(۹) عَنْ رَافِعِ بْنِ خَدِيْجٍ قَالَ قَدِمَ نَبِيُّ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْمَدِيْنَةَ وَهُمْ يُؤَبِّرُوْنَ النَّخْلَ فَقَالَ مَا تَصْنَعُوْنَ قَالُوْا كُنَّا نَصْنَعُهُ قَالَ لَعَلَّكُمْ لَوْ لَمْ تَفْعَلُوْا كَانَ خَيْرًا فَتَرَكُوْهُ فَنَقَصَتْ قَالَ فَذَكَرُوْا ذٰلِكَ لَهُ فَقَالَ اِنَّمَا اَنَا بَشَرٌ اِذَا اَمَرْتُكُمْ بِشَيْءٍ مِّنْ اَمْرِ دِيْنِكُمْ فَخُذُوْا بِهٖ وَاِذَا اَمَرْتُكُمْ بِشَيْءٍ مِّنْ رَّأْيِيْ فَاِنَّمَا اَنَا بَشَرٌ۔ (رواہ مسلم باب الاعتصام۔ ص ۲۰)

9. రాఫె బిన్ ఖదీజ్ (రజిఅన్) ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు (సఅసం) మదీనా వేంచేసినప్పుడు, ఆ కాలంలో మదీనావాసులు ఖర్జూరపు చెట్లకు అంట్లు వేసేవారు. ఆయన దాన్ని చూసి 'మీరు చేస్తున్నదేమిటి?' అని అడిగారు. దానికి వారు 'మేము ఈ విధంగా చేస్తున్నా'మని వివరంగా చెప్పారు. ఆయన 'మీరు ఇలా చెయ్యకపోతేనే బావుంటుందేమో' అని పలికారు. జనులు అంట్లు పెట్టడం మానేశారు. ఫలితంగా దిగుబడులు తగ్గిపొయ్యాయి. ఉల్లేఖన కర్త ప్రకారం, జనులు ఈ విషయాన్ని ఆయన (సఅసం)కు విన్నవించుకున్నారు. అప్పుడు ఆయన (సఅసం) ఇలా సెలవిచ్చారు, "నేనూ మనిషినే. నేను ఏ ధార్మిక విషయాన్నయినా ఆదేశిస్తే మీరు దాన్ని స్వీకరించండి. నేను ఏ విషయాన్నయినా నా సొంత అభిప్రాయంగా తెలిపితే....నేనూ కేవలం మానవమాత్రుణ్ణే." (ముస్లిం)

మరో ఉల్లేఖనంలో ప్రవక్త(సఅసం) ఇలా సెలవిచ్చినట్లు ఉంది: "ప్రాపంచిక వ్యవహారాలు మీకే బాగా తెలుసు."

---

9. ఈ హదీసు అనేక ముఖ్యమయిన అంశాలను మన ముందుంచుతుంది.

(అ) మహనీయ ముహమ్మద్ (సఅసం) దైవ సందేశహరులే అయినా సాధారణ మానవులే. ఆయనది మానవాతీత వ్యక్తిత్వం కాదు. అందువల్లనే ప్రపంచంలోని అనేక విషయాల్లో ఆయన అనుభవాలు, సొంత అభిప్రాయాలు, అంచనాలు సరయినవి కానవసరం లేదు. కాని ఏ విషయాలనయితే ఆయన వహీ (దైవం తరఫున తెలుపబడిన సందేశవాణి) ఆధారంగా సెలవిస్తారో వాటి సత్యత, సమంజసతల్ని శంకించడానికి ఏ మాత్రం వీల్లేదు.

(١٠) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اَلْمُؤْمِنُ الْقَوِیُّ خَیْرٌ وَّاَحَبُّ اِلَی اللّٰهِ مِنَ الضَّعِیْفِ وَفِیْ کُلٍّ خَیْرٌ
اِحْرِصْ عَلٰی مَا یَنْفَعُكَ وَاسْتَعِنْ بِاللّٰهِ وَلَا تَعْجِزْ، وَاِنْ اَصَابَكَ
شَیْءٌ فَلَا تَقُلْ لَوْ اَنِّیْ فَعَلْتُ کَانَ کَذَا وَکَذَا وَلٰکِنْ قُلْ قَدَّرَ اللّٰهُ
مَا شَاءَ فَعَلَ، فَاِنَّ "لَوْ" تَفْتَحُ عَمَلَ الشَّیْطَانِ

10. హజ్రత్ అబూహురైరా(రజిఅన్) ఉల్లేఖించారు: ప్రవక్త మహనీయులు ఇలా బోధించారు, 'దైవానికి బలశాలి అయిన మోమిన్ (విశ్వాసి) బలహీనుడయిన మోమిన్ కన్నా ప్రియపాత్రుడు. ఐతే ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఓ

---

(అ) ఈ హదీసును స్థూలంగా చదివితే ధార్మిక విషయాలు వేరు, ప్రాపంచిక విషయాలు వేరు, ధార్మిక విషయాలు ప్రవక్త ద్వారా తెలుసుకోవాలి, ప్రాపంచిక వ్యవహారాలకై మన బుద్ధినుపయోగించాలన్న భావం కలగవచ్చు. కాని అది సరికాదు. ఇందులో "ప్రపంచ వ్యవహారా"లంటే విద్యలు, అనుభవపూర్వకంగా లభించే విజ్ఞానం అని అర్థం. ఉదాహరణకు, వ్యవసాయం, కుమ్మరి పని, కమ్మరి పని, ఆవిష్కరణలు, పరిశోధనలు. ఒక్క మాటలో చెప్పాలంటే మనిషి జ్ఞాన పరిధిలో ఉన్నవన్నీను అని అర్థం. ప్రవక్తలు, వారి సందేశాలు మానవులకు ఈ విద్యలు నేర్పడానికి రాలేదన్న విషయం విదితమవుతూనే ఉంది. ప్రవక్తలు, దైవ మార్గదర్శకత్వం వచ్చింది మానవునికి తెలియని విషయాల జ్ఞానమందజెయ్యడానికి, అతని ఆచరణ పరిధిని క్రమబద్ధం చెయ్యడానికే. హదీసు సందర్భాన్నీ వాటిలో ప్రయోగించిన పదజాలాన్నీ జాగ్రత్తగా గమనిస్తే ఈ విషయమే బోధపడుతుంది. 'నా సొంత అభిప్రాయం' అన్న ప్రవక్త మాటకు 'వహీ ద్వారా కాని విషయం' అని భావం ప్రస్ఫుటంగా ద్యోతకమవుతూనే ఉంది. అయితే జీవితంలో, సాధారణంగా ప్రాపంచిక విషయాలని చెప్పబడే విషయాలు, సంపాదన, ఆర్థిక లావాదేవీలు సామాజిక విషయాలు, రాజకీయ వ్యవహారాలు, నైతిక నియమాలు- ఇవన్నీ ప్రవక్తల బోధనల్లోని విషయాలే. వారు ఏ విధంగానయితే ఆరాధనల్ని వివరంగా బోధిస్తారో అదే విధంగా జీవితానికి సంబంధించిన ఇతర వ్యవహారాల్లోనూ దైవిక మార్గదర్శక సూత్రాలను ప్రజలకు అందజెయ్యడం వారి విద్యుక్త ధర్మం. వాటి వివరాలు, అన్వయం, అనువర్తనం ఇత్యాది విషయాలు కాలానుగుణంగా దైవాదేశాల పరిధిలో మనుషులే నిర్ణయించుకోవాలి.

10. బలశాలి అయిన మోమిన్ అంటే, ధైర్యసాహసాలు, దీక్షా సంకల్పాల దృష్ట్యా దృఢమయినవాడని, దీనికి భిన్నంగా బలహీనుడయిన మోమిన్ అన్నదానికి ఏ మాత్రం

మంచి అన్నది ఉంటుంది. ఏ విషయమయితే మీకు ప్రయోజనకరమో దానికై ఇతోధికంగా ఆశపడండి. అల్లాహ్‌ను సహాయం కొరకు అర్థించండి, ధైర్యాన్ని కోల్పోకండి. ఒకవేళ మీకు ఏదయినా కష్టం కలిగితే- 'నేను ఆ విధంగా చేసివుంటే మరో విధంగా జరిగి ఉండేది' అని అనకండి. దానికి బదులుగా-'దైవం అలా నిర్ణయించాడు. తనకు ఇష్టమయినదాన్ని చేశాడు' అని పలకండి. ఎందుకంటే 'ఒకవేళ' అన్నది షైతాన్ తన పని ప్రారంభించ డానికి ద్వారాలు తెరుస్తుంది.

(۱۱) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ كُنْتُ خَلْفَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمًا فَقَالَ يَا غُلَامُ إِنِّي أُعَلِّمُكَ كَلِمَاتٍ، اِحْفَظِ اللّٰهَ يَحْفَظْكَ، اِحْفَظِ اللّٰهَ تَجِدْهُ تِجَاهَكَ، إِذَا سَأَلْتَ فَاسْأَلِ اللّٰهَ، وَإِذَا اسْتَعَنْتَ فَاسْتَعِنْ بِاللّٰهِ وَاعْلَمْ أَنَّ الْأُمَّةَ لَوِ اجْتَمَعَتْ عَلَى أَنْ يَنْفَعُوْكَ بِشَيْءٍ لَمْ يَنْفَعُوْكَ إِلَّا بِشَيْءٍ قَدْ كَتَبَهُ اللّٰهُ لَكَ وَلَوِ اجْتَمَعُوْا عَلَى أَنْ يَضُرُّوْكَ بِشَيْءٍ لَمْ يَضُرُّوْكَ إِلَّا بِشَيْءٍ قَدْ كَتَبَهُ اللّٰهُ عَلَيْكَ - (مشکوٰۃ صفحہ ۴۵۳)

11. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనంలో ఆయన ఇలా అన్నారు: 'నేను ఒకరోజు ప్రవక్త మహనీయుల వెనకాల (ఏదో వాహనంపై కూర్చొని) ఉన్నాను. ఆయన (సఅసం) బోధించారు: "అబ్బాయి నేను నీకు కొన్ని విషయాలు నేర్పుతాను: దైవధర్మ పరిరక్షణ చెయ్యి అల్లాహ్

---

అపజయం కలిగినా, ఏ మాత్రం ఎదురుదెబ్బ తగిలినా ధైర్యం వీడి నిరాశకులోనయ్యేవాడని భావం. 'ఒకవేళ' అన్నది షైతాన్ పనులకు దారి తెరుస్తుందంటే, మనిషిలో దైవం పట్ల, దైవ నిర్ణయాల పట్ల కుశంకలు, అపనమ్మకాలు ఆ విధంగా ప్రారంభమవుతాయి గనక అలాంటి ఆలోచనలకు దూరంగా ఉండాలని బోధించారు ప్రవక్త (స).

11. దైవ ధర్మాన్ని పరిరక్షించడం అంటే, ధర్మబోధనల పట్ల అనుమానాలు, కుశంకలు చెలరేగుతున్న కాలంలో, ధర్మంపై భావపరమయిన దాడులు, ధర్మావలం బీకులపై భౌతికమయిన దాడులు జరుగుతున్నప్పుడు తగినట్టుగా ఎదురు నిల్చొని వాటిబారినుండి ధర్మాన్నీ, ధర్మావలంబీకుల్ని కాపాడే యత్నం చెయ్యడం అన్నమాట.

నిన్ను కాపాడుతాడు. దైవధర్మ పరిరక్షణ చెయ్యి నీవు ఆయన కారుణ్యాన్ని ప్రత్యక్షంగా చూస్తావు. అర్థించవలసినప్పుడు అల్లాహ్‌నే అర్థించు. సహాయం అవసరమైనప్పుడు అల్లాహ్ సన్నిధిలోనే కోరుకో. ఒక విషయం మాత్రం గట్టిగా అర్థం చేసుకో, ఒక జాతి మొత్తం చేరి నీకు ప్రయోజనం చేకూర్చా లన్న ఏకాభిప్రాయానికి వచ్చినా దైవం నీ కొరకు వ్రాసి పెట్టినదాన్ని మించి ఏ మాత్రం లాభం చేకూర్చజాలదు, అలాగే అందరూ కలిసి నీకు నష్టం కలగజేసేందుకు ఒడిగట్టినా దైవం నిర్ణయించినదాన్ని మించి ఏ మాత్రం నష్టమూ కలగజెయ్యలేరు." (మిష్కాత్)

(١٢) عَنْ اَبِیْ خِزَامَةَ عَنْ اَبِیْهِ قَالَ قُلْتُ یَا رَسُوْلَ اللّٰهِ اَرَاَیْتَ رُقًی نَسْتَرْقِیْهَا وَدَوَاءً نَتَدَاوٰی بِهٖ وَتُقَاةً نَتَّقِیْهَا هَلْ تَرُدُّ مِنْ قَدْرِ اللّٰهِ شَیْئًا قَالَ هِیَ مِنْ قَدْرِ اللّٰهِ۔

12. అబూఖిజామా, తన తండ్రి చెప్పగా ఉల్లేఖించారు: ఆయన (అబూ ఖిజామా తండ్రి) దైవప్రవక్త (సఅసం)ని ప్రశ్నించారు, 'దైవప్రవక్తా! మా వద్ద మంత్రతంత్రాల సంప్రదాయం ఉంది, మందులూ మాకులు, చికిత్సలూ చేస్తాము, శత్రువు దాడి చేస్తే డాలు, తదితర ఆయుధాలతో ఎదుర్కోవడమూ జరుగుతుంది. అయితే ఇవన్నీ దైవం నిర్ణయించిన 'తక్‌దీర్' (విధి వ్రాత)ని మరల్చగలవా' దానికి ఆయన (సఅసం), 'ఇవన్నీ కూడా తక్‌దీర్‌కు సంబంధించిన విషయాలే' అని బదులిచ్చారు.

---

ఇలా ధర్మరక్షణలో ప్రపంచ ప్రజలు చేకూర్చగల లాభనష్టాలను ఖాతరు చెయ్యకుండా భారమంతా దైవంపైనే మోపి, తనకు కావలసినదేదయినా దైవాన్నే అర్థిస్తూ జీవించే వ్యక్తికి దైవికమయిన రక్షణ, ఆయన కారుణ్యం ప్రాప్తం కావడంలో ఆశ్చర్యమేముంది?

12. మనిషి తనకు వచ్చిన కష్టాలను బాపుకోవడానికి చేసే వివిధ ప్రయత్నాలు సయితం దైవ నిర్ణయాలకు లోబడే చేస్తాడు అని, దైవం చేసిన తుది నిర్ణయం ఏదో తనకు తెలియదుగనక మనిషి తన ప్రయత్నాలు తాను చేసుకుంటూ ఫలితాలను దైవానికి వదలి వెయ్యాలని ఈ హదీసు మనకు బోధిస్తుంది.

(۱۳) عَنِ ابْنِ مَسْعُوْدٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَا تَزُوْلُ قَدَمَا ابْنِ اٰدَمَ حَتّٰى يُسْئَلَ عَنْ خَمْسٍ، عَنْ عُمُرِهٖ فِيْمَا اَفْنَاهُ وَعَنْ شَبَابِهٖ فِيْمَا اَبْلَاهُ وَعَنْ مَالِهٖ مِنْ اَيْنَ اكْتَسَبَهٗ وَفِيْمَا اَنْفَقَهٗ وَمَا عَمِلَ فِيْمَا عَلِمَ۔ (ترمذی ج ۲ ص ۶۴۔ ابواب صفۃ القیامۃ)

13. ప్రవక్త మహనీయులు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ప్రబోధించగా ఇబ్ను మస్‌ఊద్ (రజి అల్లాహు అన్‌హు) ఉల్లేఖించారు: ప్రళయదినాన ప్రతి మనిషిని అయిదు విషయాలను గురించి ప్రశ్నించనంతవరకు అతని పాదాలు కదలజాలవు. ఆ అయిదు విషయాలు ఇవి: (1) జీవితం ఏ పనుల్లో గడిచింది? (2) యౌవ్వన శక్తి సామర్థ్యాలు ఏ పనుల్లో వినియోగ మయ్యాయి? (3) ధనం ఎక్కణ్ణుంచి సంపాయించావు? (4) ఎక్కడ ఖర్చు చేశావు? (5) అర్జించిన జ్ఞానాన్ని ఎంత వరకు ఆచరణలో పెట్టావు? (తిర్మిజి)

(۱۴) عَنِ ابْنِ مَسْعُوْدٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ كُنْتُ نَهَيْتُكُمْ عَنْ زِيَارَةِ الْقُبُوْرِ فَزُوْرُوْهَا فَاِنَّهَا تُزَهِّدُ فِي الدُّنْيَا وَتُذَكِّرُ الْاٰخِرَةَ۔ (رواہ ابن ماجہ۔ مشکوٰۃ۔ باب زیارۃ القبور)

14. ఇబ్ను మస్‌ఊద్ (రజిఅన్) ఉల్లేఖించారు, మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు: నేను ప్రారంభంలో మీకు సమాధుల సందర్శనాన్ని నిషేధించాను. అయితే ఇప్పుడు సమాధుల్ని సందర్శించండి, సమాధుల సందర్శనం ప్రపంచం పట్ల అనాసక్తిని కలగజేస్తుంది పరలోకాన్ని జ్ఞాపకం చేస్తుంది. (మిష్కాత్)

---

13. ఈ అయిదు ప్రశ్నలకు సమాధానం లభించనంతవరకు మనుషులను గురించి తీర్పు జరగదన్న మాట. ఈ ప్రశ్నల్ని ఓసారి పరిశీలిస్తే తెలుస్తుంది జీవితం లోని అన్ని రంగాలు, అన్ని విషయాలు వీటిలో చేరి ఉన్నాయని. దైవం మానవునికి ఈ లోకంలో పెట్టిన అసలు పరీక్ష ఈ అయిదు ప్రశ్నల చుట్టే పరిభ్రమిస్తుందన్న యదార్థం కూడా కాస్త ఆలోచిస్తే తేలిపోతుంది. అందువల్ల మృత్యువు రాక పూర్వమే

(۱۵) عَنْ عَبْدِ اللّٰہِ بْنِ عُمَرَ قَالَ اَخَذَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ بِمَنْکَبِیْ فَقَالَ کُنْ فِی الدُّنْیَا کَاَنَّکَ غَرِیْبٌ اَوْ عَابِرُ سَبِیْلٍ وَکَانَ ابْنُ عُمَرَ یَقُوْلُ اِذَا اَمْسَیْتَ فَلَا تَنْتَظِرِ الصَّبَاحَ وَاِذَا اَصْبَحْتَ فَلَا تَنْتَظِرِ الْمَسَاءَ وَخُذْ مِنْ صِحَّتِکَ لِمَرَضِکَ وَ مِنْ حَیَاتِکَ لِمَوْتِکَ ۔ (بخاری ۔ مشکوٰۃ ۔ باب تمنی الموت)

15. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజిఅన్) ఉల్లేఖించారు: ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం) నా భుజం పట్టుకుని, 'నీవు ప్రపంచంలో ఓ పరదేశీలా లేదా బాటసారిలా జీవించు' అని బోధించారు. ఇంకా ఇబ్నె ఉమర్ (రజిఅన్) ఇలా పలికేవారు: రాత్రి వస్తే ఉదయం కొరకు నిరీక్షించకు, తెల్లవారితే రాత్రి కొరకు వేచి ఉండకు. ఆరోగ్యంగా ఉన్నప్పుడు అనారోగ్య కాలం కొరకు సత్కార్యాలను సమకూర్చుకో, జీవితకాలంలో మృత్యుకాలం కొరకు సదాచరణలను సమాయత్తపరచుకో. (బుఖారి)

---

ఈ అయిదు ప్రశ్నలకు సరయిన సమాధానం ఇవ్వగలిగేలా జీవితాలను మలచుకోవడం విశ్వసించినవారి ఉత్తమ లక్షణం.

14. లోగడ ప్రవక్తల సహచరులు తమ ప్రవక్తల సమాధుల్ని, తమ సంఘ సంస్కర్తల సమాధుల్ని ఆరాధనాలయాలుగా మార్చుకుని వారి ద్వారానే తమ కోరికలు ఈడేరుతాయని భ్రమలకులోనై ఆ ప్రవక్తల ప్రబోధమయిన ఏకేశ్వరోపాసనను విస్మరించారు. ఈ యదార్థాన్ని గుర్తుంచుకునే ప్రవక్త మహనీయులు (సఅసం) తొలుత తన అనుయాయులు గోరీల వద్దకు, ఖనన వాటికలకు పోరాదని శాసించారు. ఆ తరువాత తన సహచరుల్లో దేవుని ఏకత్వపు భావన పటిష్టమైందన్న నమ్మకం కలిగినప్పుడు, సాధారణ మనుషులు, సంస్కర్తలు, మహనీయులు అటుంచి ప్రవక్తలు సయితం మానవులే వారిలో స్వతహాగా ఎలాంటి మానవాతీత శక్తుల్లేవు అన్న విశ్వాసం తన అనుయాయుల్లో దృఢమయిన తరువాత పరలోకాన్ని, మృత్యువును గుర్తుకు తెచ్చుకునేందుకు ఖననవాటికలకు పోవచ్చని, గోరీలను సందర్శించి, తాము కూడా ఆ విధంగా ఆ మట్టిలో కలసిపోవలసిందే అన్న నిజాన్ని మరువకుండా ఉండాలని ఆనతి ఇచ్చారు.

15. రాత్రి వస్తే ఉదయం కొరకు నిరీక్షించడం అంటే, ఫలానా మంచి పని రేపు చేసుకుందాం అన్న అలసత్వం చూపడం అన్నమాట. ఏ సమయంలో ఎంత మంచి

(١٦) عَنْ عَمْرِوبْنِ مَيْمُوْنِ الْاَوْدِيِّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِرَجُلٍ وَهُوَ يَعِظُهٗ اِغْتَنِمْ خَمْسًا قَبْلَ خَمْسٍ شَبَابَكَ قَبْلَ هَرَمِكَ وَصِحَّتَكَ قَبْلَ سُقْمِكَ وَغِنَاكَ قَبْلَ فَقْرِكَ وَ فَرَاغَكَ قَبْلَ شُغْلِكَ وَحَيٰوتَكَ قَبْلَ مَوْتِكَ ۔ (رواہ الترمذی۔ مشکوٰۃ۔ کتاب الرقاق)

16: అమ్ర్ ఇబ్నె మైమూన్ ఉల్లేఖనం ప్రకారం, ఒకసారి మహనీయ ముహమ్మద్ (సఅసం) ఒక వ్యక్తికి ఉపదేశం చేస్తూ ఇలా సెలవిచ్చారు: "అయిదు విషయాలను మరో అయిదు విషయాలకు పూర్వం మేలైనవిగా భావించు. (1) యౌవ్వనాన్ని వృద్ధాప్యానికి పూర్వం (2) ఆరోగ్యాన్ని అనారోగ్యానికి పూర్వం (3) కలిమిని లేమి దాపురించక పూర్వం, (4) తీరికను నిమగ్నతకు పూర్వం, (5) జీవితాన్ని మృత్యువుకు పూర్వం.

(١٧) عَنْ اَبِیْ اَیُّوْبَ الْاَنْصَارِیِّ قَالَ جَاءَ رَجُلٌ اِلَی النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ عِظْنِیْ وَاَوْجِزْ فَقَالَ اِذَا قُمْتَ فِیْ صَلٰوتِكَ فَصَلِّ صَلٰوةَ مُوَدِّعٍ وَلَا تَكَلَّمْ بِكَلَامٍ تَعْتَذِرُ مِنْهُ غَدًا وَاجْمَعِ الْاِيَاسَ مِمَّا فِیْ اَيْدِی النَّاسِ ۔ (مشکوٰۃ۔ کتاب الرقاق)

---

కార్యం చేసుకోగలిగేందుకు అవకాశం లభిస్తుందో దాన్ని అప్పుడే వినియోగించుకోవాలి. ఎవరికి తెలుసు అనారోగ్యమో, మృత్యువో వచ్చి, ఉన్న ఈ వ్యవధిని కాస్తా పూర్తిగా మింగివేస్తుందో ఏమో!

16. మనిషి సాధారణంగా పశ్చాత్తాపం చెందే అయిదు ముఖ్యమయిన సందర్భాలను దైవ సందేశహరులు ఈ హదీసులో సూచించారు. వృద్ధాప్యం, అనారోగ్యం, లేమి, తలకు మించిన పనులు తలపై వేసుకుని తలమునకలయి ఉండటం, మృత్యువు గడియలు సమీపించడం. ఈ ఐదు సందర్భాల్లోనూ మనిషి ఎంత తల బాదుకున్నా పోయిన తన యౌవ్వనం, ఆరోగ్యం, కలిమి, తీరిక, జీవితం తిరిగి రాజాలవు. అందువల్ల విజ్ఞతగలవారు ఈ ఐదు సందర్భాలు రాకపూర్వమే తమ జాగ్రత్తలో తాముండి లభించిన వ్యవధిని సద్వినియోగం చేసుకుంటారు.

17. అబూ అయ్యూబ్ (రజిఅన్) ఉల్లేఖించారు: "ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుల సన్నిధిలో హాజరై నాకు ఏదైనా బోధించండి, అది క్లుప్తంగా ఉండేలా బోధించండి' అని అర్థించాడు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) "నీవు నమాజ్‌లో నిలబడినప్పుడు వీడ్కోలు పుచ్చుకుంటున్న వ్యక్తిలా నమాజ్ చెయ్యి, మాట్లాడేటప్పుడు, ఆ తరువాత రేపు క్షమాపణ చెప్పుకోవలసివచ్చే ఏ మాటనూ పలుకకు, ఇతరుల చేతుల్లో ఉన్నదాన్ని గురించి పూర్తిగా ఆశలు వదలుకో." (మిష్కాత్)

(۱۸) عَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ
إِذَا رَأَيْتَ اللّٰهَ عَزَّوَجَلَّ يُعْطِي الْعَبْدَ مِنَ الدُّنْيَا عَلٰى مَعَاصِيهِ مَا يُحِبُّ
فَإِنَّمَا هُوَ اسْتِدْرَاجٌ ثُمَّ تَلَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَلَمَّا
نَسُوْا مَا ذُكِّرُوْا بِهٖ فَتَحْنَا عَلَيْهِمْ اَبْوَابَ كُلِّ شَيْءٍ حَتّٰٓى إِذَا فَرِحُوْا
بِمَآ اُوْتُوْٓا اَخَذْنَاهُمْ بَغْتَةً فَإِذَا هُمْ مُّبْلِسُوْنَ - (رواه احمد-مشكوٰة-
كتاب الرقاق)

---

17. క్లుప్తంగా ఉండేలా బోధించమని కోరింది ఆ బోధన జ్ఞాపకముంచుకునేలా ఉండాలన్న దృక్పథంతోనే, వీడ్కోలు పుచ్చుకోవడం అన్నదానికి ఈ ప్రపంచం నుండి వీడ్కోలు అని అర్థం చేసుకోవాలి. నమాజ్ చేసేటప్పుడు ఇదే నా చివరి నమాజ్ అన్న శ్రద్ధాభక్తులతో, ఏకాగ్రతతో తిరిగి నమాజ్ చేసే భాగ్యం లభిస్తుందో లేదో అనే తపనతో చెయ్యాలన్న భావం ఇందులో ఇమిడి ఉంది. ఒకవేళ పొరపాటున ఎప్పుడయినా నోరు అదుపుతప్పినప్పుడు పశ్చాత్తాపపడి క్షమాపణ చెప్పుకోక తప్పదు. కాని అలాంటి అవకాశం రానివ్వకుండా మసలుకోవాలన్నదే ఇందులోని బోధన సారాంశం. పరలోకంలో జవాబు చెప్పుకోవలసి ఉందని నమ్మే వ్యక్తి మాట్లాడేటప్పుడు సదా ఆచితూచి మాట్లాడుతాడు. ముందు నోరు జారడం, ఇష్టం వచ్చినట్లు వదరడం తరువాత దానికి పశ్చాత్తాపపడి క్షమాపణలు చెప్పుకుంటూ తిరగడం విశ్వసించినవారి లక్షణం కాదు. జీవితంలో ప్రతి అడుగూ జాగ్రత్తగా వెయ్యడమే పరలోక విశ్వాసానికి నిదర్శనం. పరులకు ఉన్నది మనకు ఇస్తారని ఆశించడం, మనం కష్టపడి సంపాదించ

18. ఉక్బా బిన్ ఆమిర్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రబోధించారు: "తన దాసుడు అపరాధాలూ అవిధేయతలు ఎన్ని చేసినా అల్లాహ్, అతనికి, అతని అభిలాష, కోరికల కనుగుణంగా ప్రాపంచిక వరాలు ప్రసాదిస్తూ ఉన్నట్లు మీరు గమనిస్తే ఇది (దైవం తరపున) లభించే సడలింపు అని తెలుసుకోండి" అని ప్రవక్త మహోదయులు (సఅసం) సెలవిచ్చి– 'వారు, తమకు ఏ విషయాలనయితే ఉపదేశించడం జరిగిందో వాటిని విస్మరించినప్పుడు మేము వారికై అన్ని విషయాల ద్వారాలు తెరచివేశాము. చివరికి వారు తమకు అనుగ్రహించిన వరాలలో ఆనందంతో తేలియాడుతున్నప్పుడు మేము అకస్మాత్తుగా వారిని పట్టుకున్నాము. వారున్నూ ఒక్కసారిగా నిరాశావహులై పొయ్యారు (6:44)' అనే ఆయత్ ని పఠించారు. (మిష్కాత్)

(۱۹) عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّمَا الْاَعْمَالُ بِالنِّيَّاتِ وَاِنَّمَا لِامْرِئٍ مَّا نَوٰى فَمَنْ كَانَتْ هِجْرَتُهٗ اِلَى اللّٰهِ وَرَسُوْلِهٖ فَهِجْرَتُهٗ اِلَى اللّٰهِ وَرَسُوْلِهٖ وَمَنْ كَانَتْ هِجْرَتُهٗ اِلٰى دُنْيَا يُصِيْبُهَا اَوِ امْرَاَةٍ يَّتَزَوَّجُهَا فَهِجْرَتُهٗ اِلٰى مَا هَاجَرَ اِلَيْهِ. (بخاری۔ مسلم۔ مشکوۃ۔ کتاب الایمان، ص ۳)

19. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజిఅన్) ప్రవక్త మహనీయులు సెలవిచ్చినట్లు ఉల్లేఖించారు: "మనిషి చేసే కర్మలు ఫలప్రదం కావడం అన్నది అతని సంకల్పంపై ఆధారభూతమయి ఉంటుంది. మనిషికి తాను సంకల్పం చేసుకున్నదే ప్రాప్తమవుతుంది. తదనుగుణంగా ఎవరయితే

---

కుండానే అన్నీ మనకు పవ్యంగా అమరాలని కోరుకోవడం, ఎవరో ఏదో చేస్తారన్న ఆశలతో పేక మేడలు కట్టుకోవడం, ఊహాసౌధాల్లో విహరించడం మనిషిని కర్తవ్యశూన్యునిగా మారుస్తాయి. అందువల్ల తన వద్ద ఉన్న దానిపై, తాను సంపాదించుకున్న దానిపై తన శక్తిసామర్థ్యాలపై మనిషి తృప్తి చెందాలి, వాటి ఆధారంగా జీవిత పథకాన్ని రూపొందించుకోవాలి.

అల్లాహ్, ఆయన ప్రవక్తల మార్గం వైపునకు హిజ్రత్ చేస్తారో వారి హిజ్రత్ నిజంగానే అల్లాహ్, ఆయన ప్రవక్త మార్గంలో పరిగణించబడుతుంది. మరెవరయితే ప్రపంచ ప్రయోజనాలను సాధించడానికి ఆ వైపునకో, పెళ్ళాడడానికి స్త్రీల వైపునకో హిజ్రత్ చేస్తారో అతని హిజ్రత్ నిజానికి అతడు దేనికొరకు హిజ్రత్ (సంకల్పం) చేస్తాడో దానికై చేసినదిగానే పరిగణించబడుతుంది." (బుఖారి, ముస్లిం)

(٢٠) عَنْ اَبِیْ مُوْسٰی قَالَ جَاءَ رَجُلٌ اِلَی النَّبِیِّ صَلَّی اللهُ عَلَیْهِ وَسَلَّمَ فَقَالَ الرَّجُلُ یُقَاتِلُ لِلْمَغْنَمِ وَالرَّجُلُ یُقَاتِلُ لِلذِّکْرِ وَالرَّجُلُ یُقَاتِلُ لِیُرٰی مَکَانُهٗ فَمَنْ فِیْ سَبِیْلِ اللهِ قَالَ مَنْ قَاتَلَ لِتَکُوْنَ کَلِمَةُ اللهِ هِیَ الْعُلْیَا فَهُوَ فِیْ سَبِیْلِ اللهِ ـ (صحیح مسلم ج ۱ ص ۱۳۹)

---

18. ఏ వ్యక్తి అయినా లేదా జాతి అయినా ప్రాపంచిక సిరిసంపదల్లో, అధికార హోదాల్లో ఉన్నంత మాత్రాన దాన్ని చూసి ఇలాంటివారిపట్ల అల్లాహ్ ప్రసన్నుడయి ఉన్నాడని భావించడం సరయింది కాదు. నిజానికి ఇది కఠిన పరీక్షకు ఓ రూపం. ఇలా ఐశ్వర్యాలను ప్రసాదించిన తరువాత అపరాధులయినవారిని దైవాగ్రహం వచ్చి అకస్మాత్తుగా పట్టుకుంటుంది.

దైవం నిర్ణయించిన పట్టువిడుపుల సూత్రం ఏ విధమయిందంటే గాలం వేసిన తరువాత అది చేపకంఠంలో చిక్కుకోగానే వేటగాడు దాన్ని బయటికి తీయడు. దారాన్ని బాగా వదులుతాడు. చేప తిరిగి తిరిగి బాగా అలసిపోయిన తరువాత ఒక్కసారిగా లాగి బయటపడేసుకుంటాడు. కాని ఈ మధ్య తెలివి లేని చేప, తాను స్వేచ్ఛా వాతావరణంలో తిరుగాడుతోందని అనుకుంటే దాన్ని ఎవరయినా చెయ్యగలిగిందేముంది?

19. మనిషి సంకల్పం, అతని చిత్త స్థితి ప్రేరణలే సకల ఆచరణలకు మూలమన్నది మనకు తెలిసిందే. అయితే దైవం దృష్టిలో ఏ కార్యమయినా ఫలప్రదం కావాలంటే, దానికి దైవం తరపున గుర్తింపు లభించాలంటే, సత్కార్యానికి పుణ్యఫలం ప్రాప్తం కావాలంటే ఈ సంకల్ప శుద్ధియే అవసరం. బయటికి ఎంతగా ఉత్తమమయిన, పుణ్యప్రదమయిన కార్యంగా అగుపించినా చేసేవాని మనసులో దానికి ప్రేరక శక్తి కేవలం దైవ ప్రసన్నత కాకపోతే దైవం ప్రసాదించే ప్రతిఫలం లేక పుణ్యఫలం ప్రాప్తం కాదు. ఈ విషయాన్నే చాటి చెబుతోంది ఈ హదీసు.

20. అబూ మూసా (రజిఅన్) ఉల్లేఖించారు: 'ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుని సన్నిధిలో హాజరయ్యాడు. అతడు, "మనిషి యుద్ధఫలం కొరకు పోరాడుతాడు, మనిషి తన పరాక్రమం ప్రదర్శించడానికి పోరాడతాడు (వీటిలో) ఎవరు దైవమార్గంలో పోరాడే యోధుడు?" అని ప్రశ్నించాడు. దానికి మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ఎవరయితే దైవ వచనం సమున్నతం కావాలని పోరాడతాడో అతడే (దైవ మార్గంలోని యోధుడు)"

(సహీహ్ ముస్లిమ్)

(۲۱) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اِنَّ اللّٰهَ لَا یَنْظُرُ اِلٰی صُوَرِکُمْ وَاَمْوَالِکُمْ وَلٰکِنْ یَّنْظُرُ اِلٰی قُلُوْبِکُمْ
وَاَعْمَالِکُمْ - (رواہ مسلم - مشکوٰۃ باب الریاء صفحہ ۴۴۶)

21. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధించినట్లు అబూ హురైరా (రజిఅన్) ఉల్లేఖించారు: అల్లాహ్ మీ ముఖాలను, మీ సంపదల్ని చూడడు. మీ ఆంతర్యాల (సంకల్పాల)ను, మీ ఆచరణలనూ చూస్తాడు.

(ముస్లిం, మిష్కాత్)

(۲۲) عَنْ اَبِیْ اُمَامَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
مَنْ اَحَبَّ لِلّٰهِ وَاَبْغَضَ لِلّٰهِ وَاَعْطٰی لِلّٰهِ وَمَنَعَ لِلّٰهِ فَقَدِ اسْتَکْمَلَ الْاِیْمَانَ۔
(رواہ ابوداؤد - مشکوٰۃ کتاب الایمان صفحہ ۷)

---

20. ప్రజలు ఎవరిని గురించి ఏమని అనుకున్నా దైవం దృష్టిలో అతని స్థానాన్ని నిర్ణయించేది అతని ప్రేరణ లేక సంకల్పమే అని చాటే మరో హదీసు ఇది.

21. ప్రపంచంలో మనిషి పొందే హెూదా, గుర్తింపు, ప్రతిష్ఠలు, అతని రూపు, వంశం, సిరిసంపదలు అన్నీ అతడెంతో పుణ్యవంతుడని చాటి చెప్పినా దైవసన్నిధిలో అసలు పనికివచ్చేది అతని మనో స్థితి, చిత్తశుద్ధితో కూడుకున్న ఆచరణలే అని దీని ద్వారా మనకు బోధపడుతుంది.

22. హజ్రత్ అబూ ఉమామా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు. ఎవరయితే అల్లాహ్ కొరకు మనుషుల్ని ప్రేమించాడో, అల్లాహ్ కొరకే ద్వేషించాడో, అల్లాహ్ కొరకు ఏదయినా ఎవరికయినా ఇచ్చాడో, మరి అల్లాహ్ కొరకే ఏదయినా ఇవ్వడం మాను కున్నాడో అతను తన విశ్వాసాన్ని పరిపూర్ణం గావించుకున్నాడు.
(అబూదావూద్)

(۲۳) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ خُذُوْا مِنَ الْاَعْمَالِ مَا تُطِيْقُوْنَ فَاِنَّ اللّٰهَ لَا يَمَلُّ حَتّٰى تَمَلُّوْا ۔ (رواه البخاری ۔ مشکوٰة ۔ ص ۱۰۲ ۔ باب القصد فی العمل)

23. హజ్రత్ ఆయిషా (రజి అల్లాహు అన్హా) ఉల్లేఖనం: "ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రబోధించారు, "సదాచరణను మీ శక్తి మేరకు పాటించండి. ఎందువల్లనంటే అల్లాహ్ (పుణ్యఫలాన్ని ప్రసాదించ డానికి) ఏ మాత్రం విసుగుచెందడు- మనిషి (సదాచరణ చేస్తూ) విసుగు చెందేవరకు!"
(బుఖారి)

(۲۴) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ كَانَ اَهْلُ الْجَاهِلِيَّةِ يَاْكُلُوْنَ اَشْيَاءَ وَيَتْرُكُوْنَ اَشْيَاءَ تَقَذُّرًا فَبَعَثَ اللّٰهُ نَبِيَّهٗ وَاَنْزَلَ كِتَابَهٗ وَاَحَلَّ حَلَالَهٗ وَحَرَّمَ حَرَامَهٗ فَمَا اَحَلَّ فَهُوَ حَلَالٌ وَمَا حَرَّمَ فَهُوَ حَرَامٌ وَمَا سَكَتَ عَنْهُ فَهُوَ عَفْوٌ ۔ (رواه ابوداؤد ۔ مشکوٰة ۔ باب ما یحل اکلہ)

---

22. అల్లాహ్ కొరకు అన్నదానికి అల్లాహ్ ప్రసన్నత బడయటానికి, ఆయన ప్రేమను చూరగొనడానికి అని భావం. ఏది చేసినా దైవం కొరకు చేసేవారి చిత్తశుద్ధిని గురించి ఇక్కడ చెప్పే అవసరమేముంటుంది? అలాంటి వారి విశ్వాసాన్ని గురించి కూడా ఎలాంటి సందేహముండదు. అయితే ఇది చిత్త ప్రవృత్తికి సంబంధించిన విషయం, చిత్త స్థితిని దైవం తప్ప ఇతరులు ఎలా లెక్కగట్టగలరు?

24. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించారు, "అజ్ఞాన కాలంలో ప్రజలు అనేక పదార్థాలు తినేవారు, ఇంకా అనేక పదార్థాలను, మొగం మొత్తడం వల్ల మానేసేవారు. ఆ తరువాత అల్లాహ్ తన ప్రవక్తను పంపాడు, గ్రంథాన్ని అవతరింపజేశాడు, హలాల్ అయిన దాన్ని హలాల్ గా నిర్ణయించాడు, హరామ్ అయినదాన్ని హరామ్‌గా నిర్ధారించాడు: ఇప్పుడు ఆయన దేన్నయితే హలాల్ గా నిర్ణయించాడో అదే హలాల్. ఆయన దేన్ని హరామ్‌గా చేశాడో అదే హరామ్. మరి దేని విషయంలో (ఏ ఆదేశమూ ఇవ్వకుండా) మౌనం వహించాడో అది మన్నించబడుతుంది."

(అబూదావూద్)

(۲۵) عَنْ حُذَيْفَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا اَحْسَنَ الْقَصْدَ فِى الْغِنٰى، مَا اَحْسَنَ الْقَصْدَ فِى الْفَقْرِ، وَمَا اَحْسَنَ الْقَصْدَ فِى الْعِبَادَةِ۔ (مسند بزار۔ کنزالعمال ج ۲۔ ص ۷)

25. హజ్రత్ హుజైఫా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు, "కలిమిలో మధ్యే మార్గం ఎంత ఉత్తమమయింది! లేమిలోనూ మధ్యే మార్గం ఎంత సుఖమయింది! అలాగే ఆరాధనల్లోనూ సంతులిత విధానం ఎంత శుభప్రదమయింది." అని నుడివారు. (కన్‌జుల్ ఉమ్మాల్)

---

23. మంచి పనులు చెయ్యడంలో ఒక్కోసారి అతివాదానికిపోయి పుణ్యఫలం పొందే ఆకాంక్షతో అలివికానివన్నీ నెత్తిన వేసుకుని బాధపడటం కొందరి మామూలు. అలాకాకుండా చెయ్యగల కార్యాలు కొన్నయినా సరే సదా చేస్తూ ఉండటం వల్ల పుణ్యఫలం దక్కడమేకాక తృప్తి, సంతోషాలూ ప్రాప్తమౌతాయి. అతివాదానికిపోయి ఏదేదో చెయ్యాలనుకొని తీరా చేతకాకపోవడం వల్ల ఏదీ చెయ్యని స్థితికి లోనవడం ఏ మాత్రం అభిలషనీయం కాదు. దైవం మటుకు మీరెంత కృషి చేసినా దానికి తగిన ప్రతిఫలాన్నివ్వడంలో ఏ మాత్రం కొరత చూపడు. అంటే అల్లాహ్ తన క్షమాగుణాన్ని, పుణ్యఫలాన్నిచ్చే గుణాన్ని ఎన్నటికీ నిలుపుదల చెయ్యడు- మనిషే తన అవివేకం వల్ల, వివేచనాశూన్యమైన నడతవల్ల దాన్ని కోల్పోతాడు.

24. అజ్ఞాన కాలంలో తమ మనోకాంక్షలే మార్గదర్శకాలు కాగా ఇష్టమయినవన్నీ

(۲۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اِنَّ الدِّیْنَ یُسْرٌ وَلَنْ یُّشَادَّ الدِّیْنَ اَحَدٌ اِلَّا غَلَبَهٗ فَسَدِّدُوْا وَقَارِبُوْا
وَاَبْشِرُوْا وَاسْتَعِیْنُوْا بِالْغَدْوَةِ وَالرَّوْحَةِ وَشَیْءٍ مِّنَ الدُّلْجَةِ (مشکوٰة
القصد فی العمل ص ۱۰۲)

26. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ధర్మం సులువయినది. ఏ వ్యక్తి అయినా ధర్మంతో పోటీకి పాల్పడితే ధర్మం అతనిపై ఆధిక్యతపొందడం తప్ప మరేమీ జరగదు. సక్రమంగా వ్యవహరించండి. మధ్యేమార్గాన్ని అవలంబించండి, సదా ప్రసన్నవదనులయి ఉండండి, ఉదయం, సాయంత్రం కొంత భాగం రాత్రి సమయాల్లో ప్రయాణం ద్వారా సహాయాన్ని అర్థించండి." (మిష్కాత్)

---

తినేవారు, ఇష్టం కానివి వదిలేసేవారు. ఇస్లాం ఆవిర్భావం తరువాత దైవం తరఫున మానవులకు మేలయినవన్నీ హలాల్ (ధర్మసమ్మతం)గానూ, కీడు కలిగించేవి హరామ్ (అధర్మమయినవి)గాను నిర్ణయమయ్యాయి. మౌనం వహించడమంటే ఇటు స్పష్టంగా అనుజ్ఞనూ ఇవ్వకుండా అటు పూర్తిగా నిషేధించకుండా వదలివేసిన పదార్థాలని అర్థం. వాటి విషయంలో అనవసరంగా ఆరా తీయడం, రంధ్రాన్వేషణ జరపడం భావ్యం కాదు. షరీఅత్ రీత్యా వాటినుపయోగించు కోవడంలో తప్పులేదు అని భావం.

25. తన అనుయాయులను సతతం మధ్యే మార్గాన్ని అనుసరించడానికే ప్రేరేపించారు ప్రవక్త శ్రేష్ఠులు (సఅసం). ఏ స్థితిలోనూ హద్దులు మీరి ప్రవర్తించడాన్ని ఖండించారు. కలిమిలోను, లేమిలోనూ ఏ విధంగానయితే సంతులిత వైఖరిని అవలంబించాలని కోరారో అదే విధంగా ఆరాధనల్లోనూ అతివాదానికిపోయి అలవికాని శ్రమకు గురికారాదని, ధర్మం సదా మధ్యస్థవిధానాన్నే అభిలషిస్తుందని ప్రబోధించారు.

26. మత సంబంధమయిన విషయాల్లో అతిశయానికి, అతివాదానికి పోయేవారు ధర్మంతోనే కుస్తీపడాలని, అంటే ధర్మంకోరే శ్రమకన్నా అధికంగా శ్రమపడాలని అభిలషించేవారు ధర్మానికయితే ఏ హానీ కలిగించలేరు కాని తామే చివరికి ఓడిపోయి, ఒక్కోసారి పతనావస్థకు గురికావలసి వస్తుంది. ఏ విధంగానయితే ప్రయాణం చేసే వ్యక్తి రేయింబవళ్ళు ఎడతెగకుండా ప్రయాణం చేస్తూనే ఉండడో, ఇంకా ఏ విధంగా

(۲۷) عَنْ حُذَيْفَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا يَنْبَغِيْ لِلْمُؤْمِنِ اَنْ يُّذِلَّ نَفْسَهٗ قَالُوْا وَكَيْفَ يُذِلُّ نَفْسَهٗ قَالَ
يَتَعَرَّضُ مِنَ الْبَلَآءِ لِمَا لَا يُطِيْقُ - (رواه الترمذی مشکوٰۃ - باب جامع الدعاء)

27. హజ్రత్ హుజైఫా (రజిఅన్) ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు, "విశ్వసించిన మనిషి తన్నుతాను అవమానపరచుకోవడం భావ్యం కాదు." దానికి అక్కడున్న వారు "విశ్వసించినవాడు తన్నుతాను ఎలా అవమానపరచుకుంటాడు?" అని ప్రశ్నించగా ఆయన, "భరించలేని పరీక్షలో తన్నుతాను పడవేసుకుంటాడు" అని సమాధానమిచ్చారు. .

(మిష్కాత్ - తిర్మిజి)

(۲۸) عَنْ اَنَسٍ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ رَاٰى شَيْخًا يُّهَادٰى
بَيْنَ اِبْنَيْهِ فَقَالَ مَا بَالُ هٰذَا قَالُوْا نَذَرَ اَنْ يَّمْشِيَ اِلٰى بَيْتِ اللّٰهِ قَالَ
اِنَّ اللّٰهَ تَعَالٰى عَنْ تَعْذِيْبِ هٰذَا نَفْسَهٗ لَغَنِيٌّ وَاَمَرَهٗ اَنْ يَّرْكَبَ ٭

28. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖించారు, "ఒకసారి ఓ వృద్ధుడు తన ఇద్దరు కొడుకుల ఆధారంతో కాళ్ళీడ్చుకుంటూ పోవడాన్ని ప్రవక్త మహనీయులు (సఅసం) చూసి, ఇతనికేమయింది? అని అడిగారు. దానికి, 'ఆ వ్యక్తి కాలినడకన బైతుల్లాహ్ (దైవ గృహం-కాబా)కు పయనించాలని మొక్కుకున్నాడు' అని జనులు బదులిచ్చారు. అప్పుడు నాయకశ్రేష్ఠులు

నయితే చల్లని వేళల్లో ప్రయాణం చేస్తాడో, ఇంకా ఏ విధంగానయితే మిగతా సమయాల్లో తాను విశ్రాంతి తీసుకుని తన వాహనానికి విశ్రాంతి కల్పిస్తాడో అదే విధంగా ధర్మపథగామి కూడా మెలగాలి. తన శక్తినిమించిన శ్రమభారాన్ని, ప్రవక్త సంప్రదాయానికి భిన్నంగా అదనపు ఆరాధనల పాటింపును నెత్తిన వేసుకోవడంలాంటి విధానాలన్నీ అతిశయ విధానాలు, ధర్మంలో అతివాదపు ద్వారాలు. వీటన్నింటికి దూరంగా మెలగడమే మధ్యేమార్గం.

(సఅసం) "ఆ వ్యక్తి తన్నుతాను ఈ యాతనకు గురి చేసుకోవడం పట్ల అల్లాహ్ అతీతుడు" అని పురమాయించి ఆ వ్యక్తిని వాహనంపై ఎక్కి తన ప్రయాణాన్ని పూర్తి చెయ్యమని ఆదేశించారు.

(۲۹) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ قَالَ لِي رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَا عَبْدَ اللّٰهِ اَلَمْ اُخْبَرْ اَنَّكَ تَصُوْمُ النَّهَارَ وَتَقُوْمُ اللَّيْلَ فَقُلْتُ بَلٰى يَا رَسُوْلَ اللّٰهِ قَالَ فَلَا تَفْعَلْ صُمْ وَاَفْطِرْ، وَقُمْ وَنَمْ فَاِنَّ لِجَسَدِكَ عَلَيْكَ حَقًّا، وَاِنَّ لِعَيْنِكَ عَلَيْكَ حَقًّا وَاِنَّ لِزَوْجِكَ عَلَيْكَ حَقًّا وَاِنَّ لِزَوْرِكَ عَلَيْكَ حَقًّا، لَاصَامَ مَنْ صَامَ الدَّهْرَ، صَوْمُ ثَلٰثَةِ اَيَّامٍ مِنْ كُلِّ شَهْرٍ صَوْمُ الدَّهْرِ كُلِّهٖ صُمْ كُلَّ شَهْرٍ ثَلٰثَةَ اَيَّامٍ وَاقْرَأِ الْقُرْاٰنَ فِيْ كُلِّ شَهْرٍ قُلْتُ اِنِّيْ اُطِيْقُ اَكْثَرَ مِنْ ذٰلِكَ قَالَ صُمْ اَفْضَلَ الصَّوْمِ صَوْمَ دَاؤُدَ صِيَامُ يَوْمٍ وَاِفْطَارُ يَوْمٍ وَاقْرَأْ فِيْ كُلِّ سَبْعِ لَيَالٍ مَرَّةً وَلَا تَزِدْ عَلٰى ذٰلِكَ۔ (بخاری۔ مشکوٰۃ۔ باب صیام التطوع)

---

27. "భరించలేని పరీక్ష" అనంటే మనిషి తన తాహతుకు మించిన శారీరక, మానసిక, ధన సంబంధమయిన ఆరాధనలు ఆచరించడానికి ఉద్యుక్తుడవడం అని భావం. అలవికాని సత్కార్యాలు చెయ్యాలని ఉబలాటపడటం, తీరా చెయ్యలేక అవస్థపడటం అవమానపరచుకోవడం కాకపోతే మరేమిటి?

28. ఆ వృద్ధుడు మొక్కుబడి అయితే చేసుకున్నాడు కాని తన వృద్ధాప్యం వల్ల నడచి వెళ్ళడం సాధ్యమవడం లేదు. అందువల్ల కొడుకుల ఆధారంగానయినా సరే ఆ మొక్కుబడిని తీర్చుకోవాలన్న అతని నిర్ణయానికి కారణం, అలా ప్రయాసపడి వెళ్ళినట్లయితే పుణ్యం అధికంగా ప్రాప్తమవుతుందని దేవుడు సంతుష్టుడవుతాడని అతని మూఢ నమ్మకం. ఆ మూఢ విశ్వాసాన్ని సంస్కరించడం మహాప్రవక్త బోధన లక్ష్యం. 'అతను యాతనకు గురవడం పట్ల అల్లాహ్ అతీతుడు' అన్నదానికి భావం, అల్లాహ్ ఇలాంటి శ్రమకు తన దాసులయిన మానవులు లోనవడాన్ని ఇష్టపడడు. ఇలాంటి అర్థంలేని పూజాభావాల పట్ల ఆయన నిరపేక్షాపరుడు. వీటితో ఆయనకు ఎలాంటి సంబంధంలేదు అని.

29. హజ్రత్ అబ్దుల్లాహ్ (రజిఅన్) నిరంతరాయంగా రోజాలు పాటిస్తూ రాత్రిళ్ళు

29. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ బిన్ ఆస్ (రజిఅన్) ఉల్లేఖనం: "దైవ సందేశహరులు (సఅసం) నన్ను సంబోధించి, "అబ్దుల్లాహ్, నీవు పగటి పూట రోజా పాటిస్తావని, రాత్రివేళ నమాజ్‌కై నిలుస్తావని తెలిసింది (నిజం) కాదా?" అని అడగ్గా నేను "అవునండి, నేను అలానే చేస్తుంటాను" అని బదులిచ్చాను. దానికి ఆయన ఇలా ఉపదేశించారు, "ఈ విధానాన్ని అవలంబించకు, రోజాలూ పాటించు, వాటిని విరమించడం కూడా చెయ్యి, రాత్రివేళ తహజ్జుద్ నమాజ్ కూడా చెయ్యి, విశ్రాంతి కూడా తీసుకో. ఎందువల్లనంటే నీపై నీ శరీరానికి హక్కు వుంది నీ కంటికీ నీపై హక్కు ఉంది. నీ భార్యకు కూడా నీపై హక్కువుంది. నీ అతిథికీ నీపై హక్కుఉంది. ఎవరయితే జీవితాంతం రోజాలు పాటిస్తాడో అతను వాస్తవంగా రోజా పాటించినట్లు అర్థం కాదు. ప్రతి నెల మూడు రోజాలు పాటించడం జీవిత కాలమంతా రోజా పాటించడంతో సమానం. నెల నెలా మూడు రోజాలు పాటిస్తూ ఉండు. ఒక్క నెలలో (ఒకసారి పూర్తిగా) ఖుర్ఆన్ పారాయణం చెయ్యి." దానికి నేను, "నాకు ఇంతకంటే అధికంగా చేసే ఓపిక ఉంది" అని విన్నవించుకున్నాను. అప్పుడు ఆయన, "అయితే దావూద్ (అలైహిస్సలాం) మాదిరిగా రోజాలు పాటించు. ఇది ఉత్తమమయిన రీతి. ఒక రోజా రోజా పాటించాలి, మరుసటి రోజు విరమించాలి. వారంలో ఒకసారి దివ్య ఖుర్ఆన్ పారాయణం పూర్తి చెయ్యి. ఇంతకంటే అధికం చెయ్యరాదు" అని సెలవిచ్చారు. (బుఖారి, మిష్కాత్)

---

పూర్తిగా నమాజ్‌లో గడుపుతూ ఉన్నారన్న సమాచారం కారుణ్యమూర్తి (సఅసం)కు తెలిసి ఆయన ఆ విషయం హజ్రత్ అబ్దుల్లాహ్‌తో ప్రస్తావించారు. హజ్రత్ అబ్దుల్లాహ్ అత్యధిక పుణ్యఫలాన్ని ఆర్జించాలన్న ఆశతో అలా చేసేవారన్న విషయం విదితమవుతూనే ఉంది. ఐతే ధర్మంలో సంతులిత మార్గం అవలంబించడమే వాంఛనీయం. ఆ మాటే బోధక శ్రేష్ఠులు (సఅసం) ఈ ఉపదేశంలో తెలిపారు. దైవ సామీప్యం కొరకు ఇతోధికంగా కృషి చెయ్యవలసిందే కాని అది ప్రాపంచిక బాధ్యతల పట్ల విస్మరణగా పరిణమించే కృషికాకుండా ఉండాలి. శరీరానికి అవసరం మేరకు విశ్రాంతి లభించకపోతే అది అనతికాలంలోనే తిరగబడుతుంది. నిద్ర కూడా మానవావసరమే. శరీరానికి గల ఈ హక్కును కాదనే సాహసం ఎవరికుంది? అలాగే భార్యను చేసుకున్న వ్యక్తి ఆమె పట్ల ఉపేక్షాభావం కనబరచి ఆవిడ కోరికల్ని ఖాతరు చెయ్యకుండా రోజా వ్రతాలని,

(٣٠) عَنْ سَعْدِ بْنِ اَبِيْ وَقَّاصٍ قَالَ جَاءَنِيْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ يَعُوْدُنِيْ عَامَ حَجَّةِ الْوَدَاعِ مِنْ وَجْعٍ اشْتَدَّ بِيْ فَقُلْتُ يَا رَسُوْلَ
اللّٰهِ اِنِّيْ قَدْ بَلَغَ بِيْ مِنَ الْوَجْعِ مَا تَرٰى وَاَنَا ذُوْ مَالٍ وَّلَا يَرِثُنِيْ اِلَّا ابْنَةٌ
لِّيْ اَفَاَتَصَدَّقُ بِثُلُثَيْ مَالِيْ قَالَ لَا، قُلْتُ فَالشَّطْرُ يَا رَسُوْلَ اللّٰهِ فَقَالَ
لَا قُلْتُ فَالثُّلُثُ يَا رَسُوْلَ اللّٰهِ قَالَ الثُّلُثُ وَالثُّلُثُ كَثِيْرٌ، اِنَّكَ اَنْ تَذَرَ
وَرَثَتَكَ اَغْنِيَاءَ خَيْرٌ مِّنْ اَنْ تَذَرَهُمْ عَالَةً يَّتَكَفَّفُوْنَ النَّاسَ۔

30. హజ్రత్ సఅద్ బిన్ అబి వక్కాస్ (రజిఅన్) ఉల్లేఖించారు. "హజ్జతుల్ వదా సంవత్సరాన నా బాధ అధికమవడంచేత ప్రవక్త (శ్రేష్ఠులు నన్ను పరామర్శించడానికి విచ్చేశారు. అప్పుడు నేను ఆయనతో, "నా బాధ ఎంత తీవ్ర రూపం దాల్చిందో మీరు చూస్తూనే ఉన్నారు. నా వద్ద బాగా ధనం ఉంది. నా వారసురాలు కేవలం ఒక్క కుమార్తె మాత్రమే. నేను నా ధనంలో రెండువంతులు దానం చెయ్యవచ్చునా?" అని విన్నవించుకున్నాను. దానికి ఆయన వద్దని వారించారు. నేను 'సగమో?' అని అడిగాను, ఆయన దానికీ కాదు అనే పురమాయించారు. అప్పుడు నేను "పోనివ్వండి మూడో వంతు ఇస్తాను" అన్నాను, దానికి ఆయన, "ఆc, మూడో వంతు సరి. అయినా మూడో వంతు కూడా ఎక్కువే. ఎందువల్లనంటే నీవు నీ వారసుల్ని శ్రీమంతులుగా వదలివెళ్ళడం, నీవు వారిని బీదరికంలో, ఆకలిదప్పుల్లో వదలి మరణించగా వారు సహాయం కోసం ఇతరులముందు చెయ్యిచాచి అర్థించడం కన్నా ఉత్తమమయింది" అని సెలవిచ్చారు.

---

నమాజులని సదా దైవధ్యానంలో గడిపితే ఆమె హక్కులు నెరవేరే విధానం ఏది? అతిథులు వచ్చినా రోజాలు పాటిస్తూ వారిని మటుకు తినమంటే వారు కూడా ఇబ్బంది పడరూ? అందువల్లనే ఇలాంటి నఫిల్ రోజాలను అతిథుల కోసం విరమించడంలో తప్పులేదని షరీఅత్ అంటుంది. ఖుర్ఆన్ పారాయణం చెయ్యడమంటే చిలకలా వల్లించడం ఎంత మాత్రం కాదు. పఠనంతోపాటు దాని అర్థాన్ని, సారాన్ని గ్రహించడం కూడా అవసరమే. అందువల్లనే మూడు రోజులకన్నా తక్కువకాలంలో ఖుర్ఆన్ పఠనాన్ని పూర్తిచెయ్యరాదని మరో హదీసు సూచిస్తుంది.

(۳۱) عَنِ الْمِقْدَامِ بْنِ مَعْدِ يْكَرِبَ اَنَّهُ سَمِعَ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَا اَطْعَمْتَ نَفْسَكَ فَهُوَ لَكَ صَدَقَةٌ وَمَا اَطْعَمْتَ وَلَدَكَ فَهُوَ لَكَ صَدَقَةٌ وَمَا اَطْعَمْتَ زَوْجَكَ فَهُوَ لَكَ صَدَقَةٌ وَمَا اَطْعَمْتَ خَادِمَكَ فَهُوَ لَكَ صَدَقَةٌ۔ (الادب المفرد)

31. మిక్దామ్ బిన్ మఅద్ యక్రబ్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ఆయన, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవియ్యగా విన్నారు: "స్వయంగా నీవు చేసే భోజనం నీకు సదకా; నీ సంతానానికి నీవు తినిపించేదీ నీకు సదకా; నీ భార్యకు నీవు పెట్టేదీ నీకు సదకా; నీ నౌకరుకు నీవు పెట్టేదీ నీకు సదకాయే." (అల్ అదబుల్ ముఫ్రద్)

(۳۲) عَنْ اَبِیْ ذَرٍّ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ بِكُلِّ تَسْبِيْحَةٍ صَدَقَةً وَكُلِّ تَكْبِيْرَةٍ صَدَقَةً وَكُلِّ تَحْمِيْدَةٍ صَدَقَةً وَكُلِّ تَهْلِيْلَةٍ صَدَقَةً وَاَمْرٌ بِالْمَعْرُوْفِ صَدَقَةٌ وَنَهْيٌ عَنِ الْمُنْكَرِ صَدَقَةٌ وَفِیْ بُضْعِ اَحَدِكُمْ صَدَقَةٌ، قَالُوْا يَا رَسُوْلَ اللهِ يَأْتِیْ اَحَدُنَا شَهْوَتَهُ وَيَكُوْنُ لَهُ فِيْهَا اَجْرٌ قَالَ اَرَاَيْتُمْ لَوْ وَضَعَهَا فِیْ حَرَامٍ كَانَ عَلَيْهِ فِيْهِ وِزْرٌ فَكَذٰلِكَ اِذَا وَضَعَهَا فِی الْحَلَالِ كَانَ لَهُ اَجْرٌ۔ (صحيح مسلم

مشكوة - باب فضل الصدقة)

---

30. దానధర్మాల్లోను అతిశయానికి, అతివాదానికి పోకుండా ఈ హదీసులో వారించడం జరిగింది. వారసుల కోసం సంపాదించి వదలివెళ్ళడం ఏ మాత్రం తప్పు కాదని దీనివల్ల తెలుస్తోంది. అతివాదపు ధార్మికతకు గురయిన కొందరు ప్రాపంచిక సామగ్రిని కూడబెట్టడమే తప్పుగా భావిస్తారు. ఈ హదీసు ఆ భావాన్ని సమూలంగా తుడిచివేస్తుంది. పైగా వారసుల్ని నిరాధారులుగా వెళ్ళేలా తన ధనాన్నంతా దానధర్మాల్లో ఖర్చుపెట్టడంకన్నా వారి కోసం వదలివెళ్ళడం సమంజసమని కూడా బోధపడుతుంది.

32. దైవ ప్రవక్త (సఅసం) బోధించినట్లు అబూజర్ (రజిఅన్) ఉల్లేఖించారు: "ఒకసారి సుబ్‌హానల్లాహ్ అని పలకడం సదకా; ఒకసారి అల్లాహు అక్బర్ అని స్మరించడం సదకా; ఒకసారి అల్ హమ్దులిల్లాహ్ అనడం కూడా సదకా; ఒకసారి లా ఇలాహ ఇల్లల్లాహ్ అనడమూ సదకాయే. మంచిని ఆదేశించడం సదకా; చెడును వారించడం సదకా; మీలో ఎవరయినా తమ లైంగిక వాంఛను సంతృప్తపరచుకుంటే అదీ సదకాయే." అప్పుడు అక్కడున్నవారు అడిగారు, 'మాలో ఒకరు తన కోరికను తీర్చుకుంటే దానికి కూడా అతను పుణ్యఫలానికి అర్హుడవుతాడా?' అని. దానికి ఆయన (సఅసం) ఇలా నుడివారు, "అవును. ఒకవేళ అతను తన కోరికను అక్రమంగా తీర్చుకుని ఉంటే అపరాధి అయ్యేవాడు కాదా? అలాగే అతను తన సహజ కాంక్షను ధర్మసమ్మతమైన మార్గాన తీర్చుకోవడంచేత అతను పుణ్యఫలానికి అర్హుడే." (సహీహ్ ముస్లిమ్, మిష్కాత్)

---

31. సదకా అంటే నిజమయినది అని అర్థం. 'దానం' అన్న భావంలో ఈ పదాన్ని ఇస్లామీయ పరిభాషలో ప్రయోగిస్తారు. ఈ హదీసు ద్వారా తెలిసేదేమిటంటే ఒక వ్యక్తి ధర్మసమ్మతమయిన మార్గాల ద్వారా జీవిక సంపాయించి తాను తింటూ తన భార్యా పిల్లలకూ పెట్టినట్లయితే అది కూడా అతనికి పుణ్యఫలాన్ని సమకూరుస్తుంది. అంటే కేవలం దానధర్మం చెయ్యటం ఒక్కటే కాదు, ధర్మబద్ధమయిన సంపాదన కూడా మనిషికి పుణ్యఫలాన్ని సమకూరుస్తుంది, దైవ సంతోషానికి కారణమవుతుందన్న మాట. సత్కార్యం అన్నది ఎంతో విస్తృత భావంకల విషయమని కూడా బోధపడుతుంది.

32. 'సుబ్‌హానల్లాహ్' అంటే దేవుని పవిత్రతను కొనియాడటం, 'అల్లాహు అక్బర్' అంటే, దేవుని గొప్పదనాన్ని స్మరించటం, 'అల్‌హమ్దులిల్లాహ్' అంటే దేవుని ప్రస్తుతించటం. 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అంటే, 'ఒక్క అల్లాహ్ తప్ప మరే దైవం లేడు' అని అర్థం. సామాన్యంగా దైవనామ సంస్మరణ పుణ్యప్రదమయిందిగా భావించడం జరుగుతుంది. దాన్ని ధృవీకరిస్తూ ఈ హదీసులో కూడా సత్క్రియ అన్నది, పుణ్యకార్యమన్నది ఎంత విస్తృతభావంకల విషయమో బోధించడం జరిగింది. దీని ప్రకారం కేవలం దైవనామ సంకీర్తనం, సత్కార్యాలు చెయ్యడం ఒక్కటే కాదు, ప్రజలను మంచి పనులకై పురికొలపడం, సత్కార్యాలకై ప్రేరేపించడం కూడా పుణ్యప్రదమని, చివరికి మనిషి తన మనోవాంఛలను అక్రమ మార్గాల ద్వారా కాకుండా ధర్మసమ్మతమయిన మార్గాల ద్వారా తీర్చుకున్నా అతని ఈ ధర్మనిష్ఠ కారణంగా కూడా దైవం సంతసించి బహుమానాలు అందజేస్తాడని ద్యోతకమవుతోంది.

(۳۳) عَنْ اَبِیْ سَعِیْدِ الْخُدْرِیْ عَنِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اِنَّ الدُّنْیَا حُلْوَۃٌ خَضِرَۃٌ وَاِنَّ اللّٰہَ مُسْتَخْلِفُکُمْ فِیْھَا فَیَنْظُرُ کَیْفَ تَعْمَلُوْنَ ۔ (صحیح مسلم ۔کتاب الذکر)

33. అబూసయీద్ ఖుద్రీ (రజిఅన్) ఉల్లేఖించారు: బోధక శ్రేష్ఠులు (సఅసం) ఇలా ఉపదేశించారు, "ప్రపంచం మధురమయినది, సస్యశ్యామల మయినది. అల్లాహ్ మీకు అందులో ఖిలాఫత్ (ప్రాతినిధ్యం) హోదాను ప్రసాదించనున్నాడు- మీరు ఏ విధమయిన ఆచరణను ప్రదర్శిస్తారో చూడాలని." (సహీ ముస్లిమ్ - కితాబుజ్జిక్ర్)

(۳۴) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَلدُّنْیَا سِجْنُ الْمُؤْمِنِ وَجَنَّۃُ الْکَافِرِ (مسلم مشکوۃ ۔کتاب الرقاق)

34. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖించారు: మానవోత్తములు (సఅసం) ఉపదేశించారు, "ప్రపంచం విశ్వసించినవానికి చెరసాలవంటిది. తిరస్కరించేవానికి స్వర్గంలాంటిది" అని.

(ముస్లిమ్, మిష్కాత్ - కితాబుర్రికాక్)

---

33. ప్రపంచం, దానిలోని రుచులు, తియ్యదనం, కమ్మదనం, దాని రమ్యత, మనోహర, మనోజ్ఞతలు మనిషిని ఎంతో ఆకట్టుకుంటాయి. ఆహ్లాదాన్ని, హాయిని గొలుపుతాయి. మనిషి వీటన్నింటిలోపడి ఇవన్నీ తన సొంతమని, తన జీవితం ఇక్కడ నిత్యమని భావిస్తాడు. కాని సత్యం అదికాదని తెలుపుతోంది ఈ హదీసు. ప్రపంచంలోని సర్వమూ మనిషిది కాదని వీటన్నింటికీ నిజస్వామి అల్లాహ్ అని మనిషి స్థానం వాటి సొంతదారునిది కాదు, కేవలం ప్రాతినిధ్య హోదాలోనే వాటిని వినియోగించుకోవాలని, నిజస్వామి వాటిని ఎలా వినియోగించాలని కోరుతున్నాడో ప్రతినిధి అలానే వినియోగించాలని తెలుపుతోంది. ఇంకా ఈ ప్రపంచం, ఇందులో మనిషి జీవితం శాశ్వతంకాదని, మనిషి తన ప్రాతినిధ్యపు హోదాను సక్రమంగా నిర్వర్తిస్తున్నాడో లేదో తిలకిస్తున్న ప్రభువు సమక్షంలో తన కర్మలన్నింటికీ జవాబు చెప్పుకునేందుకు మనిషి హాజరు కావలసి ఉందని కూడా తెలుపుతుంది ఈ హదీసు.

(۳۵) عَنْ شَدَّادِ بْنِ اَوْسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَلْکَیِّسُ مَنْ دَانَ نَفْسَہٗ وَعَمِلَ لِمَا بَعْدَ الْمَوْتِ وَالْعَاجِزُ مَنْ اَتْبَعَ نَفْسَہٗ ھَوَاھَا وَتَمَنّٰی عَلَی اللّٰہِ۔ (رواہ الترمذی۔ مشکوٰۃ۔ باب استحباب المال)

35. ప్రవక్త మహనీయులు బోధించినట్లు షద్దాద్ బిన్ ఔస్ ఉల్లేఖించారు, "ఎవరయితే తన ఆత్మపరిశీలన చేసుకుంటాడో, మరణానంతర జీవితం కొరకు సదాచరణ చేసుకుంటాడో అతడే వివేకవంతుడు. మరెవరయితే తన మనసును దాని కోరికల అనుసరణకై వదిలేస్తాడో తరువాత దైవానుగ్రహం పట్ల ఆశలు పెంచుకుంటాడో అతడే అసమర్థుడు, (ధైర్యహీనుడు)."

(తిర్మిజి, మిష్కాత్)

---

34. విశ్వసించినవారు షరీఅత్ పరిధి లోపల కట్టుబడి ఉంటూ జీవితంలోని సకల వ్యవహారాలను నడపవలసి ఉంటుంది. షరీఅత్ నియమాలను అతిక్రమించడానికి విశ్వసించినవారు సాహసించలేరు. అందువల్ల ఈ ప్రపంచం వారికి చెరసాలవంటిది. దీనికి భిన్నంగా దైవ తిరస్కారి, విశ్వాసహీనుడు ఎలాంటి షరీఅత్ ఆంక్షలకూ బద్ధుడు కాడు. విచ్చలవిడిగా, స్వేచ్ఛావిహారిగా, కళ్ళెంలేని గుర్రంలా, బరితెగించిన అడవి మృగాల్లా ఎటుబడితే అటు వెళ్ళడానికి, ఏదిబడితే అది తినడానికి, ఇష్టమయిన రీతిలో వ్యవహరించడానికి స్వతంత్రునిగా భావిస్తాడు. అతనికి ఈ ప్రపంచమే స్వర్గం. మరి పరలోకం నరకమే!

35. మనిషి అనునిత్యం ఆత్మపరిశీలన జరుపుకుంటూ, తన మనోభావాలు, ఆచరణలు ఎటు వెళ్ళుతున్నాయో లెక్కజూసుకుంటూ ఉన్నట్లయితే, తన ప్రయాణం పరలోకంలోని సాఫల్యం వైపునకు సాగుతున్నదా లేక దుష్పరిణామాలకు గొనిపోతుందా అని బేరీజు వేసుకుంటూ ఉంటే అతను బుద్ధిమంతుడవడంలో సందేహమేముంది. అలాగే ఒకవేళ అతను తన మనసుపై అదుపులేకుండా అది కోరినవన్నీ దానికి అందజేసుకుంటూ ఉన్నట్లయితే, తన చేతకానితనానికి తగినట్టుగా, 'నేను ఎన్ని ఘోరాలు చేసినా, నా ప్రభువు కరుణామయుడు నన్ను మన్నించి కాపాడుతాడు' అని ఆశల పేక మేడలు కట్టుకుంటే అవి పరలోకాన కుప్పకూలడం తథ్యం. ఈ వైఖరి అతని బుద్ధిహీనతకు తార్కాణం కాక మరేమవుతుంది?

(٣٦) عَنْ اَبِیْ سَعِیْدٍ عَنِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ
مَثَلُ الْمُؤْمِنِ وَمَثَلُ الْاِیْمَانِ کَمَثَلِ الْفَرَسِ فِیْ اِخْیَتِہٖ یَجُوْلُ ثُمَّ
یَرْجِعُ اِلٰی اِخْیَتِہٖ وَاِنَّ الْمُؤْمِنَ یَسْھُوْ ثُمَّ یَرْجِعُ اِلَی الْاِیْمَانِ
فَاَطْعِمُوْا طَعَامَکُمُ الْاَتْقِیَاءَ وَاَوْلُوْا مَعْرُوْفَکُمُ الْمُؤْمِنِیْنَ ۔ (رواہ البیہقی
مشکوٰۃ ۔ باب الضیافۃ)

36. అబూ సయీద్ ఖుద్రి (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) సెలవిచ్చారు, "మోమిన్ (విశ్వాసి) మరియు ఈమాన్(విశ్వాసం)లను ఉపమానంలో చెప్పాలంటే గుంజకు కట్టిన గుర్రంలాంటిదని చెప్పవచ్చు. గుర్రం అటు ఇటు తిరుగుతుంది, తిరిగి తన గుంజ వైపునకే మరలివస్తుంది. అదే విధంగా విశ్వసించిన వ్యక్తి వల్ల ఏమరుపాటు, విస్మరణలు జరుగవచ్చు. అయితే అతను తిరిగి తన విశ్వాసం వైపునకు మరలివస్తాడు. మీరు సజ్జనులకు భోజనం పెట్టండి, విశ్వసించినవారి ఎడల ఉదారంగా వ్యవహరించండి." (మిష్కాత్)

(٣٧) عَنِ ابْنِ عَبَّاسٍ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ
اَرْبَعٌ مَنْ اُعْطِیَھُنَّ اُعْطِیَ خَیْرَ الدُّنْیَا وَالْاٰخِرَۃِ قَلْبٌ شَاکِرٌ وَلِسَانٌ ذَاکِرٌ
وَبَدَنٌ عَلَی الْبَلَاءِ صَابِرٌ وَزَوْجَۃٌ لَا تَبْغِیْہِ خَوْنًا فِیْ نَفْسِھَا وَلَا مَالِہٖ ۔
(البیہقی ۔ مشکوٰۃ ۔ باب العشرۃ صفحہ ٢٨)

---

36. విశ్వసించిన వ్యక్తి పొరపాటున సన్మార్గం వదలి తప్పుడు పనులకు పాల్పడవచ్చు. అయితే అతనిలో విశ్వాసమే సజీవంగా ఉన్నట్లయితే మేకుకు కట్టిన గుర్రం ఏ విధంగా అటు ఇటు తిరిగినా, తిరిగి తన గాటికే చేరుతుందో అదే విధంగా ఆ మనిషి పొరపాటు వల్ల తప్పు జరిగినా దాన్ని గ్రహించి తన దైవం వైపునకు మరలుతాడు. పొరపాటు, విస్మరణ అవేది ఎన్నిసార్లు జరిగినా అన్నిసార్లూ అతను దైవం వైపునకు మరలుతాడు. అదే విశ్వసించిన వ్యక్తి ప్రత్యేకత. సరయిన విశ్వాసం, దృఢ విశ్వాసం లేని మనిషి దారితప్పడంటే తిరిగి సన్మార్గాన వచ్చే నమ్మకముండదు. కాని విశ్వాస బంధనాల్లో

37. హజ్రత్ ఇబ్ను అబ్బాస్ ఉల్లేఖించారు, ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారని, "నాలుగు విషయాలు ఎవరికయితే ప్రాప్తిస్తాయో, అతనికి ఇహపరాల మేళ్ళన్నీ ఒనగూడుతాయి. (1) కృతజ్ఞతాభావం నిండిన అంతర్యం, (2) దైవ నామ సంస్మరణ చేసే జిహ్వ (3) కష్టం కలిగినప్పుడు ఓరిమి వహించే శరీరం (4) తన విషయంలోనూ తన భర్త సొత్తు విషయంలోనూ నమ్మకద్రోహం చెయ్యని భార్య." (బైహకీ, మిష్కాత్)

(۳۸) عَنِ ابْنِ عُمَرَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ الْمُسْلِمُ الَّذِي يُخَالِطُ النَّاسَ وَيَصْبِرُ عَلٰى اَذَاهُمْ اَفْضَلُ مِنَ الَّذِي لَا يُخَالِطُهُمْ وَلَا يَصْبِرُ عَلٰى اَذَاهُمْ۔ (رواه الترمذی۔ مشکوٰۃ)

38. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఉల్లేఖనం: బోధక శ్రేష్ఠులు (సఅసం), "ఏ ముస్లిమయితే జనులతో కలుపుగోలుగా, కలివిడిగా ఉంటాడో ఇంకా వారి వల్ల ఏదయినా బాధ కలిగినప్పుడు సహనం వహిస్తాడో, అతను జను లకు దూరంగా ఉంటూ వారి ద్వారా కలిగే బాధని ఓర్చుకునే అవకాశంలేని ముస్లిమ్‌కన్నా ఎంతో ఉత్తముడు" అని ఉపదేశించారు. (తిర్మిజీ, మిష్కాత్)

---

ఉండే వ్యక్తి పొరపాటుగా ఎన్ని తప్పులు చేసినా మళ్ళీ మళ్ళీ దైవం వైపు నకు మరలే అవకాశం ఉంటుంది. అతను అలా దైవం వైపునకు మరలడమే అతనిలో విశ్వాసం సజీవంగా ఉందనడానికి ఆనవాలు.

37. కృతజ్ఞత అన్నది తృప్తి వల్ల జనిస్తుంది, దైవం పట్ల కృతజ్ఞత కలగటం, మేలుచేసిన మానవ సోదరుల పట్ల కృతజ్ఞతా భావం కలగటం అన్నది ఆ జరిగిన మేలు పట్ల సంతృప్తిని సూచిస్తుంది. సకల సంపదలకన్నా విలువయింది సంతృప్తి అనే సంపద. కృతజ్ఞతాభావం వినయాన్ని వినమ్రతను కూడా జనింపజేస్తుంది. వినయం, మరింత అనుగ్రహానికి కారణభూతమవుతుంది. దైవనామ సంస్మరణ సదా మనిషిని చెడుకు దూరంగా మంచికి చేరువగా చేస్తుంది. సహనం స్థయిర్యం అనేవి మనిషిలో ఆత్మవిశ్వాసాన్ని సంకల్పబలాన్నీ వృద్ధిచేస్తాయి. తన మానాన్నీ, భర్తధనాన్నీ పరిరక్షించుకునే భార్య వల్ల మనిషి ఎక్కడున్నా ఆత్మశాంతితో, నిశ్చింతగా గడుపుతాడు. ఈ గుణాలన్నింటికీ వ్యతిరేకమయినవాటిని గురించి ఆలోచించి చూడండి. మనిషి ఎంతగా అశాంతి అలజడులకు లోనవుతాడో, జీవితం ఎంత దుర్భరమవుతుందో, అందువల్లనే మానవోత్తములు (సఅసం) ఈ విషయాలు ప్రాప్తమయినవాడు ఇహపరాల శుభాలను పొందాడని ప్రకటించారు.

(۳۹) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اَلْمُسْلِمُ مَنْ سَلِمَ الْمُسْلِمُوْنَ مِنْ لِسَانِهٖ وَیَدِهٖ وَالْمُؤْمِنُ مَنْ اَمِنَهُ النَّاسُ عَلٰی دِمَآئِهِمْ وَاَمْوَالِهِمْ (رواه الترمذی والنسائی وزاد البیهقی فی شعب الایمان بروایة فضالة) وَالْمُجَاهِدُ مَنْ جَاهَدَ نَفْسَهٗ فِیْ طَاعَةِ اللّٰهِ وَالْمُهَاجِرُ مَنْ هَجَرَ الْخَطَایَا وَالذُّنُوْبَ۔

(مشکوٰة۔ کتاب الایمان ص)

39. హజ్రత్ అబూహురైరా (రజిఅన్), ప్రవక్త (శ్రేమ్మలు సెలవిచ్చినట్లు ఉల్లేఖించారు: "ఎవరి నోటి ద్వారా, చెయ్యి ద్వారా ఇతర ముస్లిములు సురక్షితంగా ఉంటారో అతనే నిజమైన ముస్లిమ్, ప్రజలు ఎవరి విషయంలోనయితే తమ ధన ప్రాణాలకు నష్టం కలగదని నమ్మకంగా ఉంటారో అతనే నిజమయిన మోమిన్ (విశ్వసించినవాడు), ఎవరయితే దైవ విధేయతను పాటించడంలో తన మనోకాంక్షలతో పోరాడుతాడో అతడే నిజమయిన ముజాహిద్ (యోధుడు). ఎవరయితే అవిధేయతా విధానాన్ని విడిచి పెడతాడో అతనే నిజమయిన ముహాజిర్ (స్వదేశం వదలి వలన పోయినవాడు)." (మిష్కాత్)

---

38. మానవుడు సాంఘిక జీవి. సంఘంలో ఉంటూ సంఘానికి దూరంగా ఉండటం మంచి పద్ధతి కాదు. 'తానేమో తన పనేమో', 'ఒకరి మంచిలోకి రాడు, చెబ్బరలోకి పోడు' అనే మాటలు మనం అప్పుడప్పుడు పలుకుతూ ఉంటాము. అలాంటి వారిని 'చాలా బుద్ధిమంతుడు' అని పొగడతాము కూడా. కాని ఒక ముస్లిమ్ వ్యవహరించవలసిన తీరు కాదది. ముస్లిమ్ వ్యక్తిగతంగా ఓ సంస్కరణోద్యమ కార్యకర్త. అతను ముక్కుమూసుకుని గిరిగీసుకుని ఎలా కూర్చోగలడు? అందరితో కలవాలి. సంఘకార్యకలాపాల్లో పాల్గొనాలి. జనజీవనంలో అడుగుపెడితే ఆటుపోట్లు తప్పవు. వాటిని భరించాలి. అతడే ఉత్తమ ముస్లిమ్. ప్రజలకు దూరంగా ఉండేవాడు కాదు.

39. ముస్లిమ్, మోమిన్, ముజాహిద్, ముహాజిర్ – ఇవన్నీ ముస్లిమ్ అనే వ్యక్తికి మారు పేర్లు, ముస్లిమ్ అంటే దైవానికి స్వయం సమర్పణ చేసుకున్నవాడు. మోమిన్ అంటే దైవాన్ని, దైవప్రవక్తనూ, దైవ గ్రంథాలను, దైవ దూతల్ని విశ్వసించిన వ్యక్తి.

# 2. ధార్మిక విద్యాబోధన

(۴۰) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَاحَسَدَ اِلَّا فِيْ اِثْنَتَيْنِ رَجُلٌ اٰتَاهُ اللّٰهُ مَالًا فَسَلَّطَهٗ عَلٰى هَلَكَتِهٖ
فِي الْحَقِّ وَرَجُلٌ اٰتَاهُ اللّٰهُ الْحِكْمَةَ فَهُوَ يَقْضِيْ بِهَا وَيُعَلِّمُهَا
(بخاری۔مسلم۔مشکوٰۃ۔کتاب العلم۔ص ۲۴)

40. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు(సఅసం)ఇలా సెలవిచ్చారు, 'ఈర్ష్యపడటం అన్నది ఇద్దరు వ్యక్తుల విషయంలో వినా మరెవరి విషయంలోనూ ధర్మబద్ధంకాదు. ఒకనికి, దైవం ధన సంపద ఇవ్వడంతోపాటు దాన్ని సత్యమార్గాన ధారబోసే సద్బుద్ధినీ అనుగ్రహించాడు. రెండవతనికి దైవంధర్మంలో వివేచనాతత్పరతను ప్రసాదించగా అతనుతన బుద్ధికుశలతతో తీర్పులుచెయ్యడం, నిర్ణయాలు గైకొనడమేకాక ప్రజలకు ధర్మజ్ఞాన ప్రబోధనమూ చేస్తాడు.'

(బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

---

ముజాహిద్ అంటే తనకున్న శక్తిసామర్థ్యాలన్నింటినీ వినియోగించి మిథ్యాశక్తులతో నిర్విరామంగా పోరాడేవాడు, సత్య సంస్థాపనార్థం అవిరళ కృషి సలిపేవాడు. ముహాజిర్ అంటే తన జీవన పరమార్థాన్ని సాధించేందుకు అవకాశాలు కొరవడినప్పుడు అవసరమయితే తన సొంత నివాస స్థలాన్ని సయితం వదలి తనకు అనుకూలమయిన వాతావరణం కోసం గాలిస్తూ వలస వెళ్ళేవాడు. ఈ పదాలకే మరో అంతర్గత, నైతిక, ఆధ్యాత్మిక నిర్వచనాన్ని ప్రవక్త మహనీయులు ఈ హదీసులో మనకు తెలిపారు.

40. ఇక్కడ 'ఈర్ష్య' అన్న పదం ద్వేషభావంతో కూడుకున్నది కాదు. అది సర్వత్రా పరిత్యజనీయమే. కాని ఒకరికున్న దాన్ని తాను సాధించాలన్న దీక్ష, ప్రశంసా భావాలతో కూడుకున్నదయితే అది అభిలషనీయమే అన్నమాట. ఇలా ఈర్ష్య చెందవలసిన రెండు రకాల వ్యక్తుల్ని ప్రవక్త శ్రేష్ఠులు ఇక్కడ పేర్కొన్నారు. ధనంతోపాటు దాన్ని దైవమార్గాన ధారాళంగా ఖర్చుపెట్టాలన్న సద్బుద్ధి చాలా అరుదుగాగాని కన్పించదు. ఎక్కడయినా ఉందంటే అలాంటి వారిపట్ల 'ఈర్ష్య' చెందవలసిందేమరి.

(۴۱) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ تَدَارُسُ الْعِلْمِ سَاعَةً مِّنَ اللَّيْلِ
خَيْرٌ مِّنْ إِحْيَائِهَا۔ (رواہ الدارمی۔مشکوٰۃ۔کتاب العلم صفحہ ۲۸)

41. ఇబ్ను అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనం, ఆయన ఇలా అన్నారు: రాత్రి వేళ జాగరణచేసి ఆరాధనల్లో నిమగ్నమవడంకన్నా రాత్రిలో కొంత భాగం జ్ఞానసముపార్జన చెయ్యడం, బోధించడం ఎంతో ఉత్తమం.
(దారిమి - మిష్కాత్)

(۴۲) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
كَلِمَةُ الْحِكْمَةِ ضَالَّةُ الْحَكِيمِ فَحَيْثُ وَجَدَهَا فَهُوَ أَحَقُّ بِهَا
(رواہ الترمذی۔مشکوٰۃ صفحہ ۲۶)

42. అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖించారు: ప్రవక్త మహనీయులు ఇలా ఉపదేశించారు, 'వివేచన నిండిన మాట విజ్ఞుడయిన మనిషి పోగొట్టుకున్న విత్తం. అది అతనికి ఎక్కడ ప్రాప్తమయినా దానికి అధికంగా యోగ్యుడయిన వాడు అతనే.' (తిర్మిజి, మిష్కాత్)

---

అలాగే విజ్ఞతా వివేచనల విషయంలోనూ, వాటిని యధేచ్ఛగా ఇతరులకు పంచి పెట్టేవారిని చూసినా మనసులో సద్భావం ఏర్పడటం సుగుణవంతులకు సహజం.

41. మతం, ఆధ్యాత్మికత అన్న పదాలు విన్నంతనే ఆరాధనా లాంఛనాలు, తత్సంబంధిత ఆచార వ్యవహారాలు గుర్తుకువస్తాయి. ఇస్లాం ఆరాధనలకు తగిన స్థాయినిస్తుంది. దైవ సామీప్యానికి అవి సాధనాలని అంటుంది కూడా. అయితే ప్రపంచంలో మనిషికి జ్ఞానసముపార్జనలో ఉన్న అనుబంధాన్ని, జ్ఞానానికున్న ప్రాముఖ్యాన్ని, ప్రాధాన్యాన్ని అది ఎంతవరకు గుర్తించిందో ఈ హదీసు ద్వారా ద్యోతకమవుతుంది.

42. జ్ఞాన సముపార్జనలో దురభిమానాలు, విద్వేషాలు ఏ మాత్రం పనికిరావని బోధక శ్రేష్ఠులు ఈ హదీసులో విశదపరిచారు. విజ్ఞానదాయకం, వివేక భరితమయిన మాట ఏ నోట విన్నా, ఏ చోట గ్రహించినా తక్షణం దాన్ని స్వీకరించడం, తన సొంతం చేసుకోవడం విజ్ఞుడయిన వ్యక్తి లక్షణం. ఎందువల్లనంటే విజ్ఞానం, వివేకం అన్నది

(۴۳) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
فَقِيْهٌ وَاحِدٌ اَشَدُّ عَلَى الشَّيْطَانِ مِنْ اَلْفِ عَابِدٍ۔ (الترمذی۔ مشکوٰۃ ص ۳۴)

43. హజ్రత్ ఇబ్ను అబ్బాస్ ఉల్లేఖనంలో మహనీయ ముహమ్మద్ (సఅసం) ఒకసారి ఇలా బోధించారు: 'వివేచనాపరుడయిన ఒక విద్వాంసుడు, వేలాది ఉపాసనాదీక్షాపరుల కన్నా షైతాన్‌కు అధికంగా భారమయినవాడు.' (తిర్మిజి, మిష్కాత్)

(۴۴) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
نَضَّرَ اللّٰهُ عَبْدًا سَمِعَ مَقَالَتِيْ فَحَفِظَهَا وَوَعَاهَا وَاَدَّاهَا كَمَا
سَمِعَهَا فَرُبَّ مُبَلَّغٍ اَوْعٰى لَهَا مِنْ سَامِعٍ۔ (مشکوٰۃ۔ص ۳۵)

44. ఇబ్ను మస్ఊద్ ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త ఇలా బోధించారు, 'నా మాటను విని, దాన్ని భద్రంగా ఉంచి, జ్ఞాపకం పెట్టుకుని, విన్నది విన్నట్టుగానే యథాతథంగా ఇతరులకు చేరవేసిన దాసుణ్ణి దైవం సదా ప్రఫుల్లంగా ఉంచుగాక! అనేకసార్లు, నేరుగా విన్నవానికన్నా పరోక్షంగా (ఇతరులద్వారా) విన్నవాడు మాటను అధికంగా జ్ఞాపకముంచుకుంటాడు'. (మిష్కాత్)

---

మానవాళి యొక్క ఉమ్మడి సొత్తు. మనిషి దాన్ని ఎప్పుడు గ్రహించినా తాను ఎన్నడో కోల్పోయిన సొత్తుగా భావించి దాన్ని తన హృదయానికి హత్తుకోవాలి. విజ్ఞుడయినవాడే అలా చేస్తాడు. అలా చేసినవాడే దానికి తగినవాడు. ఎవరు చెప్పారన్నది కాకుండా ఏమి చెప్పారన్న విషయానికి ప్రాధాన్యతనివ్వాలి.

43. 'భారమయినవాడు' అనంటే అతన్ని షైతాన్ త్వరగా తన వలలో వేసుకోలేడు, అపమార్గం పట్టించలేడు అని అర్థం. ఆరాధనా దీక్షలో ఉన్న వ్యక్తి తన సొంత పరిధిలో ధార్మిక జీవనసరళికి సంబంధించిన కొన్ని విషయాలను అమలుజరుపుకోవచ్చు. అతని వల్ల అంతే సాధ్యమవుతుంది కూడా. అతడు తన ఆరాధనల వల్ల తన ఆత్మ లోకాన్ని జ్యోతిర్మయం చేసుకుంటాడేమోకాని బహిర్ ప్రపంచాన్ని మార్చనూలేడు,

(۴۵) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
عَلِّمُوْا وَيَسِّرُوْا وَعَلِّمُوْا وَيَسِّرُوْا ثَلَاثَ مَرَّاتٍ وَإِذَا غَضِبْتَ فَاسْكُتْ
مَرَّتَيْنِ۔ (الادب المفرد۔ باب یسکت اذا غضب ص۱۹۱)

45. హజ్రత్ ఇబ్ను అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించినదాని ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి ఉపదేశిస్తూ, "జ్ఞానాన్ని బోధించండి, సౌలభ్యాలను సృష్టించండి" అని మూడుమార్లు అన్నారు; ఇంకా "కోపావేశం పెచ్చరిల్లినప్పుడు మౌనం వహించండి" అని రెండుసార్లు పలికారు.

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

దాన్ని పైశాచిక ప్రమాదాల నుండి కాపాడనూ లేదు. సమాజంలోని చెడును చెరపడం అతని వల్ల అయ్యే పని కాదు. కాని సరయిన జ్ఞానం కల వ్యక్తి ఏది హానికరమో, ఏది లాభదాయకమో తన వివేచన ద్వారా విచక్షణా జ్ఞానం ద్వారా తెలుసుకోగలడు. తద్వారా ధర్మ సంస్థాపనా మార్గంలో ఇతోధికంగా కృషి చెయ్యనూగలడు, ఇలాంటివాడే షైతాన్‌కు కొరుకుడు పడని కొయ్యలా తయారవుతాడు.

44. మహాప్రవక్త (సఅసం) నుడివిన ఒక మాటను శ్రద్ధగా తెలుసుకోవడం దాన్ని ఉన్నది ఉన్నట్టుగానే, మార్పులూ చేర్పులూ చెయ్యకుండా ఇతరులకు అందజెయ్యడం మహా గొప్ప కార్యం. అందువల్లనే ప్రవక్త సహచరులు ఎంతో జాగ్రత్తగా ఆయన పలికిన మాటల్ని వినడానికి, వాటిని తిరిగి అలాగే తమ తరువాతి వారికి అందజెయ్యడానికి కృషి చేశారు. ప్రవక్త (సఅసం) సెలవిచ్చినట్లే ఆ తరువాత వారు వాటిని భద్రపరచి హదీసు సంకలనాల రూపంలో మనకు అందజేశారు. అల్లాహ్ కారుణ్యం వారందరిపై వర్షించుగాక.

45. 'జ్ఞానం' అంటే ధర్మజ్ఞానం అని భావం. ఈ ఉపదేశానికి భావమేమిటంటే ధర్మ బోధనల్లోనూ, ధర్మప్రచార కార్యకలాపాల్లోనూ ఉదారంగా వ్యవహరించాలి. ప్రజలను ధర్మమార్గంలో ఉన్న సౌలభ్యాలను, సరళతను విశదపరచాలి. అంతేగాని ధర్మ నియమాలు అనుసరణీయంకావన్న భావం ప్రజల్లో జనించేలా ధర్మబోధనల్ని క్లిష్టతరం చేసి చూపరాదు; ధర్మంలోని సరళతరమయిన మార్గాలను ఎత్తిచూపాలి. మూడుసార్లు ఆ మాటల్ని చెప్పి దాని ప్రాముఖ్యాన్ని స్పష్టం చేశారు ప్రవక్త మహనీయులు (సఅసం). మనిషి కోపావేశంలో తనపై అదుపు కోల్పోయినప్పుడు మౌనం వహించడం ధార్మికంగానేకాక ప్రాపంచికంగా కూడా ఎంత ప్రయోజనకరమో వేరుగా చెప్పనవసరంలేదు.

(٤٦) عَنْ شَقِيقٍ قَالَ كَانَ عَبْدُ اللهِ بْنُ مَسْعُوْدٍ يُذَكِّرُ النَّاسَ فِي كُلِّ خَمِيْسٍ فَقَالَ لَهُ رَجُلٌ يَا أَبَا عَبْدِ الرَّحْمٰنِ لَوَدِدْتُ أَنَّكَ ذَكَّرْتَنَا فِي كُلِّ يَوْمٍ قَالَ أَمَا أَنَّهُ يَمْنَعُنِيْ مِنْ ذَالِكَ أَنِّيْ أَكْرَهُ أَنْ أُمِلَّكُمْ وَأَنِّيْ أَتَخَوَّلُكُمْ بِالْمَوْعِظَةِ كَمَا كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَتَخَوَّلُنَا بِهَا مَخَافَةَ السَّآمَةِ عَلَيْنَا۔ (بخاری۔ مسلم۔ مشکوٰۃ۔ کتاب العلم۔ مطبع انصاری دلی)

46. షకీక్ (రజిఅన్) ఉల్లేఖించారు: ప్రతి గురువారంనాడు అబ్దుల్లా బిన్ మస్ఊద్ ప్రజలకు ధర్మబోధ చేసేవారు. ఓ రోజున ఓ వ్యక్తి ఆయనతో, ఓ అబూ అబ్దుర్రహ్మాన్, మీరు ప్రతి దినం ధర్మబోధ చెయ్యాలన్నది నా ఆకాంక్ష అని అన్నాడు. దానికి ఆయన, "మీరు ధర్మబోధ అంటే విసిగెత్తి పోతారేమోనన్న విషయం దృష్ట్యా నేను మీకు రోజూ సమయం కేటాయించలేను. ప్రవక్త మహనీయులు, మేము విసుగెత్తిపోతామేమోనని ఏ విధంగా శ్రద్ధచూపేవారో, అదే విధంగా నేనూ ధర్మబోధన విషయంలో మిమ్మల్ని కనిపెట్టుకుని ఉంటాను" అని బదులిచ్చారు.(బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

(٤٧) عَنْ أَنَسٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَلَّمَا يُوَاجِهُ الرَّجُلَ بِشَيْءٍ يَكْرَهُهُ فَدَخَلَ عَلَيْهِ يَوْمًا رَجُلٌ وَعَلَيْهِ أَثَرُ صُفْرَةٍ فَلَمَّا قَامَ قَالَ لِأَصْحَابِهٖ لَوْغَيَّرَ أَوْنَزَعَ هٰذِهِ الصُّفْرَةَ۔

(الادب المفرد۔ باب من لم یواجہ الناس بکلامہ۔ ص ٦٤)

---

46. ధర్మబోధన చెయ్యడం మంచిదేకాని దానికృ్కాడా సమయం, సందర్భం ఉండాలి. ముఖ్యంగా ధర్మం విషయంలో, ధార్మిక బోధనల విషయంలో ఎలాంటి తొందరపాటు పనికిరాదు. వినేవారి మానసిక స్థితిని, వారి సంసిద్ధతను, వారి మానసిక పరిపక్వతను దృష్టిలో ఉంచుకోవడం అవసరం. ప్రవక్త మహనీయులు (సఅసం) ఈ

47. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖించారు: దైవప్రవక్త (సఅసం)కు ఏదయినా విషయం నచ్చకపోతే ఆ వ్యక్తిని ముఖతః ఆక్షేపించడం అన్నది చాలా అరుదుగా జరిగేది. ఓ రోజున ఓ వ్యక్తి ఆయన (సఅసం) సన్నిధిలో హాజరయ్యాడు. అతని దుస్తులకు ఏదో పచ్చ రంగు అంటుకుని ఉండింది. అతను ఆ సమావేశంలో నుండి లేచి వెళ్ళిన తరువాత ప్రవక్త మహనీయులు, 'అతను ఆ పచ్చ రంగును మార్చుకున్నా లేదా దాన్ని ఉతికివేసినా బావుండేది' అని సెలవిచ్చారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۴۸) عَنْ عِكْرِمَةَ اَنَّ ابْنَ عَبَّاسٍ قَالَ حَدِّثِ النَّاسَ كُلَّ جُمُعَةٍ مَرَّةً فَاِنْ اَبَيْتَ فَمَرَّتَيْنِ فَاِنْ اَكْثَرْتَ فَثَلٰثَ مَرَّاتٍ وَلَا تُمِلَّ النَّاسَ هٰذَا الْقُرْاٰنَ وَلَا اُلْفِيَنَّكَ تَاْتِى الْقَوْمَ وَهُمْ فِىْ حَدِيْثٍ مِنْ حَدِيْثِهِمْ فَتَقُصُّ عَلَيْهِمْ فَتَقْطَعُ حَدِيْثَهُمْ فَتُمِلُّهُمْ وَلٰكِنْ اَنْصِتْ فَاِذَا اَمَرُوْكَ فَحَدِّثْهُمْ وَهُمْ يَشْتَهُوْنَهٗ وَانْظُرِ السَّجْعَ مِنَ الدُّعَاءِ فَاجْتَنِبْهُ فَاِنِّىْ عَهِدْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاَصْحَابَهٗ لَا يَفْعَلُوْنَ۔

48. ఇక్రమా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ఇబ్ను అబ్బాస్ (రజిఅన్) ఈ విధంగా ఉపదేశించారు. ధర్మబోధన ప్రతి శుక్రవారంనాడు (వారంలో) ఒకసారి మాత్రమే చెయ్యండి. ఇంకా అధికంగా కావాలని కోరితే రెండుసార్లు. మరీ ఎక్కువగా అర్థిస్తే మూడుసార్లు. అంతేగాని ప్రజల్ని ఈ ఖుర్ఆన్ పట్ల

---

విధానాన్ని పాటించేవారు. ఆయన్ని అనుసరించేవారు సయితం ఆ పద్ధతిని అవలంబించాలి.

47. ఎవరినయినా పదే నలుగురి మధ్య వారిస్తే, ఆక్షేపిస్తే వారిలో తమను కించ పరిచారన్న భావం కలుగుతుంది. ముఖ్యంగా సమాజంలో ఉన్నత స్థానాన ఉండే వ్యక్తులు చిన్న చిన్న విషయాలపై మొహం మీదే తప్పుపట్టినట్లయితే దానివల్ల మంచి ప్రభావానికి బదులుగా సంబంధిత వ్యక్తిలో మొండితనం, తిరుగుబాటు రోగాలు పొడసూపవచ్చు. అందువల్ల ఎంతో విజ్ఞతతో వ్యవహరించవలసి ఉంటుంది. సంస్కరణ అన్నది వివేకవంతమయిన పద్ధతుల ద్వారానే సుసాధ్యమవుతుంది. వాటిపట్ల అవగాహన,

విసుగెత్తించకండి. జనులు తమ మాటల్లో నిమగ్నులయి ఉన్న సమయంలో వెళ్ళి మీరు ధర్మబోధన చెయ్యడం మొదలెట్టడం జరగరాదు. ఈ విధంగా వారి మాటల్లో మీరు అవాంతరం ఏర్పరచినట్లయితే దానివల్ల వారిలో ద్వేషం, నిరాశ చోటుచేసుకోవచ్చు. అందువల్ల మీరు మౌనంగా ఉండటాన్ని చూచి వారే స్వయంగా ఉత్సాహంతో, ఆసక్తితో కోరినట్లయితే వారికి హదీసులు వినిపించండి. వేడుకోలులో యతిప్రాసలకై ప్రాకులాడకండి. నేను ప్రవక్త (సఅసం)ను ఆయన సహచరుల్ని చూశాను. వారు అలా చేసే వారు కాదు.

(۴۹) عَنِ ابْنِ عَبَّاسٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَعَثَ مُعَاذًا اِلَى الْيَمَنِ فَقَالَ اِنَّكَ تَاْتِيْ قَوْمًا اَهْلَ كِتَابٍ فَادْعُهُمْ اِلٰى شَهَادَةِ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ فَاِنْ هُمْ اَطَاعُوْا لِذٰلِكَ فَاَعْلِمْهُمْ اَنَّ اللّٰهَ قَدِ افْتَرَضَ عَلَيْهِمْ خَمْسَ صَلَوَاتٍ فِي الْيَوْمِ وَاللَّيْلَةِ فَاِنْ هُمْ اَطَاعُوْا لِذٰلِكَ فَاَعْلِمْهُمْ اَنَّ اللّٰهَ قَدِ افْتَرَضَ عَلَيْهِمْ صَدَقَةً تُؤْخَذُ مِنْ اَغْنِيَآئِهِمْ وَتُرَدُّ عَلٰى فُقَرَآئِهِمْ فَاِنْ هُمْ اَطَاعُوْا لِذٰلِكَ فَاِيَّاكَ وَكَرَآئِمَ اَمْوَالِهِمْ وَاتَّقِ دَعْوَةَ الْمَظْلُوْمِ فَاِنَّهٗ لَيْسَ بَيْنَهٗ وَبَيْنَ اللّٰهِ حِجَابٌ - (بخاری مسلم - مشکوٰۃ - کتاب الزکوٰۃ)

49. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ ఉల్లేఖించారు: ప్రవక్త మహనీయులు (సఅసం) హజ్రత్ ముఆజ్ (రజిఅన్)ని యమన్ వైపునకు గవర్నరుగా పంపారు, అప్పుడు ఆయన (రజిఅన్)ని ఇలా బోధించారు "నీవు గ్రంథవహుల

---

వివేచన, ఓరిమి అవసరం. బాధ్యతాయుతమయిన స్థానాల్లో ఉండేవారి విషయంలో మరీను. దైవ ప్రవక్త (సఅసం) బట్టలకు అంటుకున్న మరక విషయంలో ఆ వ్యక్తిని, ఇంకా ఇతర సహచరులకూ బోధించాలనుకున్నారు. అయితే దానిగ్గాను అతను లేని సమయంలో దగ్గరి సహచరులు మటుకు వున్నప్పుడు వారితో చెప్పారు - వారు అతనికి తన అభిమతాన్ని తెలుపాలని. ఈ పరోక్షమయిన పద్ధతి ఉత్తమమయింది.

(క్రైస్తవుల) వద్దకు వెళుతున్నావు. ముందు "లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్" సాక్ష్యం పలికేందుకు (విశ్వాసం వైపునకు) పిలుపునివ్వాలి. వారు దాన్ని స్వీకరిస్తే, అల్లాహ్ రేయింబవళ్ళల్లో అయిదు పూటల నమాజ్‌ని విధిగా చేశాడని తెలుపాలి. వారు దాన్ని ఒప్పుకుంటే అల్లాహ్ వారికి సదకా (జకాత్) విధిగా నిర్ణయించాడని, అది వారిలోని శ్రీమంతుల నుండి వసూలు చేసి నిరుపేదలకు పంచడం జరుగుతుందని తెలుపాలి, వారు దాన్నీ ఒప్పుకుంటే వారివద్ద నుండి విలువయిన వస్తువులు తీసుకోరాదు. పీడితుని మొరను తప్పించుకో. ఎందువల్లనంటే దానికీ దైవానికీ మధ్య ఎలాంటి తెర ఉండదు." (బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

(٥٠) عَنْ عَلِيٍّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ نِعْمَ الرَّجُلُ الْفَقِيْهُ فِي الدِّيْنِ اِنِ احْتِيْجَ اِلَيْهِ نَفَعَ وَاِنِ اسْتُغْنِيَ عَنْهُ اَغْنٰى نَفْسَهٗ۔ (رواه رزين۔ مشكوٰة۔ كتاب العلم ص ٢٨)

50. హజ్రత్ అలి (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ధర్మజ్ఞానంలో విజ్ఞత వివేకాలను గ్రహించే వ్యక్తిది ఎంత ఉత్తమ స్థానం! అతని ఆవశ్యకతను గుర్తించినట్లయితే అతను అందరికీ ప్రయోజనం చేకూర్చుతాడు. అతని పట్ల ఉపేక్షాభావం కనబరిస్తే అతను స్వయంగానూ నిరపేక్షాపరుడిలా తృప్తితో మెలుగుతాడు." (మిష్కాత్)

---

48. ధర్మ బోధన వల్ల మనుషుల్లో ధర్మం పట్ల ప్రేమ, దాని అనుసరణ పట్ల మక్కువ జనింపజెయ్యాలిగాని ధర్మం పట్ల విరక్తి కాదు. అలాగే దైవంతో దుఆ వేడుకునేటప్పుడు యతిప్రాసలకు ప్రాకులాడి హృదయాంతరాళాల నుండి వెలువడవలసిన మాటల్ని మెదడుకు మేతగా మార్చివెయ్యరాదు అన్నది కూడా ఈ హదీసు తెలుపుతోంది.

49. హజ్రత్ ముఆజ్ ప్రవక్త (సఅసం) సహచరుల్లోని ప్రముఖుల్లో ఒకరు. అయితే వారిని కూడా హెచ్చరించడం మానుకోలేదు ప్రవక్త మహనీయులు (సఅసం). దైవ ధర్మ ప్రచారం ఎలా దశల వారీగా, ప్రజలకు ఆమోదయోగ్యంగా జరగాలో ఈ హదీసులో దైవప్రవక్త (సఅసం) బోధించారు. ఇంకా ఎవరిపై దౌర్జన్యం చెయ్యరాదని, అన్యాయం ఎవరికీ జరగరాదని కూడా దైవప్రవక్త (సఅసం) బోధించారు. పీడిత వ్యక్తుల ఆవేదన దైవ సన్నిధిలో ఎలాంటి అడ్డులేకుండా స్వీకరించబడుతుందని, దాని

(۵۱) عَنْ اَنَسٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا تَكَلَّمَ بِكَلِمَةٍ اَعَادَهَا ثَلَاثًا حَتّٰى تُفْهَمَ عَنْهُ وَاِذَا اَتٰى عَلٰى قَوْمٍ فَسَلَّمَ عَلَيْهِمْ سَلَّمَ عَلَيْهِمْ ثَلَاثًا۔ (رواہ البخاری مشکوٰۃ ص ۲۵)

51. హజ్రత్ అనస్ ఉల్లేఖించారు: దైవప్రవక్త (సఅసం) ఏదయిన ముఖ్య విషయం తెలిపే మాటయితే దాన్ని మూడుసార్లు పలికే వారు – దాన్ని బాగా అర్థం చేసుకోవాలని. ఒక జన సమూహం దగ్గరికి వస్తే దానికి మూడు సార్లు సలామ్ చేసేవారు. (బుఖారి, మిష్కాత్)

(۵۲) عَنْ اَيُّوْبَ بْنِ مُوْسٰى عَنْ اَبِيْهِ عَنْ جَدِّهٖ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَا نَحَلَ وَالِدٌ وَلَدَهٗ مِنْ نُحْلٍ اَفْضَلَ مِنْ اَدَبٍ حَسَنٍ (رواہ الترمذی۔ مشکوٰۃ۔ باب الشفقۃ ص ۴۱۵)

52. అయ్యూబ్ బిన్ మూసా (రజిఅన్) తన తండ్రి చెప్పగా ఆయన తన తాత చెప్పగా ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు ఉల్లేఖించారు, "ఏ తండ్రీ తన సంతానానికి ఉత్తమ సంస్కారాన్ని మించిన మంచి ఉపహారాన్ని ఇవ్వలేదు." (మిష్కాత్, తిర్మిజి)

---

ఫలంగా దౌర్జన్యపరుడు నష్టానికి గురికావలసి ఉంటుందని, అందువల్ల దానికి భయపడాలని బోధించారాయన.

50. ధార్మిక జ్ఞానంగల వ్యక్తులు, అందులో విజ్ఞత, ప్రౌఢత సంపాయించినవారైతే గొప్పవారు. వారిని గుర్తించి వారి ద్వారా ప్రయోజనం పొందడం సమాజంలోని ప్రజల బాధ్యత. వాళ్ళను ఉపేక్షిస్తే వారేమీ నష్టపోరు, వారు ధర్మజ్ఞానం గలవారు కాబట్టి తృప్తిగానే ఉంటారు, వారిని అలక్ష్యం చేసినవారే ఆ జ్ఞానంవల్ల ప్రయోజనం పొందక నష్టపోతారు.

51. ముఖ్యమయిన మాటను చెప్పేటప్పుడు ఎదుటి వ్యక్తిని మూడు మార్లు సంబోధించడం, సంబోధితులు అధికంగా ఉన్నప్పుడు ఆ మాటను మూడు పర్యాయాలు పునరుక్తం చెయ్యడం దైవ ప్రవక్త పద్ధతి. ఆ విషయాన్ని గమనించి సహచరులు ఆ మాట ప్రాముఖ్యాన్ని గుర్తించేవారు. ఆయన ప్రవచనాలను ఉల్లేఖించిన సహచరులు అలాంటి సందర్భాలను హదీసుల్లో ఉల్లేఖించేటప్పుడు అలాగే మూడేసి సార్లు దాన్ని పలికారు. హదీసుల్లో అది మనం గమనించవచ్చు.

(۵۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا مَاتَ الْاِنْسَانُ انْقَطَعَ عَنْهُ عَمَلُهٗ اِلَّا مِنْ ثَلَاثَةٍ مِنْ صَدَقَةٍ جَارِیَةٍ اَوْعِلْمٍ یُنْتَفَعُ بِهٖ اَوْوَلَدٍ صَالِحٍ یَدْعُوْلَهٗ۔ (رواه مسلم مشکٰوة کتاب العلم۔ص ۲۴)

53. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధించారుః “మనిషి చనిపోయినపుడు అతని ఆచరణలు అంతమవుతాయి. కాని మూడు రకాల ఆచరణలు ఇంకా కొనసాగుతాయి. (1) సదకాజారియా (2) ప్రయోజనకరమయిన జ్ఞానం (3) అతనికై ప్రార్థించే ఉత్తమ సంతానం.

(۵۴) عَنْ عَمْرِوبْنِ شُعَیْبٍ عَنْ اَبِیْهِ عَنْ جَدِّهٖ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَیْهِ وَسَلَّمَ مُرُوْا اَوْلَادَکُمْ بِالصَّلٰوةِ وَهُمْ اَبْنَاءُ سَبْعِ سِنِیْنَ وَاضْرِبُوْهُمْ عَلَیْهَا وَهُمْ اَبْنَاءُ عَشَرَ سِنِیْنَ وَ فَرِّقُوْا بَیْنَهُمْ فِی الْمَضَاجِعِ۔ (رواه ابوداؤد۔مشکٰوة۔کتاب الصلٰوة ص۵۰)

---

52. తండ్రి తన సంతానానికి సంక్రమింపజేసే ఉత్తమ బహుమానం, అమూల్యమయిన కానుక ఏమిటంటే మంచి సంస్కారం గరపడం, సరయిన శిక్షణ నివ్వడం అన్నమాట. కేవలం డిగ్రీలు చదివించి లేదా గొప్ప ధన సంపదలు ప్రసాదించి, ఉన్నత హోదాలో గొప్ప బ్రతుకుతెరువు ప్రాప్తమయ్యేలా కృషి చెయ్యడం ముఖ్యం కాదు. మనిషి నిరుపేద అయినా ఉన్నత సంస్కారం, ఉత్తమ క్రమశిక్షణలుంటే అవే ప్రపంచంలో మనిషిని ఉన్నత సోపానాల నధిరోహింపజేస్తాయి.

53. సదకాజారియా అంటే అందరికీ ఉపయోగకరంగా, సుదీర్ఘకాలం వరకు ప్రజలకు ప్రయోజనకరంగా ఉండే సత్కార్యం, దానధర్మంలాంటిదన్నమాట. ఉదాహరణకు, పాఠశాలలు, ధర్మశాలలు కట్టించడం, ధార్మిక సంస్థలు స్థాపించడం, రోడ్లు నిర్మించడం, బావులు త్రవ్వించడం ఇత్యాదివి అన్నమాట. ప్రయోజనకరమైన జ్ఞానం అంటే, స్వయంగా జ్ఞానం పొందడమే కాక దాని ద్వారా ఇతరులకూ ప్రయోజనం చేకూర్చడం అన్నమాట. ఉదాహరణలకు విజ్ఞానదాయకమయిన గ్రంథాలు వ్రాయడం, జ్ఞానాన్ని ఇతరులకు బోధించగా అది ఆ శిష్యగణం ద్వారా వ్యాప్తిచెందడంలాంటి సత్కార్యం

54. అమ్ర్‌బిన్ అయ్‌బ్ తన తండ్రి ద్వారా ఆయన తన తాత ద్వారా విని ఉల్లేఖించిన దానిప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం), "మీ పిల్లలకు వాళ్ళు ఏడేళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు నమాజ్‌కై తాకీదు చెయ్యండి, వాళ్ళు పదేళ్ళ వయసుకు చేరుకున్న తరువాత నమాజ్‌ను త్యజిస్తే వాళ్ళను కొట్టండి. వాళ్ళను వేర్వేరు ప్రక్కలపై పడుకోబెట్టండి" అని ఉపదేశించారు. (మిష్కాత్, అబూదావూద్)

(۵۵) عَنْ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ قَالَ فِي الْقُرْاٰنِ بِرَائِهٖ فَلْيَتَبَوَّأْ مَقْعَدَهٗ مِنَ النَّارِ وَ فِيْ رِوَايَةٍ
مَنْ قَالَ فِي الْقُرْاٰنِ بِغَيْرِ عِلْمٍ فَلْيَتَبَوَّأْ مَقْعَدَهٗ مِنَ النَّارِ۔ (رواہ الترمذی
مشکوٰۃ۔ کتاب العلم ص۲۷)

55. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధించినట్లు హజ్రత్ ఇబ్ను అబ్బాస్ ఉల్లేఖించారు, "ఎవరయితే దివ్య ఖుర్‌ఆన్ విశదీకరణలో తన సొంత అభిప్రాయంతో వ్యాఖ్యానాలు చేస్తాడో అతను తన నివాసాన్ని నరకంలో కట్టుకుంటాడు. అలాగే ఎవరయితే ఖుర్‌ఆన్ విషయంలో సరయిన పరిజ్ఞానం లేకుండా మాట్లాడతాడో అతనూ తన నివాసాన్ని నరకంలో కట్టుకుంటాడు." (తిర్మిజి, మిష్కాత్)

---

అన్నమాట. ప్రార్థించే సంతానమంటే, ఆ వ్యక్తి తన సంతానానికి మంచి విద్యాబుద్ధులు, సభ్యతా సంస్కారాలు, ధార్మిక జ్ఞానం బోధించి తదనుగుణంగా ఆచరించే శిక్షణ ఇచ్చినట్లయితే ఆ సంతానం కృతజ్ఞతా సూచకంగా, తన బాధ్యతనెరిగి సదాచార సంపన్నమవడమేకాక మృతులయిన తన తల్లిదండ్రులకై ప్రార్థిస్తుంది అని భావం.

54. ఈ హదీసులో సంతానానికి బాల్యం నుండే ధార్మిక ఆచరణ, శిక్షణలను గరపాలని ఉపదేశించడం జరిగింది. దానిపై శ్రద్ధచూపక సంతానం పెద్దదైన తరువాత ఎంత బాధపడినా ప్రయోజనం శూన్యం. బాల్యంలో వారు మంచిగా నచ్చజెప్పినా మాట వినకపోతే, నమాజ్‌కై సన్నద్ధులు కాకపోతే సముచితరీతిలో కఠినంగా ప్రవర్తించడం కూడా సబబే అని తెలుస్తోంది. పదేళ్ళ వయసున్న పిల్లల పక్కలు వేర్వేరుగా వెయ్యడం అవసరం. కలిసి పడుకునే అలవాటును మాన్పించాలి.

(٥٦) عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو قَالَ هَجَّرْتُ إِلَى رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمًا قَالَ فَسَمِعَ أَصْوَاتَ رَجُلَيْنِ اخْتَلَفَا فِيْ آيَةٍ فَخَرَجَ عَلَيْنَا رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يُعْرَفُ فِيْ وَجْهِهِ الْغَضَبُ فَقَالَ إِنَّهُ هَلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ بِاخْتِلَافِهِمْ فِي الْكِتَابِ۔

(رواه مسلم۔ مشکوٰۃ۔ باب الاعتصام۔ ص ۲۰)

56. అబ్దుల్లా బిన్ ఉమర్ (రజిఅన్) ఉల్లేఖించారు: ఒక రోజు మధ్యాహ్నం వేళ నేను మహనీయ ముహమ్మద్ (సఅసం) వద్దకు వెళ్ళాను. ఆయన ఇద్దరు వ్యక్తులు ఖుర్ఆన్ ఆయత్ ఒక దాని విషయంలో విభేదిస్తూ ఉండగా వారి సంభాషణ విన్నారు. ముఖాన కోపం తొణికిసలాడగా ఆయన బయటికి విచ్చేశారు, అప్పుడు ఇలా అన్నారు, "మీకు పూర్వపు జాతులు దివ్య గ్రంథంలో అభిప్రాయభేదం వల్లనే నాశనమయ్యాయి."

(మిష్కాత్, ముస్లిమ్)

(٥٧) وَعَنْ عَوْفِ بْنِ مَالِكٍ الْأَشْجَعِيِّ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَقُصُّ إِلَّا أَمِيْرٌ أَوْ مَأْمُوْرٌ أَوْ مُخْتَالٌ۔ (رواه

ابوداؤد)

57. ఔఫ్ బిన్ మాలిక్ అష్జయీన్ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "అమీర్ లేదా అమీర్ చేత నియుక్తుడయినవాడు లేదా సొంతంగా సాకులు వెదికేవాడు తప్ప మరో వ్యక్తి ప్రసంగాలు చెయ్యడు."

(అబూదావూద్)

---

55. ధార్మిక విషయాల్లో వేటిలోనూ కేవలం ఊహించి ఏదయినా చెప్పడం, కల్పించి మాట్లాడటం ఘోరమయిన పాపం, ముఖ్యంగా దైవ గ్రంథమైన ఖుర్ఆన్ విషయంలో ఏ మనిషయినా ఈ వైఖరిని అవలంబిస్తున్నాడంటే అతను ఎంత బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నాడో తెలుస్తూనే ఉంది. అలాంటి వ్యక్తి ఖుర్ఆన్‌ని దైవగ్రంథమని విశ్వసిస్తాడంటే ఎలా నమ్మడం. ఖుర్ఆన్ పట్ల అజాగ్రత్తగా, విశ్వాసరాహిత్య వైఖరినవలంబించే వ్యక్తి స్థానం నరకం కాకపోతే మరేమవుతుంది?

(٥٨) عَنِ ابْنِ اَبِیْ نُعْمٍ قَالَ كُنْتُ شَاهِدًا ابْنَ عُمَرَ اِذْ سَئَلَهُ رَجُلٌ عَنْ دَمِ الْبَعُوْضَةِ فَقَالَ مِمَّنْ اَنْتَ قَالَ مِنْ اَهْلِ الْعِرَاقِ فَقَالَ اُنْظُرُوْا اِلٰى هٰذَا يَسْئَالُنِىْ عَنْ دَمِ الْبَعُوْضَةِ وَقَدْ قَتَلُوا ابْنَ النَّبِىِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ سَمِعْتُ النَّبِىَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ هُمَا رَيْحَانَتَىَّ فِى الدُّنْيَا ـ (الادب المفرد ـ ص ١٦)

58. ఇబ్ను అబీ నయీమ్ ఉల్లేఖించారు, "నేనొక రోజున అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజిఅన్) వద్ద ఉండగా ఒక వ్యక్తి వచ్చి దోమ రక్తాన్ని గురించి ప్రశ్నించాడు. ఇబ్ను ఉమర్ అతన్ని, నీవెక్కడివాడివి అని అడగ్గా అతను ఇరాక్‌కు చెందినవాణ్ణి అని తెలిపాడు. అప్పుడు ఇబ్ను ఉమర్ అక్కడున్న వారినుద్దేశించి, "ఇతన్ని చూడండి, దోమ రక్తం గురించి అడుగుతున్నాడు, కాని వాస్తవానికి ఇరాక్ ప్రజలు ప్రవక్త(సఅసం) సంతానాన్నే హతమార్చారు. ఆయన (సఅసం) వాళ్ళిద్దరినీ 'ప్రపంచంలో నా రెండు పువ్వులు వీరు' అని అంటూ ఉండగా నేను విన్నాను" అని అన్నారు. *(అల్ అదబుల్ ముఫ్రద్)*

---

56. దివ్య ఖుర్ఆన్ అవగాహనకై అనుశీలన, అధ్యయనాలు, చర్చాగోష్ఠులు, ఆధారాలతో నిండిన పరిశోధనాత్మక చర్చలు అభిలషణీయమే కాని వాదులాడుకోవటం, వితర్కవాదం చెయ్యడం ఇస్లామీయ సంస్కారానికి కడు విరుద్ధం.

57. ధార్మిక విషయాల్లో బోధలు చెయ్యడం, బాధ్యతాయుతమయిన విషయాల్లో ప్రసంగాలు చెయ్యడం అందరి పని కారాదు. అమీర్ అంటే ధార్మిక నాయకుడు, లేదా ఆ నాయకుడు నియమించిన వ్యక్తి మాత్రమే ప్రజలనుద్దేశించి ఈ ప్రసంగాలు చెయ్యాలి. ఈ రెండు విధానాలు కాక ఎవరయినా తన సొంత అధికారంతో ఈ బాధ్యతను తలపై వేసుకుంటున్నాడంటే అతను బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నాడని, పొగరుమోతుగా వ్యవహరిస్తున్నాడని అర్థం. అతనికి నియమాలు, నిబంధనల్ని ఖాతరు చేసే అలవాటు లేదన్నమాట. ఇలాంటి వ్యవహారం వల్ల సమాజంలో అల్లకల్లోలం చెలరేగే ప్రమాదముంది. మహనీయ ముహమ్మద్ (సఅసం) చేసిన ఈ హెచ్చరిక మనందరికీ కనువిప్పు కాగలగాలి.

58. దోమ రక్తం గురించి అడగడమంటే అది బట్టలకయినా, శరీరానికయినా అంటుకుంటే అది నజాసత్(అశుద్ధత) క్రిందికి వస్తుందా లేదా అని ఇంకా అది అశుద్ధమే

(٥٩) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ مَنْ اُفْتِيَ بِغَيْرِ عِلْمٍ كَانَ اِثْمُهُ عَلٰى مَنْ اَفْتَاهُ وَمَنْ اَشَارَ
عَلٰى اَخِيْهِ بِاَمْرٍ يَعْلَمُ اَنَّ الرُّشْدَ فِيْ غَيْرِهِ فَقَدْ خَانَهُ. (رواه ابوداؤد كتاب العلم)

59. అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ఎవరయినా సరయిన ధార్మిక జ్ఞానం లేకుండానే ధార్మిక తీర్పునిస్తే దాని పాపఫలం తీర్పునిచ్చేవానికే ప్రాప్తమవుతుంది. ఇంకా ఒక వ్యక్తికి ఓ పని చెయ్యడంలోనే మేలు, శ్రేయం ఇమిడి ఉన్నాయని తెలిసి ఉండీ అతడు తన తోటి సోదరునికి ఆ పనికాక మరో పని చెయ్యమని సలహా చెప్పినట్లయితే అతను నిస్సందేహంగా విశ్వాసఘాతుకం చేసినట్లే అవుతుంది."

(అబూదావూద్)

---

అయితే పరిశుద్ధపరచడానికి చెయ్యవలసిందేమిటి అని అడిగి ఉంటాడు. ప్రవక్త సంతానమంటే ఆయన మనుమడయిన హజ్రత్ హుసైన్ (రజిఅన్) అని భావం. 'ఇద్దరు' అంటే హజ్రత్ హసన్, హజ్రత్ హుసైన్ (రజిఅన్) అని భావం. ఇరాక్ ప్రజలైతే హజ్రత్ హుసైన్ రక్తం చిందించడంలో ఎలాంటి జంకుచూపలేదు. ఇప్పుడేమో దోమ రక్తానికి సంబంధించిన ఆదేశాలేమిటని ప్రశ్నిస్తున్నారని ఎత్తి చూపారు ఇబ్ను ఉమర్ (రజిఅన్). ఇందులో ఇలాంటి మత భావనను కూడా దుయ్యపట్టడం జరిగింది. అత్యల్ప విషయాలనయితే ఎంతో రంధ్రాన్వేషణ జరిపి పాటిస్తారు కాని ధర్మంలో మౌలికమయిన, ప్రాధాన్యంగల విషయాల పట్ల నలువైపులా నిర్లక్ష్యం కానవస్తుంటే, వాటిని కాలరాస్తుంటే చూస్తూ నిమ్మకు నీరెత్తినట్లు పడివుంటారు. ఈ వైఖరిని ఏ విధంగానూ సరయిన ధార్మిక వైఖరిగా చెప్పలేము.

59. విషయం తెలియకపోయినా ధార్మికమయిన వ్యవహారాల్లో నోరు విప్పడంచేత ప్రజలు తప్పుడు పనులకుపక్రమించినట్లయితే దాని పాపభారమంతా ఆ పనులకు ధార్మికంగా అనుమతివివ్వడమో దానికి అనుకూలంగా అభిప్రాయం వెలిబుచ్చడమో చేసిన వ్యక్తి తల మీద పడుతుందని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అనేక విషయాల్లో తమకు ఏ మాత్రం సరయిన జ్ఞానం లేకపోయినా కేవలం వినికిడి మాటల ఆధారంగా ధార్మిక విషయాల్లో నిర్ణయాలు చేసే వారు ఈ సందర్భంలో ఆత్మపరిశీలన

(٦٠) عَنْ أَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ تَعَلَّمَ عِلْمًا مِّمَّا يُبْتَغٰى بِهٖ وَجْهُ اللّٰهِ لَا يَتَعَلَّمُهٗ إِلَّا لِيُصِيْبَ بِهٖ
عَرَضًا مِّنَ الدُّنْيَا لَمْ يَجِدْ عَرْفَ الْجَنَّةِ يَوْمَ الْقِيٰمَةِ يَعْنِيْ
رِيْحَهَا۔

60. (అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం) దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు, "ఎవరయినా దైవ ప్రసన్నత పొందే విద్యనభ్యసించి దాని ద్వారా కేవలం ప్రపంచ వస్తు సామగ్రిని పొందాలని సంకల్పిస్తే అతను స్వర్గం పరిమళాన్ని సయితం ఆఘ్రాణించలేడు."

(٦١) عَنْ أَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ سُئِلَ عَنْ عِلْمٍ عَلِمَهٗ ثُمَّ كَتَمَهٗ أُلْجِمَ يَوْمَ الْقِيٰمَةِ بِلِجَامٍ
مِّنْ نَّارٍ (رواہ احمد وابوداؤد والترمذی، مشکوٰۃ ۔ کتاب العلم ص۲۶)

61. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు, ప్రవక్తశ్రేష్ఠులు ఇలా సెలవిచ్చారని, "ఒక వ్యక్తిని అతనికి తెలిసిన ఒక విషయాన్ని గురించి ప్రశ్నించినప్పుడు అతను దాన్ని దాచిపెట్టినట్లయితే ప్రళయదినాన అతనికి అగ్ని కళ్ళెం బిగించడం జరుగుతుంది." (అబూదావూద్, తిర్మిజి)

---

చేసుకోవలసిన అవసరమెంతయినా ఉంది. అలాగే శ్రేయస్కరమైనదని తనకు తెలిసిన విషయాన్ని తెలియపరచక ఇతర వ్యవహారంపట్ల సలహానివ్వడం అంటే, మిత్రుడు మంచి సలహానిస్తాడని తనపై ఆ వ్యక్తి పెట్టుకున్న నమ్మకాన్ని వమ్ముజెయ్యడమే అన్నమాట. నమ్మక ద్రోహం మహా నేరమని వేరే చెప్పనవసరం లేదు.

60. దైవ ప్రసన్నతకు వినియోగించవలసిన మార్గాన్ని కేవలం ధనార్జనకై వినియోగించడం ఎంతో హేయమయిన విషయమని వేరుగా చెప్పనవసరం లేదు. అలాంటి వారికి స్వర్గసౌరభాలు అందకపోవడం కాదు అందినట్లయితేనే ఆశ్చర్యపడవలసింది! శాశ్వతమయిన పారలౌకిక సాఫల్యానికి వినియోగించవలసిన ధర్మజ్ఞానాన్ని క్షణికమయిన ఐహిక లాభాలకై దుర్వినియోగం జెయ్యడం ఎంత ఘోరమయిన నేరం!

(٦٢) عَنْ سُفْيَانَ اَنَّ عُمَرَبْنَ الْخَطَّابِ قَالَ لِكَعْبٍ مَنْ
اَرْبَابُ الْعِلْمِ قَالَ الَّذِيْنَ يَعْمَلُوْنَ بِمَا يَعْلَمُوْنَ قَالَ فَمَا اَخْرَجَ
الْعِلْمَ مِنْ قُلُوْبِ الْعُلَمَآءِ قَالَ الطَّمَعُ (رواه الدارمی۔ مشکوٰۃ۔ ص ٢٩)

62. హజ్రత్ సుఫ్యాన్ (రజిఅన్) ఉల్లేఖించారు, 'ఒకసారి హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజిఅన్) హజ్రత్ కఅబ్ (రజిఅన్)ని అడిగారు, "జ్ఞానులని ఎవరిని అంటారు?" అని. దానికి కఅబ్ (రజిఅన్), "ఎవరయితే తమ జ్ఞానానికనుగుణంగా ఆచరిస్తారో వారే" అని బదులు పలికారు. తిరిగి హజ్రత్ ఉమర్ (రజిఅన్), "పండితుల హృదయాల్లోని జ్ఞాన శుభాన్ని, జ్ఞాన జ్యోతినీ అంతమొందించే వస్తువు ఏది?" అని అడగ్గా, ఆయన సమాధానంగా, "ప్రపంచ వ్యామోహం" అని పలికారు. (మిష్కాత్)

(٦٣) عَنْ كَعْبِ بْنِ مَالِكٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ مَنْ طَلَبَ الْعِلْمَ لِيُجَارِيَ بِهِ الْعُلَمَآءَ اَوْلِيُمَارِيَ بِهِ السُّفَهَآءَ
اَوْيَصْرِفَ بِهِ وُجُوْهَ النَّاسِ اِلَيْهِ اَدْخَلَهُ اللّٰهُ النَّارَ۔ (ترمذی۔ مشکوٰۃ۔
کتاب العلم ص٣٦)

63. (హజ్రత్ కఅబ్ బిన్ మాలిక్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం) దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఎవరైతే ఇతర విద్వాంసులతో సమానం కావాలన్న కాంక్షతో లేదా అవివేకులతో వాదోపవాదాలు చేస్తూ సంచరించాలన్న అభిలాషతో లేదా జ్ఞానం ద్వారా ప్రజల్ని తన వైపునకు త్రిప్పుకోవాలన్న కోరికతో జ్ఞాన సముపార్జన చేస్తాడో అతన్ని అల్లాహ్ నరకంలో పడవేస్తాడు." (తిర్మిజి, మిష్కాత్)

---

61. తనకు తెలియని విషయాన్ని తెలిసినట్లు ఇష్టమయిన రీతిలో చెప్పడం ఏ విధంగా నేరమో, తెలిసిన విషయాన్ని అడిగినప్పుడు చెప్పకపోవడమూ అదే విధంగా నేరం. ఉభయ సమయాల్లోనూ మనిషి జాగ్రత్తగా నిక్కచ్చిగా మసలుకోవడం ఎంతయినా అవసరం.

(٦٤) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اِنَّ اُنَاسًا مِنْ اُمَّتِيْ سَيَتَفَقَّهُوْنَ فِي الدِّيْنِ وَيَقْرَؤُوْنَ الْقُرْاٰنَ
يَقُوْلُوْنَ نَاْتِي الْاُمَرَآءَ فَنُصِيْبُ مِنْ دُنْيَاهُمْ وَنَعْتَزِلُهُمْ بِدِيْنِنَا
وَلَا يَكُوْنُ ذَالِكَ كَمَا لَا يُجْتَنٰى مِنَ الْقَتَادِ اِلَّا الشَّوْكُ كَذَالِكَ لَا يُجْتَنٰى
مِنْ قُرْبِهِمْ اِلَّا قَالَ مُحَمَّدُ بْنُ الصَّبَاحِ كَاَنَّهٗ يَعْنِي الْخَطَايَا

(رواه ابن ماجه - مشکوٰۃ - ص ٢٩)

64. ప్రవక్త మహనీయులు (సఅసం) సెలవిచ్చినట్లు ఇబ్ను అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించారు. "నా అనుచర సమూజంలో కొందరు ధార్మిక విషయాల పరిజ్ఞానాన్ని, వివేచనను పరిగ్రహిస్తారు, దివ్య ఖుర్ఆన్ అనుశీలనం చేస్తారు. దాన్ని ఇతరులకూ బోధిస్తారు. వారు ఇలా కూడా అంటుంటారు "మేము ప్రభుత్వాధికారుల వద్దకు వెళ్ళుతూ ఉంటాము - వారి ప్రాపంచిక సంపద నుండి మాకూ కొంత లభించాలన్న ఉద్దేశ్యంతో. అప్పుడు మేము మా ధర్మాన్ని వారికి దూరంగా ఉంచుతుంటాము" అని. కాని ఇది అసంభవం. ముండ్ల చెట్ల నుండి ముళ్ళు తప్ప మరేమీ లభించని మాదిరిగానే ప్రభుత్వాధికారులకు చేరువయితే మరేమి లభిస్తుందని? (దీన్ని ఉల్లేఖించిన ముహమ్మద్ బిన్ సబాహ్ అన్నారు:) అలాంటి వారికి పాపపు ముల్లె తప్ప మరేదీ లభించదు అని ఆయన (సఅసం) నుడివిన దానికి భావం." (ఇబ్నుమాజ, మిష్కాత్)

---

62. పండితులమని చెప్పుకునేవారికి కనువిప్పు కలిగించే హదీసు!

63. పేరుప్రతిష్ఠల కాంక్ష అయినా, నలుగురిమెప్పు పొందాలన్న ఆశ అయినా, ప్రజల మధ్య రాణించాలన్న కోరిక అయినా చిత్తశుద్ధి లేకపోవడాన్ని సూచిస్తాయి. చిత్తశుద్ధే లేకపోతే పుణ్యఫలాపేక్ష నిరర్థకం! అందువల్ల అసలు దృష్టిలో నిత్యం పరలోక సాఫల్యం, ప్రభువు మన్నింపు, ఆయన ప్రసన్నతలే ఉండాలి.

64. ప్రాపంచిక సిరిసంపదల్ని గ్రహించడానికి ధర్మ వివేచనను గ్రహించిన మేధావి వర్గం పాలకులకు చేరువయినప్పుడు ధనసామగ్రితో పాటు పాపపు మూట తప్పక

(٦٥) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ لَوْ اَنَّ اَهْلَ الْعِلْمِ صَانُوا الْعِلْمَ
وَوَضَعُوْهُ عِنْدَ اَهْلِهٖ سَادُوْا بِهٖ اَهْلَ زَمَانِهِمْ وَلٰكِنَّهُمْ بَذَلُوْهُ
لِاَهْلِ الدُّنْيَا لِيَنَالُوْا بِهٖ مِنْ دُنْيَاهُمْ فَهَانُوْا عَلَيْهِمْ سَمِعْتُ نَبِيَّكُمْ صَلَّى
اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ جَعَلَ الْهُمُوْمَ هَمًّا وَاحِدًا هَمَّ اٰخِرَتِهٖ كَفَاهُ
اللّٰهُ هَمَّ دُنْيَاهُ وَمَنْ تَشَعَّبَتْ بِهِ الْهُمُوْمُ اَحْوَالَ الدُّنْيَا لَمْ يُبَالِ
اللّٰهُ فِيْ اَيِّ اَوْدِيَتِهَا هَلَكَ ۔ (ابن ماجہ مصری ۔ مع حاشیہ السندی ج ۱ ص ۱۱۲)

65. హజ్రత్ ఇబ్ను మస్ఊద్ ఉల్లేఖిస్తూ ఇలా అన్నారు: "విద్వాంసులు విజ్ఞానాన్ని పరిరక్షించినట్లయితే, దానికి యోగ్యులయిన వారి కొరకే దాన్ని (ఆ వరప్రసాదాన్ని) వినియోగించి ఉన్నట్లయితే వారు తమ కాల ప్రజలకు నాయకులు, మార్గదర్శకులు అయ్యేవారు. కాని వారు దాన్ని ప్రాపంచికులయిన వారికొరకే వినియోగించారు - తమకూ వారి ప్రపంచంలో నుండి కొంత భాగం ప్రాప్తం కావాలని. (పర్యవసానంగా) ఇలాంటి విద్వాంసులు ప్రపంచ ప్రజల దృష్టిలో హీనమయిపొయ్యారు, నేను మీ ప్రవక్త(సఅసం) ప్రబోధించగా విన్నాను. "ఎవరయితే సకల రకాల వ్యధల, దుఃఖాలకు ప్రతిగా కేవలం పరలోకపు బాధను తన దృష్టిలో ఉంచుకుంటాడో అతని ప్రపంచ ఆవేదనలన్నింటినీ ఆదుకోవడానికి స్వయంగా అల్లాహ్ ఒక్కడు సరిపోతాడు. కాని మరెవడయితే ప్రాపంచిక చింతలతో, దుఃఖాలతో వికల మనస్కుడవుతాడో అతడు ప్రపంచంలోని ఏ అగాధంలోపడి నాశనమైనా అల్లాహ్‌కు ఎలాంటి చింత ఉండదు." (ఇబ్నుమాజ)

---

పరిగ్రహిస్తారని ఈ హదీసు బోధిస్తోంది. ధర్మవేత్తలు శ్రీమంతులకు దూరంగా ఉండడమే శ్రేయస్కరమని దాని ద్వారా తెలుస్తోంది.

"ధర్మాన్ని దూరంగా" ఉంచడమంటే, శ్రీమంతులు చేసే చెడుగు ప్రభావం తమ ధార్మిక స్థితిపై పడకుండా జాగ్రత్తపడటం అన్నమాట. ఇది సాధ్యపడదని, శ్రీమంతుల దుష్ప్రభావం ధర్మవేత్తలపై తప్పకపడుతుందని హదీసు చెబుతోంది.

65. విద్వాంసులంటే ధార్మిక జ్ఞానార్జన చేసిన వారు అని అర్థం. జనసామాన్యం

(٦٦) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ تَعَوَّذُوْا بِاللّٰهِ مِنْ جُبِّ الْحَزَنِ قَالُوْا يَا رَسُوْلَ اللّٰهِ وَمَا جُبُّ الْحَزَنِ قَالَ وَادٍ فِيْ جَهَنَّمَ يَتَعَوَّذُ مِنْهُ كُلَّ يَوْمٍ أَرْبَعَ مِائَةِ مَرَّةٍ قِيْلَ يَا رَسُوْلَ اللّٰهِ وَمَنْ يَّدْخُلُهَا قَالَ الْقُرَّاءُ الْمُرَاءُوْنَ بِأَعْمَالِهِمْ۔ رواه الترمذی وکذا ابن ماجة وزاد فیه وَإِنَّ مِنْ أَبْغَضِ الْقُرَّاءِ إِلَى اللّٰهِ تَعَالٰى الَّذِيْنَ يَزُوْرُوْنَ الْأُمَرَاءَ قَالَ الْمُحَارِبِيُّ يَعْنِي الْجَوَرَةَ۔ (مشکوٰۃ۔ص٣)

66. అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు, "అల్లాహ్‌ను 'జుబ్బుల్ హుజ్న్' నుండి రక్షణను అర్థించండి" అక్కడున్నవారు, "దైవ సందేశహరా, జుబ్బుల్ హుజ్న్ అంటే ఏమిటి?" అని అడిగారు. "అది నరకంలో ఒక లోయ, దాన్నుండి స్వయంగా నరకమే రోజుకు నాలుగు వందలసార్లు రక్షణను కోరుకుంటుంది." అని బదు లిచ్చారాయన. అప్పుడు తిరిగి అడిగారు ప్రజలు, "అందులో ఎవరిని పడవేస్తారు?" అని. ఆయన ఇలా సమాధానం పలికారు, "తమ ఆచరణలను ప్రదర్శిస్తూ తిరిగే విద్వాంసులకు." ఇది తిర్మిజిలోని ఉల్లేఖనం, ఇబ్నుమాజాలోని ఉల్లేఖనంలో ఇంకా ఇలా ఉంది: 'దైవం దృష్టిలో అత్యంత హేయమయిన విద్వాంసులు, సమకాలీన అధికార పీఠాల చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ ఉండేవారు' అని ఉంది. 'ముహారిబీ' ( ఓ హదీసువేత్త) ప్రకారం అధి కారులంటే దౌర్జన్యపరులయిన పరిపాలక వర్గం అని భావం. (మిష్కాత్)

---

అనుసరించడానికి వీలుగా ఉలమా (పండిత వర్గం) అందుబాటులో ఉండాలంటే వారు అధికారులకు దూరంగా ఉండటం అవసరం. ధర్మవేత్తలు ప్రజలకు చేరువగా ఉండి వారికి ధర్మావగాహనలో సహాయ సహకారాల నందించినంతకాలం ప్రజలు వారిని గౌర విస్తారు, ఆదరిస్తారు. అలాకాక ఉలమా అధికారులకు దగ్గరయితే వారు చేసే కుచేష్టలకు అడ్డుచెప్పే నైతిక సాహసాన్ని కోల్పోతారు. తద్వారా ధర్మవిరుద్ధ కార్య కలాపాలు చేసినప్పటికీ దౌర్జన్యపరులయిన అధికారులు, సంపన్నులు సమాజంలో ఉన్నత స్థానం అధిష్ఠించే ఉంటారు. అలాంటి వారిని, వారి అండనుండే పండితుల్ని

# 3. ధర్మసంస్థాపన

(٦٧) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ بَدَءَ الْاِسْلَامُ غَرِیْبًا وَسَیَعُوْدُ كَمَا بَدَءَ فَطُوْبٰی لِلْغُرَبَاءِ - (صحیح مسلم) وفی روایة للترمذی هُمُ الَّذِیْنَ یُصْلِحُوْنَ مَا اَفْسَدَ النَّاسُ مِنْ بَعْدِیْ مِنْ سُنَّتِیْ (مشکوٰة۔ باب الاعتصام ص ۲۱و۲۲)

67. దైవ సందేశహరులు (సఅసం) ప్రవచించారు: "ధర్మం అపరిచిత పరిస్థితుల్లో ప్రారంభమయింది. తిరిగి ఆ అపరిచిత పరిస్థితులే పునరావృతమవుతాయి. ఆనాటి 'అపరిచితుల'కు శుభవార్త! శుభాకాంక్షలు!! (తిర్మిజీలోని ఓ ఉల్లేఖనంలో ఇంకా ఇలా ఉంది:) "ఆ అపరిచితులు ఎవరంటే, నా తరువాత నా సంప్రదాయాల్లో ప్రజలు కల్పించిన చెడులను సంస్కరించేవారు."

(ముస్లిమ్, మిష్కాత్ , అబూహురైరా)

---

సామాన్య ప్రజలు ముఖతః ఏమీ చెప్పలేకపోయినా వారిపట్ల గౌరవాభిమానాలు మటుకు కలిగి ఉండరు. ఏ సమాజంలోనైతే ధర్మవేత్తలకు ప్రజల్లో విలువలేకపోతుందో ఇక ఆ సమాజం ధార్మికంగా బాగా పతనమయిపోతుందన్న విషయంలో ఎలాంటి సందేహమూ లేదు. ఇదీ హజ్రత్ ఇబ్ను మస్ఊద్ గారి ఉల్లేఖనానికి భావం. ఇకపోతే ప్రవక్త మహనీయులు (సఅసం) నుడివిన దాని భావమేమంటే, మనిషి 'ప్రపంచం ఎలా గడుస్తుంది, ప్రపంచ సౌఖ్యాలు ఎలా ప్రాప్తమవుతాయి' అని చింతకు లోనయి అదే బాధలో కుమిలిపోతే దైవం అలాంటి వ్యక్తిని – సరే నీవే నీ ప్రపంచాన్ని నిర్మించుకొమ్మని వదిలేసి తన అండ, నీడను ఉపసంహరించుకుంటాడు. దానికి బదులుగా ఏ వ్యక్తి అయితే తన పరలోకం ఎలా రూపొందుతుందో, పరలోక సాఫల్యాలు ఎలా లభిస్తాయో అని చింతిస్తూ వాటికై పరితపిస్తాడో అలాంటి వారి ప్రాపంచిక బాధలను దూరం చెయ్యడానికి దైవం ముందుకు వస్తాడు. వారి అవసరాలను తీర్చుతాడు. అందువల్ల పండితులయినా, సామాన్య జనులయినా ప్రపంచంలోనే నిండా మునిగిపోకుండా శక్తి మేరకు ప్రపంచంలో కృషి చేసి ఫలితం దైవానికి వదిలేసి పరలోక చింతనలో లీనమవ్వాలని ఈ హదీసు బోధిస్తోంది.

66. ధర్మవేత్తలు తమ ధర్మనిష్టను ప్రదర్శనాబుద్ధితో ఆచరిస్తే వారి గతి ఏమవుతుందో ఈ హదీసు తెలుపుతోంది. అయితే ఇది కేవలం ధర్మవేత్తలకే వర్తించదు. ధర్మవేత్తల్ని పేర్కొనడానికి కారణం వారు ధార్మిక విషయాల్లో మార్గదర్శకులు అవడం చేత, వారిని చూసి ఇతర ప్రజలు కూడా ధర్మావలంబనలో వారి పోకడలనే అనుసరిస్తారన్న

(٦٨) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَنْ تَمَسَّكَ بِسُنَّتِیْ عِنْدَ فَسَادِ اُمَّتِیْ فَلَهٗ اَجْرُ مِائَةِ شَهِیْدٍ۔ (رواه البیهقی مشکوٰة باب الاعتصام)

68. అబూహురైరా (రజి అల్లాహు అన్హు) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఎవరయితే నా అనుచర సంఘం (ధార్మిక) ఉపద్రవానికి గురయినప్పుడు నా ఆదర్శాన్ని (సున్నత్‌ను) పటిష్ఠంగా పాటిస్తాడో అతనికి వంద షహీదుల (అమరగతుల) పుణ్యఫలం లభిస్తుంది." (బైహకీ, మిష్కాత్)

(٦٩) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَاْتِیْ عَلَی النَّاسِ زَمَانٌ اَلصَّابِرُ فِیْهِمْ عَلٰی دِیْنِهٖ کَالْقَابِضِ عَلَی الْجَمْرِ۔ (ترمذی۔ مشکوٰة باب تغیر الناس ص ۴۵۱)

---

యదార్థం మాత్రమే. ఈ హదీసులోనూ చివరి మాటల్లో అధికార వర్గానికి చేరువగాఉంటూ ధర్మాన్ని సందేహాస్పదంగా తయారుచేసేవారిని గురించి హెచ్చరించడం జరిగింది.

67. ధర్మం ప్రారంభమయినప్పుడు అది అందరికీ అపరిచితమయిందే. పరదేశీయుణ్ణి ఏ విధంగా పురవాసులు అనుమానాలతో, కుశంకలతో చూస్తారో ప్రారంభ కాలంలో ధర్మాన్ని అవలంబించే వారిని అలాగే చూశారు. అలాగే వారితో ప్రవర్తించారు ఆనాటి ప్రజలు. ప్రవక్త మహనీయులు చెప్పేదేమంటే ఉత్థాన పతనాల దశలన్నీ ముగిశాక ఓ కాలంలో నిజధర్మాన్ని దాని అసలు రూపంలో ఆచరించేవారు తిరిగి ప్రజల మధ్య అపరిచితుల్లా పరదేశీయుల్లా ఉండిపోతారు. ఆ కాలంలో దైవప్రవక్త నిలబెట్టిన ఆదర్శాలను, సంప్రదాయాలను రూపుమాపి ప్రజలు తమకు ఇష్టమయిన రీతిలో వికృతం చేసిన దశలో వాటిని పునరుద్ధరించి సరయిన రీతిలో ఆచరించేవారే ఆ సరికొత్త అపరిచితులు, వారికే ప్రవక్త మహనీయులు శుభవార్తలనందజేశారు.

68. 'సున్నత్‌'ని పటిష్ఠంగా పాటించడం అంటే ఏమిటి? ఏది ముఖ్యం, ఏది కాదు, ఏది ప్రధానం, ఏది అప్రధానం ఏది ఎప్పుడు ప్రాధాన్యతను సంతరించుకుంటుంది అన్న విషయాన్ని సదా దృష్టిలో ఉంచుకోవాలి. షరీఅత్‌లో దేనికి ఏ స్థానం ఉంటే ఆ స్థానమే దానికి ఇవ్వాలి. ధర్మంలోని మౌలిక సున్నత్‌లు అడుగంటిపోతూ ఉంటే

69. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఇలా తెలిపారు: "ప్రజలు భావిలో ఓ కాలాన్ని ఎదుర్కోబో తున్నారు. అప్పుడు వారిలో తన ధర్మంపై సుస్థిరంగా నిలబడేవాడు చేతిలో నిప్పుకణిక పట్టుకున్న వానితో సమానమవుతాడు."

(తిర్మిజి, మిష్కాత్)

(۷۰) عَنِ ابْنِ عُمَرَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِقَامَةُ حَدٍّ مِّنْ حُدُوْدِ اللّٰهِ خَيْرٌ مِّنْ مَطَرِ اَرْبَعِيْنَ لَيْلَةً فِيْ بِلَادِ اللّٰهِ۔

(رواه ابن ماجه۔ مشکوٰۃ۔ کتاب الحدود)

70. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా నుడివారు: "అల్లాహ్ నిర్ణయించిన శిక్షాస్మృతి లోని ఒక శాసనాన్ని సంస్థాపించడం దేవుని జనావాసాలలో నలభయి దినాలు కురిసే వర్షంకన్నా ఉత్తమమయింది." (మిష్కాత్, ఇబ్నుమాజా)

---

మనం కొమ్మల్ని రెమ్మల్ని పట్టుకు వ్రేలాడుతూ ఉండడం జరగరాదు. ఇదే జరిగితే అంతకంటే అవివేకపూర్ణమయిన కార్యం మరేది కాగలదు.

69. ధర్మాన్ని అవలంబించడం అంత ప్రమాదకరం ఎలా కాగలదు? ఆలోచిం చవలసిన విషయం. ఇక్కడ ధర్మం అంటే దాని విస్తృత భావాన్నే ఉద్దేశించడం జరి గింది. ఆ భావంలో ధర్మం జీవితపు సమస్త రంగాలకు వ్యాప్తమయి ఉంటుంది. అలాంటి విస్తృత భావంలో ధర్మోన్నతి జరుగుతూ ఉంటే ధర్మధిక్కారశక్తులకు, ధర్మ ఉల్లంఘన శక్తులకు కంపరమెక్కుతుంది. అవి విజృంభించి ధర్మాన్ని అణచివేయాలని, దాన్ని అనుసరించేవారిని తుడిచిపెట్టాలని ప్రయత్నిస్తాయి. కాని ధర్మమంటే ఆ భావం కాకుండా కేవలం ఆరాధనా నియమాలు ఆచార వ్యవహారాల వరకే ధర్మాన్ని పరిమితం చేస్తే ఏ మిథ్యాశక్తికీ కనుబొమలు కూడా ముడిపడవు. దానిని అనుసరించే వారికి ఏ అపాయమూ ఎదురవదు.

70. శిక్షాస్మృతిలోని శిక్షలు దాదాపు అన్నీ మానవుల హక్కులకు సంబంధించిన అతిక్రమణలకే వర్తిస్తాయి. మానవ సమాజంలో శాంతిభద్రతలు సర్వసామాన్యం కావాలంటే వాటిని అమలుపరచడం ఎంతో అవసరం. అవి లేకుండా కేవలం భౌతిక అవసరాల పరిపూర్తి వల్ల ప్రయోజనం సంపూర్ణంగా ఒనగూడదు. వర్షాన్ని భౌతిక అవసరాలకు ప్రతీకగా తెలపడం జరిగింది.

(۷۱) عَنْ اَبِیْ سَعِیْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَفْضَلُ
الْجِهَادِ مَنْ قَالَ كَلِمَةَ حَقٍّ عِنْدَ سُلْطَانٍ جَائِرٍ - (ترمذی ابوداؤد وابن ماجہ۔
مشکوٰۃ۔کتاب الامارۃ)

71. "దుర్మార్గంతో, దౌర్జన్యంతో నిండిన ప్రభుత్వాధికారం సమక్షంలో సత్యవాక్కును పలకడం అత్యున్నతమయిన జిహాద్" అని మహనీయ ముహమ్మద్ (సఅసం) పలికినట్లు అబూ సయీద్ ఉల్లేఖించారు.

(మిష్కాత్, తిర్మిజి , అబూదావూద్, ఇబ్నుమాజా)

(۷۲) عَنْ اَبِیْ سَعِیْدِ الْخُدْرِیِّ عَنْ رَسُوْلِ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
قَالَ مَنْ رَاٰی مِنْكُمْ مُنْكَرًا فَلْیُغَیِّرْہُ بِیَدِہٖ فَاِنْ لَّمْ یَسْتَطِعْ فَبِلِسَانِہٖ
فَاِنْ لَّمْ یَسْتَطِعْ فَبِقَلْبِہٖ وَذٰلِكَ اَضْعَفُ الْاِیْمَانِ (رواہ مسلم۔مشکوٰۃ باب الامر
بالمعروف۔ص ۴۳۸)

72. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ ఉల్లేఖనం ప్రకారం బోధక శ్రేష్ఠులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "మీలో ఎవరు చెడును చూస్తారో వారు దాన్ని తన చేత్తో ఆపాలి. అంత శక్తి లేకపోతే నోటితో, అదీ సాధ్యం కాకపోతే హృదయంతో ఇది విశ్వాసంలో అత్యంత హీనమయిన స్థాయి."

(మిష్కాత్, ముస్లిమ్)

---

71. ఈ చిన్న వాక్యంలో దౌర్జన్యాన్ని ఎదిరించే ప్రాముఖ్యాన్ని, ఈ చర్యకు ధర్మంలో గల స్థానాన్ని విశదీకరించడం జరిగింది. దుష్టుని ఎదురుగా నిలబడి నీవు దౌర్జన్యం చేస్తున్నావని చెప్పడం సామాన్య విషయం కాదు. ప్రాణాలకు తెగించినవారే ఆ సాహసం చెయ్యగలరు. జిహాద్ అంటే ప్రాణాలను పణంగా పెట్టి ధర్మ సంస్థాపనా కృషి చెయ్యడమేగా?!

72. చేత్తో ఆపడమంటే దాన్ని శక్తి ద్వారా రూపుమాపడమన్నమాట. అయితే చెడును శక్తి ద్వారా రూపుమాపడం ఎలా సాధ్యమవుతుంది? దానికి దైవభక్తిపరాయణతగల నాయకత్వం అధికారంలో ఉండాలి. లేకపోతే ప్రతి వ్యక్తి చెడును రూపుమాపాలని చట్టాన్ని చేతుల్లో తీసుకుంటే ఇక మిగిలేది అరాచకమే. అందువల్ల ఆ పని అధికారంగల వారిదే. అయితే అధికారం వివిధ పరిధుల్లో వివిధ కేంద్రాల్లో కేంద్రీకృతమయి ఉండటం సాధ్యమే. ఆయా పరిధుల్లో ఎక్కడ అధికారం కేంద్రీకృతమయి ఉంటుందో ఆ అధికారంగలవారు మంచివారుగా ఉండేలా చూస్తే వారు చెడును నిర్మూలించడానికి, మంచిని అభివృద్ధిపరచడానికి కృషి చేస్తారు.

(٧٣) عَنِ النُّعْمَانِ بْنِ بَشِيْرٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ
مَثَلُ الْمُدْهِنِ فِيْ حُدُوْدِ اللّٰهِ وَالْوَاقِعِ فِيْهَا مَثَلُ قَوْمٍ نِ اسْتَهَمُوْا سَفِيْنَةً
فَصَارَ بَعْضُهُمْ فِيْ اَعْلَاهَا وَصَارَ بَعْضُهُمْ فِيْ اَسْفَلِهَا، فَكَانَ الَّذِيْ فِيْ اَسْفَلِهَا
يَمُرُّ بِالْمَآءِ عَلَى الَّذِيْنَ فِيْ اَعْلَاهَا فَتَاَذَّوْا بِهٖ فَاَخَذَ فَاْسًا فَجَعَلَ يَنْقُرُ اَسْفَلَ
السَّفِيْنَةِ فَاَتَوْهُ فَقَالُوْا مَالَكَ قَالَ تَاَذَّيْتُمْ بِيْ وَلَابُدَّ لِيْ مِنَ الْمَآءِ فَاِنْ
اَخَذُوْا عَلٰى يَدَيْهِ اَنْجَوْهُ وَنَجَّوْا اَنْفُسَهُمْ وَاِنْ تَرَكُوْهُ اَهْلَكُوْهُ وَاَهْلَكُوْا
اَنْفُسَهُمْ ـ (بخاری ـ مشکوٰۃ ص ٤٣٦)

73. నోమాన్ బిన్ బషీర్ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "అల్లాహ్ (నిర్ణయించిన) శిక్షాస్మృతి విషయంలో అలసత్వాన్ని చూపే దానిని కాలరాచేవారి ఉపమానం ఇలా ఉంటుంది- కొందరు వ్యక్తులు ఓ పడవలో ప్రయాణం చెయ్యడానికి చీటీ వేసి వారిలో కొందరు పై అంతస్థులోకీ, మరికొందరు క్రింది అంతస్థులోకి వెళ్ళి కూర్చున్నారు. క్రిందిభాగంలో కూర్చున్నవారు (పైకి వచ్చి) నీరు తీసుకుని పైన కూర్చునేవారిని దాటుకుంటూపోయేవారు. దీని వల్ల పైన కూర్చునే వారికి ఇబ్బంది కలిగి బాధపడేవారు. అది గమనించి క్రిందివారిలోని ఒకడు గొడ్డలితీసుకుని పడవ క్రిందిభాగాన బెజ్జం చెయ్యడానికి ఉపక్రమించాడు. పై వారు అతని వద్దకు వచ్చి, ఏమిటీ వ్యవహారం అని అడగ్గా అతను, 'మీరేమో మా కారణంగా బాధపడుతున్నారు. నాకేమో నీరవసరమాయె' అని బదులిచ్చాడు. ఇక పైవారు అతన్ని వారించి అడ్డుకుంటే వారు స్వయంగానూ వినాశాన్ని తప్పించుకోగలరు, క్రిందివారినీ రక్షించగలరు. అలాకాక అతన్ని అతని మానాన వదలివేస్తే వారు స్వయంగానూ నాశనమవుతారు, ఇతరుల వినాశానికీ కారకులవుతారు." (బుఖారి, మిష్కాత్)

---

73. ఈ ఉపమానం చాలా విస్తృతమయింది. అనేక అర్థాలను, తాత్పర్యాలను స్ఫురింపజేస్తుంది. పై అంతస్తులో ఉన్నవారంటే సమాజంలో ఉన్నత హోదాల్లో ఉన్నవారని, అధికారం కలవారని భావం. క్రింది అంతస్తువారంటే పాలిత ప్రజలని,

(۷۴) عَنْ عَائِشَةَ اَنَّهَا قَالَتْ مَا خُيِّرَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَيْنَ اَمْرَيْنِ اِلَّا اخْتَارَ اَيْسَرَهُمَا مَا لَمْ يَكُنْ اِثْمًا فَاِذَا كَانَ اِثْمًا كَانَ اَبْعَدَ النَّاسِ مِنْهُ وَمَا انْتَقَمَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِنَفْسِهٖ اِلَّا اَنْ تُنْتَهَكَ حُرْمَةُ اللّٰهِ فَيَنْتَقِمُ لِلّٰهِ عَزَّوَجَلَّ - (الادب المفرد حسن الخلق ص ۴۲)

74. హ|జత్ ఆయిషా (రజి అల్లాహు అన్‌హా) ఇలా ఉల్లేఖించారు, 'ప్రవక్త మహనీయులు(సఅసం)కు రెండు కార్యాల్లో దేన్నయినా ఒకదాన్ని అవలంబించవచ్చని దైవం అధికారం ఇచ్చినప్పుడల్లా ఆయన రెంటిలో సరళతరమయిన కార్యాన్ని-అది పాపపు కార్యం కాకపోతే-ఎన్నుకునేవారు. ఒక వేళ అదిపాపపు కార్యమైనట్లయితే ప్రజలందరికన్నా అధికంగా దానికి దూరంగా ఉండేవారు. దైవ ప్రవక్త (సఅసం) వ్యక్తిగతంగా ఎన్నడూ ప్రతీకారాన్ని తీర్చుకోలేదు. కాని దేవుని శిక్షాస్మృతి భంగమయినప్పుడు ఆయన అల్లాహ్ ప్రసన్నతకై ప్రతీకారం తీర్చుకునేందుకు ఉద్యుక్తులయ్యేవారు.' (అల్ అదబుల్ ముఫ్రద్)

---

సామాన్య మనుషులని అర్థం. సామాన్య ప్రజలకు కావలసిన నిత్యావసరాలను అందజెయ్యడంలో 'పై' వారు విఫలురయితే 'క్రింది' వారు శాసనోల్లంఘన చర్యలకు పాల్పడి, తిరుగుబాటు వైఖరులనవలంబించి మొత్తం సమాజాన్నే నట్టేట ముంచివేసేందుకు సిద్ధమవుతారని దీన్ని సామాజిక దృక్పథంతో అర్థం చేసుకోవచ్చు.

అలాగే ధార్మికంగా చూస్తే ధర్మజ్ఞానం కలవారు, ఆ విషయాల్లో సరయిన అవగాహన లేనివారికి తమ జ్ఞాన సంపత్తిని పంచిపెట్టకపోతే క్రిందివారు అధర్మపు కార్యకలాపాలకు పాల్పడతారని, వారిని వారించి సన్మార్గాన పయనింపజేసే బాధ్యత పై వారిదేనని, అలా చెయ్యకపోతే వీరూ వారూ అందరూ కలసి సర్వనాశనమయిపోతారని కూడా దీనికి భావం వర్తిస్తుంది. ఈ భావాలను అర్థం చేసుకుని తదనుగుణంగా మసలు కోవడం మనందరి కర్తవ్యం.

74. 'ధర్మం సులువయినది' అని మరో చోట ప్రవక్త మహనీయులు సెలవిచ్చి ఉన్నారు. ఆయన స్వయంగానూ తన అనుయాయులకు సులువయిన బాటలో నడవమని బోధిస్తూ తానూ దాన్ని అవలంబించి చూపారు. అయితే ఎంత సులువయినప్పటికీ

(۷۵) عَنْ اَبِي هُرَيْرَةَ قَالَ خَرَجَ عَلَيْنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
وَنَحْنُ نَتَنَازَعُ فِي الْقَدْرِ فَغَضِبَ حَتّٰى اَحْمَرَّ وَجْهُهٗ حَتّٰى كَاَنَّمَا فُقِئَ فِي
وَجْنَتَيْهِ حَبُّ الرُّمَّانِ فَقَالَ اَبِهٰذَا اُمِرْتُمْ اَمْ بِهٰذَا اُرْسِلْتُ اِلَيْكُمْ اِنَّمَا
هَلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ حِيْنَ تَنَازَعُوْا فِي هٰذَا الْاَمْرِ عَزَمْتُ عَلَيْكُمْ عَزَمْتُ
عَلَيْكُمْ اَنْ لَّا تَتَنَازَعُوْا فِيْهِ (رواه الترمذی۔ مشکوٰۃ باب القدر۔ ص ۱۴)

75. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు, 'ఒకసారి మేము విధి వ్రాతను గురించి వాదోపవాదాలు జరుపుకుంటూ ఉండగా దైవ సందేశహరులు (సఅసం) అటుగా వెళ్ళారు. ఆగ్రహం వల్ల ఆయన ముఖం ఎర్రబడింది - చెంపలు దానిమ్మ గింజల్లా ఎరుపెక్కాయి. "ఈ వాదనలు చెయ్యాలని మీకు ఆదేశమివ్వడం జరిగిందా? నా ఆవిర్భావానికి ఉద్దేశ్యం ఇదేనా? మీకు పూర్వంవారు నాశనమవడానికి కారణం, ఈ విషయంలో వాదోపవాదాలు జరపడమే. నేను మీకు తాకీదు చేస్తున్నాను, గట్టి తాకీదు చేస్తున్నాను, మీరు ఈ విధి విషయంలో వాదోపవాదాలు జరపడం మానుకోండి" అని ఉపదేశించారు.' (తిర్మిజి, మిష్కాత్)

---

పాపపు పని అయినా, పాపపు పనికి చేరువయ్యే పని అయినా చెయ్యరాదని కూడా దీని ద్వారా బోధపడుతుంది. 'సులువు' అన్నది ధర్మపరిధిలోనే అని మరువరాదు.

రెండవ విషయం ఏమిటంటే విశ్వసించినవారు ఎన్నటికీ తమ స్వంత విషయాల్లో పగతీర్చుకునే విధానానికి పాల్పడరాదు. అయితే ధర్మ మార్గాన దైవ శాసనోల్లంఘన జరిగినా, దైవ ధర్మాన్ని కాలరాచే పద్ధతులు ప్రజలు అవలంబించినా భరించి సైరణ వహించడం సహనం అనిపించుకోదు; ఆ సహనం ప్రశంసనీయం కాదు. ధార్మిక విషయాల్లో, ధర్మం నిరాదరణకు గురవుతున్న సందర్భాల్లో ఆ అధర్మపు చర్యల్ని ఎదిరించడమే దైవ ప్రీతికి కారణమవుతుంది. అయితే అది కూడా ధర్మ పరిధుల్లోనే జరగాలి.

75. ఏ విషయాలయితే ప్రయోజనకరమయినవో మరే విషయాలయితే మనిషి తెలుసుకోవడం వల్ల అతని జీవితం బాగుపడుతుందో, ఏ విషయాలయితే అతని జ్ఞాన పరిధికి అందుబాటులో ఉంటాయో వాటికై కృషి చెయ్యడమే మంచిది. అలా కాక

(٧٦) عَنْ مُجَاهِدٍ عَنْ عَبْدِ اللهِ بْنِ عُمَرَ اَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ لَا يَمْنَعَنَّ رَجُلٌ اَهْلَهٗ اَنْ يَّاْتُوا الْمَسَاجِدَ فَقَالَ ابْنٌ لِعَبْدِ اللهِ بْنِ عُمَرَ
فَاِنَّا نَمْنَعُهُنَّ فَقَالَ عَبْدُ اللهِ اُحَدِّثُكَ عَنْ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
وَتَقُوْلُ هٰذَا قَالَ فَمَا كَلَّمَهٗ عَبْدُ اللهِ حَتّٰى مَاتَ - (رواه احمد مشكوٰة - باب الجماعة ص٨٩)

76. ముజాహిద్, అబ్దుల్లా ద్వారా ఉల్లేఖించినదాని ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు: "ఏ వ్యక్తీ తన గృహస్థులను మస్జిద్‌కు రాకుండా వారించరాదు" ఇది విన్న అబ్దుల్లా (బిన్ ఉమర్) కుమారుడొకడు ఆయన (తన తండ్రి)తో, "మేము వారిని తప్పక వారిస్తాము" అని పలికాడు. దానికి అబ్దుల్లా 'నేను నీకు దైవ ప్రవక్త హదీసును వినిపిస్తే నీవీ విధంగా పలుకుతావా?' అని ఆగ్రహించారు. ఉల్లేఖన కర్త (ముజాహిద్)చెప్పినదాని ప్రకారం ఆ సంఘటన జరిగిన తరువాత హజ్రత్ అబ్దుల్లా చివరి శ్వాస వరకు తన కొడుకుతో మాట్లాడలేదు."

(ముస్నద్ అహ్మద్ - మిష్కాత్)

(٧٧) عَنْ عَلِيٍّ قَالَ مَرَّ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ عَلٰى قَوْمٍ فِيْهِمْ
مُتَخَلِّقٌ بِخَلُوْقٍ فَنَظَرَ اِلَيْهِمْ وَسَلَّمَ عَلَيْهِمْ وَاَعْرَضَ عَنِ الرَّجُلِ فَقَالَ الرَّجُلُ
اَعْرَضْتَ عَنِّيْ قَالَ بَيْنَ عَيْنَيْهِ جَمْرَةٌ (باب ترك السلام على المتخلق واضحا المعاصي ص١٢٩)

77. హజ్రత్ అలీ ఉల్లేఖనం: "ప్రవక్త మహనీయులు ఒకసారి ప్రయాణంలో కొందరు ప్రజలకు సమీపంగా వెళ్ళారు. వారిలో ఒక వ్యక్తి శరీరాన పసుపు వన్నె సుగంధ ద్రవ్యం ఏదో పులుముకున్నాడు. ఆయన (సఅసం) ఆ ప్రజల్ని చూసి సలామ్ చేశారు. అయితే ఆ వ్యక్తిని దాటిపొయ్యారు. ఆ వ్యక్తి 'మీరు నన్ను ఉపేక్షించారే' అని పలికాడు. దానికి ఆయన, "అతని రెండు కళ్ళ మధ్య నిప్పు కణం ఉంది" అని సెలవిచ్చారు. (మిష్కాత్)

---

ఇతరత్రా శక్తి సామర్థ్యాలను వెచ్చించడం వృధా ప్రయాస తప్ప మరేమీ కాదని ఈ హదీసు బోధిస్తోంది.

(۷۸) عَنْ عَبْدِ اللّٰہِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ لَا تَعُوْدُوْا شُرَّابَ الْخَمْرِ اِذَا مَرِضُوْا۔ (الادب المفرد۔ باب عیادۃ الفاسق۔ ص ۷۸)

78. అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజిఅన్) ఇలా తెలిపారు: "త్రాగుబోతులు రోగగ్రస్తులయితే వారి పరామర్శకు వెళ్ళకండి."
(అల్ అదబుల్ ముఫ్రద్)

(۷۹) عَنْ عَائِشَۃَ اَنَّہٗ بَلَغَھَا اَنَّ اَھْلَ بَیْتٍ فِیْ دَارِھَا کَانُوْا سُکَّانًا فِیْھَا عِنْدَھُمْ نَرْدٌ فَاَرْسَلَتْ اِلَیْھِمْ لَئِنْ لَّمْ تُخْرِجُوْھَا لَاُخْرِجَنَّکُمْ مِنْ دَارِیْ وَاَنْکَرَتْ ذَالِکَ عَلَیْھِمْ۔ (الادب المفرد باب الادب واخراج الباطل۔ ص ۱۸۶)

79. హజ్రత్ ఆయిషా ఉల్లేఖనం ప్రకారం, ఆమెగారి ఇంట్లో నివసించే కొందరు అతిథుల వద్ద "చెస్" లాంటి (గళ్ళ జూదమాడే) ఆట పావులూ ఇత్యాదివీ ఉన్నాయని ఆమెకు తెలిసింది. వెంటనే ఆమె వారి వద్దకు మనిషిని పంపి, 'మీరు ఈ జూదపు సామగ్రిని బయటికి విసిరివెయ్యకపోతే నేను మిమ్మల్ని నా ఇంటిలో ఉండనివ్వను' అని చెప్పి పంపారు. ఇంకా ఈ విషయంలో వారికి బాగా చీవాట్లు పెట్టారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

76. ధర్మానికి భిన్నమయిన విషయాల్లో మంకుతనంతో, మొండిగా వ్యవహరించేవారి పట్ల నిరసన ప్రదర్శించడం వారి ఎడల తమ అయిష్టతను వ్యక్తపరచడం విశ్వాసానికి ప్రతీక. అలాంటి వారు సొంత సంతానమయినా వారిని సయితం దూరముంచడమన్నది గొప్ప ధార్మిక చైతన్యాన్ని సూచిస్తుంది.

77. మూలం (హదీసు)లో ఆ రంగుకు "ఖలూక్" అన్న పదం ప్రయోగించడం జరిగింది. కుంకుమ పువ్వు కలిపిన ఓ అత్తరును ఖలూక్ అనంటారు. దాని రంగును, ఆ అత్తరును ప్రవక్త మహనీయులు ఇష్టపడేవారు కారు. దీని ద్వారా తెలిసే మరో విషయమేమిటంటే, ఓ పని మంచిది కాదని తెలిసీ ఎవరైనా దాన్ని చేస్తూ ఉంటే దానిపట్ల అయిష్టతను కనబరచడానికి వారితో సాధారణ సంబంధాలు కలిగి ఉండకపోవడం, యోగక్షేమాల పరామర్శను మానుకోవడంలో తప్పులేదు.

(۸۰) عَنْ اَسْلَمَ مَوْلٰی عُمَرَؓ قَالَ لَمَّا قَدِمْنَا مَعَ عُمَرَ بْنِ الْخَطَّابِ الشَّامَ اَتَاهُ الدِّهْقَانُ قَالَ يَا اَمِيْرَ الْمُؤْمِنِيْنَ اِنِّیْ قَدْ صَنَعْتُ لَكَ طَعَامًا فَاُحِبُّ اَنْ تَاْتِيَنِیْ بِاَشْرَافِ مَنْ مَعَكَ - فَاِنَّهٗ اَقْوٰی لِیْ فِیْ عَمَلِیْ وَاَشْرَفُ لِیْ - قَالَ اِنَّا لَا نَسْتَطِيْعُ اَنْ نَدْخُلَ كَنَائِسَكُمْ هٰذِهٖ مَعَ الصُّوَرِ الَّتِیْ فِيْهَا - (باب الادب المفرد - باب دعوة الذمی ص۱۸۳)

80. హజ్రత్ ఉమర్ (రజిఅన్) సేవలో ఉండే "అస్లం" ఉల్లేఖించారు, 'మేము హజ్రత్ ఉమర్ (రజిఅన్)తోపాటు సిరియా వెళ్ళినప్పుడు అక్కడ ఒక ఊరిలో ఆ ఊరి పెద్ద ఉమర్ (రజిఅన్) వద్దకు వచ్చి, "అమీరుల్ మూ'మినీన్," నేను భోజనం తయారుచేయించి సిద్ధంగా ఉంచాను. మీరున్నూ, సహచరులున్నూ నా ఇంటికి రావాలని, భోంచెయ్యాలని నా కోరిక, దీనివల్ల నా కార్యనిర్వహణలో బలం చేకూరుతుంది, నాకు గౌరవపరచినట్లూ అవుతుంది. దానికి ఉమర్ (రజిఅన్), 'మేము మీ ఆరాధనాలయాల్లోకి ప్రవేశించలేము. అక్కడ బొమ్మలూ (విగ్రహాలు) ఉంటాయి' అని బదులిచ్చారు.

(۸۱) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَكُوْنُ فِیْ اٰخِرِ الزَّمَانِ اُمَرَاءُ ظَلَمَةٌ، وَوُزَرَاءُ فَسَقَةٌ وَقُضَاةٌ خَوَنَةٌ وَفُقَهَاءُ كَذَبَةٌ فَمَنْ اَدْرَكَ مِنْكُمْ ذَالِكَ الزَّمَنَ فَلَا يَكُوْنَنَّ لَهُمْ جَابِيًا وَلَا عَرِيْفًا وَشُرْطِيًّا - (المعجم الصغير للطبرانی - ص۱۱)

---

78. మానవత రీత్యా అందరినీ పరామర్శించవలసిందే, కాని సమాజంలో అనేక రుగ్మతలకు కారణమయిన మద్యపానాన్ని ప్రాణ సమానంగా భావించి జీవించేవారి పట్ల అయిష్టతను, నిరసనను తెలపడం కూడా అంతే అవసరం. అపరాధుల్ని క్షమించే ఆధునిక కాలపు 'ఉదార' బుద్ధి సమాజానికి వినాశకరం అని మరువరాదు.

79. దుర్ వ్యసనాల పట్ల గల అసహ్యతను, ఏహ్యభావాన్ని, మంచిని ప్రేమించే వారెవరూ ప్రకటించకుండా ఉండలేరు. బజారులోనో మరెక్కడో ఉన్నా ఆ వైపునకు

81. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "అంతిమ కాలంలో, దౌర్జన్యపరులయిన నాయకులు, అత్యాచారులయిన పరిపాలనాధికారులు, నిజాయితీ లేని న్యాయమూర్తులు, అబద్ధాలు పలికే ధర్మవేత్తలు పైకి వస్తారు. మీలో ఎవరయితే అలాంటి కాలాన్ని చూస్తారో వారు, వారి పన్నులు వసూలు చేసే అధికారాన్నిగాని, వారి నాయకత్వాన్నిగాని, వారి పరిపాలనా వ్యవస్థలో కీలకమయిన పదవినిగాని స్వీకరించరాదు." *(అల్ మోజము' స్సగీర్)*

(۸۲) عَنْ إِبْرَاهِيمَ بْنِ مَيْسَرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ وَقَّرَ صَاحِبَ بِدْعَةٍ فَقَدْ أَعَانَ عَلٰى هَدْمِ الْإِسْلَامِ۔

(رواہ البیہقی۔ مشکوٰۃ۔ باب الاعتصام۔ ص۳۳)

82. మహాప్రవక్త మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా బోధించారని ఇబ్రాహీమ్ బిన్ మైసర ఉల్లేఖించారు, "ఎవరైతే బిద్అత్ చేసేవాణ్ణి గౌరవిస్తాడో అతను ఇస్లాంను పడగొట్టడంలో సహాయపడినవాడవుతాడు." *(మిష్కాత్)*

---

పోవడానికి ఇష్టపడరు సున్నిత మనస్కులు. వాటిని సహించడం, భరించడం, పైగా తన ఇంటిలోనే వాటికై చోటు కల్పించడం ఏ మాత్రం సహనం, ఇతరుల అభిప్రాయాల గౌరవం అనిపించుకోదు. హజ్రత్ ఆయిషా చర్య దాన్నే సూచిస్తోంది.

80. హజ్రత్ ఉమర్ (రజిఅన్) కాలంలో ఇస్లామీయ పరిపాలన క్రింద వచ్చిన సిరియాకు ఉమర్(రజిఅన్) వెళ్ళినప్పటి సంఘటన అది. ప్రభుత్వానికి లొంగిపోయిన ప్రజలు తమ మతాచారాలను, వాటి ప్రకారం తమ వ్యవహారాలను నిర్వహించేందుకు అనుమతి ఇవ్వడం జరిగింది. తాను ఇస్లామీయ ప్రభుత్వాధినేతగా ఏ చర్య తీసుకున్నా, ఏ పని చేసినా అందరికీ అదో దృష్టాంతమవుతుందని, ఉన్నత స్థానాన ఉన్న వ్యక్తి జాగ్రత్తగా ఆదర్శవంతంగా ప్రతి అడుగూ వెయ్యవలసి ఉంటుందని హజ్రత్ ఉమర్ తన మాటల వల్ల తేల్చి చెప్పారు. మరో విషయం ఏమిటంటే మనిషి అధికారం లేనప్పుడు, తన మాట చెల్లనప్పుడు కొన్ని అనివార్య సందర్భాలను, మాటలను పనుల్ని సహించినా, మాటచెల్లే అవకాశం ఉన్నప్పుడు ఎలాంటి రాయితీలకు, వినాయింపులకు

(۸۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
مَنْ مَاتَ وَلَمْ یَغْزُ وَلَمْ یُحَدِّثْ بِهٖ نَفْسَهٗ مَاتَ عَلٰی شُعْبَةٍ مِّنَ النِّفَاقِ۔
(رواہ مسلم، مشکوٰۃ کتاب الجہاد)

83. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా ప్రబోధించారు: "ఎవరయితే పోరాటంలో పాల్గొనరో, దాన్ని గురించి తన మనసులోనయినా అనుకోరో అలాంటివారి చావు 'నిఫాక్' శాఖల్లో ఒకదానిలో సంభవించినట్లే." (ముస్లిం - మిష్కాత్)

(۸۴) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
عَیْنَانِ لَا تَمَسُّهُمَا النَّارُ، عَیْنٌ بَکَتْ مِنْ خَشْیَةِ اللّٰهِ وَعَیْنٌ بَاتَتْ تَحْرُسُ
فِیْ سَبِیْلِ اللّٰهِ۔

84. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు ఇలా నుడివారు: "రెండు నయనాలు నరకాగ్ని నుండి భద్రంగా ఉంటాయి. ఒకటి, దైవభీతి వల్ల అశ్రుపూరితమయిన కన్ను. రెండు, దైవ మార్గంలో రేయంతా కాపలా కాసిన కన్ను."

---

తావివ్వనవసరంలేదని, తన మాటపై గట్టిగా నిలబడి ఆదర్శాన్ని నిలబెట్టి అందరికీ చూపవలసి ఉంటుందని కూడా దీనివల్ల తెలుస్తోంది.

81. తుది రోజుల్లో అంటే ప్రళయానికి పూర్వం అన్నమాట. మంచి వ్యక్తులు, విశ్వసించేవారు, దైవ ధర్మానుసారం జీవించాలని కోరుకునేవారు అధర్మమైన పరిపాలనా వ్యవస్థలో పదవులు, హోదాలు పొందినట్లయితే వారు కూడా ఆ దుశ్శీలురయినవారి అండన ఉంటూ తమ ఆత్మ గౌరవాన్ని, తమ వ్యక్తిగత హుందాను, మంచితనాన్ని పక్కకునెట్టి జీవించవలసి ఉంటుంది. ఉన్నత అధికారుల ఒత్తిడి వల్ల లేక వారి సహవాసం ప్రభావం వల్ల లేక వారి ముఖస్తుతికి లోనయి అనేక అధర్మ కార్యాలకు పాల్పడవలసి ఉంటుంది. ఆ కారణంగానే మంచివారు వాటికి దూరంగా ఉండాలని బోధించడం జరిగింది.

82. "బిద్అత్" అంటే ధర్మంలో లేని విషయాన్ని ధార్మికమయిందిగా భావించడం, అలా ఆచరించడం అని భావం. హదీసు భావం ఏమిటంటే ఎవరయితే సమాజంలో ఇలాంటి కొత్త విషయాలను కల్పించేవారికి గౌరవాదరణలు ఇస్తారో వారు స్వచ్ఛమయిన ఇస్లామ్ సౌధాన్ని పడగొట్టడంలో సహాయపడిన వారవుతారన్న మాట.

83. ధర్మోన్నతికి, ధర్మరక్షణకు, ధర్మావలంబీకుల రక్షణకు నిరంతర కృషి జరపవలసి ఉంటుంది. అప్పుడప్పుడు తీవ్ర సంఘర్షణ జరుగుతుంది, ప్రతీప శక్తులతో పోరాడవలసివస్తుంది. విశ్వసించినవారంతా ఆ కృషిలో, ఆ సంఘర్షణలో, ఆ పోరాటంలో పాల్గొనాలని ఉవ్విళ్ళూరుతారు. ఇది సహజమైన కోరిక. అయితే అందరికీ దాని అవకాశం లభించడం దుర్లభం. అలాంటప్పుడు కనీసం మనసులోని మనస్సులో ఆ కోరిక, అందులో పాల్గొని అవసరమైతే తన ప్రాణాలను సయితం అర్పించాలన్న ప్రబల కాంక్ష తేలియాడాలి. అవకాశం లభించినా ఆ కృషిలో పాల్గొనకపోవడం, అవకాశం లేకపోతే కనీసం దానికై కోరికయినా జనించకపోవడం ఓ విశ్వాసి స్థాయికి తగని స్థితి. అతని విశ్వాసంలో లోపం ఉందన్న మాట, లేదా ఆ వ్యక్తి కపట విశ్వాసాన్ని కలిగి ఉన్నాడన్న మాట. కాపట్యం ఎంతో హానికరమయిన రోగం. 'నిఫాక్' అన్న పదానికి కాపట్యం, ద్వంద్వ స్వభావం అని భావం, కాపట్యం ఎన్నో రకాలు. పైన పేర్కొన్న కోరిక లేమి ఓ విధమయిన కాపట్యమే. అందువల్ల అలాంటి వ్యక్తి కాపట్యపు ఓ శాఖలో మరణించినట్లని పలకడం జరిగింది. కాపట్యం ఏ వ్యవస్థలోనూ గర్హనీయమే. ఇస్లాం ప్రకారం, అలాంటి వ్యక్తులకు ప్రపంచంలో ఏమీ జరక్కపోయినా పరలోకంలో వారు ఎంతో హేయమయిన శిక్షకు గురికావలసివస్తుంది. దైవం మనందరినీ రక్షించుగాక.

84. పై హదీసుకు భిన్నమయినది ఈ హదీసు. ధర్మ సంఘర్షణలో కేవలం పహరా కాయడం కూడా ఎంతో ఉన్నతమయిన పుణ్యకార్యమని చాటే హదీసు ఇది. అలా పహరా కాసిన వ్యక్తి కళ్ళను నరకాగ్ని సోకదంటే ఆ వ్యక్తి రక్షణ పొందాడన్న మాటే. అలాగే, 'దైవభీతి వల్ల అశ్రుపూరితాలయిన నయనాలు' అంటే దైవం పట్ల భయభక్తులతో మెలుగుతూ తప్పుచేసిన భావన కలిగి బాధపడే వ్యక్తి అన్నమాట. ఇతనికీ రక్షణ ప్రాప్తమయినట్లే.



# 4. ఆరాధనలు

(٨٥) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا اِيْمَانَ لِمَنْ لَّا اَمَانَةَ لَهٗ وَلَا صَلٰوةَ لِمَنْ لَّا طُهُوْرَ لَهٗ وَلَا دِيْنَ
لِمَنْ لَّا صَلٰوةَ لَهٗ، اِنَّمَا مَوْضِعُ الصَّلٰوةِ مِنَ الدِّيْنِ كَمَوْضِعِ الرَّأْسِ
مِنَ الْجَسَدِ - (المعجم الصغير للطبرانی - ص ٣١)

85. హజ్రత్ ఇబ్ను ఉమర్ (రజిఅన్) ఉల్లేఖించారు, "ఎవరిలో అమానత్ లేదో అతనిలో ఈమాన్ లేదు. మరెవరిలో పరిశుద్ధత ఉండదో అతని నమాజ్ నెరవేరదు. ఎవరి నమాజ్ నెరవేరదో అతనికి దీన్ ప్రాప్తం కాదు. దీన్‌లో నమాజ్‌కున్న స్థానం శరీరంలో శిరస్సుకున్నటువంటిదే" అని ప్రవక్త మహనీయులు బోధించారు. (అల్ మో'జముస్సగీర్ - త్రిబాని)

(٨٦) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَرَاَيْتُمْ لَوْ اَنَّ نَهْرًا بِبَابِ اَحَدِكُمْ يَغْتَسِلُ فِيْهِ كُلَّ يَوْمٍ خَمْسًا هَلْ يَبْقٰى
مِنْ دَرَنِهٖ شَيْءٌ قَالُوْا لَا يَبْقٰى مِنْ دَرَنِهٖ شَيْءٌ قَالَ فَذَالِكَ مَثَلُ الصَّلٰوتِ
الْخَمْسِ يَمْحُو اللّٰهُ بِهِنَّ الْخَطَايَا (صحیح بخاری مع فتح الباری مصری ج ٢ ص٨ کتاب
مواقیت الصلٰوة)

86. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు: "మీ అభిప్రాయమేమిటో కాస్త చెప్పండి. ఒకవేళ మీలో ఎవరి ఇంటిప్రక్కనయినా ఓ కాలువ ప్రవహిస్తూ ఉండి అతను ప్రతి రోజూ అయిదు పూటలా అందులో స్నానం చేస్తూ ఉన్నట్లయితే అతని. మేనుపై మలినం అంటూ ఏమైనా మిగులుతుందా?" అని దైవప్రవక్త (సఅసం) ఓసారి అడిగారు. సహచరులు, "ఏ మాత్రం మలినముండదు" అని విన్నవించుకున్నారు. అప్పుడు ఆయన ఇలా బోధించారు: అయిదు పూటల నమాజ్‌కు ఇదే ఉపమానం. అల్లాహ్ దీనిద్వారా అపరాధాలను తుడిచిపెడతాడు." (సహీహ్ బుఖారి)

(٨٧) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
أَلَا أَدُلُّكُمْ عَلٰى مَا يَمْحُو اللّٰهُ بِهِ الْخَطَايَا وَيَرْفَعُ بِهِ الدَّرَجَاتِ قَالُوْا
بَلٰى يَا رَسُوْلَ اللّٰهِ قَالَ إِسْبَاغُ الْوُضُوْءِ عَلَى الْمَكَارِهِ وَكَثْرَةُ
الْخُطٰى إِلَى الْمَسَاجِدِ وَانْتِظَارُ الصَّلٰوةِ بَعْدَ الصَّلٰوةِ فَذٰلِكُمُ الرِّبَاطُ
وَفِيْ حَدِيْثِ مَالِكِ بْنِ أَنَسٍ فَذٰلِكُمُ الرِّبَاطُ فَذٰلِكُمُ الرِّبَاطُ رَدَّدَ مَرَّتَيْنِ. (رواه مسلم)

87. అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం: ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా అడిగారు: "పరమ ప్రభువయిన అల్లాహ్ ఏ విషయాల ఆధారంగా అపరాధాలను మన్నిస్తాడో, స్థాయిని ఉన్నతం చేస్తాడో అలాంటి మాటల్ని మీకు తెలుపనా?" దానికి సహచరులు 'దైవ ప్రవక్తా తప్పక సెలవీయండి' అని బదులిచ్చారు. అప్పుడాయన ఇలా బోధించారు: "(1)వాతావరణం, పరిస్థితులూ అననుకూలంగా ఉన్నప్పటికీ వుజూ పూర్తిగా చెయ్యడం, (2) మస్జిద్ వైపునకు అధికంగా అడుగులు వెయ్యడం, (3) ఒక నమాజ్ తరువాత మరో నమాజ్ కొరకు నిరీక్షించడం – ఇది రిబాత్‌తో సమానం." మరో హదీసులో 'ఇది రిబాత్‌తో సమానం' అన్న పదాన్ని రెండుసార్లు పలికారు. (ముస్లిమ్)

---

85. 'అమానత్' అనంటే అప్పగింతను భద్రంగా కాపాడి, ఇచ్చినవానికి తిరిగి అప్పగించడం అన్నమాట. ఈ అమానత్ భౌతిక వస్తువులు, అవసర సామగ్రి మొదలు కొని మానసిక, ధార్మిక, ఆధ్యాత్మిక విషయాల వరకు విస్తృతమయింది. విద్యాజ్ఞానాలు, కళానైపుణ్యాలు కూడా దైవం ఇచ్చిన అమానతులు. వాటి సక్రమ వినియోగమే వాటిని కాపాడటమంటే. ధర్మ జ్ఞానం కూడా అమానతే. దాన్ని అందరికీ పంచి పెట్టడమే దాని 'కాపుదల'.

'ఈమాన్' అంటే ధార్మిక విశ్వాసమని అర్థం. మనిషి తోటి మానవుల పట్ల అమానత్ దారుగా ఉన్నప్పుడే దైవం పట్లనూ అమానత్‌దారుగా వ్యవహరించగలడు. అదే అతని ఈమాన్‌కు ఆనవాలు.

పరిశుద్ధత సగం ఈమాన్ అని మరో హదీసులో ఉంది. పరిశుద్ధతకు ఉన్న ప్రాముఖ్యం ఏమిటో దీనిద్వారా బోధపడుతుంది. శరీరం మాలిన్యాల నుండి ప్రక్షాళన పొంది మలమూత్రాదుల విషయంలో శుద్ధంగా ఉన్నప్పుడే నమాజ్ నెరవేరుతుంది. పరిశుద్ధత, వుజూ నమాజ్‌కు తొలి షరతులు కదా.

(۸۸) عَنْ اَبِیْ سَعِیْدِ نِ الْخُدْرِیْ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا رَاَیْتُمُ الرَّجُلَ یَتَعَاھَدُ الْمَسْجِدَ فَاشْھَدُوْا لَہٗ بِالْاِیْمَانِ فَاِنَّ اللّٰہَ یَقُوْلُ اِنَّمَا یَعْمُرُ مَسَاجِدَ اللّٰہِ مَنْ اٰمَنَ بِاللّٰہِ وَالْیَوْمِ الْاٰخِرِ (رواہ الترمذی۔ مشکوٰۃ باب المساجد۔ ص۲۱)

88. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్తమహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారుః "ఒక వ్యక్తిని మీరు నియమం, క్రమం తప్పకుండా మస్జిద్‌లో హాజరవుతుండగా చూస్తే అతని విశ్వాసం గురించి సాక్ష్యం పలకండి. ఎందువల్లనంటే, అల్లాహ్ మస్జిద్‌లను సదా కళకళలాడేలా చేసేవారు, దైవాన్ని, అంతిమ దినాన్నీ విశ్వసించినవారే అయి ఉంటారు."

(తిర్మిజి, మిష్కాత్)

---

మనిషి నమాజే సక్రమంగా నెరవేరకపోతే అతనికి 'దీన్' (ధర్మం)లోని మేళ్ళు ఎలా ప్రాప్తమవుతాయి?

మొత్తం హదీసు ద్వారా ఓ విషయం విదితమవుతోంది, గమనించారా? ధర్మం లేక దీన్ ప్రాపంచిక విషయాల మధ్యనే పరిపూర్ణమవుతుంది - ప్రపంచానికి దూరంగా కాదు.

86. అయిదు పూటలా నమాజ్ చెయ్యడమంటే దైవాన్ని జ్ఞాపకముంచుకోవడం, ఆయన ఆదేశాలున్నాయని, వాటిని సతతం ఆచరించాలని నెమరువేసుకోవడమన్న మాట. తద్వారా సహజంగానే మనిషి చెడులకు దూరంగా, దైవాదేశాలకు చేరువగా మసలుకుంటాడన్నది వాస్తవం. అయితే అచేతనావస్థలో, మొక్కుబడిగా, ఏదో అలవాటుగా చేసుకునే నమాజ్ వల్ల ఈ ప్రయోజనం ఒనగూడదు. దైవాన్ని గుర్తుంచుకుని, ఆయన్ని చూస్తున్నట్లు కాకపోయినా కనీసం ఆయన మనల్ని కనిపెట్టుకుని ఉన్నాడన్న ఆలోచనతో చేసే నమాజ్ ద్వారా ఈ మేళ్ళు ప్రాప్తమవుతాయి.

87. వుజూ చెయ్యడం ముఖ్యంగా చలి కాలంలో ఫజ్ర్ నమాజ్ వేళ చెయ్యడం మహా యజ్ఞంలాంటిది. ఎముకలు కొరికే చలిలోనూ మొక్కుబడిగా కాకుండా పూర్తిగా నియమబద్ధంగా వుజూచేసేవారు దైవం పట్ల భయభక్తుల సంపద మెండుగా కలవారనడంలో సందేహం లేదు. అలాగే మస్జిద్ దూరాన ఉన్నప్పటికీ అంతవరకూ వెళ్ళి జమాఅత్‌తో పాటు నమాజ్ చేసే నియమాన్ని పాటించేవారు కూడా నిష్ఠాపరాయణులనడంలో సంశయమే లేదు. మూడవ అంశం, నమాజ్ తరువాత తదుపరి నమాజ్ కోసం ప్రతీక్ష చెయ్యడం; ఇది కూడా దైవ భక్తిని సూచించే అంశం.

(۸۹) عَنْ بُرَيْدَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
بَشِّرِ الْمَشَّائِيْنَ فِي الظُّلَمِ إِلَى الْمَسَاجِدِ بِالنُّوْرِ التَّامِّ يَوْمَ الْقِيٰمَةِ
(ترمذی۔ مشکوٰۃ۔ ص۶۶)

89. హజ్రత్ బురైదా ఉల్లేఖించారు, ప్రవక్త మహనీయులు ఇలా బోధించారని: "ఎవరయితే చీకట్లల్లో మస్జిదులకు వెళతారో వారికి ప్రళయంనాడు పరిపూర్ణమయిన కాంతి లభించే శుభవార్తను తెలుపండి." (తిర్మిజి)

(۹۰) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَثَلُ الْبَخِيْلِ وَالْمُتَصَدِّقِ كَمَثَلِ رَجُلَيْنِ عَلَيْهِمَا جُنَّتَانِ مِنْ حَدِيْدٍ قَدِ
اضْطُرَّتْ أَيْدِيْهِمَا إِلَى ثُدِيِّهِمَا وَتَرَاقِيْهِمَا فَجَعَلَ الْمُتَصَدِّقُ كُلَّمَا
تَصَدَّقَ بِصَدَقَةٍ انْبَسَطَتْ عَنْهُ وَجَعَلَ الْبَخِيْلُ كُلَّمَا هَمَّ بِصَدَقَةٍ
قَلَصَتْ وَأَخَذَتْ كُلُّ حَلْقَةٍ بِمَكَانِهَا۔ (صحیح مسلم۔ کتاب الزکوٰۃ ج ۱ ص۳۲۹)

90. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు: పిసినారి, దానధర్మాలు చేసేవారి ఉపమానం ఇద్దరు వ్యక్తులకు పోలి ఉంది. వారిద్దరూ ఉక్కు కవచాలు ధరించారు. ఇద్దరి చేతులూ రొమ్ము, కంఠం వరకు బంధించబడి ఉన్నాయి. దాతృగుణంగల వ్యక్తి దానం చేసినప్పుడు అతని కవచం వదులయి విశాలమవుతుంది. పిసినారి దానం ఇవ్వాలని అనుకున్నప్పుడు ఆ కవచం మరింత బిగుసుకుపోతుంది. కవచంలోని ప్రతి వలయం తన స్థానాన అతుక్కుపోతుంది." (ముస్లిమ్)

---

ఇందులో 'రిబాత్' అన్న పదం ప్రయోగించడం జరిగింది. రిబాత్ అంటే, సత్యాసత్యాల మధ్య పోరాటం సాగే రోజుల్లో రాత్రిళ్ళు పహరా కాయడం అన్న మాట. శాంతి కాలంలో నమాజ్ పట్ల మక్కువ, పోరాటపు రోజుల్లో ప్రాణాలొడ్డి పహరాకాయడంతో సమానమని అర్థం.

88. 'అల్లాహ్ మస్జిద్‌లు' అనంటే అల్లాహ్ ఆరాధనకై, సజ్దా చెయ్యడానికై నిర్మించిన ఆరాధనాలయాలన్నమాట. మస్జిద్‌లను సదా కళకళలాడేలా చెయ్యడమంటే వాటిని

(۹۱) عَنْ عَائِشَةَ قَالَتْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَا خَالَطَتِ الزَّكٰوةُ مَالاً قَطُّ اِلَّا اَهْلَكَتْهُ. (مشكوٰة - كتاب الزكوٰة)

91. హజ్రత్ ఆయిషా ఉల్లేఖనం: ఆమె ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవీయగా విన్నారు. సంపాదనలో జకాత్ ధనం కలిసి ఉన్నట్లయితే ఆ సంపద సర్వనాశనమయిపోతుంది. (మిష్కాత్)

(۹۲) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ لَّمْ يَدَعْ قَوْلَ الزُّوْرِ وَالْعَمَلَ بِهٖ لَيْسَ لِلّٰهِ حَاجَةٌ اَنْ يَّدَعَ طَعَامَهٗ وَشَرَابَهٗ. (صحيح بخاری، مشكوٰة - باب تنزيه الصوم ص۱۶۸)

92. దైవ ప్రవక్త (సఅసం) సెలవిచ్చారని హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు: "ఏ వ్యక్తి అయితే అబద్ధం పలకడాన్ని, అబద్ధాన్ని ఆచరించడాన్నీ మానుకోలేదో అలాంటి వ్యక్తి రోజా పాటించి అన్నపానీయాలు మానుకోవడం అల్లాహ్‌కు ఏ మాత్రం అక్కరలేదు." (బుఖారీ)

---

అలంకరించడం ఎంత మాత్రం కాదు. వాటి అలంకరణ ఆరాధకులు అత్యధికంగా పాల్గొనడంలోనే ఉంది. అందువల్ల అయిదు వేళలా జమాఅత్‌తోటి నమాజ్ కొరకు మస్జిదుకు వెళ్ళేవారు దాని శోభను పెంచుతారు. దైవభక్తి, పరలోక భీతి లేని మనిషే నమాజ్‌కు క్రమం తప్పకుండా హాజరవడంలో జాప్యం చూపుతాడు. అదే ఈ హదీసు ప్రబోధం.

89. నేటి నాగరిక వసతుల గాలి సోకని చోట వీధి దీపాలు లేని పల్లెల్లో ఇషా నమాజ్‌కయినా, ఫజ్ర్ నమాజ్‌కయినా ఇండ్ల నుండి మస్జిద్‌లకు చీకట్లలో వెళ్ళడం చాలా కష్టం. అయితే నేడు ఆ కష్టాన్ని భరిస్తే అంతిమ దినంనాడు మార్గం కాంతిమంతమవుతుందని దైవప్రవక్త సెలవిచ్చారు. ఈ శుభవార్తకు అర్హత పొందినవారే ధన్యులు.

90. దైవ సందేశహరులు అతి సున్నితంగా మానవుని మనోమయ జగత్తును ఇక్కడ ఓ ఉపమానం ద్వారా చిత్రించారు. సహజంగా దాతృ గుణంగల వ్యక్తి అయినా పిసినారితనం నిండినవాడయినా ఒకే వాతావరణంలో ఒకే ఆర్థిక వ్యవస్థలో జీవిస్తుంటారు. కాని సహజ లక్షణాల కారణంగా మనిషి ఆంతర్యం స్పందిస్తుంది. దానధర్మాల సందర్భం వచ్చినప్పుడు దాతృగుణం కలవాడి చెయ్యి, ఉన్నదానిలో నుంచి నిండు

(٩٣) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّی اللهُ عَلَیْهِ وَسَلَّمَ
مَنْ اَتٰی هٰذَا الْبَیْتَ فَلَمْ یَرْفُثْ وَلَمْ یَفْسُقْ رَجَعَ کَمَا وَلَدَتْهُ
اُمُّهٗ. (صحیح مسلم ج ١۔ صـ ٤٣٦)

93. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా తెలిపారు: "ఎవరయితే ఈ గృహం (బైతుల్లాహ్) సందర్శించి నీతిబాహ్యమయిన చర్యలకు, దురాచారం, దుశ్చేష్టలకు లోనవకుండా మరలిపోతాడో అతను తన తల్లికి పుట్టినప్పటిలా (పరిశుద్ధుడయి) మరిలాడని అర్థం." (సహీహ్ ముస్లిమ్)

---

హృదయంతో ఇవ్వడానికి సహజంగానే ముందుకు వస్తుంది. స్వతహాగా పిసినారి అయి తెచ్చిపెట్టుకున్న దాతృగుణం గల వ్యక్తి చెయ్యి సహజంగానే ఏడుస్తూ ఇస్తుంది.

91. జకాత్ ధనం సాధారణ సంపాదనలో కలవడమన్నది రెండు రకాలుగా జరగవచ్చు. (1) జకాత్ విధి అయినప్పటికీ ధనంలోనుంచి జకాత్ (మొత్తం ధనంలోనుంచి రెండున్నర శాతం ధనం) తీసి అర్హులయినవారికి ఇవ్వకపోతే సంపాదన అంతా దౌర్జన్యపూరితమయిపోతుంది. అశుభసూచకమవుతుంది. నైతికంగా షరీఅత్ రీత్యా 'ముస్లిం' అని చెప్పుకునే వ్యక్తి వినియోగించేందుకు అది అర్హత కోల్పోతుంది. ఈ విధంగా అది వినాశమయినట్లే. (2) ఒక ముస్లిం జకాత్ స్వీకరించేందుకు అర్హుడు కాకపోయినప్పటికీ జకాత్ వసూలు చేసి ఈ దాన ధనాన్ని తాను చేసే సంపాదనలో కలుపుకున్నట్లయితే మొత్తం సంపద కలుషితమయి అశుద్ధమయిపోతుంది.

92. అంటే రోజా మనిషిలో ఏ ఉత్తమ గుణాలనయితే పెంపొందించాలని కోరుతుందో వాటికే విరుద్ధంగా ప్రవర్తిస్తే మనిషి సచేతనావస్థలో రోజాను పాటించడం లేదన్నమాట. ఉత్తమ నైతిక మూల్యాలను అలవరచుకోవడం లేదన్నమాట. అలాంటి నిష్ప్రయోజనమయిన ఆచారబద్ధమయినదే తప్ప మనసులోకి ఎక్కని వ్రతం పాటించడం దైవానికి ఏ మాత్రం ఇష్టం లేదని అంటుందీ హదీసు – ఆత్మ పరిశీలనకు పిలుపునిస్తోంది!

93. కాబా గృహ సందర్శనంలో సకల ఆరాధనా నియమాలు ఇమిడి ఉన్నాయి. ఆ కారణంగా వాటిని నియమబద్ధంగా ఆచరించి ఎలాంటి పాప కార్యాలకు ఒడిగట్టకుండా హజ్జ్‌ను పూర్తి చేసుకున్న వ్యక్తి సచేతనావస్థలో దాన్ని నిర్వహిస్తే అతని మానసిక, ఆధ్యాత్మిక స్థితులు పూర్తిగా పరిశుద్ధమయిపోతాయి. దాన్నే ప్రవక్త మహనీయులు తల్లి కడుపున పుట్టినప్పటి పాపరహిత స్థితికి చేరుకుంటాడని అభివర్ణించారు.

(۹۴) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِنَّ اَوَّلَ مَا یُحَاسَبُ بِهِ الْعَبْدُ یَوْمَ الْقِیٰمَةِ صَلٰوتُهٗ فَاِنْ صَلَحَتْ فَقَدْ اَفْلَحَ وَاِنْ فَسَدَتْ فَقَدْ خَابَ وَخَسِرَ فَاِنِ انْتَقَصَ مِنْ فَرِیْضَتِهٖ شَیْئٌ قَالَ الرَّبُّ تَبَارَكَ وَتَعَالٰی اُنْظُرُوْا هَلْ لِعَبْدِیْ مِنْ تَطَوُّعٍ فَیُكَمَّلُ بِهَا مَا انْتَقَصَ مِنَ الْفَرِیْضَةِ ثُمَّ یَكُوْنُ سَائِرُ عَمَلِهٖ عَلٰی ذَالِكَ وَفِیْ رِوَایَةٍ ثُمَّ الزَّكٰوةُ مِثْلَ ذَالِكَ ثُمَّ تُؤْخَذُ الْاَعْمَالُ عَلٰی حَسَبِ ذَالِكَ۔ (رواه ابوداؤد مشکوٰۃ۔ باب التطوع ص ۱۰۹)

94. మహాప్రవక్త ఇలా ఉపదేశించారని హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు: "దాసుడు (మనిషి)ని ప్రళయంనాడు మొట్టమొదట నమాజ్ విషయంలో లెక్క అడగటం జరుగుతుంది. అది సవ్యంగా ఉన్నట్లయితే అతను సఫలీకృతుడవుతాడు, అది భంగపడినట్లయితే అతనూ భంగపడతాడు, నిష్ఫలుడవుతాడు. ఒకవేళ అతని విధి(అయిన నమాజు)ల్లో ఏవయినా కొరతలున్న పక్షంలో అల్లాహ్, 'నా దాసుని అదనపు ఆరాధనలేవయినా ఉన్నాయేమో చూడండి' అని అడుగుతాడు. (అవి ఉన్నట్లయితే) వాటిద్వారా ఫర్జ్ (విధులైనటువంటి)లోని కొరతల్ని తీర్చడం జరుగుతుంది. ఆ తరువాత అతని ఆచరణలన్నింటినీ ఇదే విధంగా పరిశీలించడం జరుగుతుంది. మరో ఉల్లేఖనంలో-"జకాత్‌ని కూడా ఇలాగే లెక్క జూడటం జరుగుతుంది, తదనుగుణంగానే ఇతర ఆచరణల్ని గణించడం జరుగుతుంది" అని ఉంది.

(అబూదావూద్, మిష్కాత్)

---

94. మనిషి 'ఆచరణ'కు రెండు రూపాలు: ఒకటి, దేవుని హక్కుల నిర్వర్తన. రెండు, మానవుల హక్కుల నిర్వర్తన. ఫర్జ్ నమాజ్ దేవుని హక్కు. దాన్ని సరిగ్గా పాటించడంలో ఏవైనా తప్పులు జరిగి ఉంటే మనిషి చేసే నఫిల్ (అదనపు) నమాజ్ ద్వారా ఆ లోపాన్ని పూడ్చడానికి కారుణ్యస్వరూపుడైన ప్రభువు ఆదేశాలిస్తాడు. అలాగే సకల విషయాలనూ పరిశీలించడం జరుగుతుంది. అందువల్లనే కేవలం ఫర్జ్ (విధి అయిన) ఆరాధనల్ని,. విధి అయిన సామాజిక, నైతిక బాధ్యతల్ని మటుకే కాక అదనపు ఆరాధనల్ని ఆచరిస్తూ సామాజిక నైతిక రంగాల్లోనూ బొటాబొటిగా పనులు చేయడంతో

(۹۵) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ رَحِمَ اللّٰهُ رَجُلاً قَامَ مِنَ اللَّیْلِ فَصَلّٰی وَاَیْقَظَ امْرَأَتَهٗ فَصَلَّتْ فَاِنْ اَبَتْ نَضَحَ فِیْ وَجْهِهَا الْمَاءَ رَحِمَ اللّٰهُ امْرَاَةً قَامَتْ مِنَ اللَّیْلِ فَصَلَّتْ وَاَیْقَظَتْ زَوْجَهَا فَاِنْ اَبٰی نَضَحَتْ فِیْ وَجْهِهِ الْمَاءَ۔ (رواه ابوداؤد، مشکوٰة۔ باب التحریض علی قیام اللیل ص۱۰۹)

95. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారని అబూహురైరా ఉల్లేఖించారు, "అల్లాహ్ ఓ వ్యక్తిని కరుణించుగాక. అతను నడిరేయిన తానూ లేచాడు, నమాజ్ చేశాడు, తన భార్యనూ లేపాడు, ఆమె కూడా నమాజ్ చేసింది. భార్య లేవకపోతే భర్త ఆమె ముఖాన నీళ్ళు చల్లాడు. అల్లాహ్ ఓ స్త్రీని అనుగ్రహించుగాక. ఆమె నడిరేయిన తానూ లేచింది, నమాజ్ చేసింది, తన భర్తనూ లేపింది. అతను లేవకపోతే ఆమె అతని ముఖంపై నీళ్ళు చల్లింది." (అబూదావూద్ - మిష్కాత్)

(۹۶) عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَا مِنْ مُسْلِمٍ یَبِیْتُ عَلٰی ذِکْرٍ طَاهِرًا فَیَتَعَارُّ مِنَ اللَّیْلِ فَیَسْأَلُ اللّٰهَ خَیْرًا اِلَّا اَعْطَاهُ اللّٰهُ اِیَّاهُ۔ (رواه احمد، مشکوٰة۔ باب التحریض علی قیام اللیل ص۱۰۹)

96. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, దైవసందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ముస్లిమ్ వుజూ చేసి దైవనామ సంస్మరణ చేస్తూ నిద్రపోయి, రాత్రికి లేచి అల్లాహ్‌ను శుభశ్రేయాలకై వేడుకుంటే అల్లాహ్ అతని దుఆ (వేడుకోలు)ను తప్పక ఆమోదిస్తాడు." (అహ్మద్ - మిష్కాత్)

---

ఆగిపోక విశాల హృదయంతో ఇతరుల పట్ల గల బాధ్యతల్ని ఇతోధికంగా నెరవేర్చడానికి కృషి చెయ్యాలి. అవి ప్రళయంనాడు మన లోటుపాట్ల సర్దుబాటుకు ఉపకరిస్తాయి.

95. మహనీయ ముహమ్మద్(సఅసం) ఇలా భూతకాల వర్ణనలో అనేక ఉపమానాలు చెప్పారు. అలా చెప్పి మంచి పనులకై ప్రజలను పురికొలిపేవారు. ఎలా ప్రవర్తించడం

(۹۷) عَنْ اَبِیْ سَعِیْدٍ قَالَ جَاءَ رَجُلٌ اِلَی النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَقَالَ یَا رَسُوْلَ اللّٰهِ اَوْصِنِیْ قَالَ عَلَیْكَ بِتَقْوَی اللّٰهِ فَاِنَّهَا جِمَاعُ كُلِّ خَیْرٍ، وَعَلَیْكَ بِالْجِهَادِ فَاِنَّهٗ رَهْبَانِیَّةُ الْمُسْلِمِیْنَ وَعَلَیْكَ بِذِكْرِ اللّٰهِ وَتِلَاوَةِ كِتَابِهٖ فَاِنَّهٗ نُوْرٌ لَّكَ فِی الْاَرْضِ وَذِكْرٌ لَّكَ فِی السَّمَاءِ وَاخْزُنْ لِسَانَكَ اِلَّا مِنْ خَیْرٍ فَاِنَّكَ بِذٰلِكَ تَغْلِبُ الشَّیْطَانَ ۔

(المعجم الصغیر للطبرانی ص۱۹۷)

97. అబూ సయీద్ (రజిఅన్) ఉల్లేఖించారు: "ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుల సన్నిధిలో హాజరయి, 'దైవప్రవక్తా, నాకు ఏదయినా ఉపదేశించండి' అని వేడుకున్నాడు. అప్పుడు ఆయన ఇలా బోధించారు: "దేవుని తక్వా (భయభక్తుల)ను నీవు తప్పనిసరిగా పాటించు, ఎందువల్లనంటే అది సకల సదాచారాలకు మూలనిధి. జిహాద్‌ని తప్పనిసరయినదిగా చేసుకో, ఎందువల్లనంటే అది ముస్లిములకై సన్యాసత్వంలాంటిది. ఇంకా, దైవనామ సంస్మరణను, దైవగ్రంథ పఠనాన్ని నియమబద్ధంగా పాటించు - అవి నీకు భువిలో జ్యోతికి, దివిలో నీ ప్రస్తావనకు కారణభూతమవుతాయి, నీ నోటిని మంచికై తప్ప ప్రతిదానికీ నిషేధించి ఉంచు, తద్వారా నీవు షైతాన్‌ని అదుపులో ఉంచగలుగుతావు." (అల్‌మో'జముస్సగీర్ - త్రిబాని)

---

ఉత్తమమో దైవానికి ఇష్టమైనదో తెలిపేవారు. ఈ హదీసులోనూ అదే జరిగింది. రాత్రిళ్ళల్లో చేసే తహజ్జుద్ నఫిల్ (అదనపు) నమాజును ఆచరించేవారు కేవలం దాన్ని తాము పాటించడమే కాక తమ తోటివారినీ, ఇంటివారినీ దానికై ప్రేరేపించాలని ఈ హదీసు సారాంశం.

96. ఈ హదీసులో మూడు విషయాలు బోధించడం జరిగింది. నిద్రపోయే ముందు ముస్లిములు వుజూ చేసి దైవాన్ని స్మరించుకుంటూ నిద్రపోవాలి. రాత్రిళ్ళల్లో తహజ్జుద్‌కై లేవాలి, అప్పుడు నమాజ్ చెయ్యాలి. దానితోపాటు దైవంతో తన జీవితంలో శుభశ్రేయాలు, మేళ్ళు కలగాలని తనకున్న వాంఛల్ని విన్నవించుకోవాలి. ఇలా పరిశుద్ధంగా దైవనామ సంస్మరణతోనే నిద్రపోయి లేచి తిరిగి దైవనామ సంస్మరణతోనే గడిపే వ్యక్తి 'దుఆ' (ప్రార్థన)లను అల్లాహ్ తప్పక స్వీకరిస్తాడు.

(٩٨) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
إِنَّ هٰذِهِ الْقُلُوْبَ تَصْدَأُ كَمَا يَصْدَأُ الْحَدِيْدُ إِذَا أَصَابَهُ الْمَاءُ قِيْلَ
يَا رَسُوْلَ اللّٰهِ وَمَا جِلَاؤُهَا قَالَ كَثْرَةُ ذِكْرِ الْمَوْتِ وَتِلَاوَةُ الْقُرْاٰنِ۔
(رواہ البیہقی۔مشکوٰۃ۔کتاب فضائل القرآن)

98. ఇబ్నె ఉమర్ ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి "ఇనుముకు నీరు తగిలినప్పుడు త్రుప్పుపట్టిన విధంగానే హృదయాలకు కూడా త్రుప్పు పట్టుతుంది" అని సెలవియ్యగా అక్కడున్నవారు, "దైవప్రవక్తా! అయితే హృదయాన్ని ఎలా మెరుగుపరచుకోవాలి?" అని అడిగారు. అప్పుడాయన ఇలా ఉపదేశించారు: "మృత్యువును ఇతోధికంగా గుర్తుచేసుకోవాలి. దివ్యఖుర్ఆన్ పారాయణం కూడా అధికంగా చెయ్యాలి."

(బైహకీ - మిష్కాత్)

---

97. 'తక్వా' అంటే తప్పించుకోవడం, కాపాడుకోవడం అని అర్థం. దుర్మార్గపు కంటకాల నుండి చెడుల మురికి నుండి తన్నుతాను భద్రంగా ఉంచడం - అదే ధర్మనిష్ఠగా మసలుకోవడం అని భావం. 'జిహాద్' అంటే దైవధర్మ మార్గంలో నిరంతర కృషి సలపడం, ఆ కృషిలో సుఖాలు, భాగ్యాలు వదలుకోవడం, కడకు అవసరమయితే ప్రాణాలను సయితం త్యాగం చెయ్యడం అని భావం. ఈ అత్యున్నత త్యాగనిరతినే 'సన్యాసత్వం' అని చెప్పారు ప్రవక్త మహనీయులు (సఅసం). భోగిగా ఉంటూనే 'త్యాగి'గా అలరారడం అంటే ఇదేగా మరి! మనిషి నిష్కల్మష హృదయంతో అనవరతం దైవాన్ని జ్ఞాపకముంచుకుంటున్నాడంటే దైవం నిషేధించిన దాని దారి వైపులకు అడుగు వెయ్యడని చెప్పవచ్చు. మనిషి చిత్తశుద్ధితో దైవ గ్రంథాన్ని పారాయణం చేస్తున్నాడంటే దైవాదేశాలకు భిన్నమయిన పనుల జోలికి పోడని భావించవచ్చు. ఈ ఆచరణ వల్ల అతని ప్రాపంచిక జీవితం జ్యోతిర్మయమవడంలోను, పరలోకంలో అతనికి ఉన్నత స్థానం లభించడంలోను సందేహమే లేదు. నోరు లెక్కలేని మేళ్ళకు నిలయం; చెప్పలేని కీడులకు మూలం కూడా ఇదే. నోరు మంచిదైతే ఊరు మంచిదన్న నానుడి ఉండనే ఉంది. నోరు అదుపులో ఉంటే అనేక దుష్టత్వాలు, షైతాన్ ప్రేరణలు తామై పారిపోతాయి.

98. అంతర్యం నిగనిగలాడుతుంటే సవ్యంగా పని చేస్తూ ఉంటుంది. మనిషి చేసే చెడు పనుల వల్ల అంతర్యం మలినమయి ఇనుముకు త్రుప్పు పట్టినట్లే హృదయానికి మాలిన్యం చుట్టుకుంటుంది. అది సవ్యంగా పనిచెయ్యనిదయి పోతుంది. దాన్ని

(۹۹) عَنْ جُنْدُبِ بْنِ عَبْدِ اللّٰهِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِقْرَؤُا الْقُرْاٰنَ مَا ائْتَلَفَتْ عَلَيْهِ قُلُوْبُكُمْ فَاِذَا اخْتَلَفْتُمْ فَقُوْمُوْا عَنْهُ. (بخاری، مسلم، مشکوٰۃ۔ فضائل القرآن)

99. జున్దుబ్ బిన్ అబ్దుల్లాహ్ ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త మహనీయులు ఇలా హితవు గరిపారు, "దివ్య ఖుర్ఆన్ పఠనం చేస్తూ ఉండండి - మీకు అందులో మక్కువ ఉన్నంత వరకు. ఇక చాలనిపిస్తే దాన్ని నిలిపివెయ్యండి."
(బుఖారి, ముస్లిం)

(۱۰۰) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ بُسْرٍ قَالَ جَاءَ اَعْرَابِيٌّ اِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ اَيُّ النَّاسِ خَيْرٌ فَقَالَ طُوْبٰى لِمَنْ طَالَ عُمُرُهٗ وَحَسُنَ عَمَلُهٗ قَالَ يَارَسُوْلَ اللّٰهِ اَيُّ الْاَعْمَالِ اَفْضَلُ قَالَ اَنْ تُفَارِقَ الدُّنْيَا وَلِسَانُكَ رَطْبٌ مِّنْ ذِكْرِ اللّٰهِ. (رواہ احمد۔ مشکوٰۃ باب ذکر اللہ)

100. అబ్దుల్లాహ్ బిన్ బుస్ర్ ఇలా ఉల్లేఖించారు: "ఒక పల్లెవాసి ప్రవక్త మహనీయులు (సఅసం) సన్నిధిలోకి వచ్చి, 'జనుల్లో ఉత్తమమయిన వాడెవడు?' అని ప్రశ్నించాడు. దానికి ఆయన, "దీర్ఘాయుష్మంతుడు, సదాచార సంపన్నుడయిన వ్యక్తికి శుభవార్త" అని సెలవిచ్చారు. ఆ వ్యక్తి తిరిగి ఇలా అడిగాడు, 'సదాచరణలోకెల్లా ఏ ఆచరణ ఘనమయింది?' "నీవు ప్రపంచాన్ని వదలి వెళుతున్నప్పుడు దైవ సంస్మరణతో నీ నోటి తడియారకుండా ఉంటే, ఆ ఆచరణ" అని దైవప్రవక్త సెలవిచ్చారు.' (మిష్కాత్)

---

ఆధ్యాత్మిక వికాసానికి ఆధారంగా మలచుకోవాలంటే చెయ్యవలసిన పనిని ప్రవక్త మహనీయులు ఇక్కడ సూచించారు. మరణాన్ని స్మరించడం మూలాన మనిషిని చెడుకై ప్రేరేపించే ప్రపంచ వ్యామోహం నశిస్తుంది. అలాగే దైవగ్రంథ పఠనం వల్ల (అర్థం చేసుకుంటూ చదవడం అన్నమాట) దైవాదేశాలు తెలిసివస్తాయి. చెడువల్ల కలిగే పరిణామాలు ద్యోతకమవుతాయి. మనిషి ఆంతర్యం ఉజ్వలమానమవుతుంది.

99.దేన్నీ అతిగా చెయ్యరాదు. తినగ తినగ గారెలు చేదు అన్నట్లే, విసుగు అనిపించేలా, మొక్కుబడిగా చదివి తీరాలని దివ్య గ్రంథ పారాయణం చెయ్యరాదు. అలా చెయ్యడం

(۱۰۱) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَنْ قَعَدَ مَقْعَدًا لَمْ یَذْکُرِ اللّٰهَ فِیْهِ کَانَتْ عَلَیْهِ مِنَ اللّٰهِ تِرَةٌ وَمَنِ اضْطَجَعَ مَضْجَعًا لَا یَذْکُرُ اللّٰهَ فِیْهِ کَانَتْ عَلَیْهِ مِنَ اللّٰهِ تِرَةٌ۔ (رواہ ابوداؤد، مشکوٰۃ ۔ باب ذکر اللّٰہ)

101. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం: దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ఒక వ్యక్తి దైవాన్ని సంస్మరించకుండా కూర్చున్న స్థితిలో ఒక్కసారి గడిపినా అతనిపై దేవుని అభిశాపం అవతరిస్తుంది. మరే వ్యక్తి అయినా దైవాన్ని సంస్మరించకుండా కొంతసేపు పరుండినా అతనిపై దైవం తరపున వినాశం చుట్టుముడుతుంది." (అబూదావూద్, మిష్కాత్)

(۱۰۲) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یُسْتَجَابُ لِلْعَبْدِ مَا لَمْ یَدْعُ بِاِثْمٍ اَوْ قَطِیْعَةِ رَحِمٍ، مَا لَمْ یَسْتَعْجِلْ قِیْلَ یَا رَسُوْلَ اللّٰهِ مَا الْاِسْتِعْجَالُ قَالَ یَقُوْلُ دَعَوْتُ وَقَدْ دَعَوْتُ فَلَمْ یُسْتَجَبْ لِیْ فَیَسْتَحْسِرُ عِنْدَ ذٰلِكَ وَیَدَعُ الدُّعَاءَ۔ (رواہ مسلم، مشکوٰۃ ۔ کتاب الدعوات)

102. ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చినట్లు అబూహురైరా (రజి) ఉల్లేఖించారు: "దాసుని వేడుకోలు స్వీకరించబడుతూ ఉంటుంది – అతను పాపపు కార్యం చెయ్యనంతవరకు, బంధువుల పట్ల నిర్దయగా ప్రవర్తించనంత వరకు, తొందరపడనంతవరకు." 'దైవప్రవక్తా, తొందరపడడం అంటే ఉద్దేశ్యం ఏమిటి?' అని అడగ్గా ఆయన ఇలా అన్నారు "దాసుడు 'నేను దుఆ చేస్తూనే ఉన్నాను, కాని అది స్వీకరించబడలేదు' అని అంటాడు. ఆ తరువాత విసుగెత్తి వేడుకోవడం విరమించుకుంటాడు." (ముస్లిం, మిష్కాత్)

---

దివ్య గ్రంథం పట్ల నిరాదరణగానే పరిణమిస్తుంది. మనసు ఉల్లాసంగా ఉన్నంత వరకు, దాని మాధుర్యాలను గ్రోలుతూ, అందులో లీనమయి పఠించినదే సరయిన గ్రంథ పఠనం, సదా దీన్ని గుర్తుంచుకోవాలి.

100. ఉత్తముడయిన మనిషి అంటే ఇహపరాల్లో సాఫల్యం పొందేవాడని భావం.

(۱۰۳) عَنِ ابْنِ الزُّبَيْرِ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا سَلَّمَ مِنْ صَلٰوتِهٖ يَقُوْلُ بِصَوْتِهِ الْأَعْلٰى لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ۔ لَا حَوْلَ وَلَا قُوَّةَ إِلَّا بِاللّٰهِ لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَلَا نَعْبُدُ إِلَّا إِيَّاهُ لَهُ النِّعْمَةُ وَلَهُ الْفَضْلُ وَلَهُ الثَّنَاءُ الْحَسَنُ لَا إِلٰهَ إِلَّا اللّٰهُ مُخْلِصِيْنَ لَهُ الدِّيْنَ وَلَوْ كَرِهَ الْكَافِرُوْنَ۔

(مسلم۔ مشکوٰۃ۔ ص ۸۸)

103. 'దైవ సందేశహరులు (సఅసం) నమాజ్ ముగించి, సలామ్ పలికి తిరిగిన తరువాత బిగ్గరగా ఇలా పఠించేవారని హజ్రత్ ఇబ్ను జుబైర్ (రజి అన్) ఉల్లేఖించారు: "ఒక్క అల్లాహ్ తప్ప మరే ఇతర దైవంలేదు. ఆయనకు సహవర్తులెవ్వరూ లేరు పాలనాధికారమంతా ఆయనకే చెందింది. స్తోత్రం కూడా ఆయనకే చెందుతుంది. ఆయన ప్రతిదానిపై అధికారం కలవాడు. అల్లాహ్ ఆధారంగా తప్ప మరే శక్తిగాని, సామర్థ్యంగానీ ఏదీ లేదు. మేము ఆయన్ని తప్ప మరెవరినీ ఆరాధించము. మానవులకు లభించే వరాలన్నీ ఆయనవే. ఘనత ఏదయినా ఉంటే ఆయనకే కలదు, ఉత్తమ స్తోత్రం కూడా ఆయనకే చెల్లుతుంది. అల్లాహ్ తప్ప మరే దైవం లేదు. మేము ధర్మాన్ని (దాని అనుసరణను, ఆరాధనను) ఆయనకే ప్రత్యేకిస్తున్నాము. దైవ తిరస్కారులకు (మా) ఈమాట ఎంతగా రుచించకపోయినా సరే."

(ముస్లిం, మిష్కాత్)

---

దీర్ఘాయుష్షు లభించి సత్కార్యాలు చేసే అవకాశం మెండుగా లభించే వ్యక్తి కన్నా ఇహపర సాఫల్యం పొందే అర్హతలు అధికంగా ఎవరికుంటాయి? అలాగే చివరి శ్వాస వరకు దైవసంస్మరణ చెయ్యడంకన్నా ఘనమయిన సత్కార్యం ఏది కాగలదు?

101. విశ్వసించిన వ్యక్తి అనుక్షణం - కూర్చున్నా, పడుకున్నా, నిల్చున్నా, నడుస్తున్నా దైవ సంస్మరణలోనే గడుపుతాడు. అలా గడపకపోతే అతని విశ్వాసం లోపభూయిష్ట మయిందనడంలో సందేహమేముంటుంది? ఎక్కడ, ఏ స్థితిలో కొంత కాలం గడిపినా, ఏది చేసినా దైవాన్ని తలచుకుని మరీ గడుపుతాడు విశ్వసించిన మనిషి. దైవాన్ని మరచిపోయి వ్యవహరిస్తే అతను తన సర్వ నాశనాన్ని కొనిదెచ్చుకున్నట్లే అర్థం.

(۱۰۴) عَنْ اَبِیْ اَیُّوْبَ قَالَ کَانَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا اَکَلَ اَوْ شَرِبَ قَالَ اَلْحَمْدُ لِلّٰہِ الَّذِیْ اَطْعَمَ وَسَقٰی وَسَوَّغَہٗ وَ جَعَلَ لَہٗ مَخْرَجًا (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ کتاب الاطعمہ۔ ص۳۶۵)

104. హజ్రత్ అబూఅయ్యూబ్ (రజిఅన్) ఉల్లేఖించారు: "ప్రవక్త మహనీయులు అన్నపానీయాలు పుచ్చుకుంటే ఇలా పలికేవారు, "స్తోత్రం కేవలం అల్లాహ్‌కే చెల్లు ఆయనే తినిపించాడు, త్రాగించాడు, ఆహారం రుచికరంగా చేశాడు (అనవసరమయిన పదార్థాల) విసర్జనకు ఏర్పాటు చేసాడు." (అబూదావూద్, మిష్కాత్)

---

102. మనిషి దైవాన్ని వేడుకున్నప్పుడు ఆ వేడుకోలు స్వీకరించబడాలంటే మూడు నిబంధనలు ఇక్కడ పేర్కొనబడ్డాయి. ఒకటి, అతను పాపపు పనులేవీ చెయ్యరాదు. రెండు, బంధువుల ఎడల సవ్యంగా ప్రవర్తించాలి, వారి హక్కుల్ని సక్రమంగా నెరవేర్చాలి. మూడు, తన కోరిక మన్నించాలని వేగిరపడరాదు. దైవానికి తెలుసు, తన దాసునికి ఏది ఎప్పుడు శ్రేయస్కరమయిందో. ఆయన తదనుగుణంగానే వేడుకోలును నెరవేర్చుతాడు. ఇంకా తన మొర ఆలకించలేదే స్వామి, అని విసుగు ప్రదర్శించి వేడుకోవడం మానివేస్తే దైవం ప్రార్థనను స్వీకరించే భాగ్యమూ కోల్పోతాడు మనిషి. ఇది చాలా ప్రమాదకరమయిన పరిస్థితి. ఇది ఏర్పడకుండా మనిషి తన మానసికావస్థను సదా పరిశీలించుకుంటూ ఉండాలి.

103. దైవాన్ని సంస్మరించే విధానం దైవప్రవక్త నేర్పిందే అత్యుత్తమమయింది. ఈ హదీసులో దైవ ప్రవక్త నమాజ్ తరువాత విశ్వప్రభువును వేడుకున్న విధానం, దైవ సంస్మరణ చేసిన ఓ వచనాన్ని ప్రస్తావించడం జరిగింది. (మేము కేవలం భావాన్ని ఇక్కడ పేర్కొన్నాము. అసలు పదాలు మూలంలో నుంచి గ్రహించి నేర్చుకోవడం మంచిది.)

104. దైవనామ సంస్మరణ అనునిత్యం జరగవలసిందే. ప్రతి కార్యం చేసే ముందు దైవ నామంతోనే ప్రారంభించాలన్నది ఇస్లామీయ సంస్కృతిలోని అంతర్భాగమయిన అంశం. అలాగే ప్రతి కార్యం చేసే సమయంలో ఏ దుఆ ప్రవక్త మహనీయులు చేసేవారో హదీసుల్లో వివరంగా ఉంది. పడక నుంచి లేచినప్పటి నుండి, వుజూ చెయ్యడం, మస్జిద్‌కు వెళ్ళడం, మస్జిద్‌లో ప్రవేశించడం, వెలికి రావడం, అన్న పానీయాలు పుచ్చుకోవడం, బయటకు వెళ్ళడం ఇత్యాది సకల దినచర్యలతోపాటు చివరికి తిరిగి పడక పైకి చేరేటప్పటి వరకు అన్ని సందర్భాలకై దైవప్రవక్త చేసిన దుఆలు హదీసు గ్రంథాల్లో పేర్కొనడం జరిగింది. వాటిని తెలుసుకుని నేర్చుకోవడం మన దిన చర్యల్లో ప్రయోగించడం సరయిన విధానం. ఇక్కడ అన్నపానీయాలకు సంబంధించిన దుఆ ఉల్లేఖించబడింది.

(١٠٥) عَنْ ابْنِ عُمَرَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ
اِذَا اسْتَوٰى عَلٰى بَعِيْرِهٖ خَارِجًا اِلَى السَّفَرِ كَبَّرَ ثَلَاثًا ثُمَّ قَالَ سُبْحَانَ
الَّذِىْ سَخَّرَ لَنَا هٰذَا وَمَا كُنَّا لَهٗ مُقْرِنِيْنَ وَاِنَّا اِلٰى رَبِّنَا لَمُنْقَلِبُوْنَ. اَللّٰهُمَّ
اِنَّا نَسْئَلُكَ فِىْ سَفَرِنَا هٰذَا الْبِرَّ وَالتَّقْوٰى مِنَ الْعَمَلِ مَا تَرْضٰى. اَللّٰهُمَّ
هَوِّنْ عَلَيْنَا سَفَرَنَا هٰذَا وَاطْوِ لَنَا بُعْدَهٗ اَللّٰهُمَّ اَنْتَ الصَّاحِبُ فِى السَّفَرِ
وَالْخَلِيْفَةُ فِى الْاَهْلِ اَللّٰهُمَّ اِنِّىْ اَعُوْذُ بِكَ مِنْ وَعْثَاءِ السَّفَرِ وَكَآبَةِ
الْمَنْظَرِ وَسُوْءِ الْمُنْقَلَبِ فِى الْمَالِ وَالْاَهْلِ وَاِذَا رَجَعَ قَالَهُنَّ وَزَادَ
فِيْهِنَّ اٰئِبُوْنَ تَائِبُوْنَ عَابِدُوْنَ لِرَبِّنَا حَامِدُوْنَ. (رواه مسلم)

105. హజ్రత్ ఇబ్ను ఉమర్ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు ప్రయాణానికి ఉద్యుక్తులయినప్పుడు ఒంటెనెక్కి మూడుమార్లు తక్బీర్ పలికేవారు. ఆ తరువాత ఇలా పఠించే వారు. "పరిశుద్ధుడు ఆ దేవుడు, ఆయన దీన్ని మా కొరకు మా అధీనంలో ఇచ్చాడు. ఇంకా మేము మా ప్రభువు వైపునకు మరలిపోవలసినవారమే. ఓ అల్లాహ్, మేము ఈ ప్రయాణంలో శుభాన్నీ, నిష్ఠనూ అర్థిస్తున్నాము. నీకు ఇష్టమయిన ఆచరణ చేసే బుద్ధిని అర్థిస్తున్నాము. ఓ అల్లాహ్ మా ఈ ప్రయాణాన్ని మా కొరకు సులభతరంచెయ్యి. దీని దూరాన్ని తగ్గించు, ఓ అల్లాహ్ నీవు ప్రయాణావస్థలోనూ మాకు తోడుగా ఉంటావు. (మా వెనకాల) మా ఇండ్లల్లోనూ నీవే మా (కుటుంబ రక్షణ) బాధ్యతలు వహించేవాడవు. ఓ అల్లాహ్ నేను ప్రయాణంలోని ఇబ్బందుల నుండి నీ రక్షణకై వేడుకుంటు న్నాను – నేను నా భార్యాపిల్లల మధ్యన, నా ధన సామగ్రి మధ్యన దురవస్థలో తిరిగి రాకుండా, మరేదయినా బాధాకరమయిన దృశ్యం చూడకుండా (కాపాడు)" ఆయన తిరిగి వచ్చిన తరువాత కూడా ఈ దుఆనే పలికేవారు. దానికి ఈ మాటలు అధికం చేసేవారు: "మేము తిరిగి వచ్చాము – పాపాల మన్నింపునకై వేడుకుంటూ, దైవదాస్యం చేసుకుంటూ, మన ప్రభువు స్తోత్రగానం చేసుకుంటూ." (ముస్లిం)

(۱۰۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَقُوْلُ اَللّٰهُمَّ اَصْلِحْ لِیْ دِیْنِیَ الَّذِیْ هُوَ عِصْمَةُ اَمْرِیْ وَاَصْلِحْ لِیْ دُنْیَایَ الَّتِیْ فِیْهَا مَعَاشِیْ وَاَصْلِحْ لِیْ اٰخِرَتِیَ الَّتِیْ فِیْهَا مَعَادِیْ وَاجْعَلِ الْحَیَاةَ زِیَادَةً لِّیْ فِیْ كُلِّ خَیْرٍ وَّاجْعَلِ الْمَوْتَ رَاحَةً لِّیْ مِنْ كُلِّ شَرٍّ۔ (رواہ مسلم مشکوٰۃ۔ باب جامع الدعاء)

106. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రార్థించేవారు: "ఓ అల్లాహ్, నాధర్మాన్ని, నా మోక్షమార్గాన్ని ఉత్తమంగా రూపొందించు. నా ప్రపంచాన్ని, నా జీవన సామగ్రిని ఉత్తమంగా చెయ్యి. నా పరలోకాన్ని, నేను తిరిగివెళ్ళే స్థావరాన్ని ఉత్తమంగా చెయ్యి. నా జీవితాన్ని ప్రతి శుభం అధికమవడానికి కారణమయ్యేలా చెయ్యి. మృత్యువును సకల చెడులకు దూరంగా, సురక్షితంగా ఉండేందుకు కారణంగా చెయ్యి."
(ముస్లిం - మిష్కాత్)

(۱۰۷) عَنْ اَبِیْ سَعِیْدِنِ الْخُدْرِیِّ قَالَ قَالَ رَجُلٌ هُمُوْمٌ لَزِمَتْنِیْ وَدُیُوْنٌ یَا رَسُوْلَ اللّٰهِ قَالَ اَفَلَا اُعَلِّمُكَ كَلَامًا اِذَا قُلْتَهٗ اَذْهَبَ اللّٰهُ هَمَّكَ وَقَضٰی عَنْكَ دَیْنَكَ قَالَ بَلٰی قَالَ قُلْ اِذَا اَصْبَحْتَ وَاِذَا اَمْسَیْتَ اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُ بِكَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَاَعُوْذُ بِكَ مِنَ الْعِجْزِ وَالْكَسَلِ وَاَعُوْذُ بِكَ مِنَ الْبُخْلِ وَالْجُبْنِ وَاَعُوْذُ بِكَ مِنْ غَلَبَةِ الدَّیْنِ وَقَهْرِ الرِّجَالِ قَالَ فَفَعَلْتُ ذٰلِكَ فَاَذْهَبَ اللّٰهُ هَمِّیْ وَقَضٰی عَنِّیْ دَیْنِیْ۔ (رواہ ابو داؤد۔ مشکوٰۃ۔ باب الدعوات۔ ص۲۰۷)

---

105. ప్రయాణం నిజానికి ఓ పరీక్షలాంటిది. ప్రయాణావస్థలో మనిషి సాధారణంగా చెయ్యని పనులకు కూడా ఒడిగడతాడు. అతనిలో దైవ భావం సదా నిత్య నూతనంగా ఉంటే తప్ప తప్పుల నుండి తప్పించుకోలేడు. అందువల్లనే ప్రారంభంలో దాన్ని తాజాగా ఉంచేందుకు దైవాన్ని సంస్మరించుకుంటూ దైవం తనకై కల్పించిన సౌకర్యాల పట్ల కృతజ్ఞతా భావం తెలుపుకుంటూ బయల్దేరేవారు ప్రవక్త మహనీయులు.

107. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ ఉల్లేఖనం: ఒక వ్యక్తి వచ్చి ఇలా విన్నవించుకున్నాడు, "దైవ ప్రవక్తా, బాధలు, అప్పులు నా ప్రాణాన్ని తొలిచివేస్తున్నాయి." దానికి ఆయన, "నీవు విన్నవించుకుంటే అల్లాహ్ నీ కష్టాలను కడతేర్చేలా, నీ అప్పుల్ని తీర్చేలా చేసే వచనాలను నేర్పనా?" అని అడిగారు. "తప్పక దైవప్రవక్తా" అన్నాడతను. అప్పుడాయన ఇలా ఉపదేశించారు, "నీవు ఉదయం, సాయంత్రం ఇలా వేడుకో, "అల్లాహ్, నేను నీ రక్షణ కోరుతున్నాను - విచారం నుండి దుఃఖం నుండి కాపాడమని; అశక్తత నుండి అలసత్వం నుండి కాపాడమని; పిసినారితనం, పిరికితనాల నుండి రక్షించమని; నీ రక్షణకై వేడుకుంటున్నాను - అప్పులబారి నుండి, ఇతరులు నాపై ఆధిక్యత పొందకుండా కాపాడమని." ఆ వ్యక్తి తరువాత తెలిపాడు, "నేను ఆ విధంగానే చేశాను, దైవం నా బాధలను దూరం చేశాడు, నా అప్పులు తీరేమార్గం చూపాడు" అని. (అబూదావూద్, మిష్కాత్)

(۱۰۸) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَوْ اَنَّ اَحَدَكُمْ اِذَا اَرَادَ اَنْ يَّاْتِىَ اَهْلَهٗ قَالَ بِسْمِ اللّٰهِ اَللّٰهُمَّ جَنِّبْنَا
الشَّيْطٰنَ وَجَنِّبِ الشَّيْطٰنَ مَا رَزَقْتَنَا فَاِنَّهٗ اِنْ يُّقَدَّرْ بَيْنَهُمَا وَلَدٌ
فِىْ ذٰلِكَ لَمْ يَضُرَّهٗ شَيْطٰنٌ اَبَدًا۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ باب الدعوات)

108. దైవప్రవక్త ఇలా తెలిపారని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ ఉల్లేఖించారు, "మీలో ఎవరైనా తన భార్య వద్దకు పోయినప్పుడు ఇలా పఠిస్తే 'బిస్మిల్లాహి (దైవం పేరుతో), అల్లాహ్, మమ్మల్ని షైతాన్‌కు దూరంగా కాపాడు. నీవు ప్రసాదించే దాన్ని (సంతానాన్ని) షైతాన్‌కు దూరంగా కాపాడు" దైవం ఆ భార్యాభర్తలకు సంతానాన్ని ప్రసాదించగా షైతాన్ దానికి ఎలాంటి హాని కలగజెయ్యలేడు." (ముత్తఫకున్ అలైహ్)

---

ప్రయాణం నుండి తిరిగి రాగానే ప్రయాణమంతా సుఖవంతంగా ముగిసినందుకు కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటూ కూడా దుఆ చేసుకోవాలి. ఇంటి పెద్దలు అటు ప్రయాణానికి వెళ్ళినప్పుడు ఇంటివద్ద తమ వారి రక్షణకై దైవం తప్ప మరెవరూ

(۱۰۹) عَنْ اَبِیْ مَالِكٍ الْاَشْعَرِیْ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا وَلَجَ الرَّجُلُ بَیْتَهٗ فَلْیَقُلْ اَللّٰهُمَّ اِنِّیْ اَسْئَلُكَ خَیْرَ الْمَوْلَجِ وَخَیْرَ الْمَخْرَجِ بِسْمِ اللّٰهِ وَلَجْنَا وَعَلَی اللّٰهِ تَوَكَّلْنَا ثُمَّ یُسَلِّمْ عَلٰی اَهْلِهٖ۔

(رواه ابوداؤد۔ مشکوٰۃ۔ باب الدعوات۔ ص۲۰۰)

109. హజ్రత్ అబూ మాలిక్ అష్అరి ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు, మనిషి తన ఇంటిలో ప్రవేశించేటప్పుడు ఇలా పలుకుతూ ప్రవేశించాలని ఉపదేశించారు: "దేవా! నేను ఇంటిలో ప్రవేశించడమైనా, బయటికి వెళ్ళడమయినా శ్రేయస్కరమే కాగలగాలని నిన్ను అర్థిస్తున్నాను. మేము అల్లాహ్ పేరిట ప్రవేశిస్తున్నాము. అల్లాహ్‌నే మేము నమ్ముకున్నాము." ఆ తరువాత ఇంటివారికి సలాములు తెలుపుకుంటూ ప్రవేశించాలి.

(అబూదావూద్)

---

లేరన్న భావన అటు ప్రయాణీకుల్లోనూ ఇటు ఇంటివారిలోనూ స్పష్టంగా రూపుదిద్దుకుని ఉభయత్రా దైవం వైపునకు మరిలే సద్బుద్ధి కలగాలి.

106. దైవాన్ని విశ్వసించేవారు ఏది కోరుకున్నా దైవంతోనే కోరుకుంటారు. ప్రపంచాన్నీ, దాని సామగ్రినీ కోరుకున్నా పరలోక సాఫల్యం కొరకే కోరుకుంటారు. అలాగే కోరుకోవాలి అన్న భావం ఈ దుఆల్లో ద్యోతకమవుతోంది.

107. ఆపదల్లో ఉన్న మనిషి విశ్వాసి అయితే అతని అంతర్యం ఆర్ద్రమయి ఉంటుంది. అతనిలో దైవచింతన అధికమవుతుంది. అదే దైవ విశ్వాసం లేనివాడయితే ఆత్మహత్య చేసుకోవడమో, దౌర్జన్యాలకు పాల్పడడమో జరుగుతుంది. ప్రాపంచిక బాధలు మనిషిని ఏ అతివాదానికయినా తీసుకుపోగలవు. నేడు తీవ్రవాదులు, ఉగ్రవాదులుగా చెలామణీ అవుతున్న నక్సలైట్లు అధికాంశం నిజానికి ప్రాపంచిక బాధలు పడలేక అలా తయారయినవారే అంటే అందులో అతిశయోక్తి లేదు. అప్పుల భారాన్ని భరించలేక ఆత్మహత్యలకు పాల్పడినవారిని గురించి కూడా వార్తాపత్రికల్లో మనం వింటుంటాము. కారణం అదే - దైవ విశ్వాసం లేకపోవడం. దైవంపై భారంమోపే దైవ విశ్వాసి పరిస్థితుల్ని ధైర్యస్థయిర్యాలతో ఎదుర్కొంటాడు. దేవుడు సహాయపడి కష్టాల నుండి బయటపడే మార్గాలు స్ఫురింపజేస్తాడు. ఆ నమ్మకం ఉండాలి, మనిషి ఆయన వైపునకు మరలాలి - అదే కావలసింది.

108. భార్యతో కలవడం వెనకనూ దైవభావన ఉండాలని ఈ దుఆ నేర్పుతుంది.

(۱۱۰) عَنْ اُمِّ مَعْبَدٍ قَالَتْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اَللّٰهُمَّ طَهِّرْ قَلْبِىْ مِنَ النِّفَاقِ وَعَمَلِىْ مِنَ الرِّيَا وَلِسَانِىْ مِنَ الْكِذْبِ وَعَيْنِىْ مِنَ الْخِيَانَةِ فَاِنَّكَ تَعْلَمُ خَائِنَةَ الْاَعْيُنِ وَمَا تُخْفِى الصُّدُوْرُ۔ (رواه البيهقى۔ مشكوة۔باب جامع الدعاء)

110. దైవప్రవక్త (సఅసం) ఇలా వేడుకుంటూ ఉండగా నేను విన్నానని ఉమ్మెమా'బర్ (రజిఅన్హా) ఉల్లేఖించారు: "దేవా, నా అంతర్యాన్ని కాపట్యం నుండి, నా ఆచరణను ప్రదర్శనా బుద్ధి నుండి, నోటిని అబద్ధం నుండి, నా కంటిని దొంగ చూపు నుండి – పరిశుద్ధం చెయ్యి. నీవు నిస్సందేహంగా కండ్ల దొంగతనాన్ని, హృదయాల భేదాన్ని ఎరిగినవాడవు." (బైహకీ)

---

తల్లిదండ్రుల అభిప్రాయాలు, భావాలు, నమ్మకాలు, వారి సంతానంపై ప్రభావం చూపుతాయన్నది నేడు పరిశోధనలవల్ల ధృవపడిన విషయమే. తమ సంతానం మంచివారయి ఉండాలని కోరుకునే తల్లిదండ్రుల మానసిక స్థితిగతులు సదా దైవచింతనతో నిండి ఉంటే తప్ప అది సాధ్యం కాదని మనం తెలుసుకోవాలి.

109. తన సొంత ఇల్లయినా సరే ప్రవేశించే ముందు తన రాకకు సంకేతంగా సలామ్ చేసి మరీ ప్రవేశించాలన్నది దైవాదేశం. ఇక్కడ ప్రవక్త మహనీయులు ఆ ప్రవేశం శుభప్రదం కావాలని దైవాన్ని వేడుకుంటూ మరీ అడుగు వెయ్యడం మంచిదని బోధించారు. సదా దైవ చింతన మదిలో మెదలాలన్నదే దీనిలోని మర్మ హేతువు. ఇంటిలో తమ కొరకు సదా మంచి అన్నదే ఎదురు రావాలన్న ఆకాంక్ష ఈ అర్థింపు లేక వేడుకోలులో గోచరిస్తుంది.

110. సామాన్యంగా మనం అంతర్యంలో అనుకునేది, కళ్ళతో దొంగచాటుగా చూసేది ఎదుటివారికెవ్వరికీ గోచరించదు – ఒక్క దైవానికి తప్ప. అలా చేసే వ్యక్తి తాను అనుకున్న దానికి వ్యతిరేకంగా, చూసినదానికి భిన్నంగా అబద్ధం చెప్పే ఆస్కారముంది. ఈ పోకడ కాపట్యంతో కూడుకున్నది. ఈ హదీసులోని చివరి మాటలు, నీవు నిస్సందేహంగా కండ్ల దొంగచాటు చూపును, మనసులోని తలంపుల్ని ఎరిగినవాడవు అనేవి, దివ్య ఖుర్ఆన్లోనివి. ప్రవక్త మహనీయులు ఆ మాటలకు తగినట్లుగా ఓ వేడుకోలును, దుఆను బోధించి మనల్ని అబద్ధాన్నుండి, కాపట్యం నుండి కాపాడటానికి అర్థించాలని బోధించడం ద్వారా మనం వాటికి దూరంగా ఉండాలని కూడా పరోక్షంగా సెలవిచ్చారు.



# 5. నైతికత

(۱۱۱) عَنْ مَالِكٍ بَلَغَهٗ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بُعِثْتُ
لِاُتَمِّمَ مَكَارِمَ الْاَخْلَاقِ۔ (مؤطا امام مالک مجتبائی۔ صـ۳۶۴)

111. "నన్ను ఉత్తమ నైతిక ప్రమాణాల పరిపూర్ణతకై పంపడం జరిగింది" అని దైవ సందేశహరులు (సఅసం) పలికిన సమాచారం తనకు తెలిసిందని ఇమామ్ మాలిక్ (రహ్మ) ఉల్లేఖించారు. (ముఅత్తా ఇమామ్ మాలిక్)

(۱۱۲) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَكْمَلُ الْمُؤْمِنِيْنَ اِيْمَانًا اَحْسَنُهُمْ خُلُقًا۔ (ابو داؤد۔ مشکوٰۃ۔ باب حسن الخلق)

112. అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "విశ్వసించినవారిలో ఎవరయితే నైతిక ప్రవర్తనలో అందరికంటే ఉత్తముడో అతనే విశ్వాసంలోనూ పరిపూర్ణుడు." (మిష్కాత్)

---

111. నైతిక ప్రమాణాలంటే, ఓ పరిశుద్ధమయిన మానవ జీవితానికి, సదాచార సంపన్నమయిన మానవ సమాజానికి మూలమయిన ఉత్తమ నైతిక భావనలు, ఉన్నత నైతిక సూత్రాలు, శ్రేష్ఠమయిన గుణగణాలని అర్థం. ఈ 'ప్రమాణాల పరిపూర్ణత'కు భావమేమిటంటే, మహనీయ ముహమ్మద్ (సఅసం)కు పూర్వం దైవప్రవక్తలు, వారి సజ్జనులయిన అనుచరులు, అనుయాయులు, విభిన్న పరిస్థితులు, వివిధ కాలాల్లో, వివిధ జాతుల్లో వేర్వేరు దేశాల్లో ఉత్తమ నైతిక ప్రమాణాలను, వాటి విభిన్న కోణాలను తమ బోధనల ద్వారా విశదపరుస్తూవచ్చారు. తమ జీవితాల్లో ఆచరణాత్మకంగా ఆ గుణగణాలను నెలకొలుపుతూ వచ్చారు. వాటి ఆదర్శాలూ నిలిపారు. అయితే మానవ జీవితానికి సంబంధించిన సకల కోణాల నైతిక సూత్రాలను సంపూర్ణంగా విశదీకరించి, వాటికనుగుణంగా స్వయంగా తన జీవితాన్ని మలచుకోవడమే కాక వాటి ఆధారంగా ఓ సత్సమాజాన్ని, ఓ పరిపాలనా వ్యవస్థను, రాజ్య వ్యవస్థను స్థాపించి, నడిపించి చూపిన సమగ్రమయిన వ్యక్తి ఎవ్వరూ ఆవిర్భవించలేదు. ఈ మహత్కార్యం పశేషంగానే ఉండిపోయింది. దాన్ని పరిపూర్ణం గావించడమే ప్రవక్త మహనీయు (సఅసం)ల జీవితాశయం.

(۱۱۳) عَنْ اَبِیْ اُمَامَۃَ اَنَّ رَجُلاً سَاَلَ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَ سَلَّمَ مَا الْاِیْمَانُ قَالَ اِذَا سَرَّتْکَ حَسَنُتُکَ وَسَاءَتْکَ سَیِّءُکَ فَاَنْتَ مُؤْمِنٌ قَالَ یَارَسُوْلَ اللّٰہِ فَمَا الْاِثْمُ قَالَ اِذَا حَاکَ فِیْ نَفْسِکَ شَیْءٌ فَدَعْہُ۔ (رواہ احمد۔ مشکوٰۃ۔ کتاب الایمان ص)

113. అబూ ఉమామ ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త (సఅసం)ను "ఈమాన్ (విశ్వాసం) అంటే ఏమిటి?" అని ప్రశ్నించాడు. దానికి ఆయన "మంచి పని చేసి నీవు ఆనందానుభూతి పొందితే, చెడు పని వల్ల నీకు ఆవేదన కలిగితే అప్పుడు నీవు విశ్వసించినవాడివి (మోమిన్)." ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు, "దైవ సందేశహరా, పాపం అని దేన్నంటారు?" అని. దానికి ఇలా నుడివారు, "నీ మనసులో ఏదయినా జంకు కలిగితే ఆ పనిని మానెయ్యి." (మిష్కాత్)

---

మహనీయ ముహమ్మద్ స్వయంగా ఈ కార్యమే తన ఆవిర్భావానికి అసలు ధ్యేయమని చెప్పారు. అంటే అది ఏదో రెండవ శ్రేణి పని కాదు. ఆయన జీవిత ధ్యేయం మరొకటి కాదు. ఆయన్ని పంపిన అసలు ఉద్దేశ్యం ఇదే అన్నది ఈ హదీసు ద్వారా ద్యోతకమవుతోంది.

112. దైవ విశ్వాసం, ప్రవక్త పట్ల, పరలోకం పట్ల విశ్వాసం - ఈమాన్, దాని ముఖ్యాంశాలు, ఆరాధనలు, వాటి నియమాలు అన్నీ ఈమాన్ లేక విశ్వాసంలోని అంతర్భాగాలే. అయితే విశ్వాస సౌధాన్ని పరిపూర్ణం చేసేది మనిషిలోని నైతిక వర్తనం, నీతి, నడవడులే అని దీని ద్వారా మనకు తెలుస్తోంది.

113. ప్రశ్నించిన వ్యక్తి ఉద్దేశ్యాన్ని బట్టి సమాధానాలివ్వడం ప్రవక్త మహనీయుల విశిష్టత. అది తెలియనివారు ప్రశ్నేమిటి, సమాధానమేమిటి అని ఆశ్చర్యపోతారు. 'విశ్వాసం' అన్నది మనసులో తిష్టవేసుకుంటే దానికి సంకేతంగా మనిషిలో కొన్ని గుణాలు, లక్షణాలు బహిర్గతమవుతాయి. అలాంటి మౌలికమయినవాటినే ప్రవక్త మహనీయులు ఇక్కడ ప్రస్తావించారు. మంచి పని చేసి ఆనందానుభూతి కాక విచారం కలుగుతుందా అని ఎవరయినా అడుగవచ్చు. కాని దానధర్మాలు చేసి, ప్రజలకు సేవ చేసి 'మా డబ్బు పోయిందే,నేనింత సేవ చేసినా కృతజ్ఞత లేదే' అని వాపోయేవారు మన సమాజంలో తారసపడరని గుండెపై చెయ్యి వేసుకుని చెప్పలేము. అలాగే దుష్టకార్యం చేసి అంటే అబద్ధం చెప్పి, మోసం చేసి, మరే నీచమయిన పనయినా చేసి లోలోపల ఆనందపడేవారూ ఉన్నారు. అందువల్లనే ఈ ప్రమాణాన్ని ప్రవక్త మహనీయులు

(۱۱۴) عَنْ عَطِيَّةَ السَّعْدِيِّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَبْلُغُ الْعَبْدُ اَنْ يَّكُوْنَ مِنَ الْمُتَّقِيْنَ حَتّٰى يَدَعَ مَا لَا بَأْسَ بِهٖ حَذَرًا لِمَا بِهٖ بَأْسٌ۔ (ترمذی۔ مشکوٰۃ ص ۲۴۲۔ باب الکسب وطلب الحلال)

114. అతియ సఅదీ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు ఇలా బోధించారు: "మనిషి భయభక్తులు గలవారి స్థాయిని పొందాలంటే, అతను అభ్యంతరకరమయిన వాటిలో పడిపోతానేమోనన్న భయంతో, అభ్యంతరం లేనివిగా అగుపించేవాటిని వదలుకోనంతవరకు అది సాధ్యపడదు."

(తిర్మిజి, మిష్కాత్)

(۱۱۵) عَنْ عَائِشَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ يَا عَائِشَةُ اِيَّاكِ وَمُحَقَّرَاتِ الذُّنُوْبِ فَاِنَّ لَهَا مِنَ اللّٰهِ طَالِبًا۔ (رواہ ابن ماجہ مشکوٰۃ۔ باب البکاء)

115. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రబోధించినట్లు హజ్రత్ ఆయిషా (రజి) ఉల్లేఖించారు: "ఆయిషా, అత్యల్పమయిన పాపాలకూ దూరంగా ఉండు. ఎందువల్లనంటే వాటిని గురించి కూడా దైవం సమక్షంలో ప్రశ్నించడం జరుగుతుంది." (ఇబ్నుమాజ, మిష్కాత్)

---

చూపారు. అలాగే ఒక పని చేస్తూ మనసు దాన్ని సంతోషంగా స్వీకరించక అందులో ఏదో చెడు ఉందన్న అనుభూతికి గురయితే అదే పాపానికి రూపమని చెప్పడం కూడా ఎంతో విజ్ఞతతో కూడుకున్న విషయం. ఇక్కడ ఓ విషయం గుర్తుంచుకోవలసి ఉంటుంది. మంచీ చెడుల ఈ ప్రమాణం, మనిషి అంతరాత్మ సజీవంగా ఉండి, అతని నిజ ప్రవృత్తి వాతావరణంలోని దుష్ప్రభావాల కారణంగా, అతని చెడు నడత మూలంగా నమసిపోకుండా ఉన్న సందర్భంలోనే వర్తిస్తుంది.

114. దైవంపై నమ్మకమున్న ప్రతి మనిషి ఆయన పట్ల భయభక్తులు గలవారిలో తానూ పరిగణించబడాలని కోరుకుంటాడు. అలాంటి వ్యక్తి ఈ నియమాన్ని పాటించాలి. కొన్ని పర్యాయాలు ధర్మసమ్మతమయిన విషయాలు కూడా అధర్మ కార్యాలకు మార్గాలయిపోతాయి. అందువల్ల విశ్వసించిన వ్యక్తి కేవలం ఒక విషయం అనుమతించబడిందా లేదా అన్నదే కాదు. ఈ సమ్మతమయిన పని కూడా అధర్మ కార్యానికి మూలమవుతుందా అన్న విషయాన్నీ పరిశీలించి జాగ్రత్తగా మసలు కోవాలి.

(۱۱۶) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
اِنَّ نَفْسًا لَنْ تَمُوْتَ حَتّٰی تَسْتَكْمِلَ رِزْقَھَا اَلَا فَاتَّقُوا اللّٰہَ وَاَجْمِلُوْا فِی الطَّلَبِ
وَلَا یَحْمِلَنَّكُمْ اِسْتِبْطَاءُ الرِّزْقِ اَنْ تَطْلُبُوْہُ بِمَعَاصِی اللّٰہِ، فَاِنَّہٗ لَا یُدْرَكُ
مَا عِنْدَہٗ اِلَّا بِطَاعَتِہٖ ۔ (مشکوۃ-ج ۲-ص ۴۵۲)

116. హజ్రత్ అబ్దుల్లా ఇబ్ను మస్ఊద్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, “ఏ వ్యక్తి అయినా దైవం నిర్ణయించిన ఉపాధిని పూర్తిగా పొందకుండా మృత్యువును సమీపించడు. వినండి, దైవభీతితో మెలగండి. ఉపాధి సాధనలో ధర్మ సమ్మతమయిన మార్గాలను అవలంబించండి. ఉపాధిని పొందడంలో ఆల స్యం వల్ల మీరు అధర్మ మార్గాలనవలంబించేందుకు పాల్పడరాదు. ఎందు వల్లనంటే దైవం వద్ద ఉన్నదేదయినా ఆయన విధేయత ద్వారానే సాధించ వీలవుతుంది.” (మిష్కాత్)

---

115. విశ్వాసమున్నప్పటికీ పెద్ద పాపం వల్ల పరలోక మోక్షం ఒక్కోసారి ప్రమాదానికి గురైనట్లు చిన్న చిన్న పాపాల వ్యవహారం కూడా ప్రమాదకరమయిందే. చిన్న తప్పు చూడడానికి చిన్నదిగానే అగుపిస్తుంది. కాని దాన్ని మాటిమాటికీ చేస్తూ ఉంటే అంతర్యం తుప్పుపట్టిపోతుంది. చెడుల పట్ల, పెద్ద పాపాల పట్ల అసహ్యత, ఏహ్యాభావాలు తగ్గిపోతాయి. హాఫిజ్ ఇబ్ను కయ్యిమ్ ఓ చోట ఇలా వ్రాశారు: “పాపం ఎంత చిన్న దయిందో చూడకండి. ఎవరి అవిధేయతకు ఒడిగడుతున్నామో ఆ దైవం గొప్ప దనాన్ని దృష్టిలో ఉంచుకోండి.”

తీర్పు దినపు యజమాని గొప్పదనం, ఆయన ఇచ్చే శిక్ష భయంకర రూపం ముం దుంటే అత్యంత చిన్న పాపం చేసేందుకు కూడా మనిషి సాహసించలేడు.

116. ఈ హదీసులో కొన్ని వాస్తవాలను వెల్లడించడం జరిగింది:

(1) మనిషికి సృష్టికర్త నిర్ణయించిన ఆహారం పూర్తికానంతవరకు అతన్ని ఏ శక్తి అంతమొందించజాలదు. అలాగే ఆ పరిమితి ముగియగానే మరే శక్తి కూడా అతన్ని నిలపజాలదు.

(2) ఒకవేళ ఎప్పుడయినా మనిషికి ఉపాధి సముపార్జనలో నిష్ఫలత కలిగినా లేదా ఆలస్యం జరిగినా అతను నిరాశకు గురికారాదు. దైవం

(۱۱۷) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مَسْعُوْدٍ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ لَا يَكْسِبُ عَبْدٌ مَالَ حَرَامٍ فَيَتَصَدَّقُ مِنْهُ فَيُقْبَلُ مِنْهُ
فَيُبَارَكُ لَهٗ فِيْهِ وَلَا يَتْرُكُهٗ خَلْفَ ظَهْرِهٖ اِلَّا كَانَ زَادَهٗ اِلَى النَّارِ
اِنَّ اللّٰهَ لَا يَمْحُو السَّيِّئَ بِالسَّيِّئِ وَلٰكِنْ يَمْحُو السَّيِّئَ بِالْحَسَنِ اِنَّ الْخَبِيْثَ
لَا يَمْحُو الْخَبِيْثَ ۔ (رواہ احمد مشکوٰۃ۔ باب الکسب ص ۲۴۲۔ مطبوعہ اصح المطابع)

117. హజ్రత్ అబ్దుల్లా ఇబ్ను మస్ఊద్ (రజిఅన్), దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారని ఉల్లేఖించారు: "ఇలా జరగడం అసంభవం. ఒక వ్యక్తి అధర్మ సంపాదన ఆర్జించి అందులో నుంచి దానం చేస్తే దాన్ని స్వీకరించటం, అతని ధనంలో శుభలాభాలు ప్రసాదించటం అన్నది ఎన్నటికీ జరగదు. అతను వదలి (చని)పోయే ఆస్తి అతన్ని కేవలం నరకానికి గొనిపోయే దారి ఖర్చుగా పరిణమిస్తుంది. అల్లాహ్ విధానం ఏమిటంటే ఆయన చెడును చెడు ద్వారా నివారించడు. ఆయన చెడును మంచి ద్వారా రూపుమాపుతాడు, మలినాన్ని మలినం ద్వారా ప్రక్షాళన చేసి పరిశుద్ధతను పొందలేము."

(మిష్కాత్)

---

తరఫున ఏ ఉపాధి అయితే అతనికి కేటాయించడం జరిగిందో అది ఆలస్యంగానైనా సరే అతనికి లభించి తీరుతుంది.

(3) ఒక్కోసారి మనిషి దైవధిక్కార వైఖరినవలంబిస్తూ కూడా బాహ్య పరమయిన సుఖశ్రేయాలు, భోగభాగ్యాల జీవితం గడుపుతున్నట్లు అగుపిస్తుంది. కాని వాస్తవానికి ఇది దైవం తరఫున ఇవ్వబడిన వ్యవధి. ఆ తరువాత ఇక దైవం తరఫున శిక్ష విఘాతాలే ప్రాప్తమవుతాయి. నిజమైన ఆనందం, శాంతి శ్రేయాలు, దైవవిధేయతను పాటిస్తూ ప్రాప్తమయినవే!

117. అతని ఆస్తి అతనికి నరకానికి గొనిపోతుందంటే భావం ఆ ధనం, ఆ సంపాదన వల్ల పరలోకంలో శుభశ్రేయాలు, సాఫల్యం ప్రాప్తం కావని అర్థం. మలినాన్ని మలినం ద్వారా పరిశుద్ధపరచలేమన్నది ఓ యదార్థం. దాన్ని ఇక్కడ ఉదాహరిస్తూ దైవప్రవక్త (సఅసం) కేవలం లక్ష్యశుద్ధి ఉన్నంత మాత్రాన సరిపోదు, దానితోపాటు సాధనాలు మార్గాల పరిశుద్ధత కూడా అవసరమే అని తెలపడం ఈ హదీసు ఉద్దేశ్యం.

(۱۱۸) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ لَا يَظْلِمُهُ وَلَا يَخْذُلُهُ وَلَا يَحْقِرُهُ التَّقْوٰى هٰهُنَا وَيُشِيرُ إِلٰى صَدْرِهِ ثَلٰثَ مِرَارٍ بِحَسْبِ امْرَءٍ مِنَ الشَّرِّ أَنْ يَحْقِرَ أَخَاهُ الْمُسْلِمَ كُلُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ حَرَامٌ دَمُهُ وَمَالُهُ وَعِرْضُهُ

(رواه مسلم۔ مشکوٰۃ باب الشفقۃ ص ۴۱۴)

118. హ|జత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు, "“ఒక ముస్లిమ్ వ్యక్తి, మరో ముస్లిమ్ వ్యక్తికి సోదర సమానుడు. అతనికి అన్యాయం చెయ్యరాదు, అతన్ని నిస్సహాయకునిగా వదలి పెట్టనూ రాదు. 'తక్వా' (నిష్ఠ) అన్నది ఇక్కడ ఉంటుంది" (అంటూ ఆయన మూడు పర్యాయాలు) తన గుండె వైపు సైగ చేస్తూ ఇలా నుడివారు, 'మనిషి చెడుకు లోనవడానికి అతను ముస్లిమ్ సోదరుని అల్పునిగా భావించడం చాలు, ప్రతి ముస్లిం రక్తం, ధనం, మానం ముస్లిము లందరికీ హరామ్ (నిషిద్ధం).' (మిష్కాత్)

(۱۱۹) عَنِ الْحَسَنِ بْنِ عَلِيٍّ قَالَ حَفِظْتُ مِنْ رَسُولِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ دَعْ مَا يُرِيبُكَ إِلٰى مَا لَا يُرِيبُكَ فَإِنَّ الصِّدْقَ طُمَأْنِيْنَةٌ وَالْكِذْبُ رِيْبَةٌ۔ (رواه الترمذی۔ مشکوٰۃ۔ باب الکسب ۲۴۲)

119. హ|జత్ హసన్ బిన్ అలీ (రజిఅన్) ఉల్లేఖనం: "నేను ప్రవక్త మహనీ యుని నోట ఈ వచనాలు విని కంఠస్థం చేసుకున్నాను, “అనుమానాస్పద మయిన విషయాన్ని వదలి అన్ని శంకలకు సందేహాలకు తావివ్వని విష యాన్ని (ఆచరణకు) ఇష్టపడండి. ఎందువల్లనంటే సత్యం సదా సంతృప్తి స్వరూపం, అసత్యం నిత్యం సంశయ పూరితం." (తిర్మిజి, మిష్కాత్)

(١٢٠) عَنْ اَسْمَاءَ بِنْتِ يَزِيْدَ اَنَّهَا سَمِعَتْ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اَلَا اُنَبِّئُكُمْ بِخِيَارِكُمْ قَالُوْا بَلٰى يَا رَسُوْلَ اللّٰهِ قَالَ خِيَارُكُمُ الَّذِيْنَ اِذَا رُءُوْا ذُكِرَ اللّٰهُ. (رواه ابن ماجه. مشکوٰة ـ باب الحب ـ ص ٤١٩)

120. అస్మా బిన్తెయజీద్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ఆమె ప్రవక్త మహ నీయులు (సఅసం) ఇలా ప్రవచించగా విన్నారు: "ఉత్తమమయిన మనిషి ఎవరో మీకు తెలుపనా?" దానికి అక్కడున్న వారు 'తప్పక, ఓ దైవ ప్రవక్తా!' అని అర్ధించారు. అప్పుడాయన ఇలా నుడివారు, "ఎవరిని చూడ గానే దైవం గుర్తుకు వస్తాడో అతనే మీలో ఉత్తమ మయిన వ్యక్తి."

(ఇబ్నుమాజ - మిష్కాత్)

---

118. (1) ఇస్లామీయ సౌభ్రాత్రత తెలిపేదేమిటంటే మనిషి తన సోదరునిపై తానూ అత్యాచారం జరపరాదు, అతను అత్యాచారుల పాలయ్యేలానూ చెయ్యరాదు. తన ఐశ్వర్యం కారణంగా, శారీరక దౌర్జ్యం కారణంగా, వంశోన్నతి మూలంగా, జ్ఞానాధిక్యత వల్ల ఇతర సోదరుణ్ణి తనకంటే అల్పునిగా భావించరాదు.

(2) 'తక్వా' (ధర్మనిష్ఠ) అన్నదానికి ఆంతర్యమే కేంద్రం. మనోభూమిలో 'తక్వా' బీజం నాటుకుంటే మనిషి బాహ్యం కూడా సత్కర్మలతో సస్యశ్యామలంగా అలరారుతుంది. కాని ఒకవేళ ఆంతర్యంలోనే ధర్మనిష్ఠకు స్థానం లేకపోతే బాహ్యంలో ఎన్ని నిష్ఠాగరిష్ఠ చిహ్నాలు రూపుదిద్దుకున్నా స్వభావ స్వరూపాల్లో ఆహ్లాదకరమైన పరివర్తన రాదు. పరలోకమూ బాగుపడదు.

(3) ముస్లిం సమాజంలో ఒక ముస్లిం వ్యక్తి ధనమాన ప్రాణాలపై దాడి జరపడం కఠిన శిక్షకు దారితీస్తుంది, ఇహంలోనూ పరంలోనూ.

119. ఏ విషయంలోనయితే మనిషికి సంతృప్తి, సంతుష్టి ప్రాప్తిస్తాయో అదే సత్యమని ధర్మమని, మనిషిని కళవళ పెట్టేది, వ్యాకుల పరిచేది, సందిగ్ధావస్థలోకి నెట్టివేసేది ఎంత మాత్రం సత్యధర్మం కాజాలదని ప్రవక్త మహనీయుని చివరి సూక్తి తెలియపరుస్తోంది. ఈ హదీసు ద్వారా తెలుసుకోవలసిన ముఖ్య విషయం ఏమిటంటే, ఏ వ్యవహారమయినా ఆధారాల ద్వారా సందేహాస్పదంగా ఉన్న పక్షంలో, లేదా అది ధర్మమయినదో కాదో అన్న విషయం ప్రస్ఫుటమయి ముందుకు రాకపోయిన పక్షంలో సందేహాలు, శంకలకు లోనయి సందిగ్ధావస్థకు గురికావడానికి బదులు, కనీసం బలమయిన అంచనా ఆధారంగా నమ్మకం కుదిరిన మార్గంలో అడుగువెయ్యడం ఉత్తమం. అయితే అనవసరంగా లేనిపోని అపోహలకు లోనయి కుశంకల్ని, అనుమానాన్ని

(۱۲۱) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا دَخَلَ اَحَدُکُمْ عَلٰی اَخِیْهِ الْمُسْلِمِ فَلْیَاْکُلْ مِنْ طَعَامِهٖ وَلَا یَسْئَالْ وَیَشْرَبْ مِنْ شَرَابِهٖ وَلَا یَسْئَالْ - (رواه البیهقی - مشکٰوة ج ۲ - ص ۲۷۹)

121. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖించారు, "మీలో ఎవరయినా తన ముస్లిం సోదరుని వద్దకు పోయినట్లయితే అతని భోజనంలో నుండి భుజించాలి. ఆరాతీయ నవసరంలేదు. అతను త్రాగే పదార్థంలో నుంచి త్రాగాలి, కూపీ లాగరాదు." (బైహకి, మిష్కాత్)

(۱۲۲) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَجُلٌ یَارَسُوْلَ اللّٰهِ اَعْقِلُهَا وَاَتَوَکَّلُ اَوْ اُطْلِقُهَا وَاَتَوَکَّلُ ؟ قَالَ اِعْقِلْهَا وَتَوَکَّلْ - (ترمذی ج ۲ ص ۷۸)

122. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుల సన్నిధిలోకి హాజరయి, దైవప్రవక్తా, నేను ఒంటెను కట్టివేసి దైవంపై భారం మోపనా లేక వదిలేసి దైవాన్ని నమ్ముకోవాలా? అని అడిగాడు. ప్రవక్త మహనీయులు దాన్ని కట్టివేసి ఆ తరువాత దైవంపై భారం పెట్టుకో అని అతనికి ప్రబోధించారు. (తిర్మిజి)

---

సృజించాలని దీని అర్థం కాదు. హదీసులోని ఆదేశం కేవలం నిజంగానే అనుమానాస్పద వ్యవహారం ముందుకు వచ్చినప్పటి పరిస్థితులకు వర్తిస్తుంది.

120. మనిషి ఆంతర్యంలో భయభక్తుల వసంతం వెల్లివిరియగానే దాని ప్రభావాలు బయల్పడనారంభిస్తాయి. విశ్వసించిన మనిషిలోని వివేచన, విచక్షణా జ్ఞానం అతను ధర్మ పురుషుడని గుర్తింపజేస్తాయి. అతనిలోని భయభక్తులే అతని పరిసరాలను సయితం ప్రభావితం చేశాయని తెలిసిపోతుంది.

121. అంటే మంచి నమ్మకముంచి ముస్లిమ్ సోదరుడు అందజేసిన కానుకను గురించి, లేదా విందుభోజన సందర్భంలో ఆ భోజనం గురించి ధర్మాధర్మాల ప్రశ్నను లేవనెత్తరాదని దీని భావం. ఒక ముస్లిం తాను సయితం హలాల్ భోజనమే భుజిస్తూ తన మిత్రులు, సోదరులకు సయితం హలాల్, పరిశుద్ధమైన ఆహారాన్నే అందజేస్తాడని ఆశించాలి.

(۱۲۳) عَنْ عُمَرَ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ لَوْ اَنَّكُمْ تَتَوَكَّلُوْنَ عَلَى اللّٰهِ حَقَّ تَوَكُّلِهٖ لَرَزَقَكُمْ كَمَا يُرْزَقُ الطَّيْرُ تَغْدُوْ خِمَاصًا وَتَرُوْحُ بِطَانًا۔ (ترمذی۔ مشکوٰۃ۔ باب التوکل ص۴۵۲)

123. దైవప్రవక్త ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నానని హజ్రత్ ఉమర్ (ర.అ) ఉల్లేఖించారు: "మీరు అల్లాహ్‌పై భారం మోపవలసిన రీతిలో ఆయన్ని నమ్ముకుంటే ఆయన మీకు ఉపాధినిస్తాడు. పక్షులకు ఉపాధి లభించే రీతిలోనే మీకూ లభిస్తుంది. అవి ప్రాతఃకాలాన పరిగడుపున తమ గూళ్ళనుండి బయల్దేరుతాయి, సాయంత్రానికి సుష్టిగా భుజించి మరీ తిరిగి వస్తాయి." (తిర్మిజి, మిష్కాత్)

(۱۲۴) عَنْ عَوْفِ بْنِ مَالِكٍ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَضٰى بَيْنَ رَجُلَيْنِ فَقَالَ الْمَقْضِيُّ عَلَيْهِ لَمَّا اَدْبَرَ قَالَ حَسْبِيَ اللّٰهُ وَنِعْمَ الْوَكِيْلُ فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اللّٰهَ تَعَالٰى يَلُوْمُ عَلَى الْعَجْزِ وَلٰكِنْ عَلَيْكَ بِالْكَيْسِ فَاِذَا غَلَبَكَ اَمْرٌ فَقُلْ حَسْبِيَ اللّٰهُ وَنِعْمَ الْوَكِيْلُ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب الاقضیہ)

124. ఔఫ్ బిన్ మాలిక్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు ఇద్దరు వ్యక్తులమధ్య తీర్పు చేశారు. ఎవరికి ప్రతికూలంగా తీర్పు జరిగిందో అతను వెనుదిరుగుతూ 'హస్బియల్లాహు వ నీ'మల్ వకీల్' అని పలికాడు. అప్పుడు దైవ సందేశహరులు ఇలా ప్రబోధించారు, "దైవం దృష్టిలో అధైర్యపడటం గర్హనీయమయింది. నీవు మంచి ధైర్యస్థైర్యాలతో వ్యవహరించవలసింది. అప్పటికీ నీవు పరాధీనుడవయితే అప్పుడు అనవచ్చు- 'హస్బియల్లాహు వ నీ'మల్‌వకీల్' అని." (అబూదావూద్, మిష్కాత్)

---

122. దైవంపై భారం మోపడమంటే కొందరు చేతులు ముడుచుకు కూర్చోవడమని భావిస్తారు. అది సరయిన భావన కాదు. మనిషి తాను చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చేసి, తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకుని, ఆ తరువాత తన కార్యఫలితాన్ని దైవానికి వదిలేసి 'భారం ఆయనపై మోపాన'ని అంటే అందులో అర్థముంది. ప్రపంచం

(۱۲۵) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ حَسْبُنَا اللّٰهُ وَنِعْمَ الْوَكِيْلُ قَالَهَا اِبْرَاهِيْمُ حِيْنَ اُلْقِيَ فِى النَّارِ وَقَالَ مُحَمَّدٌ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حِيْنَ قَالُوْا اِنَّ النَّاسَ قَدْ جَمَعُوْا لَكُمْ فَاخْشَوْهُمْ فَزَادَهُمْ اِيْمَانًا، وَقَالُوْا حَسْبُنَا اللّٰهُ وَنِعْمَ الْوَكِيْلُ۔ (صحیح البخاری)

125. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించారు: "హస్బునల్లాహు వ నీ'మల్ వకీల్' (దేవుడే మాకు చాలు, ఎంతచక్కగా పనులు చక్కబరిచేవాడాయన!) అనే వచనాన్ని హజ్రత్ ఇబ్రాహీమ్ తనను అగ్నిలో పడవేసినప్పుడు అన్నాడు. దాన్ని మహనీయ ముహమ్మద్ (సఅసం) కూడా పలికారు. (ముస్లిములతో) మీ శత్రుజనం మిమ్మల్ని ఎదిరించడానికి సమాయత్తమవుతున్నారని, వారికి భయపడండని (జనులు) అన్నప్పుడు ముస్లిముల దైవ విశ్వాసం ఇతోధికమయింది. వారప్పుడు అన్నారు: హస్బునల్లాహు వ నీ'మల్ వకీల్ అని." (సహీహ్ అల్ బుఖారి)

---

క్రియారంగం. ఇక్కడ చేసుకున్నవారికి చేసుకున్నంత! ఫలితం మటుకు దైవానికే హస్తగతమయి ఉంటుందని, కృషి చేసి చేపట్టిన కార్యం నెరవేర్చడం ఆయన కరుణానుగ్రహంవల్లనే సాధ్యమని నమ్మాలి.

123. పిచ్చుకలు, పక్షుల ఉపమానం ప్రస్తావించడానికి కారణం వాటి జీవన సరళియే. అవి కడుపు నిండా భుజిస్తాయి కాని నిలువ ఉంచుకోవు. ఏ దినం భుక్తి ఆ రోజు సంపాయించుకోవలసిందే. 'ఈనాడు కడుపు నింపిన ప్రభువు రేపు కూడా మార్గం చూపుతాడు' అన్న తృప్తి సంతుష్టితో నిద్రపోవడం, తిరిగి తెల్లవారగానే తమ ప్రయత్నంలో ఎలాంటి లోటురానివ్వకుండా కృషి ప్రారంభించడం ఉపాధి అన్వేషణలో బయల్దేరడం, వాటి దిన చర్య. మనిషి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడం దైవంపై భారం మోపడం అనిపించుకోదు, దైవం ప్రసాదించిన సాధనా సంపత్తిని వినియోగించుకుని కృషి చేసి ఫలితాన్ని దైవానికి వదలి వెయ్యడం "తవక్కుల్" లేక దైవంపై భారం మోపడం అనిపించుకుంటుంది.

124. "హస్బియల్లాహు వ నీమల్ వకీల్" దైవమే నాకు చాలు, ఆయన్నే అందరినీ మించిన అత్యుత్తమ సంరక్షకుడు, సహాయకుడు అని అర్థం. ఇక్కడ ఒక పరాజయానికే అధైర్యపడనవసరం లేదు, పరిస్థితుల్ని ఎదుర్కొని చివరి వరకు కృషి చేసి పరాజయాన్నే చవిచూడవలసి వస్తే అప్పుడు భారం దైవంపై మోపి శాంతించవచ్చు అని హదీసు భావం.

(۱۲۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَلطَّاعِمُ الشَّاكِرُ كَالصَّائِمِ الصَّابِرِ ۔ (رواه الترمذی۔ مشکوٰۃ)

126. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, "కృతజ్ఞతా భావంతో భుజించే వ్యక్తి కూడా సహన భావంతో రోజా (ఉపవాస) వ్రతం పాటించే వ్యక్తికి సమానము"ని ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రవచించారు.
(తిర్మిజి, మిష్కాత్)

(۱۲۷) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اُنْظُرُوْا اِلٰى مَنْ هُوَ اَسْفَلُ مِنْكُمْ وَلَا تَنْظُرُوْا اِلٰى مَنْ هُوَ فَوْقَكُمْ فَهُوَ اَجْدَرُ اَنْ لَا تَزْدَرُوْا نِعْمَةَ اللهِ عَلَيْكُمْ وَفِیْ رِوَايَةٍ لِمُسْلِمٍ اِذَا نَظَرَ اَحَدُكُمْ اِلٰى مَنْ فُضِّلَ عَلَيْهِ فِی الْمَالِ وَالْخَلْقِ فَلْيَنْظُرْ اِلٰى مَنْ هُوَ اَسْفَلُ مِنْهُ ۔ (مسلم۔ مشکوٰۃ)

127. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించినట్లుంది: "మీలో అధమస్థితిలో ఉన్నవారిని మీరు చూడండి, మీ కంటె ఉన్నత స్థాయిలో ఉన్నవారిని చూడకండి. తద్వారా మీరు దేవుని అనుగ్రహాలను హీనంగా చూడరు." సహీహ్ ముస్లింలోని మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది: "మీలో ఎవరి చూపయినా తన కంటే సంపదలోనూ, శారీరక దారుఢ్యంలోను ఆధిక్యత గల వానిపై పడితే అతను తనకంటే అధముడయిన వాడని గమనించాలి."
(ముస్లిం, మిష్కాత్)

---

125. తన బాగోగులను గురించి కనిపెట్టుకుని ఉన్న స్వామిపై భారం మోపి రుజుమార్గాన పయనించడమే నిజమయిన విశ్వాసి అవలంబించవలసిన విధానం. ఆ మార్గాన ఆపదలు ఎదురయినా తన ప్రయత్నం చేసుకుంటూ పోయి ఆయనపై భారం మోపినట్లయితే ఆయన తన దాసునికి నిరాశకు లోనవనివ్వడు. అయితే చిత్తశుద్ధితో, సంకల్ప నిరతితో ఆయన మార్గాన్నే అవలంబించడం తప్పనిసరి. హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్)ని మంటల్లో వేసినప్పుడు ఆ దాసునికి ఇక మిగిలిందేమిటి? ఆయన సంకల్పబలమే పరీక్షలో ఆయన్ని నెగ్గించింది. అంతిమ

(١٢٨) عَنْ صُهَيْبٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَجَبًا لِاَمْرِ الْمُؤْمِنِ اِنَّ اَمْرَهٗ كُلَّهٗ لَهٗ خَيْرٌ وَّلَيْسَ ذٰلِكَ اِلَّا لِلْمُؤْمِنِ اِنْ اَصَابَتْهُ ضَرَّآءُ صَبَرَ فَكَانَ خَيْرًا لَّهٗ وَاِنْ اَصَابَتْهُ سَرَّآءُ شَكَرَ فَكَانَ خَيْرًا لَّهٗ.

(صحیح مسلم ۔ مشکوٰۃ ۔ باب التوکل ۔ ۴۵۲)

128. హజ్రత్ సుహైబ్ (రజిఅన్) ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "మోమిన్ వ్యవహారం విచిత్రమయింది. అతను చేసే ప్రతి పనీ శుభకరమయిందే. ఈ శుభం ఒక్క మోమిన్‌కు తప్ప మరెవరికీ లభించలేదు. అతనికి బాధకలిగితే సహనం వహిస్తాడు. అదీ అతనికి శుభంగా పరిణమిస్తుంది. సంతోషం కలిగితే దైవ కృతజ్ఞతా భావంలో మునిగిపోతాడు, అదీ అతనికి శుభమే కలగజేస్తుంది. అంటే అతను సర్వావస్థల్లోనూ శుభాన్నే ప్రోగు చేసుకుంటాడు." (సహీహ్ ముస్లిం)

---

దైవప్రవక్త, ఆయన అనుచరగణం కూడా దైవమార్గాన చెయ్యవలసిన కృషి చేసి భారం ఆయన పైనే మోపారు. ఆ కష్టాల కడలిని విజయవంతంగా ఈదుకు వచ్చినందుకే నేడు దైవధర్మమయిన ఇస్లాం మనవరకు చేరింది.

126. ఇక్కడ వచ్చింది అదనపు (నఫిల్) రోజాల ప్రస్తావన. అంటే నఫిల్ రోజా పాటిస్తూ అన్నిటా సహన స్థయిర్యాలు కనబరిచేవాడయినా, ధర్మ సమ్మతమయిన భోజనం తింటూ దైవానికి కృతజ్ఞతలు తెలుపుకునే వ్యక్తి అయినా, సహనం, కృతజ్ఞతా భావం కారణంగా దైవం దృష్టిలో సమానులే.

127. మనిషిలో ఈర్ష్య, ద్వేషం, ఆత్మ న్యూనతా భావం, ఇత్యాదివి జనించడానికి కారణం అతను తనకంటే అధిక స్థాయిలో నుండేవారిని చూడటమే. దానికి బదులు మనిషి తనకంటే తక్కువ స్థాయిలో నున్న వారిని పరిశీలించడం మొదలెడితే అతనిలో దైవం పట్ల కృతజ్ఞతా భావం జనించడమే కాక, తనకు దైవం ప్రసాదించిన వరాల విలువ అవగతమవుతుంది. తనకు ఇతరులకన్నా ఎన్ని వరాలు అధికంగా దేవుడు అనుగ్రహించాడో ద్యోతకమవుతుంది. దైవం పట్ల కృతజ్ఞతా భావం, తన శక్తి సామర్థ్యాల పట్ల సంతుష్టి మనిషిని నిరాశా నిస్పృహలకు దూరం చేసి కార్యోన్ముఖునిగా చేస్తాయి.

128. కష్టంలోనూ సుఖంలోనూ మనిషి దైవ ప్రసన్నత బడయటానికి అతని నడవడి ఏ విధంగా దోహదపడుతుందో ఈ హదీసు తెలుపుతోంది. నిజమయిన

(۱۲۹) عَنْ اَنَسٍ قَالَ مَرَّ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِامْرَأَةٍ تَبْكِيْ عِنْدَ قَبْرٍ فَقَالَ اِتَّقِي اللّٰهَ وَاصْبِرِيْ قَالَتْ اِلَيْكَ عَنِّيْ فَاِنَّكَ لَمْ تُصَبْ بِمُصِيْبَتِيْ وَلَمْ تَعْرِفْهُ فَقِيْلَ لَهَا اِنَّهُ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاَتَتْ بَابَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَلَمْ تَجِدْ عِنْدَهٗ بَوَّابِيْنَ فَقَالَتْ لَمْ اَعْرِفْكَ فَقَالَ اِنَّمَا الصَّبْرُ عِنْدَ الصَّدْمَةِ الْاُوْلٰى۔ (بخاری، مسلم، مشکوۃ۔ باب البکاء علی المیت صـ۱۵۰)

129. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం)ఒకసారి, ఓ గోరి వద్ద కూర్చొని రోదిస్తున్న స్త్రీని చూశారు. ఆమెని ఆయన, దైవ నిష్ఠ అలవరచుకో, సహనం అవలంబించు, అని అన్నారు. దానికి "నీ దారిన నీవు పోవయ్యా, నాకు దాపురించిన కష్టం నీకు దాపురించ లేదుకదా!" అన్నదామె. ఆమె ఆయన్ని ఎరుగదు. ఆమెకు అక్కడున్న వారు, 'ఈయన దైవ సందేశహరులు (సఅసం)' అని చెప్పగా ఆమె దైవ ప్రవక్త ఇంటికి పరుగు పరుగున వచ్చి చూసింది. అక్కడ ద్వారపాలకులు ఎవ్వరూ లేరు. ఆమె 'ప్రవక్తా నేను మిమ్మల్ని గుర్తుపట్టలేదు' అని విన్నవించుకుంది. ఆయన ఇలా ఉపదేశించారు, "గుండెపై తొలిపోటు పడినప్పుడు సహించేదే సహనం." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

విశ్వాసి కష్టాల్లో ఉన్నప్పటికీ ఓరిమి కనబరచి, సన్మార్గాన, నిలకడగా ముందుకు సాగుతూ దైవప్రసన్నతను, సత్ఫలితాలకు పాత్రుడవుతే ఆనందపారవశ్యంలోను దైవాన్ని మరువక తనకు ఆనందాన్ని కలగజేసిన ఆ ప్రభువు పట్ల కృతజ్ఞతా భావం కనబరచి, ఆయనకు తన భక్తి ప్రతిపత్తుల్ని తెలియజేసి ఆయన ప్రసన్నతను చూరగొంటాడు. అంటే ఎట్టి పరిస్థితుల్లోనూ విశ్వాసి సరయిన పంథాన నడుచుకుంటే అన్నీ అతనికి సాఫల్య సాధనాలే!

129. ఈ హదీసుద్వారా ఎన్నో విషయాలు బోధపడుతున్నాయి: 1) మృతులను గుర్తుచేసుకుని రోదించడం దైవ నిష్ఠకు విరుద్ధమయింది. 2) దైవ ప్రవక్త సజీవులయి ఉన్న చోటనే ఆయన్ని ఎరుగని మహిళలుండేవారు. 3) మనుషుల సంస్కరణ చెయ్యగోరే వారు తమకు అగౌరవం, నిరాదరణ జరిగినా దాన్ని చీదరించుకోరాదు. సహృదయంతో స్వీకరించాలి. 4) ప్రవక్తమహనీయుల 'దర్బారు'లో ద్వార పాలకుల్లాంటి

(۱۳۰) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
حُفَّتِ الْجَنَّةُ بِالْمَكَارِهِ وَحُفَّتِ النَّارُ بِالشَّهَوَاتِ (مشکوۃ۔کتاب الرقاق)

130. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు: "మనిషి అంతర్యం ఇష్టపడనివి స్వర్గాన్ని చుట్టుముట్టి ఉన్నాయి. మనిషికి ప్రీతిపాత్రమయిన కాంక్షలు నరకం చుట్టూ చేరి ఉన్నాయి." (మిష్కాత్)

(۱۳۱) عَنْ حُذَیْفَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ لَا تَكُوْنُوْا اِمَّعَةً تَقُوْلُوْنَ اِنْ اَحْسَنَ النَّاسُ اَحْسَنَّا وَاِنْ اَسَاءُوْا ظَلَمْنَا وَلٰكِنْ وَطِّنُوْا اَنْفُسَكُمْ، اِنْ اَحْسَنَ النَّاسُ اَنْ تُحْسِنُوْا وَاِنْ اَسَاءُوْا فَلَا تَظْلِمُوْا (مشکوۃ
ج ۲ باب الظلم ص ۴۲۷)

131. హజ్రత్ హుజైఫా (రజి అల్లాహు అన్హు) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు, "జనులారా; 'అమ్మిఅ'గా రూపొందకండి. అంటే, 'జనులు మాతో సద్ప్రవర్తన అవలంబిస్తే మేమూ వారి పట్ల ఉత్తమరీతిలో ప్రవర్తిస్తాము. ఒకవేళ వారు మా పట్ల దుర్వర్తన అవలంబిస్తే మేము కూడా వారిపట్ల అన్యాయంగా వ్యవహరిస్తాము' అంటూ మెలగకండి. దానికి బదులు లోకులు మీ పట్ల మంచిగా ప్రవర్తించినా ఉత్తమరీతిలోనే మెలుగుతామని, వారు అన్యాయానికి ఒడిగట్టినా వారిని అనుసరించమని నిర్ణయించుకుని అదే విధానాన్ని మీ అంతర్యాల్లో అలవరచుకోండి." (మిష్కాత్)

---

వారెవరూ ఉండేవారు కాదు. ఎవరయినా ఆయన్ని కలవగోరితే ఎలాంటి ఆటంకం ఉండేదికాదు. 5) సంస్కరణ, శిక్షణలను చెయ్యగోరేవారు అదను చూసి తమ మాటను తప్పక అందజెయ్యాలి. ఆ మహిళ ప్రవక్త వద్దకు వచ్చినప్పుడు తన తొలి బోధను మళ్ళీ చెప్పడం మరువలేదు ప్రవక్త మహనీయులు (సఅసం). 6) మనిషి తేరుకోలేని గాయం కలిగినప్పుడే సహనం అవసరమయ్యేది. తొలిగాయం

(۱۳۲) عَنْ عَبْدِاللّٰهِ بْنِ اَبِیْ اَوْفٰی اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
فِیْ بَعْضِ اَيَّامِهِ الَّتِیْ لَقِیَ فِيْهَا الْعَدُوَّ، اِنْتَظَرَ حَتّٰی اِذَا مَالَتِ الشَّمْسُ قَامَ فِيْهِمْ
فَقَالَ اَيُّهَا النَّاسُ لَاتَتَمَنَّوْا لِقَاءَ الْعَدُوِّ وَاسْئَلُوا اللّٰهَ الْعَافِيَةَ فَاِذَا لَقِيْتُمُوْهُمْ
فَاصْبِرُوْا وَاعْلَمُوْا اَنَّ الْجَنَّةَ تَحْتَ ظِلَالِ السُّيُوْفِ - (بخاری مسلم۔ ریاض الصالحین
مصری ص ۱۸)

132. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఔఫా ఇలా ఉల్లేఖించారు. "శత్రువులు ఎదురయిన కాలంలో (ఓ రోజున) దైవ సందేశహరులు (సఅసం) సూర్యుడు పడమటికి వాలేంతవరకు నిరీక్షించి ఆ పిదప ఆయన ముస్లిముల మధ్యన నిలబడి ఇలా ప్రసంగించారు, 'శత్రువును మార్కొనాలని కోరుకోకండి. దైవాన్ని సదా శ్రేయంకై అర్థించండి. కాని శత్రువుల్ని ఎదుర్కోవలసి వస్తే మాత్రం స్థయిర్యం కనబరచండి. బాగా గుర్తుంచుకోండి స్వర్గం ఖడ్గాల ఛాయల్లోనే ఉంటుంది." (బుఖారి, ముస్లిం, రియాజుస్సాలిహీన్)

---

భరించరానిదయి ఉంటుంది. అయినా దాన్ని సహనంతో ఎదుర్కొన్నప్పుడే అది నిజమయిన ఓరిమి అనిపించుకుంటుంది.

130. అంటే స్వర్గాన్ని చేరాలంటే మనిషి తనకు ఇష్టం కాని వాటిని అన్నింటినీ భరించి ఇష్టమయిన వాటినీ, కోరికల్నీ, సుఖాల్ని, విశ్రాంతినీ, త్యాగం చెయ్యనిదే స్వర్గానికి అర్హత పొందలేడు. అలాగే ధర్మాధర్మాలను, న్యాయాన్యాయాలను ఖాతరు చెయ్యకుండా కేవలం వాంఛాప్రియత్వం వల్ల, కాంక్షా దాస్యం వల్ల నరకం తప్ప మరేది ప్రాప్తం కాదు. ఈ సత్యాన్నే ఈ ఉపమానం ద్వారా వెల్లడి చెయ్యడం జరిగింది.

131. సమాజం ఏ పంథాననుసరించినా, ఏ విధానాలవలంబించినా మీరు మాత్రం సదా న్యాయం, ధర్మం, పరోపకారం, ఉత్తమ సంస్కారం లాంటి విధానాలనే అవలంబించాలి అని అర్థం.

132. ఇది యుద్ధాలు జరుగుతున్న రోజుల్లోని సంఘటన. అలాంటి సున్నితమయిన గడియలోనూ ప్రవక్త మహనీయులు సహనాన్ని సంయమనాన్ని ఉపదేశించారు. ఈ హదీసు బోధించే మరో విషయం ఏమిటంటే, శత్రువు మార్కొనాలన్న కోరిక కలిగి ఉండడం భావ్యం కాదు. అలా డంబాలు పలకడం, గొప్పలు చెప్పుకోవడం దైవానికి ఇష్టమయింది కాదు. అయితే శత్రువు దాడి చేసి దెబ్బతీయాలని సన్నద్ధుడయినప్పుడు

(۱۳۳) عَنْ اَبِیْ سَعِیْدِ الْخُدْرِیِّ اَنَّ نَاسًا مِنَ الْاَنْصَارِ سَئَلُوْا رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَاَعْطَاهُمْ ثُمَّ سَاَلُوْهُ فَاَعْطَاهُمْ حَتّٰی نَفِدَ مَا عِنْدَهٗ فَقَالَ لَهُمْ حِیْنَ اَنْفَقَ کُلَّ شَیْءٍ بِیَدِهٖ مَا یَکُنْ مِنْ خَیْرٍ فَلَنْ اَدَّخِرَهٗ عَنْکُمْ وَمَنْ یَّسْتَعْفِفْ یُعِفَّهُ اللّٰهُ وَمَنْ یَّسْتَغْنِ یُغْنِهِ اللّٰهُ وَمَنْ یَّتَصَبَّرْ یُصَبِّرْهُ اللّٰهُ، وَمَا اُعْطِیَ اَحَدٌ عَطَاءً خَیْرًا وَّاَوْسَعَ مِنَ الصَّبْرِ

(بخاری۔ مسلم۔ مشکوٰۃ۔ باب من لا تحل لہ المسئلۃ ومن تحل لہ)

133. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రి (ర.అ) ఉల్లేఖించిన దాని ప్రకారం, కొందరు అన్సారీలు మహాప్రవక్త (సఅసం) సమక్షంలో తమ అవసరాన్ని ముందుంచారు. ఆయన దాన్ని తీర్చి వేశారు. వారు తిరిగి అర్థించారు. ఆయన మళ్ళీ వారికి ఇప్పించారు. చివరికి ఆయన దగ్గర మరేమీ మిగల్లేదు. ఉన్నదంతా ప్రదానం చేసిన తరువాత వారికి ఉపదేశించారు: "నా వద్ద ఉండేదేదీ నేను మిగిల్చి ప్రోగుచెయ్యను. ఏ వ్యక్తి అయితే సంతుష్టిని, ఆత్మాభిమానాన్ని ఆశ్రయిస్తాడో అల్లాహ్ అలాంటి వ్యక్తికి ఆ గుణాలనే అనుగ్రహిస్తున్నాడు. ఎవరయితే కోరికలకు అతీతంగా వ్యవహరిస్తాడో అల్లాహ్ అతన్ని కోరికలకు అతీతంగానే తీర్చి దిద్దుతాడు. మరెవరయితే సహనస్థయిర్యాల నవలంబిస్తాడో అతనికి అల్లాహ్ సహనస్థయిర్యాలను అనుగ్రహిస్తాడు. దైవం మానవునికి ప్రసాదించే నైతిక గుణగణాలన్నింటిలోనూ ఉత్తమమయింది, విస్తృతమయింది సహనమే." (బుఖారి, ముస్లిం)

---

మటుకు వెన్నుజూపకుండా ధైర్యశౌర్యాలను చూపుతూ ఎదుర్కోవడం చెయ్యవలసిన కార్యం.

133. ఈ హదీసు ద్వారా, ప్రవక్త మహనీయులు – అర్థికి ప్రియము తోడ ఉన్నదంతా ప్రదానం చేసే వారని తెలుస్తోంది. ఇంకా ఆయన తన సహచరులకు, అనుయాయులకు ప్రపంచం కన్నా పరలోకాన్ని ప్రబోధించే వారని, ధన సంపదల విషయంలో సంతుష్టిని, సంతృప్తిని ఉపదేశించేవారని బోధపడుతోంది. మరో విషయం, మనిషి ఏ గుణాలను పెంపొందించుకోగోరుతాడో వాటి కోసమే దైవ సహాయం లభిస్తుందన్న సత్యం కూడా ఈ ప్రవచనం ద్వారా ద్యోతకమవుతోంది.

(۱۳۴) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ دَخَلَ عُيَيْنَةُ بْنُ حِصْنٍ عَلٰى عُمَرَ بْنِ الْخَطَّابِ فَقَالَ هِيْ يَا ابْنَ الْخَطَّابِ فَوَاللّٰهِ مَا تُعْطِيْنَا الْجَزْلَ، وَلَا تَحْكُمُ فِيْنَا بِالْعَدْلِ، فَغَضِبَ عُمَرُ حَتّٰى هَمَّ اَنْ يُّوْقِعَ بِهٖ، فَقَالَ الْحُرُّ يَا اَمِيْرَ الْمُؤْمِنِيْنَ اِنَّ اللّٰهَ تَعَالٰى قَالَ لِنَبِيِّهٖ خُذِ الْعَفْوَ وَأْمُرْ بِالْعُرْفِ وَاَعْرِضْ عَنِ الْجٰهِلِيْنَ. وَاللّٰهِ مَا جَاوَزَهَا عُمَرُ حِيْنَ تَلَاهَا عَلَيْهِ وَكَانَ وَقَّافًا عِنْدَ كِتَابِ اللّٰهِ - (صحیح بخاری، ریاض الصالحین مصری ص...)

134. హజ్రత్ ఇబ్ను అబ్బాస్ ఉల్లేఖనం ప్రకారం, ఉయైనా ఇబ్ను హిస్న్, హజ్రత్ ఉమర్ (ర.అ) వద్దకు వచ్చి, "ఓ ఖత్తాబ్ కుమారుడా, నీవు మాకు ధనం బాగా పంచవు, మా మధ్య న్యాయంగా తీర్పు చెయ్యవు." అన్నాడు. దానికి ఉమర్ ఉగ్రులయిపొయ్యారు. అతనిపై విరుచుకు పడబొయ్యారు. అంతలోనే 'హుర్' (హిస్న్‌కు సోదరసుతుడు) అడ్డుకుని, 'అమీరుల్ మోమినీన్, అల్లాహ్ తన ప్రవక్తను మన్నింపు వైఖరిని అవలంబించమని, మంచిని ఆదేశించమని, అజ్ఞానులకు దూరంగా మెలగమని బోధించారు' అని గుర్తుచేశాడు. (ఉల్లేఖనకర్త కథనం) అప్పుడు హజ్రత్ ఉమర్ ఈ ఆయత్ వినగానే దాన్ని ఏమాత్రం జవదాటలేదు. ఆయన సాధారణంగా దైవగ్రంథం (దైవాదేశం) ముందుకు రాగానే ఆగిపొయ్యేవారు.

(బిన్నుహారిస్-సహీహ్ బుఖారి)

---

134. ప్రవక్త సహచర అగ్రగణ్యుల్లో ఒకరు, రెండవ ఖలీఫా అయిన హజ్రత్ ఉమర్ సహజంగానే కోపిష్టి. అయితే ఇస్లాం స్వీకరించిన తరువాత ఆయన కేవలం సత్యానికి విరుద్ధంగా ఏదయినా విన్నప్పుడు లేదా చూసినప్పుడే ఆగ్రహం చెందేవారు. ఇది కూడా అలాంటి సందర్భమే. ఒక వ్యక్తి వచ్చి ఆయన ఏ విషయాలకు అతీతంగా వ్యవహరిస్తున్నారో వాటిలోనే ఆయన లీనమయినట్లు ఆరోపించినప్పుడు, అవాస్తవికమయిన ఈ మాటలు విన్నంతనే ఆయన కోపం కట్టలు తెచ్చుకుంది. అతనిపై చెయ్యి చేసుకునే వారే కాని మరో వ్యక్తి దైవాదేశాన్ని గుర్తు చెయ్యగానే తన కోపాన్నంతటినీ దిగమ్రింగుకున్నారు.

(١٣٥) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ أَخْبَرَنِي عُبَيْدُ اللهِ بْنُ عِيَاضٍ أَنَّ بِنْتَ الْحَارِثِ أَخْبَرَتْهُ أَنَّهُمْ حِينَ اجْتَمَعُوا اسْتَعَارَ مِنْهَا مُوسَى لِيَسْتَحِدَّ بِهَا فَأَعَارَتْهُ فَأَخَذَ ابْنًا لِي وَأَنَا غَافِلَةٌ حَتَّى أَتَاهُ قَالَتْ فَوَجَدْتُهُ مُجْلِسَهُ عَلَى فَخِذِهِ وَالْمُوسَى بِيَدِهِ فَفَزِعْتُ فَزْعَةً عَرَفَهَا خُبَيْبٌ فِي وَجْهِي فَقَالَ تَخْشَيْنَ أَنْ أَقْتُلَهُ مَا كُنْتُ لِأَفْعَلَ ذٰلِكَ ، مَا رَأَيْتُ أَسِيرًا قَطُّ خَيْرًا مِنْ خُبَيْبٍ - (بخاری مع فتح الباری مصری - کتاب الجہاد - ج ۱۰۱)

135. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనంలో బిన్తు హారిస్ (హారిస్ కుమార్తె) కథనం ప్రకారం: ముష్రికులందరూ సమావేశమయిన సందర్భంలో హజ్రత్ ఖుబైబ్ (ర.అ) ఆమె (హారిస్ కుమార్తె) వద్ద వెంట్రుకలు గొరిగే కత్తి (పరిశు భ్రమయ్యేందుకు) వినియోగించుకోవడానికి అడిగి తీసుకున్నారు. ఆమె కత్తి ఇచ్చి వేశారు. (బిన్తు హారీస్ ఇలా అంటున్నారు:) 'ఆ తరువాత ఆయన నా కొడుకును తన ఒడిలోకి తీసుకున్నాడు. పిల్లవాడు ఆయన వద్దకు పోవ డం నేను గమనిరంచలేదు. వాడు ఆయన తొడపై కూర్చున్నాడు. అప్పుడు కత్తి ఆయన చేతిలోనే ఉంది.(ఆ దృశ్యంచూసి) నేను గాభరా పడ్డాను. ఖుబైబ్ నా ముఖం చూసి నా ఆందోళనను పసిగట్టారు. "నేను ఇతన్ని చంపి వేస్తానేమో అని భయపడుతున్నావు కదూ! నేను అలా ఎన్నటికీ చేయను" అన్నారాయన. ఖుబైబ్ కంటే మంచి ఖైదీని నేనెన్నడూ చూడలేదు.' (బుఖారి)

---

మనిషికి కోపం సహజమే. అయితే ఎవరయినా సహనం, సంయమనం పాటించమని బోధించినప్పుడు దాన్ని పాటించాలి. మరో విషయం ఏమిటంటే అర్థంలేని ఆరోపణలు వస్తే వాటిని అరికట్టడానికి వాటిపై ఆగ్రహం వ్యక్తం చెయ్యడం తప్పుకాదు. అయితే సహనం వహించడమే ఉత్తమ విధానం.

135. దీని పూర్వ రంగం ఏమిటంటే, ఒకసారి మక్కా బహు దైవారాధకులు ముస్లిములను మోసపుచ్చి మదీనా నుండి కొందరు సహాబా వారిని తెచ్చి మక్కాలోని వేర్వేరు ఇండ్లల్లో ఖైదీలుగా నిర్బంధించి ఉంచారు. హదీసులోని సంఘటన హజ్రత్ ఖుబైబ్ అనే ప్రవక్త సహచరునికి సంబంధించింది. ఆయన్ని, ఈ సంఘటన జరిగిన కొంతసేపటికి ఉరికంబానికి ఎక్కించారు.

(۱۳۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
لَیْسَ الشَّدِیْدُ بِالصُّرَعَةِ اِنَّمَا الشَّدِیْدُ مَنْ یَّمْلِكُ نَفْسَهٗ عِنْدَ الْغَضَبِ ۔
(صحیح مسلم۔ مشکوٰۃ باب الغضب والکبر ص ۴۲۵)

136. మహనీయ ముహమ్మద్ (సఅసం) ఉపదేశించినట్లు హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు, ("శత్రువును యుద్ధరంగంలో") చిత్తు చేసినవాడు కాదు వీరుడు, కోపావేశంలో తన అంతర్యాన్ని అధీనంలో ఉంచుకున్న వాడే నిజమయిన శూరుడు. (సహీహ్ ముస్లిం)

(۱۳۷) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ رَجُلًا قَالَ لِلنَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اَوْصِنِیْ قَالَ لَا تَغْضَبْ فَرَدَّدَ ذٰلِكَ مِرَارًا قَالَ لَا تَغْضَبْ (بخاری۔ مشکوٰۃ ص ۳۵۳)

137. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) వద్దకు ఒక వ్యక్తి వచ్చి, "ఏదయినా బోధించండి" అని అర్థించాడు. దానికి ఆయన, 'ఆగ్రహం చెందకు' అని ఉపదేశించారు. ఈ మాటను ఆయన మాటిమాటికీ పలికారు – 'ఆగ్రహం చెందకు' అని. (బుఖారి, మిష్కాత్)

---

హజ్రత్ ఖుబైబ్ తన మరణానికి కొన్ని గడియలకు పూర్వం కూడా శుచీ శుభ్రతలకు ఎంత ప్రాధాన్యత నిచ్చారో, ఇస్లాం పారిశుధ్యానికి పరిశుభ్రతకు ఇచ్చిన ప్రాముఖ్యం ఎలాంటిదో ద్యోతకమవుతోంది. మరో విషయం ఏమంటే ఈ బహుదైవారాధకులు కొన్ని గంటల తరువాత తన్ను చంపివేస్తారని తెలిసి కూడా ఆయన వారి పిల్లవానిపై తన ప్రతీకారాగ్నిని తీర్చుకోలేదు. ఇది షరీఅత్‌లో నిషిద్ధమనీ ఆయనకు తెలుసు. మహిళల్ని, బాలల్ని, వృద్ధుల్ని చంపరాదన్న షరీఅత్ ఆదేశాన్ని ఆయన తన అంతిమశ్వాస వరకు పాటించారు. ఆయన నైతిక ప్రమాణాల ఆదర్శాన్ని నెలకొలిపారు.

136. క్రోధాన్ని దిగమ్రింగడం కన్నా గొప్ప శౌర్యం లేదన్న ఈ హదీసు సర్వకాల సర్వావస్థల్లో సహనాన్ని సంయమనాన్ని ఎలా పాటించాలో మనకు బోధిస్తుంది. మనిషి కోపావేశంలో కొన్ని పర్యాయాలు నైతికతను, శాసనపరిధుల్ని అధిగమించి

(١٣٨) عَنْ اَنَسٍ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ ثَلٰثٌ مِنْ اَخْلَاقِ الْاِیْمَانِ مَنْ اِذَا غَضِبَ لَمْ یُدْخِلْہُ غَضَبُہٗ فِیْ بَاطِلٍ ، وَ مَنْ اِذَا رَضِیَ لَمْ یُخْرِجْہُ رِضَاہُ مِنْ حَقٍّ وَمَنْ اِذَا قَدَرَ لَمْ یَتَعَاطَ مَا لَیْسَ لَہٗ (المعجم الصغیر للطبرانی۔ ص ٣١)

138. హజ్రత్ అనస్ ఉల్లేఖించిన దాన్ని బట్టి దైవసందేశహరులు (సఅసం) ఇలా నుడివారు, "మూడు విషయాలు విశ్వాస నైతికతకు సంబంధించినవి. 1.మనిషి కోపావేశానికి గురయి మిథ్యా కూపంలో పడరాదు. 2. ఆనంద భరితుడయినప్పుడు అతని ఆనందం అతన్ని సత్యమార్గానికి దూరం చెయ్యరాదు. 3. అధికారం, ఆధిక్యత సంపాయించినప్పుడు తనకు హక్కులేని దాన్ని దేన్నీ తీసుకోరాదు." (అల్ మో'జమున్సగీర్)

---

నష్టాన్ని కలిగించే ధ్యాసలో తానే సొంతంగా నష్టపోవడం కూడా కద్దు. అలాంటి వారందరికీ ఇది కనువిప్పు కాగలగాలి.

137. దైవప్రవక్త సహచరులు మనలాంటి మానవులే. రకరకాల మనస్తత్వాలు, లోపాలు వాళ్ళల్లోనూ ఉండేవి. అయితే వారు తమను సంస్కరించుకునేందుకు సదా ప్రవక్త మహనీయుని (సఅసం) ఉపదేశాల దర్పణం తమ ముందుంచుకుని తమ్ముతాము చక్కదిద్దుకునేవారు. ఆయన (సఅసం) కూడా వ్యక్తినిబట్టి, అతనిలో సంస్కరించవలసిన లోటును బట్టి బోధించేవారు. ప్రశ్నించిన వ్యక్తి బాగా కోపిష్ఠిలా అగుపడుతున్నాడు. అందువల్లనే ఆయన అతనికి కోపావేశానికి గురికారాదన్న బోధనను మరీ మరీ చేసి పంపారు.

138. 'విశ్వాసనైతికత' అనంటే 'విశ్వాసం' లేక ఈమాన్ ప్రవేశించిన వ్యక్తిలో సహజ పరిణామంగా జనించవలసిన నైతికత, గుణగణాలని అర్థం. ఇక్కడ మూడు విషయాలను విశ్వాసానికి తగిన నైతిక గుణాలని బోధించడం జరిగింది. ఇవి లేని వ్యక్తిలో విశ్వాసం ఇంకా బలమయిన స్థానం ఏర్పరచుకోలేదని చెప్పవచ్చు.

మొదటిది మనిషి ఆగ్రహావేశాలకు లోనయి, పంతాలకు పోయి మొండివైఖరిని అవలంబించి సత్యానికి దూరమయ్యే ప్రమాదముంది, ఆ తరువాత మిథ్యావాదపు అంధకారంలో పడిపోయ్యే ప్రమాదమూ ఉంది. అలా జరక్కుండా తన్ను తాను కాపాడుకోవడం విశ్వాసి లక్షణం.

(١٣٩) عَنْ عَائِشَةَ قَالَتْ مَا انْتَقَمَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِنَفْسِهٖ فِيْ شَيْءٍ قَطُّ اِلَّا اَنْ تُنْتَهَكَ حُرْمَةُ اللّٰهِ، فَيَنْتَقِمُ لِلّٰهِ ۔

(بخاری، مسلم ۔ ریاض الصالحین ۔ ص ۱۱۷)

139. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఉల్లేఖించారుః "ప్రవక్త మహనీయులు తన సొంత విషయంలో ఎన్నడూ ప్రతీకారం తీర్చుకోలేదు. అయితే దైవం నిర్ణయించిన పవిత్రతలు వినాశమవుతూ ఉంటే ఆయన దైవం కొరకు ప్రతీకారం తీర్చుకునేవారు." (బుఖారి, ముస్లిం)

(١٤٠) عَنْ اَبِي الْاَحْوَصِ الْجُشَمِيِّ عَنْ اَبِيْهِ قَالَ قُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ اَرَاَيْتَ اِنْ مَرَرْتُ بِرَجُلٍ فَلَمْ يَقْرِنِيْ وَلَمْ يُضِفْنِيْ ثُمَّ مَرَّ بِيْ بَعْدَ ذٰلِكَ اَاَقْرِيْهِ اَمْ اَجْزِيْهِ قَالَ بَلْ اِقْرِهٖ (رواه الترمذی ۔ مشکوٰۃ ۔ باب الضیافۃ)

140. అబుల్ అహ్వస్ జుషమి తన తండ్రి చెప్పినట్లు ఉల్లేఖించారు, 'ఒకసారి నేను దైవ ప్రవక్తను ఇలా అడిగాను, "ఒకవేళ నేను ఓ వ్యక్తి వద్దకు వెళ్ళగా అతను నా ఆతిథ్యానికి ఎలాంటి ఏర్పాటు చెయ్యకపోతే, అతను నా వద్దకు వచ్చినప్పుడు నేను అతనికి ఆతిథ్యమివ్వాలా లేక అతని వైఖరిని త్రిప్పికొట్టాలా?" దానికి ఆయన, "అలా కాదు, నీవు అతనికి అతిథి సత్కారం చెయ్యి" అని బోధించారు. (తిర్మిజి, మిష్కాత్)

---

రెండవది, ఆనందాతిరేకంలోనూ మనిషి సదాచారాన్ని, సత్యపథాన్ని విడనాడే ప్రమాదం ఉంది. 'విశ్వాసం' జాగ్రదావస్థలో ఉంటేనే తప్ప ఈ ప్రమాదాన్ని అధిగమించలేడు మనిషి.

మూడవది, అధికారం, ఆధిక్యత ఏమాత్రం లభించినా మనుషులు అదుపు తప్పి ఎవ్వరినీ ఖాతరు చెయ్యని దుస్థితికి చేరుకుంటారు. అలాంటప్పుడు అక్రమంగా, అన్యాయంగా కూడా ఇతరుల హక్కుల్ని కాజేసే ధోరణి కూడా పొడసూపడం కద్దు. దానికి దూరంగా ఉండాలన్నదీ దీని సారం.

139. మనిషి వ్యక్తిగత ప్రతీకారం తీర్చుకోవడం అసహజమూ కాదు అన్యాయమూ కాదు. అయితే మానవత పట్ల ప్రేమ, ఉన్నత నైతిక ప్రమాణాల పట్ల అభిమానమున్న

(١٤١) عَنِ ابْنِ عُمَرَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَرَّ عَلٰى رَجُلٍ مِّنَ الْاَنْصَارِ وَهُوَ يَعِظُ اَخَاهُ فِى الْحَيَاءِ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ دَعْهُ فَاِنَّ الْحَيَاءَ مِنَ الْاِيْمَانِ (متفق عليه مشكوٰة باب الرفق ۴۲۳)



141. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖించారు: "ఒకసారి ప్రవక్త మహనీయులు ఓ అన్సారి సహచరుని వద్దకు వెళ్ళారు. అప్పుడతను తన సోదరునికి వ్రీడ, లజ్జాగుణాల విషయంలో ఉపదేశిస్తూ ఉన్నాడు. ఆయన (సఅసం) అతనితో, "అతన్ని వదిలెయ్యి, లజ్జ అన్నది విశ్వాసంలోని అంతర్భాగమే." అని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)

---

వారు ఇలాంటి 'హక్కు'ను సయితం వదలుకుని ఉదారంగా వ్యవహరించడం, 'చెల్లియుండియు సైరణ చేయు' గుణాన్ని పెంపొందించుకోవడం, నిగ్రహం, సంయమనం పాటించడం ఆదర్శనీయమయిన వైఖరి. 

140. మేలు చేసినవారికే మేలుచెయ్యడం మానవ సహజగుణం. అయితే దానికన్నా కాస్త ఎదిగి మేలు చెయ్యకపోయినా అలాంటి వ్యక్తిపట్ల ఉదార వైఖరి నవలంబించడం ఉత్తమ మానవీయ లక్షణం. ప్రవక్త సహచరులు చిన్నచిన్న అనుమానాలు వచ్చినా పరిష్కారానికి ప్రవక్తను ఆశ్రయించేవారు. ఆయన (సఅసం) వారికి తగిన రీతిలో ఉత్కృష్టగుణగణాలను బోధించేవారు. 

141. ఒక వ్యక్తి ఏదో లజ్జాకరమయిన పని చేసినందువల్లనో లేదా నిర్లజ్జగా వ్యవహరించడం వల్లనో అతని సోదరుడు అతన్ని మందలిస్తున్నాడు. అతన్ని చూసి ప్రవక్త మహనీయులు (సఅసం) ఆ మందలించే వ్యక్తికి మూలమంత్రాన్ని ఉపదేశించారు. మనిషిలో 'విశ్వాసం' స్థానమేర్పరచుకుని అతని జీవితంలో అది ప్రతిబింబించినట్లయితే ఇలాంటి పరిస్థితి ఏర్పడేది కాదన్నది దాని సారాంశం. అందువల్ల సంస్కరణాకార్యానికి తొలిమెట్టు విశ్వాసాన్ని పటిష్టం చెయ్యడం. అలాగే విశ్వాసంగల వ్యక్తి ఎప్పుడయినా తప్పి తవిరి తప్పుచేసినా అతని విశ్వాసం అతన్ని మేల్కొలిపి సంస్కరణాభిముఖం చెయ్యడం తప్పనిసరిగా జరిగే పరిణామం. దాన్ని జాగృత పరిస్తే పరిస్థితులు వాటంతట అవే చక్కబడతాయి.

(۱۴۲) عَنْ اَنَسٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا اَرَادَ الْحَاجَةَ لَمْ يَرْفَعْ ثَوْبَهٗ حَتّٰى يَدْنُوَ مِنَ الْاَرْضِ۔ (مشکوٰۃ باب آداب الخلاء ص ۴۲)

142. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు సహజ అవసరాలకై వెళ్ళినప్పుడు నేలకు దగ్గరయి కూర్చునేంత వరకు బట్టలను లేవనెత్తేవారు కారు. (మిష్కాత్)

(۱۴۳) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِيَّاكُمْ وَالتَّعَرِّيْ فَاِنَّ مَعَكُمْ مَنْ لَا يُفَارِقُكُمْ اِلَّا عِنْدَ الْغَائِطِ وَحِيْنَ يُفْضِي الرَّجُلُ اِلٰى اَهْلِهٖ فَاسْتَحْيُوْهُمْ وَاَكْرِمُوْهُمْ (رواہ الترمذی۔ مشکوٰۃ۔ ص ۲۶۱)

143. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు తెలిపారు, "పూర్తిగా దిగంబరులవకుండా జాగ్రత్త వహించండి. ఎందువల్లనంటే మీకు తోడుగా, ఎన్నడూ వేరు కాని వారుంటారు. అయితే సహజావశ్యకతకు వెళ్ళినప్పుడు లేదా తన భార్యతో సంయోగమయినప్పుడు మటుకు మినహాయింపు ఉంది. వీరి (దైవదూతల) సమక్షంలో లజ్జతో మెలగండి, గౌరవంగా మసలుకోండి." (తిర్మిజి, మిష్కాత్)

---

142. ఈ హదీసువల్ల కొన్ని అతిముఖ్యమయిన విషయాలు ద్యోతకమవుతున్నాయి.

1. ఇస్లాం బోధించే జీవన సరళిలో మానవుని నిత్యజీవిత వ్యవహారాల్లోని అత్యంత అల్పమయిన విషయమూ ఉంది. మనకు చిన్న చిన్న విషయాల్లోనూ మార్గదర్శకత్వంతోపాటు ఆదర్శజీవితమూ కానవస్తుంది.

2. మహనీయ ముహమ్మద్(సఅసం) జీవిత వివరాలు సూక్ష్మాతిసూక్ష్మంగా భద్రపరచబడి ఉన్నాయి. చివరికి ఆయనకు అత్యంత వ్యక్తిగతమయిన విషయాలు సయితం ఆ వివరణల్లో చోటు చేసుకున్నాయి.

3. ప్రవక్త జీవితాన్ని, ఆయన బోధనల్ని భద్రపరచినవారు ముఖ్యంగా ఆయన్ని అనుసరించగోరిన ప్రపంచ ప్రజలపై, ఇంకా ఆయన జీవితాన్ని అధ్యయనం

(۱۴۴) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا سَمِعْتُمُ الْاِقَامَةَ فَامْشُوْا اِلَی الصَّلٰوةِ وَعَلَیْکُمُ السَّکِیْنَةَ وَالْوَقَارَ وَلَا تُسْرِعُوْا (مشکٰوة ـ ص ۵۹)

144. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు ఇలా బోధించారు. "మీరు 'ఇకామత్' విన్నప్పుడు నమాజ్ కోసం ప్రశాంతంగా హుందాగా వెళ్ళండి. ఆ సందర్భంలో తొక్కిసలాటకు పాల్పడకండి." (మిష్కాత్)

(۱۴۵) عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِسْتَعِیْنُوْا عَلٰی اِنْجَاحِ حَوَائِجِکُمْ بِالْکِتْمَانِ فَاِنَّ کُلَّ ذِیْ نِعْمَةٍ مَحْسُوْدٌ (المعجم الصغیر للطبرانی ـ ص ۲۴۶)

145. మహాప్రవక్త ఇలా బోధించినట్లు హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ ఉల్లేఖించారు. "మీ అవసరాల పరిపూర్తికై చేసే కృషిలో గోప్య విధానాన్ని అవలంబించి తద్వారా సహాయం పొందండి. ఎందువల్లనంటే వరప్రసాదితుడయిన ప్రతి వ్యక్తి పట్ల జనం ఈర్ష్యకు లోనవుతారు." (అల్ మౌ'జముస్సగీర్)

---

చేయగోరిన వారిపై ఎనలేని మేళ్ళు చేశారు. వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఈ వివరాలు లేకపోతే దైవమార్గదర్శకత్వం పూర్తయ్యేది కాదు.

4. సిగ్గు బిడియాలను ఎల్లవేళలా కాపాడుకుంటూ జీవితం గడపడం విశ్వాసానికి ముఖ్యమయిన గుర్తు.

143. దైవదూతలు మనిషి వెంట ఉంటూ అతని మాటలు, చేతలు అన్నీ రికార్డు చేస్తూ ఉంటారని ఖుర్ఆన్ హదీసుల ద్వారా తెలుస్తోంది. వారు అనునిత్యం తోడుగా ఉంటారు కాబట్టి రెండు అనివార్య సందర్భాల్లో తప్ప, స్త్రీ పురుషులెవరయినా తమ మర్మస్థానాన్ని బహిర్గతం చెయ్యరాదని బోధించడం జరిగింది. మనకు కానరాకుండానే తోడుగా ఉండే దైవదూతల పట్ల గౌరవభావం కలిగి ఉండటం, వారి గౌరవం దృష్ట్యా అనవసరంగా దిగంబరులవకుండా మెలగడం, వారి ఎడల బిడియం ప్రదర్శించడం –

(١٤٦) عَنْ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ عَجِبْتُ مِنَ الرَّجُلِ يَفِرُّ مِنَ الْقَدَرِ وَهُوَ مُوَاقِعُهُ، وَيَرَى الْقَذَاةَ فِي عَيْنِ أَخِيهِ وَيَدَعُ الْجِذْعَ فِي عَيْنَيْهِ وَيُخْرِجُ الضِّغْنَ مِنْ نَفْسِ أَخِيهِ وَيَدَعُ الضِّغْنَ فِي نَفْسِهِ وَمَا وَضَعْتُ سِرِّي عِنْدَ أَحَدٍ فَلُمْتُهُ عَلَى إِفْشَائِهِ وَكَيْفَ أَلُومُهُ وَقَدْ ضِقْتُ بِهِ ذَرْعًا - (الادب المفرد - باب افشاء السر ١٣٩)

146. హజ్రత్ అమ్ర్ బిన్ అల్ ఆస్ (ర) ఓ ఉల్లేఖనంలో ఇలా నుడివారు. "నాకు, ఇలాంటి వ్యక్తి పట్ల ఆశ్చర్యం కలుగుతుంది. అదృష్టం నుండి పరారయ్యే వ్యక్తి; నిజానికి అతను అందులో చిక్కుకుపోవలసినవాడే. తన సోదరుని కంటిలోని నలుసునయితే చూడగలిగి, తన కంటిలోని దూలాన్ని మరచిపోయే వ్యక్తి. తన సోదరుని ఆంతర్యంలోని విద్వేషాన్ని పార్రదోలాలని చింతిస్తూ ఉంటూ స్వయంగా తన హృదయంలో ఇతరుల పట్ల వైరాన్ని, వైషమ్యాన్ని పెంచి పోషించే వ్యక్తి. ఎప్పుడయినా నేను నా రహస్యాన్ని ఇతరునికి తెలపగా అతను దాన్ని బయలు పరచినందుకు నేను అతన్ని నిందించడం అన్నది ఎన్నడూ జరగలేదు. ఎందువల్లనంటే ఏ రహస్యమయితే నా గుండెల్లో దాగలేదో దాన్ని బయట పెట్టినందుకు నేను ఇతరుణ్ణి ఎలా నిందించగలను?" (అల్ అదబుల్ ముఫ్రద్)

---

అన్నీ దైవదూతల మహత్తును తెలపడమే కాక మనుషుల శీలనిర్మాణంలో ప్రముఖ పాత్ర నిర్వహించే గుణాలు.

144. 'ఇకామత్' తరువాత సామూహిక నమాజ్ ప్రారంభమవుతుంది. గనుక చాలామంది అది విన్నంతనే ఉరుకులు పరుగులతో తొలి వరుస (సఫ్)లో స్థలం పొందాలన్న ఆత్రుత కనబరుస్తారు. అలాంటి వారు ముందుగానే సిద్ధమయి వెళ్ళి సఫ్‌లో కూర్చొని నమాజ్‌కై నిరీక్షించడం పుణ్యప్రదం; కాని హుందాతనాన్ని వదలి తొక్కిసలాట జరిపితే స్వయంగా గాయపడటమే కాక ఇతరుల్ని గాయపరచడం కూడా ఖాయమే.

145. మనిషి తన అవసరాల పరిపూర్తికి ఎన్నో పథకాలు, కార్యక్రమాలు రూపొందించుకుంటాడు. వాటిని అమలు జరపనంత వరకు మాటను కడుపులో దాచుకోలేక తన సంకల్పాలన్నింటినీ ముందుగానే జనుల ముందు చెప్పుకుంటూ తిరిగితే ఫలితం ఏమిటి? దీనిద్వారా ఈర్ష్యాపరులు విషం క్రక్కి, కుతంత్రాలు పన్ని జరిగే పనిని

(١٤٧) عَنْ عُمَرَ قَالَ وَهُوَ عَلَى الْمِنْبَرِ يَا اَيُّهَا النَّاسُ تَوَاضَعُوْا فَاِنِّيْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ تَوَاضَعَ لِلّٰهِ رَفَعَهُ اللّٰهُ فَهُوَ فِيْ نَفْسِهٖ صَغِيْرٌ وَفِيْ اَعْيُنِ النَّاسِ عَظِيْمٌ وَ مَنْ تَكَبَّرَ وَضَعَهُ اللّٰهُ فَهُوَ فِيْ اَعْيُنِ النَّاسِ صَغِيْرٌ وَفِيْ نَفْسِهٖ كَبِيْرٌ حَتّٰى لَهُوَ اَهْوَنُ عَلَيْهِمْ مِنْ كَلْبٍ وَخِنْزِيْرٍ۔ (مشكوٰة - باب الغضب - ص ٤٢٦)

147. ఓ ఉల్లేఖనం ప్రకారం, హజ్రత్ ఉమర్ (ర.అ) ఒకసారి మింబర్ నెక్కి ప్రసంగిస్తూ ఇలా ప్రవచించారు, "జనులారా వినయ వినమ్రతల్ని అవలంబించండి. ఎందువల్లనంటే నేను దైవసందేశహరులు ఇలా సెలవియ్యగా విన్నాను, 'ఎవరయితే అల్లాహ్ కొరకు వినమ్రుడవుతాడో అల్లాహ్ అతన్ని ఉన్నతునిగా చేస్తాడు. అతను తన్ను తాను అల్పునిగా భావిస్తాడు. కాని ప్రజల దృష్టిలో ఉన్నతుడయి ఉంటాడు. మరెవడయితే గర్వపడతాడో అతడు ప్రజల దృష్టిలో అల్పుడయి ఉంటాడు. కాని అతను తన్నుతాను గొప్పవానిగా భావిస్తూ ఉంటాడు. చివరికి అలాంటి వ్యక్తి ప్రజల దృష్టిలో కుక్కకన్నా, పందికన్నా నీచమయిపోతాడు.' (మిష్కాత్)

---

చెడగొట్టే అవకాశం ఉంది. అందుకే వీలయినంత వరకు భావి కార్యక్రమాలకు కార్య రూపమివ్వనంత వరకు దండోరా కొట్టించడం భావ్యం కాదు.

146. ఇవి వాస్తవానికి హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ వచనాలు. మనిషి దైవలిఖితం తప్పించుకుని ఎక్కడికీ పోలేడు. అయినా దాన్ని తప్పించుకోవాలని సకల ప్రయత్నాలు చేస్తాడు. అయితే అసలు ప్రయత్నాలు చెయ్యరాదని దీని అర్థం కాదు. ప్రయత్నాలు చేసి అవి ఫలవంతం కాకపోయినా నిరాశ చెందకుండా జరిగిన ఫలితాన్ని అదృష్టానికి వదిలేసి కొత్త కోణంలో ప్రయత్నాలు ప్రారంభించాలి. అయితే ఫలితానికి దైవంపై మాత్రమే భారం వేసి సత్ఫలితాలకై ప్రార్థిస్తూ ఉండాలి. ఈ హదీసులో మనుషుల బలహీనతల్ని కొన్నింటిని ప్రస్తావించి వీటి పట్ల హజ్రత్ అమ్ర్ తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. చివరన తన రహస్యాన్ని దేన్నయినా ఇతరులకు చెప్పి వారు దాన్ని గోప్యంగా ఉంచలేదని ఇతరుల్ని నిందించే వ్యక్తుల గురించి కూడా ఆయన తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు, తన గుండెల్లో దాగని తన రహస్యాన్ని ఇతరులు భద్రపరుస్తారని ఎలా అనుకున్నాడని.

(۱۴۸) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ قَالَ مَا رُاِیَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَاکُلُ مُتَّکِئًا قَطُّ وَلَا یَطَأُ عُقِبَهٗ رَجُلَانِ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔کتاب الاطعمہ)

148. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ ఉల్లేఖనం: దైవప్రవక్త (సఅసం)ని ఎన్నడూ వీపు ఆనించి తింటూ ఉండగా చూడటం తటస్థించలేదు. ఇంకా, ఆయన వెనక ఇద్దరు వ్యక్తులు నడుస్తూ ఉండగానూ నేనెన్నడూ చూడలేదు. (అబూదావూద్, మిష్కాత్)

(۱۴۹) عَنْ اُمِّ سَلَمَةَ قَالَتْ رَأَی النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ غُلَامًا لَنَا یُقَالُ لَهٗ اَفْلَحُ اِذَا سَجَدَ نَفَخَ فَقَالَ یَا اَفْلَحُ تَرِّبْ وَجْهَكَ ۔

(رواہ الترمذی۔ مشکوٰۃ باب مالایجوز فی الصلوٰۃ ص ۸۳)

149. హజ్రత్ ఉమ్మె సల్మా (రజిఅల్లాహు అన్హా) ఉల్లేఖించిన దాని ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి అఫ్లహ్ అనే బానిసను, సజ్దా చేసేటప్పుడు ఊది మరీ సజ్దా చెయ్యగా చూశారు. అప్పుడు అతనికి ఇలా ఉపదేశించారు: "అఫ్లహ్, నీ ముఖానికి మట్టి తగలనీ" (తిర్మిజీ, మిష్కాత్)

---

147. వినయం వల్ల – అనవసరమయిన అతి వినయం కాదు – మనిషిలో ఇతరుల పట్ల గౌరవ భావం జనిస్తుంది. ఇతరుల్ని గౌరవించినవాడు తప్పక తానూ గౌరవించ బడతాడు. ఎందువల్లనంటే గర్వం గల వ్యక్తిని ప్రజలు అతని సమక్షంలో ఏమీ చెప్పక పోయినా తమ ఆంతర్యాల్లో అతని పట్ల ద్వేషమే కలిగి ఉంటారు. మనిషి తన్ను తాను చిన్నవానిగా భావించినప్పుడు దేవుడు అతన్ని ఇతరుల దృష్టిలో పెద్దవానిగా చేస్తాడు.

148. వీపు ఆనించి భోంచెయ్యడం, తాను ముందు నడుస్తూ ఇతరులు తన వెనకాల నడవాలన్న కోరిక– ఇవి రెండూ అహంభావం, వైభవ ప్రతాపాల ప్రదర్శనకు సంబంధించినవి. మహనీయ ముహమ్మద్ (సఅసం)లో వినయ విన్రమతలు ఎంతగా ఉండేవంటే ఆయన ఎన్నడూ మెత్తలు వేసుకుని వీపు ఆనించి భోజనం చెయ్యలేదు. మరెన్నడూ తాను ముందు నడుస్తూ ఉంటే ప్రజలు తన వెనక నడవాలన్నది

(١٥٠) عَنْ سَعْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
إِنَّ اللهَ يُحِبُّ الْعَبْدَ التَّقِيَّ الْغَنِيَّ الْخَفِيَّ (رواه مشكوٰة - باب استحباب المال)

150. హజ్రత్ సఅద్ ఉల్లేఖించారు, దైవప్రవక్త ఇలా ఉపదేశించారు, "పరమ ప్రభువయిన అల్లాహ్, 'తక్వా' గుణశీలుడు, సంతుష్ట హృదయుడు, మరుగున ఉండే తన దాసుడంటే ఎంతో ఇష్టపడతాడు." (మిష్కాత్)

(١٥١) عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ قَدْ أَفْلَحَ مَنْ أَسْلَمَ وَرُزِقَ كَفَافًا وَقَنَّعَهُ اللهُ بِمَا آتَاهُ (رواه مسلم.
مشكوٰة - كتاب الرقاق)

151. దైవసందేశహరులు ఇలా బోధించారని అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ ఉల్లేఖించారు, "ఇస్లాం స్వీకరించిన వ్యక్తికి బ్రతుకు తెరువుకు సరిపోయే ఉపాధి లభించి, తాను ప్రసాదించిన దానిపై సంతృప్తిని, సంతుష్టిని సయితం దైవం అనుగ్రహిస్తే అలాంటి వ్యక్తి విజయసాఫల్యాలకు చేరుకున్నట్లే." (మిష్కాత్)

---

ఆయనకు ఇష్టమయ్యేది కాదు. కనీసం ఇద్దరయినా ఆయన వెనక నడవగా ఠీవితో నడవడం కూడా ఆయన ఇష్టపడలేదని హదీసు ఉల్లేఖన కర్త ఇక్కడ తెలుపుతున్నారు.

149. మనిషిలో వినయ వినమ్రతలు ఎల్లవేళలా ప్రతిఫలించాలన్నది ఈ హదీసు బోధన. ఎవరయినా దైవం సమక్షంలో నమాజ్ చేస్తూ కూడా తన నుదిటికి మట్టి అంటరాదని భావించినట్లయితే ఆ వ్యక్తి ఆంతర్యంలో వినయభావం చోటు చేసుకోలేదని అర్థం. అందువల్లనే దైవప్రవక్త ఆ విధంగా బోధించారు.

150. 'తక్వా' గుణశీలుడు అంటే నిష్ఠాపరాయణుడు, ప్రతిపనిలోనూ దేవుని ఇష్టానికి ప్రాముఖ్యమిచ్చి దైవం ఇష్టపడిన దాన్ని చేస్తూ ఇష్టపడని దానికి దూరంగా ఉండే వ్యక్తి అని అర్థం. అరబీలో 'గని' అన్న పదానికి మేము సంతుష్ట హృదయుడని అనువదించాము. గని అన్నదానికి ఆత్మాభిమానం గల వ్యక్తి అని, సంతుష్టి పొందిన వ్యక్తి అని, సౌభాగ్యవంతుడని కూడా అర్థం వస్తుంది. కలిగిన దానిపై సంతృప్తి, సంతుష్టి దానిపై ఆత్మాభిమానం కంటే గొప్ప సౌభాగ్యమేముంది? భయభక్తులు, ధర్మనిష్ఠతో పాటు మనిషిలో సంతుష్టి ఏర్పడి ఇంకా అతను పేరూ ప్రతిష్ఠలకు ప్రాకులాడకుండా

(۱۵۲) عَنِ ابْنِ الْفَرَاسِی اَنَّ الْفَرَاسِیَ قَالَ قُلْتُ لِرَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اَسْئَلُ یَا رَسُوْلَ اللّٰهِ؟ فَقَالَ النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ "لَا" وَاِنْ کُنْتَ لَا بُدَّ فَسْئَلِ الصّٰلِحِیْنَ ۔ (ابوداؤد ۔ مشکوٰۃ ص ۱۶۳)

152. ఇబ్ను ఫరాసి ఉల్లేఖనం ప్రకారం (ఆయన తండ్రి) ఫరాసి ఇలా తెలిపారు, "నేనొకసారి దైవప్రవక్తను అడిగాను, 'నేను అర్థింపులతో చెయ్యిచాచవచ్చునా?' అని. దానికి ఆయన ఇలా బోధించారు, "కూడదు, అంతగా గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడితే సజ్జనులయిన వారిని అడగవచ్చు."

(అబూదావూద్, మిష్కాత్)

(۱۵۳) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِنَّ الْمَسْئَلَةَ لَا تَحِلُّ اِلَّا لِثَلَاثَةٍ لِذِیْ فَقْرٍ مُّدْقِعٍ وَلِذِیْ غُرْمٍ مُّفْظِعٍ اَوْ لِذِیْ دَمٍ مُّوْجِعٍ ۔ (ابوداؤد ۔ مشکوٰۃ ۔ باب من لا تحل له المسئلة)

153. హజ్రత్ అనస్ (రజిఅల్లాహు అన్హు) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ముగ్గురు మనుషులకు తప్ప మరెవరికీ అర్థించడం ధర్మసమ్మతం (హలాల్) కాదు – 1. కటిక దరిద్రుడు, 2. విపత్కరమయిన రుణభారం క్రింద అణగిపోయినవాడు, 3. బాధాకరమయిన రక్తభారం కలవాడు."

---

మరుగున పడి ఉండడమే ఇష్టపడితే అది నిజంగా దైవ ప్రసాదితమయిన మహావరప్రసాదమే. ఇలాంటి సద్గుణ సంపన్నుడయిన వ్యక్తిని దైవం ఇష్టపడటంలో ఆశ్చర్యమే లేదు.

151. సంతృప్తి, సంతుష్టి (Contentment) అన్న గుణం ప్రాపంచిక సంపద లన్నింటిలో మహోన్నతమయింది. ఆధ్యాత్మిక సంపద అయిన ఇస్లాంతో పాటు ఈ ప్రాపంచిక వరప్రసాదమూ మనిషికి లభిస్తే అతను ఉభయ లోకాల సకల విజయాలను సాధించినట్లే.

152. మనిషి ఆత్మాభిమానాన్ని చంపుకుని ఇతరుల్ని అర్థించడానికి సిద్ధమవ్వాలంటే గత్యంతరం లేని స్థితిలోనే జరుగుతుంది. అలాంటి పరిస్థితుల్లోనూ సజ్జనుల వద్ద అర్థించడమే ఉత్తమం అని అంటున్నారు దైవప్రవక్త. సజ్జనులు తాము చేసిన మేలుకై

(١٥٤) عَنْ أُمِّ سَلَمَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَا نَقَصَ مَالٌ مِنْ صَدَقَةٍ وَلَا عَفَا رَجُلٌ عَنْ مَظْلَمَةٍ اِلَّا زَادَهُ اللّٰهُ بِهَا
عِزًّا فَاعْفُوْا يُعِزَّكُمُ اللّٰهُ، وَلَا فَتَحَ رَجُلٌ عَلٰى نَفْسِهٖ بَابَ مَسْئَلَةٍ اِلَّا
فَتَحَ اللّٰهُ عَلَيْهِ بَابَ فَقْرٍ ـ (المعجم الصغير للطبراني ص ٢٧)

154. హజ్రత్ ఉమ్మె సల్మా ఉల్లేఖించిన దాని ప్రకారం దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు, "1.సదకావల్ల సంపాదనలో కొరత ఏర్పడదు. 2. అన్యాయాన్ని.అక్రమాన్ని మన్నించి వేస్తే అల్లాహ్ తప్పనిసరిగా ఆ వ్యక్తి గౌరవాన్ని ద్విగుణీకృతం చేస్తాడు. అందువల్ల ప్రజల్ని మన్నించండి, అల్లాహ్ మిమ్మల్ని గౌరవపరుస్తాడు. మనిషి అర్థించే ద్వారాన్ని తెరచుకుంటే దైవం అతనికై బీదరికం, దారిద్ర్యాల ద్వారాన్ని తెరుస్తాడు.

(అల్ మో'జముస్సగీర్)

---

ఎలాంటి ప్రతిఫలం ఆశించరు. ఇంకా చేసిన మేలును నలుగురికి చెప్పుకుని అర్థించే వాని ఆత్మాభిమానంపై దెబ్బతీయరు. అందువల్ల అనివార్య పరిస్థితుల్లో సజ్జనులముందు చెయ్యిచాచి అడగడం తప్పుకాదు.

153. చీటికి మాటికి అర్థించడాన్ని ఎంతగా నిరుత్సాహపరచడం జరిగిందో తెలుస్తోంది. ఇల్లూవాకిలి లేక నిరాధారులయిన దౌర్భాగ్యులు, మోయలేని రుణభారం గలవాడు, రక్తపరిహారం చెల్లించవలసినవాడు. రక్తపరిహారం అంటే ఏ కారణాల వల్లనయిన ఒకరికి ప్రాణ నష్టం కలిగిస్తే ఇస్లామీయ న్యాయం ప్రకారం చెల్లించవలసిన దండన అని భావం. ఇది హతుని వారసులకు చెల్లించవలసి ఉంటుంది. ఈ మూడు పరిస్థితుల్లోనూ మనిషి బయటపడే మార్గాంతరం ఏదీ కానరాదు గనక స్వచ్ఛంద సంస్థలనో లేక ప్రభుత్వ ఖజానానో అదీ లేకపోతే శ్రీమంతులయిన సహృదయులనో అర్థించడంలో తప్పులేదు.

**పూర్వరంగం**

ఈ హదీసుకు పూర్వం ఓ గాథ ఉంది. దాన్ని ఇక్కడ ఉటంకించడం సబబుగా తోస్తోంది. ఇస్లాం భిక్షాటనను ఎలా రూపు మాపదలచిందో కూడా ద్యోతకమవుతుంది.

ఒకసారి ఓ అన్సారీ, దైవసందేశహరుల (సఅసం) సమక్షంలో హాజరయి అర్థించాడు. ఆయన అతన్ని, 'మీ ఇంట్లో ఏమయినా సామాను ఉందా' అనడిగారు. దానికతను, 'మా వద్ద ఒక గొంగళి ఉంది. దాన్ని మేము సగం పరచుకుంటాము, సగం కప్పు

(۱۵۵) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا تَتَّخِذُوا الضَّيْعَةَ فَتَرْغَبُوْا فِي الدُّنْيَا (رواه الترمذی۔ مشکوٰۃ کتاب الرقاق)

155. దైవప్రవక్త (సఅసం) బోధించినట్లు హజ్రత్ ఇబ్ను మస్ఊద్ ఉల్లేఖించారు, "ఆస్తుల్ని సమకూర్చకండి, ఆ తరువాత ప్రపంచానికే అంకితమయి పోతారు." (తిర్మిజి)

(۱۵۶) عَنْ عَبْدِ الرُّوْمِيِّ قَالَ دَخَلْتُ عَلٰى اُمِّ طَلْقٍ فَقُلْتُ مَا اَقْصَرَ
سَقْفَ بَيْتِكِ هٰذَا قَالَتْ يَا بُنَيَّ اِنَّ اَمِيْرَ الْمُؤْمِنِيْنَ عُمَرَ بْنَ الْخَطَّابِ
كَتَبَ اِلٰى عُمَّالِهٖ اَنْ لَا تُطِيْلُوْا بِنَاءَكُمْ فَاِنَّهٗ مِنْ شَرِّ اَيَّامِكُمْ (الادب المفرد ص۶۶)

156. అబ్దుర్రూమి ఇలా ఉల్లేఖించారు, "నేనొకసారి ఉమ్మె 'తల్క్' వద్దకు వెళ్ళాను. నేను, 'మీ ఇంటి కప్పేమిటీ ఇంత తక్కువ ఎత్తులో ఉంది' అనడిగాను. ఆవిడ ఇలా బదులిచ్చారు, 'నాయనా, అమీరుల్ మూ'మినీన్ ఉమర్ ఇబ్ను ఖత్తాబ్ తన (ప్రభుత్వ) ఉద్యోగులకు, 'మీ కట్టడాలు ఎత్తయినవిగా నిర్మించుకోకండి, అది ఎంతో దుష్టదినాలకు సంకేతం అని ఉత్తరువులు పంపారు." (అల్ అదబుల్ ముఫ్రద్)

కుంటాము. ఇంకా ఓ పెద్ద గిన్నె ఉంది. అందులోనే మేము నీరు త్రాగుతాము' అని బదులిచ్చాడు.

ఆయన ఆ రెండు వస్తువులూ తెప్పించి పాట ద్వారా రెండు దిర్హములకు అమ్మివేశారు. ఆ రెండు దిర్హములు అన్సారీకి ఇచ్చి 'ఒక్క దిర్హమ్‌తో భోజనానికి ఏదైనా కొనుక్కోమని, మరొక దిర్హమ్‌తో గొడ్డలి కొనుక్కుని నా వద్దకు రమ్మ'ని పురమాయించారు. అతను తిరిగి వచ్చిన తరువాత ప్రవక్త మహనీయులు (సఅసం) తన శుభహస్తాలతో గొడ్డలికి కమ్మవేసి అతనికి అందిస్తూ 'వెళ్ళి అడవి నుండి కట్టెలుకొట్టి (అమ్ముకో) పదిహేను రోజుల వరకు మళ్ళీ నాకు కనబడకు' అని సెలవిచ్చారు.

అన్సారీ అలాగే కట్టెలు కొట్టి అమ్ముకుంటూ ఉన్నాడు. పదిహేను రోజుల తర్వాత ప్రవక్త సమక్షంలో హాజరయినప్పుడు అతని వద్ద పది దిర్హమ్‌లు మిగిలాయి. దానితో అతను భోజనసామగ్రి, బట్టలు కొనుక్కున్నాడు. అప్పుడు దైవప్రవక్త ఇలా ప్రవచించారు, "కష్టించి పనిచేసే ఈ పద్ధతి, అర్థించడం వల్ల ప్రళయదినాన నీ ముఖాన కలిగే పరాభవపు మచ్చల కన్నా ఎంతో మేలయినది."

(١٥٧) عَنْ اَبِيْ اُمَامَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلَا تَسْمَعُوْنَ اَلَا تَسْمَعُوْنَ اِنَّ الْبَذَاذَةَ مِنَ الْاِيْمَانِ اِنَّ الْبَذَاذَةَ مِنَ الْاِيْمَانِ۔

(ابوداؤد، مشکوٰۃ۔کتاب اللباس)

157. హజ్రత్ అబూ ఉమామ(ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "జనులారా, మీరు వినటం లేదా? మీరు వినటం లేదా? నిరాడంబరత నిస్సందేహంగా విశ్వాసానికి గుర్తు."

(అబూదావూద్, మిష్కాత్)

(١٥٨) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا اسْتَكْبَرَ مَنْ اَكَلَ مَعَهٗ خَادِمُهٗ وَرَكِبَ الْحِمَارَ بِالْاَسْوَاقِ وَاعْتَقَلَ الشَّاةَ فَحَلَبَهَا۔

158. హజ్రత్ అబూ హురైరా (ర.అ), దైవప్రవక్త (సఅసం) ఇలా నుడివినట్లు ఓ ఉల్లేఖనంలో పేర్కొన్నారు, "ఎవరిలోనయితే అహంకారం ఉండదో అతనితోపాటు అతని నౌకరు కూడా భోజనం కలిసి చేస్తాడు. అతను బజారులో గాడిదను నయితం స్వారీ చేస్తాడు, మేకను పెంచుకుని దాని పాలు పిండుకుంటాడు."

---

154. ఈ హదీసులో మూడు నైతిక గుణాలు చర్చించడం జరిగింది. సదకా అంటే దైవమార్గంలో ఖర్చు చెయ్యడం అన్నమాట. జకాత్ ఇవ్వటం, దాన ధర్మాలు చెయ్యడంవల్ల బయటికి ధనం తగ్గినట్లు అగుపించినా నిజానికి సమాజంలో సామూహిక సంపద పెరుగుతుంది. సమాజం సౌభాగ్యవంతమవుతుంది. జకాత్, సదకా ఇచ్చే వ్యక్తిలో లోభత్వం, పిసినారితనం చోటు చేసుకోవు. సాధారణంగా చెల్లి ఉండి శత్రువుపై కక్షతీర్చుకోకపోవడం అవమానకరమని, పిరికితనమని భావిస్తారు. కాని తనకు జరిగిన అన్యాయాన్ని మన్నించగల ఉదార వైఖరి చూపే వ్యక్తి స్వయంగా ఆ అన్యాయం చేసిన వ్యక్తి దృష్టిలోనే ఎంతో ఆదరణీయుడయిపోతాడు. అలాంటి వ్యక్తికి అతని నైతిక ఆధిక్యత కారణంగా ఎల్లెడలా గౌరవమే ప్రాప్తమవుతుంది. అలాగే మనిషి స్వయంగావే భిక్షాటనకు పూనుకుంటే అతనికి సోమరితనం, నిర్లజ్జలాంటి నీచగుణాలు అబ్బుతాయి. ఆత్మగౌరవం దెబ్బతింటుంది. ఫలితంగా సంపాదించడం సుఖంగా బ్రతకడం, గౌరవంగా మసలుకోవడం అతనికి ఎంతమాత్రం సాధ్యం కాదు.

(١٥٩) عَنْ جَدَّةِ صَالِحٍ قَالَتْ رَأَيْتُ عَلِيًّا اِشْتَرٰى تَمرًا بِدِرْهَمٍ فَحَمَلَهٗ فِىْ مِلْحَفَةٍ فَقَالَتْ لَهٗ اَوْ قَالَ لَهٗ اَحَدٌ اَحْمِلُ عَنْكَ يَا اَمِيْرَالْمُؤْمِنِيْنَ قَالَ لَا اَبُوالْعِيَالِ اَحَقُّ اَنْ يَّحْمِلَ ۔ (الادب المفرد۔ باب الكبر ص ٨١)

159. సాలెహ్ నాయనమ్మ ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు, "నేనొకసారి హజ్రత్ అలీని చూశాను. ఆయన ఒక్క దిర్హానికి ఖర్జూరప్పండ్లు కొనుక్కుని దుప్పటిలో మూట కట్టుకుని ఎత్తుకున్నారు. నేనో, మరెవరో ఆయనతో "నేను ఎత్తుకుంటాను, ఓ అమీరుల్ మో'మినీన్" అని అనగా, హజ్రత్ అలీ, "వద్దు, మోయడానికి బిడ్డల తండ్రి అధికంగా యోగ్యుడయినవాడు" అని అన్నారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

155. ధర్మపరిధిలో ఉంటూ ఇళ్ళు కట్టుకోవడం, అవసరం మేరకు స్థిరాస్థిని పెంపొందించుకోవడంలో తప్పులేదు. దాన్ని అతిగా తీసుకుని మనిషి కేవలం 'డబ్బు మనిషి' అయిపోవడం, బ్రతుకుకు లక్ష్యమే ప్రపంచ భోగవిలాసాలయి పోవడంలాంటి దుర్గుణాలకు దూరంగా ఉండాలని ఇక్కడ బోధించడం జరిగింది. జీవన లక్ష్యం డబ్బు కన్నా, ఆస్తిపాస్తులకన్నా మహోన్నతమయింది.

156. ఎత్తయిన భవంతులు ఆడంబరానికి చిహ్నాలు. ఒక జాతిలో దాని నిజాశయం నుండి దృష్టి మరలి ఆడంబరాలపై లగ్నమయితే అది దాని పతనావస్థకు రాచబాట వేసిందన్న మాటే. అదే మాట చివరి వాక్యంలో 'దుష్ట దినాలకు చిహ్నం' అని చెప్పబడింది.

157. అరబీలో 'బజాజ' అన్న పదం ప్రయోగించడం జరిగింది. బజాజ అన్న పదానికి, మొహమాటం, బలవంతపు మర్యాద, అసహజమయిన ప్రవర్తనలేని జీవితం అని భావం. అదే నిరాడంబరత. మంచి దుస్తులు ధరించడం, అలంకరించుకోవడం ఇస్లాంలో నిషిద్ధం కాదు. కాని ఈ అభిరుచి కాస్త మితిమీరితే మనిషి దుబారా ఖర్చుకు, వ్యర్థవ్యయాలకు, గర్వం, పై మెరుగులు ఇత్యాదివాటికి తన సంపదనంతా ధారపొయ్యగలడు. అందువల్లనే ఇస్లామ్ అటు విలాసమయ జీవితం, ఇటు సన్యాసత్వం రెంటికీ మధ్య మధ్యేమార్గాన్ని అవలంబించమని బోధించింది. దీన్నే ఉల్లేఖనంలో 'బజాజ' అని పేర్కొనడం జరిగింది.

158. తన సేవకుడు తనతోపాటు సహపంక్తిలో తినడమంటే మనిషి తాను యజమాని అని గర్వపడటం మానుకున్నాడని అర్థం. పైగా ఇస్లామ్ ప్రతిపాదించే సమానతా భావం అతనిలో నాటుకుందని భావం. గాడిదపై స్వారి చెయ్యడం అంటే

(١٦٠) عَنْ عَمْرَةَ قِيْلَ لِعَائِشَةَ مَاذَا كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَعْمَلُ فِيْ بَيْتِهٖ قَالَتْ كَانَ بَشَرًا مِّنَ الْبَشَرِ يَفْلِيْ ثَوْبَهٗ وَيَحْلِبُ شَاتَهٗ ـ (الادب المفرد ـ باب ما يعمل الرجل في بيته ص ٧٩)

160. అమ్‌రహ్ ఉల్లేఖనం ప్రకారం, ఆవిడ హజ్రత్ ఆయిషా (ర.అ)ని "ప్రవక్త మహనీయులు ఏమి చేస్తూ ఉండేవారు?" అని అడగ్గా ఆమె ఇలా బదులిచ్చారు, "ఆయన సాధారణ మానవుల్లాంటి ఓ మానవుడు. బట్టల్లో పేలున్నట్లయితే వాటిని ఏరివేసేవారు. మేక పాలు పిండుకునేవారు."

(అల్ అదబుల్ ముఫ్రద్)

(١٦١) عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَمَّا بَعَثَهٗ اِلَى الْيَمَنِ قَالَ اِيَّاكَ وَالتَّنَعُّمَ فَاِنَّ عِبَادَ اللّٰهِ لَيْسُوْا بِالْمُتَنَعِّمِيْنَ ـ (رواه احمد ـ مشكوٰة ـ باب فضل الفقراء)

161. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ ఇలా ఉల్లేఖించారు, ప్రవక్తమహనీయులు (సఅసం) తన్ను యమన్‌కు పంపేటప్పుడు, "చూడు ముఆజ్, విలాసవంతమైన జీవితం గడపబాకు. విలాసమయ జీవితం గడపడం దేవుని దాసుల పద్ధతి కాదు." (అహ్మద్, మిష్కాత్)

---

అత్యంత అల్పమైన వాహనాన్ని వాడటానికి జంకకపోవడం అని అర్థం. తన హోదా, దర్పం పట్ల జాగ్రత్తపడే మనిషి ఎలాంటి భేషజాలకు పోకుండా దొరికిన వాహనాన్ని ఎక్కి పోగలుగుతాడా!

159. హజ్రత్ అలీ (ర.అ) సన్మార్గగాములయిన ఖలీఫాలలో నాల్గవవారు. ఖలీఫాలందరూ తమ ప్రవక్త ఆదర్శం ప్రకారం జీవించిన చాలా నిరాడంబర జీవులే. ఆనాటి ప్రపంచంలో ఓ మహా సామ్రాజ్యానికి అధినేత అయి ఉండీ తన ఇంటికి కావలసిన ఆహార పదార్థం తానే కొనుక్కొని పోవడం అటుంచి దాన్ని తన దుప్పటిలో కట్టుకుని నెత్తిన ఎత్తుకోవడం కన్నా సాదాసీదాతనం మరేది కాగలదు? హజ్రత్ అలీ కాస్త చతురోక్తుడు. అలంకారభూషితమయిన వాక్యాలు పలికేవారని ప్రతీతి. మంచి రచయిత కూడా. ఆ లక్షణం ఈ వాక్యంలో గోచరించడం లేదూ?

160. ప్రవక్త సహచరులు, వారి అనుయాయులు, దైవ సందేశహరులు తమ రోజు వారీ కార్యక్రమాలు ఎలా గడిపేవారో తెలుసుకోవాలని చాలా ఉబలాటపడేవారు.

(۱۶۲) عَنْ عَمْرِو بْنِ شُعَيْبٍ عَنْ اَبِيْهِ عَنْ جَدِّهٖ قَالَ قَالَ
رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كُلُوْا وَاشْرَبُوْا وَتَصَدَّقُوْا وَالْبَسُوْا
مَا لَمْ يُخَالِطْ اِسْرَافٌ وَّلَا مَخِيْلَةٌ ۔ (نسائی ۔ مشکوٰۃ ۔ کتاب اللباس)

**162.** అమ్ర్ బిన్ షుఅయ్‌బ్ తన తండ్రి షుఅయ్‌బ్ చెప్పగా, ఆయన షుఅయ్‌బ్ తాత ముహమ్మద్ చెప్పగా ఉల్లేఖించారు: దైవ సందేశహరులు (సఅసం), "తినండి, త్రాగండి, బట్టలూ తొడుక్కోండి, సదకా దానధర్మం చెయ్యండి- అయితే అందులో అహంకారం, దుబారా మిశ్రమం కానంతవరకు" అని ప్రబోధించారు. (నసాయి, మిష్కాత్)

(۱۶۳) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ سَرْجِسَ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ اَلسَّمْتُ الْحَسَنُ وَالتُّؤَدَةُ وَالْاِقْتِصَادُ جُزْءٌ مِّنْ اَرْبَعٍ وَّعِشْرِيْنَ جُزْءًا
مِّنَ النُّبُوَّةِ (ترمذی، مشکوٰۃ ص ۴۳۰)

**163.** అబ్దుల్లాబిన్ సర్జిస్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "సౌశీల్యం, నిగ్రహం, సంతులిత వైఖరి దైవదౌత్యంలోని 24వ వంతుకు చెందినవి." (తిర్మిజి, మిష్కాత్)

---

అందుకు ఈ హదీసు ఓ నిదర్శనం. ప్రవక్త మానవాతీత శక్తిగల వ్యక్తి కాడని, సామాన్య మనిషిలా తన అవసరాలు, అగత్యాలూ తీర్చుకునేవారని చెప్పడానికి ఆయన ప్రియ సతీమణి హజ్రత్ ఆయిషా రెండు విషయాలు ఉదాహరణగా పేర్కొన్నారు. ఎక్కువగా ఉన్ని బట్టలు వాడటం మూలాన ఎప్పుడయినా వాటిలో పేలు చొరబడే అవకాశం ఉంటుంది కాబట్టి ఆయన వాటిని శుభ్రపరచుకునేవారని తేటమవుతోంది.

161. హజ్రత్ ముఆజ్‌ని ప్రవక్త మహనీయులు యమన్ గవర్నరుగా నియమించి పంపారు. పంపేటప్పుడు, అక్కడి సుభిక్షమయిన వాతావరణంలోపడి విలాసమయ జీవితానికి గురికారాదని ఆయన హెచ్చరించారు. హుందాగా, అందంగా (అంటే పరిశుభ్రంగా, పరిశుద్ధంగా, మంచి వస్త్రధారణతో) జీవించడం వేరు, విలాసవంతంగా (అంటే దుబారా ఖర్చుతో, సుఖభోగాలతో) అలరారడం వేరు. రెంటిలో చాలా వ్యత్యాసముంది. అందంగా తయారవడం అన్నది ప్రవక్త మహనీయులు (సఅసం) స్వయాన ఇష్టపడేవారు. హదీసుల్లో, ఆయన కొత్త బట్టలు తొడుక్కున్నప్పుడు చేసే

(۱٦٤) عَنْ عَمَّارٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
يَقُوْلُ اِنَّ طُوْلَ صَلٰوةِ الرَّجُلِ وَقِصَرَ خُطْبَتِهٖ مِئِنَّةٌ مِّنْ فِقْهِهٖ فَاَطِيْلُوا
الصَّلٰوةَ وَاَقْصِرُوا الْخُطْبَةَ وَاِنَّ مِنَ الْبَيَانِ لَسِحْرًا (رواہ مسلم مشکوٰۃ باب الخطبہ ص ۱۱۵)

164. అమ్మార్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరుడు (సఅసం) ఇలా ఉపదేశించగా ఆయన విన్నారు: "నమాజ్ దీర్ఘంగాను, ప్రసంగం క్లుప్తంగా చెయ్యడం మనిషి ఫకీహ్ (వివేచనా పరుడు) అవడానికి నిదర్శనాలు. నమాజ్ పొడిగించండి, ప్రసంగాన్ని వీలైనంత క్లుప్తంగా ముగించండి. నిస్సందేహంగా కొన్ని ప్రసంగాలు ఇంద్రజాలంలా పనిచేస్తాయి."

(ముస్లిం, మిష్కాత్)

(۱٦۵) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ
اَحَبَّ الدِّيْنِ اِلَى اللّٰهِ مَا دَامَ عَلَيْهِ صَاحِبُهٗ - (بخاری، مسلم مشکوٰۃ. باب القصد
فی العمل صـ۱۱۲)

165. హజ్రత్ ఆయిషా (ర.అ), "ధార్మిక కార్యకలాపాల్లో మెచ్చదగిన పని - నిలకడతో క్రమం తప్పకుండా చేసే పని" అని ఆదరణీయ ప్రవక్త అన్నట్లు ఉల్లేఖించారు. (బుఖారి, ముస్లిం)

---

దుఅ - నా జీవితంలో దీనిద్వారా అందాన్ని ప్రసాదించు - అని ఉంది. మరో చోట, కొత్త అతిధులెవరయినా కలవడానికి వచ్చినప్పుడు ఆయన, అందమైన బట్టలు తొడుక్కునేవారని కూడా తెలుస్తోంది.

అయితే అందం, హుందాతనం అతిశయిస్తే విలాసమయంగా రూపొందుతుంది. హుందాతనం తగ్గితే అది సన్యాసత్వం క్రిందికి వస్తుంది. రెండు అతివాదాల మధ్య సరిహద్దును తెలుసుకోవడం ఆయా వ్యక్తుల విశ్వాసమయ మనస్సాక్షికే వదిలేసింది షరీఅత్. "మీ అంతర్యాలను ప్రశ్నించుకోండి" అన్న ఆదేశం ఇలాంటి సందర్భాల్లోనే ఉపయోగపడుతుంది.

162. ఈ హదీసులో, ధర్మబద్ధంగా జీవిస్తూ, వీలయినంత మంచి ఆహార పానీయాలు, దుస్తులూ ధరించడం తప్పుకాదని, అలాగే వీలయినంత మేరకు దానధర్మాలు

(۱۶۶) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَا عَبْدَ اللّٰهِ لَا تَكُنْ مِثْلَ فُلَانٍ كَانَ يَقُوْمُ اللَّيْلَ فَتَرَكَ قِيَامَ اللَّيْلِ۔

(بخاری، مسلم، مشکوٰۃ ـ باب التحریض علی قیام اللیل ص۱۰۱)

166. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్, దైవసందేశహరులు ఇలా ఉపదేశించారని ఉల్లేఖించారు: "అబ్దుల్లాహ్! ఫలానా వ్యక్తి మాదిరిగా అవకు, అతను తహజ్జుద్ కై రాత్రిళ్ళు లేచేవాడు. తరువాత అతను రాత్రిళ్ళు లేచే ఆచరణ వదలివేశాడు." (బుఖారి, ముస్లిం)

---

చెయ్యడం కూడా అవసరమేనని అయితే ఈ పనుల్లో అహంభావంగాని, గర్వంకాని, అదుపులేకుండా చేసే దుబారా ఖర్చుగాని చోటుచేసుకోరాదని బోధించడం జరిగింది.

163. సౌశీల్యం అంటే రుజువర్తనం, నిజాయితీ అనిభావం. సంతులిత వైఖరి అంటే ఏ అతి వాదానికీ గురికాకుండా ఉండడమని అర్థం. హదీసులో ప్రస్తావించిన లక్షణాలు దైవప్రవక్తల జీవితాల్లో ప్రముఖ స్థానం కలిగి ఉంటాయి. ఎవరు ఎంతగా వాటిని అవలంబిస్తే ఆమేరకే అతను దైవప్రవక్తల అనుసరణలో పరిపూర్ణతను సాధించగలడు. మరో విషయమేమంటే జీవిత వ్యవహారాల్లో ఏ ఒక్క వైపునకూ మొగ్గకుండా మధ్యస్థ విధానాన్ని అనుసరించడమన్నది అభిలషణీయం. ఉదాహరణకు ఆర్థిక వ్యవహారాల్లో అటు దుబారా ఖర్చులకు పాల్పడడమో, ఇటు పిసినారితనానికి లోనవడమో కాకుండా ఈ రెండు అతివాద ధోరణుల్ని వదలి వాటి మధ్యన అనవసరమయిన చోట ఖర్చు చెయ్యకుండా అగత్యపరులకు సహాయపడటంలో వెనకాడకుండా మెలగడమే మధ్యస్థ మార్గం. షరీఅత్, జీవితంలో అన్నిటా దీన్ని అవలంబించాలని కోరుతుంది.

164. వినేవారికి విసిగించేలా సుదీర్ఘమయిన ప్రసంగాలు చేస్తే ప్రసంగాలంటేనే జనులకు ఏవగింపు కలుగవచ్చు. అందువల్ల క్లుప్తంగానే అయినా అన్ని విషయాలూ సమగ్రంగా తెలిపి ఆచరణాభిముఖులుగా చెయ్యగలిగితే ఉపన్యాసకుని గొప్పదనం అందులోనే ఉంది. కొందరు చెప్పే శైలి, ధోరణి, మాటల ఎంపిక నిజంగానే వినేవారిపై ఇంద్రజాలంలా పని చేసి వారిని ఉత్తేజిత పరచవచ్చు. మరికొందరు ఎన్ని గొప్ప విషయాలు చెప్పినా, ఎన్నిసార్లు చెప్పినా మనిషిలో చలనం కలగకపోవచ్చు. ఇలాంటి చొప్పదంటు ప్రసంగాలకన్నా పనికివచ్చే ముక్క ఒక్కటి చాలు, మనిషినీ మనసునూ మార్చడానికి. అయితే నమాజ్ తప్పనిసరయిన విషయం, దైవానికి సంబంధించిన విషయం గనక భక్తుడు కాస్త ఎక్కువ సమయమయినా సంతోషంగానే సిద్ధమవుతాడు.

(١٦٧) عَنْ نَافِعٍ عَنْ عَائِشَةَ قَالَتْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ إِذَا سَبَّبَ اللّٰهُ لِاَحَدِكُمْ رِزْقًا مِنْ وَجْهٍ فَلَا يَدَعْهُ حَتّٰى يَتَغَيَّرَ لَهٗ اَوْ يَتَنَكَّرَ لَهٗ۔ (مسند احمد۔ مشکوٰۃ باب الکسب)

167. హజ్రత్ ఆయిషా ద్వారా విన్నట్లు నాఫే (ర.అ) ఉల్లేఖించారు, దైవ ప్రవక్త ఇలా బోధించారని ఆవిడగారు తెలిపారు: "మీలో ఎవరికయినా దైవం జీవనోపాధిమార్గాన్ని అనుగ్రహించినప్పుడు, అందులో ఏదయినా పరివర్తన, లేదా చెడుగు ఉత్పన్నం కానంతవరకు దాన్ని వదల రాదు."
(ముస్నద్ అహ్మద్ - మిష్కాత్)

(١٦٨) عَنْ جَابِرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِسْتِتْمَامُ الْمَعْرُوْفِ اَفْضَلُ مِنِ ابْتِدَائِهٖ (المعجم الصغیر للطبرانی۔ ص ٨٦)

168. హజ్రత్ జాబిర్ ఉల్లేఖనం: "సత్కార్యం ప్రారంభం కన్నా దాని పరిపూర్తి శ్రేష్టమయింది." అని దైవసందేశహరులు ప్రవచించారు.

---

165. సాధారణంగా మనిషి ఏదో ఆరంభశూరత్వం జూపి, లేదా ఏదో కారణాన ఉత్తేజితుడయి కొన్ని పనులు చేసేసి ఆ తరువాత నిద్రపోవడం కన్నా చిన్నపని అయినా, నిరంతరంగా, అనవరతం చేస్తూ ఉన్నట్లయితే అది ప్రభావం రీత్యానూ ధార్మికరంగంలో పుణ్యం రీత్యాను గొప్ప ప్రతిఫలాలనిస్తుంది. నిలకడ, స్థిర చిత్తంతో చేసే కొద్దిపాటి సత్కార్యాలే పర్యవసానాలరీత్యా గొప్పవి. తాత్కాలిక ఉద్వేగంతో ఏవో కొన్ని సమయానుకూలమయిన పనులు చేసి ఆ తరువాత చలనం లేకుండా పడి ఉండడం అనర్థదాయకం.

166. విధిగా నిర్ణయమయిన పనులయితే ఎలాగూ స్థిరచిత్తంతో చెయ్యవలసి ఉంటుంది. అదనపు సత్కార్యాల విషయంలోనే ఈ నిలకడ చూపవలసింది.

167. దీని పూర్వ రంగం ఏమిటంటే "నాఫె" తన వాణిజ్య సామగ్రిని సిరియా దేశానికి ఎగుమతి చేసేవారు. ఆ తరువాత అకారణంగా అటునుంచి మరల్చి ఇరాక్‌కు ఎగుమతి చెయ్యాలని నిర్ణయించుకున్నారు. ఈ మార్పు గురించి తెలుసుకున్న హజ్రత్ ఆయిషా ఆయన్ని వారించి ఈ దైవప్రవక్త ఉపదేశాన్ని వినిపించారు. దీని వల్ల తెలిసేదేమంటే విశ్వాసి కేవలం ఆరాధనల విషయంలోనే కాక నిత్యజీవిత వ్యవహారాల్లోనూ

(١٦٩) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ الزُّبَيْرِ قَالَ مَا رَأَيْتُ امْرَأَتَيْنِ أَجْوَدَيْنِ
مِنْ عَائِشَةَ وَأَسْمَاءَ وَجُوْدُهُمَا مُخْتَلِفٌ أَمَّا عَائِشَةُ فَكَانَتْ تَجْمَعُ
الشَّيْءَ إِلَى الشَّيْءِ حَتّٰى إِذَا كَانَ اجْتَمَعَ عِنْدَهَا قَسَمَتْ وَأَمَّا أَسْمَاءُ
فَكَانَتْ لَا تُمْسِكُ شَيْئًا لِغَدٍ۔ (الادب المفرد۔ باب سخاوت النفس ص۴۳)

169. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ ఇలా ఉల్లేఖించారు: నేను హజ్రత్ ఆయిషా, హజ్రత్ అస్మాల కన్నా దాతృత్వ స్వభావం గల మహిళల్ని చూడలేదు. అయితే ఇద్దరి దాతృత్వపు స్వభావమూ వేర్వేరుగా ఉండేది. హజ్రత్ ఆయిషా పరిస్థితి ఏమిటంటే ఆవిడ డబ్బు వచ్చినది వచ్చినట్లుగానే కూడబెట్టేవారు. సొమ్ము పుష్కలంగా కూడబెట్టి దాన్ని అగత్యపరుల్లో పంచివేసేవారు. ఇక హజ్రత్ అస్మా విషయానికి వస్తే ఆవిడ విధానం దీనికి పూర్తిగా భిన్నంగా ఉండేది. ఆవిడ రేపటి నిరీక్షణలో ఏమీ దాచిపెట్టేవారు కాదు. వచ్చినది వచ్చినట్లుగానే పంచిపెట్టేవారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

నిలకడ కనబరచవలసి ఉంటుంది. మాటిమాటికి అభిప్రాయాన్ని మార్చుకోవడం అతనికి శోభించదు.

168. భావమేమంటే, ఏమంచిపని అయినా ముఖ్యంగా మరొకరిపట్ల చేసే ఏ సత్కార్యం, ఉపకారమయినా దాన్ని పరిపూర్ణంగావించాలి. అసంపూర్ణమయిన సత్కార్యం ఉత్తమ నైతికతగా పరిగణనలోకి రాదు. ఎదుటి వ్యక్తికి (ఎవరి పట్లనయితే మేలు చేస్తున్నామో వారికి) ఈవైఖరివల్ల అసంతృప్తి, అయిష్టం కలగవచ్చు. చేసిన ఆ కాస్తమేలు కూడా బూడిద పాలయిన పన్నీరుగా మారిపోవచ్చు.

169. ఈ హదీసు ఉల్లేఖన కర్త (రావి) హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (ర.అ) హజ్రత్ అస్మా కుమారుడు. హజ్రత్ అస్మా, హజ్రత్ ఆయిషా సొంత అక్కా చెల్లెండ్రు. అందువల్ల కుటుంబ సభ్యుడయిన హజ్రత్ అబ్దుల్లాకు తెలిసినంతగా వారిద్దరి గురించి మరెవరికి తెలిసి ఉంటుంది? వారిరువురు అవలంబించిన దాతృత్వపు విధానాలు అనన్యమయినవే. అయితే హజ్రత్ ఆయిషా అనుసరించిన విధానం - అంటే డబ్బు కూడబెట్టి ఓ పథకం ప్రకారం సహాయాలను అందజెయ్యడం అన్నది - సంగఠిత ఆచరణావిధానం. దీనివల్ల చిల్లరమల్లరగా కాకుండా అగత్యపరులకు లెక్కప్రకారం, వారి అవసరం మేరకు, వీలయితే వారి శాశ్వత ఉపాధి కల్పనకు సహాయం అందజెయ్యడానికి వీలవుతుంది. రేపటి సంగతి దేవుడెరుగు, నేడు లభించిన అవకాశాన్ని ఎందుకు

(۱۷۰) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَرْبَعٌ اِذَا كُنَّ فِيْكَ فَلَا عَلَيْكَ مَا فَاتَكَ مِنَ الدُّنْيَا حِفْظُ اَمَانَةٍ وَصِدْقُ حَدِيْثٍ، وَحُسْنُ خَلِيْقَةٍ وَعِفَّةٌ فِىْ طُعْمَةٍ۔ (رواه احمد مشكوٰة۔ كتاب الرقاق)

170. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు: "మీకు నాలుగు విషయాలు ప్రాప్తమయితే ప్రపంచంలో మరే వస్తువు ప్రాప్తం కాకపోయినా అది మీకు నష్టకరం కాజాలదు. అవి: (1) అప్పగింతను కాపాడటం (2) నిజాయితీగా మాట్లాడటం (3) ఉత్తమ రీతిలో మెలగటం (4) పరిశుద్ధ జీవనోపాధికై పాటుపడటం."

(మిష్కాత్)

---

జారవిడవాలన్న ఆలోచనతో ఎప్పటికప్పుడు ఉన్నంత సహాయం అందజెయ్యడమూ ఓ పద్ధతే. వీరిద్దరూ హజ్రత్ అబూబక్ర్ (ర.అ) లాంటి అగ్రగణ్యుల కుమార్తెలు కదా. ఆయన మటుకు, ఇస్లామీయ వ్యవస్థకు అవసరం కలిగితే తన ఇంటిలోని సర్వస్వమూ ధారబోయలేదా?

170. ప్రవక్త మహనీయులు (సఅసం) అనేక సందర్భాల్లో సందర్భోచితంగా ఇలాంటి బోధనలు చేశారు. ఇక్కడ నాలుగు సద్గుణాలు మనిషిలో ఉంటే ఇక అతనికి ప్రపంచంలో ఏ సంపదలు లేకపోయినా ఫరవా లేదు అన్న ప్రబోధం ఉల్లేఖించబడింది. ఈ నాల్గింటినీ పరిశీలిద్దాం – (1) అప్పగింతను కాపాడటం అంటే వస్తువుల్ని అప్పగించినప్పుడు, ఆ వస్తువుల్ని భద్రపరచి తిరిగి ఒప్పజెప్పడం అని మాత్రమే అర్థం కాదు. సామాజిక వ్యవహారాల్లో ఏవయినా బాధ్యతల్ని స్వీకరించడం కూడా అప్పగింతలాంటిదే. దాన్ని సరిగ్గా నిర్వర్తించడం, రాగద్వేషాలకు అతీతంగా వ్యవహరించడం, తాను నిర్వర్తించలేకపోతే మంచితనంతో ఆ బాధ్యత నుండి వైదొలగడం అన్నీ చేరి ఉన్నాయి. అలాగే మాట, సంభాషణ, చర్చలు, విద్యావిజ్ఞానాలు కూడా అప్పగింత లాంటివే. వాటిని ఎక్కడ ఎలా అందరి శ్రేయంకై ఉపయోగించాలో అలానే వినియోగించాలి. అంతేకాని వాటి ద్వారా మనస్పర్ధలు పెరిగే, సమాజంలో విచ్ఛిత్తి ఏర్పడే ఏ అవకాశమూ రానివ్వరాదు. (2) నిజాయితీగా మాట్లాడటం అంటే కలిమిలోనూ లేమిలోనూ, కష్టాల్లోనూ సుఖాల్లోనూ ఎలాంటి ప్రలోభాలకు, భయాలకు లొంగరాదు. ఎల్లవేళలా సత్యమే పలికే నైతిక సాహసం కలిగి ఉండాలి. అవసరమేర్పడి

(۱۷۱) عَنْ اَبِیْ هُرَیْرَةَ عَنِ النَّبِیِّ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ
اَدِّ الْاَمَانَةَ اِلٰى مَنِ ائْتَمَنَكَ وَلَا تَخُنْ مَنْ خَانَكَ۔ (رواہ الترمذی۔ مشکوٰۃ
باب الشرکۃ ص ۲۵۴)

171. హజ్రత్ అబూ హురైరా (రజిఅన్) ఓ ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు తెలిపారు: "మీ వద్ద అప్పగింతగా దేన్నయినా భద్రపరచినవారికి వారి వస్తువు భద్రంగా తిరిగి ఒప్పజెప్పండి. మరెవరయినా వారి పట్ల నమ్మక ద్రోహం చేస్తే అతని పట్ల మీరెంతసేపటికీ నమ్మక ద్రోహం తలపెట్టకండి." (తిర్మిజి - మిష్కాత్)

---

నప్పుడు ప్రపంచం తన్ను ఏమంటుందో అన్న సంశయాన్ని దగ్గరకు రానివ్వకుండా సత్యాన్ని చాటాలి. వెగటు కలిగించే మాటలనయినా సరే కుండబద్దలు కొట్టే విధంగా చెప్పే అవసరం ఏర్పడితే జంకరాదు. నిజాన్ని నిజాయితీగా, అయితే సంఘమర్యాదల కనుగుణంగా, పలికే ధైర్యం కలిగి ఉండాలి. (3) సమాజంలో జీవించాలంటే అన్యోన్యతను పెంచే రీతిలోనే అందరితో మెలగవలసి ఉంటుంది. నగుమోముతో పలకరించడం, నెమ్మదిగా, శాంతంగా మాట్లాడటం, ఇతరుల అసభ్యతను భరించడం, ఇతరుల కుసంస్కారాన్ని సహించడం, వారికి ఆ పంథాలోనే బదులు పలకకుండా ఓరిమి వహించడం, తనకు బాధ కలిగినా ఇతరుల మనస్సును నొప్పించే విధంగా మొరటుగా, కటువుగా మాట్లాడకుండా ఉండటం, ఇతరులకు వీలయినంత మేరకు సహాయపడటం, సహాయం అందజెయ్యలేకపోతే కసరుకోకుండా సమాధానపరచడం ఇత్యాదివి సద్గుణాలుగా భావించబడతాయి. వీటిని సదా పాటించాలి. (4) ఉపాధి సముపార్జనలో ధర్మాధర్మాలను పాటించడం, అక్రమ సంపాదన, అన్యాయార్జిత సొమ్ములకు దూరంగా ఉండాలి. అన్యాయార్జితం అంటే కేవలం ఒకరి హక్కును కాజేసిన సొమ్ము మాత్రమే కాదు, తన కర్తవ్యం, బాధ్యత పూర్తిగా నిర్వర్తించకుండానే లేక బాధ్యతానిర్వహణలో జాప్యం, అలసత్వం, నిర్లక్ష్యం చూపుతూనే ప్రతిఫలాన్ని మటుకు పూర్తిగా ఆశించడం కూడా ఈ కోవలోనే వస్తుంది. ముఖ్యంగా వేతనానికి పనిచేసే ఉద్యోగులు, కార్మికులు, కూలీలు అందరూ ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. సక్రమమయిన ఉద్యోగం సంపాదించడం ఒక్కటే కాదు, ఆ ఉద్యోగ బాధ్యతల్ని నిర్వర్తించడం కూడా అవసరం. లేకపోతే ఆ ఉపాధి పరిశుద్ధమయిందనడానికి ఆస్కారముండదు. పోతే అధర్మమయిన జీవనోపాధి-వడ్డీ, జూదం, లాటరీ, సారాయి, అశ్లీల విషయాల వ్యాపారం, దొంగ వ్యాపారం, నల్లబజారు వ్యాపారం. మనది కాని

వస్తువును కాజెయ్యడం, అధర్మ కార్యాలతో లభించే సంపాదన- ఇవన్నీ చిన్న స్థాయిలోనయినా తక్కువయినా ఎక్కువైనా అన్నీ సమానంగా అపరిశుద్ధ ఉపాధి క్రిందనే వస్తాయి. వీటికి దూరంగా మెలగాలి.

ఇక ఆలోచించండి. ఇలాంటి ఉత్తమ గుణాలు గల వ్యక్తికి ప్రపంచంలో కొరవడేదేముంది? ఉత్తమ గుణాలు ఉత్తమ ప్రతిఫలాన్ని తప్పకనిస్తాయి. సమాజంలో గౌరవమర్యాదలే కాక ప్రజల ప్రేమానురాగాలు, అభిమానం, నిత్య సహాయసహకారాలు, సేవలు ప్రాప్త మవుతాయి. చిత్తశుద్ధితో వీటిని పాటిస్తే పరలోకంలోనూ ప్రతిఫలం ఎటూ పోదు.

171. అప్పగింతను భద్రంగా అప్పగించడం ఒక ఎత్తయితే తనకు హాని చేసినవాని పట్ల కూడా హాని తలపెట్టకుండా మెలగటమే గొప్ప. "అపకారికి యుపకారము నెపమెన్నక సేయునతడు నేర్పరి" అన్నాడు సుమతి శతకకారుడు. తనకు ఉపకారం చేసినవారికి, తనకు సహాయపడినవారికి సహాయం చెయ్యడం మామూలు ధర్మమే. అదీ మంచిదే అయినా అందులో గొప్పదనం లేదు. తనకు ఉపకారం చెయ్యకపోవడమే కాదు హాని తలపెట్టి తన పట్ల విశ్వాసఘాతుకానికి ఒడిగట్టినవానికి సయితం హాని కలిగించకపోవడం కూడా ఓ ఉపకారమే. అయితే అవసరం ఏర్పడితే అతని పట్ల కూడా ఉపకారం చెయ్యడం మరీ గొప్ప విషయం. ఇందులోనూ చిత్తశుద్ధి ఉన్నట్లయితే ఇహపరాలు ఉభయత్రా లాభదాయకం.

# 6. దుర్గుణాలు

(١٧٢) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
ثَلٰثٌ مُّنْجِيَاتٌ وَثَلٰثٌ مُّهْلِكَاتٌ فَتَقْوَى اللهِ فِي السِّرِّ وَالْعَلَانِيَةِ
وَالْقَوْلُ بِالْحَقِّ فِي الرِّضَا وَالسَّخَطِ وَالْقَصْدُ فِي الْفَقْرِ وَالْغِنَا وَأَمَّا
الْمُهْلِكَاتُ فَهَوًى مُّتَّبَعٌ وَشُحٌّ مُّطَاعٌ وَإِعْجَابُ الْمَرْءِ بِنَفْسِهٖ
وَهِيَ أَشَدُّهُنَّ ۔ (البيهقي ۔ مشكوٰة ۔ ص ٣٥٥)

172. దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించినట్లు హజ్రత్ అబూ హురైరా(ర.అ) ఉల్లేఖించారు: "మూడు విషయాలు మోక్షాన్ని ప్రసాదిస్తాయి, మూడేమో వినాశానికి గురి చేస్తాయి. మోక్షాన్నిచ్చేవి ఇవి: (1) గోప్యంగానూ, బహిర్గతంగానూ దైవం పట్ల 'తక్వా' పాటించడం; (2) ప్రమోదంలోనూ, ప్రమాదంలోనూ సదా సత్యమే పలకడం; (3) లేమిలోనూ, కలిమిలోనూ ఎల్లవేళలా మధ్యస్థ మార్గాన్ని అవలంబించడం; వినాశం తెచ్చి పెట్టేవి ఇవి: (1) మనిషి తల ఒగ్గి బానిస అయ్యేలా చేసే కోర్కె; (2) ముందుండి మనిషిని అనుసరింపజేసే పేరాశ; (3) మనిషిని ఆవహించిన స్వయోత్కర్ష- ఈ రోగం మూడింటిలో అత్యంత నికృష్టమయింది. (బైహకీ, మిష్కాత్)

---

172. "తక్వా" అన్న అరబీ పదానికి దైవాగ్రహాన్నుండి తన్నుతాను కాపాడుకోవడం అని అర్థం. అంటే శ్రద్ధాభక్తులు కలిగిన నిష్ఠాగరిష్ఠమయిన జీవితం గడపడం అని భావం. మనిషి నిష్ఠ కనబరిచే పనులయితే చెయ్యడం సులువేకాని ఎవరూ చూడనప్పుడు, దైవం మాత్రమే తన్ను తిలకిస్తున్నాడన్న యదార్థ దృష్టితో చెడుకు దూరంగా నిష్ఠతో బ్రతకడం గొప్ప విషయమే. నిజానికి ఇదే ఉత్తమ గుణం. అలాగే ఇష్టమయినా, కష్టమయినా సత్యాన్ని మాత్రమే పలకడం, ఆచరించడం ఉన్నత గుణం. ఇంకా కలిమిలో పొంగిపోకుండా, లేమిలో క్రుంగిపోకుండా సదా సత్పథాన సాగడమే ఉత్తమ లక్షణం. పోతే మనిషిని బానిసను చేసివేసే కోర్కెలు ఎలాంటి నైచ్యానికయినా మనిషి ఒడిగట్టేలా చేస్తాయన్నది యదార్థం. అలాగే పేరాశ వెంటబడితే మనిషికి గమ్యమే చిక్కదు. ఇక అన్నింటికంటే ఘోరమైంది, మనిషిని నైతికంగాను, ప్రజల్లో ప్రతిష్ఠ

(۱۷۳) عَنِ الْمِقْدَادِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا رَاَيْتُمُ الْمَدَّاحِيْنَ فَاحْثُوْا فِیْ وُجُوْهِهِمُ التُّرَابَ ۔ (صحیح مسلم۔ مشکوٰۃ۔ ص۴۱۲)

173. మిక్దాద్ (ర.అ) ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "మీరు పొగడ్తలు చేసేవారిని చూసినట్లయితే వాళ్ళ ముఖాన మట్టి కొట్టండి." (సహీహ్ ముస్లిమ్, మిష్కాత్)

(۱۷۴) عَنْ عَلِیٍّ قَالَ کَانَ الرَّجُلُ مِنْ اَصْحَابِ النَّبِیِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا زُکِّیَ قَالَ اَللّٰهُمَّ لَا تُؤَاخِذْنِیْ بِمَا يَقُوْلُوْنَ وَاغْفِرْلِیْ مَا لَا يَعْلَمُوْنَ

(الادب المفرد۔ باب مایقول الرجل اذازکی۔ ص۱۱۱)

174. అది బిన్ హాతిమ్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా అంటున్నారు: "ప్రవక్త సహచరుల్లో ఎవరినయినా ముఖతః పొగడినట్లయితే వారు వెంటనే, 'దేవా, ఈ జనులు పలికే విషయాలకై నన్ను తప్పు పట్టకు, వీరెరుగనివాటికై నన్ను క్షమించు' అని ప్రార్థించుకునేవారు." (అల్ అదబుల్ ముఫ్రద్)

---

దృష్ట్యాను, దైవ సాన్నిధ్యంలో మోక్షం రీత్యాను - సర్వవిధాలా దెబ్బతీయగల దుర్గుణం - స్వయోత్కర్ష! మనిషి తన జ్ఞానం, సంపద, శారీరక శక్తి, నిష్ఠాతత్పరత, భక్తి పరాయణత ఇత్యాది విషయాల కారణంగా మిడిసిపడడం నైతిక రుగ్మత. దీనికి గురయిన మనిషి ఆత్మవంచనకు లోనవుతాడు. అతనికి తన తప్పూ తెలీదు, అతనిలో సత్యాన్ని గ్రహించాలన్న తపనా ఉత్పన్నం కాదు. ఇది సర్వ వినాశిని అనడంలో సందేహమే లేదు.

173. భావమేమిటంటే భట్రాజుల్లా ముఖస్తుతి చేసేవారిని నిరోధించాలని, వారి ఆటలు సాగకుండా చెయ్యాలని, వారిఎత్తుగడలు పారకుండా చూడాలని సదా గుర్తుంచుకోవాలి.

174. "వీరెరుగనివి" అంటే, వీరెరుగని నాలోని లోపాలు అని భావం. మనిషి సాధారణంగా తన పొగడ్త విని గర్వానికి, స్వయోత్కర్షకు గురవుతాడు. అందువల్లనే ప్రవక్త సహచరులు (ర.అ.) ఇలాంటి సందర్భాల్లో దాని చెడుగు నుండి రక్షించమని దైవాన్ని వేడుకుంటూనే తమలోని లోపాలను కూడా గుర్తు చేసుకునేవారు. ఈ

(۱۷۵) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ لَبِسَ ثَوْبَ شُهْرَةٍ فِي الدُّنْيَا أَلْبَسَهُ اللّٰهُ ثَوْبَ مَذَلَّةٍ يَوْمَ الْقِيٰمَةِ۔
(رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ کتاب اللباس)

175. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా హెచ్చరించారు: "ఎవరయితే ఈ లోకాన పేరు ప్రతిష్ఠల దుస్తులు ధరిస్తాడో, అతనికి అల్లాహ్ ప్రళయదినాన నీచత్వపు బట్టలు ధరింపజేస్తాడు." (అబూదావూద్, మిష్కాత్)

(۱۷۶) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَدْخُلُ الْجَنَّةَ مَنْ كَانَ فِيْ قَلْبِهٖ مِثْقَالُ ذَرَّةٍ مِّنْ كِبْرٍ فَقَالَ رَجُلٌ إِنَّ الرَّجُلَ يُحِبُّ أَنْ يَّكُوْنَ ثَوْبُهٗ حَسَنًا وَنَعْلُهٗ حَسَنًا قَالَ إِنَّ اللّٰهَ جَمِيْلٌ وَّيُحِبُّ الْجَمَالَ، اَلْكِبْرُ بَطَرُ الْحَقِّ وَغَمْطُ النَّاسِ (صحیح مسلم، مشکوٰۃ)

176. అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా పేర్కొన్నారు. ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం), "తన ఆంతర్యంలో ఈమన్మాత్రం కూడా అహంకారం గల వ్యక్తి స్వర్గంలో ప్రవేశించలేడు" అని సెలవియ్యగా, ఓ వ్యక్తి, "మనిషి తన దుస్తులు ఉత్తమమైనవై ఉండాలని, తన పాదరక్షలు నాణ్యమైనవై ఉండాలని కోరుకుంటాడు" అన్న సందేహం వ్యక్తం చేస్తాడు. దానికి ఆయన, "అల్లాహ్ సుందరమూర్తి, సౌందర్యాన్ని ఇష్టపడతాడు, అహంభావం అంటే, ధర్మానికి, సత్యానికి ప్రతిగా తలబిరుసుతనం చూపడాన్ని, జనుల్ని అల్పులుగా భావించడాన్ని అంటారు."

(సహీహ్ బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

---

విధంగా తాము ఆత్మవంచనకు కూడా లోనవకుండా దైవ రక్షణను పొందేందుకు తాపత్రయపడేవారు.

175. పేరు ప్రతిష్ఠల ప్రదర్శనా బుద్ధి గల దుస్తులంటే అది రెండు రకాలుగా సాధ్యం. (1) శ్రీమంతుల జిగేల్ మనిపించే ఖరీదయిన బట్టలు, తద్వారా ప్రజలపై తమ దర్పం, ఠీవిలాముద్రవెయ్యడానికి కృషి చెయ్యడం. (2) మత గురువులు, సన్యాసులు,

(١٧٧) عَنْ اَبِى الْاَحْوَصِ عَنْ اَبِيْهِ قَالَ اَتَيْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَعَلَىَّ ثَوْبٌ دُوْنٌ فَقَالَ لِىْ، اَلَكَ مَالٌ قُلْتُ نَعَمْ قَالَ مِنْ اَىِّ الْمَالِ؟ قُلْتُ مِنْ كُلِّ الْمَالِ قَدْ اَعْطَانِىَ اللّٰهُ مِنَ الْاِبِلِ وَالْبَقَرِ وَالْغَنَمِ وَالْخَيْلِ وَالرَّقِيْقِ، قَالَ فَاِذَا اٰتَاكَ مَالًا فَلْيُرَ اَثَرُ نِعْمَةِ اللّٰهِ عَلَيْكَ وَكَرَامَتِهٖ۔ (النسائى۔ مشكوٰة۔ ص ٣٧٥)

177. అబుల్ అహ్వస్ ఉల్లేఖనం: "నేనొకసారి దైవ సందేశహరుల (సఅసం) సన్నిధిలో హాజరయ్యాను. నా దుస్తులు అతి సామాన్యంగా ఉండేవి. 'నీ వద్ద ధనం ఉందా?' అని ఆయన (సఅసం) ప్రశ్నించారు. దానికి నేను ఉందని సమాధానం చెప్పాను. 'ఏ రకమయిన సంపద?' అని ఆయన తిరిగి అడగ్గా నేను, 'సకల సంపదలూ దైవం నాకు ప్రసాదించాడు. ఒంటెలు, ఆవులు, గొర్రెలు, గుర్రాలు, పాలేళ్ళు – నాకు అన్నీ ఉన్నాయి' అని పలికాను. దానిమీదట ఆయన ఇలా సెలవిచ్చారు: 'దైవం నీకు ధన సంపదలు అనుగ్రహించగా ఆయన వరప్రసాదానికి, అనుగ్రహానికి గుర్తు కూడా బయటికి ప్రదర్శితమవ్వాలి కదా?!" (నసాయి, మిష్కాత్)

---

యోగుల దుస్తులు ధరించి ప్రజలపై తమ ధార్మికత, ఆధ్యాత్మిక పవిత్రతను చాటే ఉద్దేశ్యం కలిగి ఉండడం. నిజమయిన ఇస్లామీయ సమాజంలో ధనవంతులకంటూ ప్రత్యేకమయిన వస్త్రధారణకూ అవకాశం లేదు, అలాగే మత గురువుల ఓ విశేష వర్గమంటూ ఉండడానికి, తమ ప్రత్యేక వేషధారణతో ప్రజల్ని ప్రభావితం చెయ్యడానికి వీలులేదు.

176. ధర్మసమ్మతమయిన పరిధుల్లో తన స్థాయి, స్తోమత ననుసరించి వేషధారణ చేసినా, గృహ వసతి నిర్మించుకున్నా, గృహాలంకరణలు చేసుకున్నా దాన్ని గర్వంగా, అహంకారంగా వర్ణించడానికి వీల్లేదు. మనిషి ప్రాపంచిక రుచులు మరిగి, ప్రాపంచిక భోగభాగ్యాల్లో విలాసాల్లో మునిగి అటు దేవుని హక్కుల్ని నిర్వర్తించకుండా ఇటు దైవదాసులైన మానవుల హక్కులు చెల్లించకుండా బాధ్యతారహితంగా ప్రవర్తించడాన్నే అహంకారంగా పరిగణించ వీలవుతుంది.

177. ఈ హదీసు లోభత్వాన్ని, పిసినారితనాన్ని నిరోధించడానికి ఉద్దేశించబడినట్లు తెలుస్తోంది. అల్పబుద్ధితో వ్యవహరించడం దేవుని వరప్రసాదాల పట్ల నిరాదరణకు

(۱۷۸) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَلْعَائِدُ فِيْ هِبَتِهٖ كَالْكَلْبِ يَعُوْدُ فِيْ قَيْئِهٖ لَيْسَ لَهَا مَثَلُ السَّوْءِ۔
(البخاری۔ مشکوٰۃ۔ باب العطایا۔ ص۲۵۲۔ مطبع انصاری)

178. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "కానుక ఇచ్చి తిరిగి వాపసు తీసుకునేవాని ఉపమానం కుక్కలాంటిది, అది తాను వాంతి చేసుకున్న దాన్ని తిరిగి నాక్కుంటుంది. ఈ విషయంలో ఇంతకంటే హీనమైన ఉపమానం మరేది కాగలదు?" (బుఖారి)

(۱۷۹) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا تَسْأَلِ الْمَرْاَةُ طَلَاقَ اُخْتِهَا لِتَسْتَفْرِغَ مَا فِيْ اِنَائِهَا وَلِتَنْكِحَ فَاِنَّ لَهَا
مَا قُدِّرَ لَهَا۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ ص۲۶۳)

179. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "ఏ ముస్లిమ్ మహిళ అయినా తన సోదరి (సవితి)కి విడాకులు కోరరాదు. ఆ విధంగా ఆమె పాత్రలోనిదంతా తాను పోసుకోవాలని కాంక్షించరాదు. తాను సలక్షణంగా నికాహ్ చేసుకోవడం ఉత్తమం. ఆమెకు తన విధిలో ఉన్నది ఎలాగూ ప్రాప్తం కాగలదు." (ముత్తఫకున్ అలైహ్)

---

కారణభూతమవుతుంది. కాని అదే సందర్భంలో వరప్రసాదాల ప్రదర్శన మనిషిలో గర్వానికి, ప్రదర్శనా బుద్ధికి, దుబారా ఖర్చుకూ కారణభూతమవరాదు. దైవానుగ్రహాల ప్రదర్శన ఇలా చెడు రూపు ధరించకుండా జాగ్రత్తపడడం కూడా అవసరమే.

178. కానుక ఇవ్వడమన్నది ప్రేమానురాగాల కారణంగా, వాటిని పెంపొందించడానికి జరుగుతుంది. మనిషి ప్రేమగా ఇచ్చిన కానుకను వాపసు తీసుకోవడమంటే అతనిలో నీచాతినీచమయిన ప్రవృత్తి చోటు చేసుకుందన్నమాట. అందుకే అలాంటి వ్యక్తి చర్యను కుక్క చేసే హేయమైన చర్యతో పోల్చారు. కానుక ఇచ్చి, ఎత్తిపొడవడం, వాపసు తీసుకోవాలన్న తలంపు రావడం కూడా ఎంత ఏహ్యమయిందో బోధపడుతూనే ఉంది.

(١٨٠) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ لَيْسَ الْمُؤْمِنُ بِالَّذِىْ يَشْبَعُ وَجَارُهٗ جَائِعٌ اِلٰى جَنْبِهٖ - (رواه البيهقى- مشكوٰة - ص٤١٦)

180. అబ్దుల్లాహ్ ఇబ్ను అబ్బాస్ ఓ ఉల్లేఖనంలో, "తన పొరుగులోని సోదరుడు ఆకలితో అలమటిస్తుంటే, తాను మటుకు కడుపు నిండా భుజించే వ్యక్తి మోమిన్ (విశ్వాసి) కాజాలడు" అని ప్రవక్త మహనీయులు బోధించినట్లు తెలిపారు.

(١٨١) عَنْ عَبْدِ اللهِ بْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ دُعِىَ فَلَمْ يُجِبْ فَقَدْ عَصَى اللهَ وَرَسُوْلَهٗ وَمَنْ دَخَلَ عَلٰى غَيْرِ دَعْوَةٍ دَخَلَ سَارِقًا وَخَرَجَ مُغِيْرًا - (رواه ابوداؤد- مشكوٰة - ص٢٧٠)

181. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు: "విందు ఆహ్వానం పొందిన వ్యక్తి దాన్ని స్వీకరించకపోతే అతను దైవం, దైవ ప్రవక్తల పట్ల అవిధేయత కనబరచినట్లు, మరెవరయితే పిలుపు లేకుండానే విందుకు హాజరవుతాడో అతను దొంగచాటుగా దూరినట్లు, దొంగలాగా వెలికివచ్చినట్లు అవుతుంది."

(అబూదావూద్, మిష్కాత్)

---

179. పెళ్ళయిన పురుషునితో పెళ్ళికి సిద్ధమయిన స్త్రీ, ఆ పురుషుడు తన తొలి భార్యకు విడాకులివ్వాలని కోరడం, ఆ తరువాత తాను అతనితో నికాహ్ చేసుకుంటానని కాంక్షించడం తప్పు అని ఈ హదీసు తెలుపుతోంది. ఇలాంటి కోరికకు వెనుకవుండే ఉద్దేశ్యం కేవలం ఆ మొదటి భార్యకు లభిస్తున్నదంతా తనకు ప్రాప్తం కావాలన్న కోరిక మాత్రమే. ఇలాంటి నీచమయిన స్వార్థపరత్వపు భావన ఇస్లామ్ సృజించగోరే స్వభావంతో ఏ మాత్రం పొసగదు, పైగా ఇది దానికి పూర్తిగా విరుద్ధమయిన గుణం.

180. మనిషిలో దయార్ద్రత, విశాల హృదయం, ఉదార స్వభావాలకు భిన్నంగా కాఠిన్యం, సంకుచితత్వం, లోభత్వం ఉంటే తప్ప తన పొరుగువాని పట్ల హదీసులో పేర్కొన్న విధంగా ప్రవర్తించడు మనిషి. విశ్వాసి సద్గుణాల సరోవరమయి జీవించాలన్నది ఇస్లామ్ అభిలాష. దానికి భిన్నమైన రీతిలో జీవించేవాడు విశ్వాసి ఎలా కాగలడు?

(١٨٢) عَنْ عَمْرِو بْنِ عَوْفٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
فَوَاللّٰهِ لَا الْفَقْرَ اَخْشٰى عَلَيْكُمْ وَلٰكِنْ اَخْشٰى عَلَيْكُمْ اَنْ تُبْسَطَ عَلَيْكُمُ
الدُّنْيَا كَمَا بُسِطَتْ عَلٰى مَنْ كَانَ قَبْلَكُمْ فَتَنَافَسُوْهَا كَمَا تَنَافَسُوْهَا وَ
تُهْلِكَكُمْ كَمَا اَهْلَكَتْهُمْ. (متفق عليه مشكوٰة-كتاب الرقاق)

182. అమ్ర్ బిన్ ఔఫ్ ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (సఅసం) ఇలా సెల విచ్చారుః "మీరు బీదరికానికి, దారిద్ర్యానికి గురవుతారన్న భయం నాకు లేదు. కాని ప్రాపంచిక ధనసంపత్తులు, పూర్వం వారిపై విరుచుకుపడినట్లే, మీపై కూడా విరుచుకుపడతాయేమోనని, పూర్వం వారి మాదిరిగానే మీరున్నూ ప్రపంచ సంపదల వ్యామోహంలో పడిపోతారేమోనని, ఫలితంగా ఈ 'ప్రపంచం' పూర్వం వారిని సర్వనాశనం చేసినట్లే మిమ్మల్నీ చేసివేస్తుందేమోనని భయపడుతున్నాను." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

181. పరస్పర సంబంధాలను ఉత్తమ రీతిలో పెంపొందించడానికి కానుకలివ్వడం, విందులు, అతిథి సత్కారాలు చెయ్యడంలాంటివి జరుగుతాయి. ఇక ఓ సోదరుని ఆహ్వానాన్ని నిష్కారణంగా స్వీకరించని వ్యక్తి వాస్తవానికి సోదరత్వపు సంబంధాన్ని తెంచుతున్నాడని అర్థం. ఇస్లామ్ అందరిలో సోదర భావాన్ని సృజించాలనే కదా కోరుకునేది!

అలాగే పిలువని పేరంటానికి వెళ్ళడం, విందు భోజనాలారగించడం హృదయ వైచ్యానికి, అభిమాన రాహిత్యానికి, లజ్జారాహిత్యానికి తార్కాణం. అయితే ఏ ఇంటనైనా లేదా ఆ ఇంటి యజమాని వద్దనయినా ఎవరికయినా ఎలాంటి అరమరికల్లేని, మొహమాటం లేని చెలిమి ఉంటే, అలాంటి సంబంధ బాంధవ్యాలుంటే అలా వెళ్ళినా అందులో తప్పు లేదు. పైగా ఇలాంటి సందర్భాలలో అతిధేయానికి తన మిత్రుడు అకస్మాత్తుగా తలువని తలంపులా రావడం ఆనందకారణం కూడా అవుతుంది.

మరో మాట. ఎవరయినా తనకున్న బలమయిన కారణాల వల్ల చిత్తశుద్ధితో ఎలాంటి దుష్టభావన లేకుండా ఏదయినా ఆహ్వానాన్ని మన్నించలేకపోతే అందులో తప్పుపట్టవలసిన అవసరముండదు. ఇంకా హదీసులో పేర్కొన్న అభిశాపమూ అలాంటి వారి పట్ల వర్తించదు.

182. ఈ హదీసులో ప్రవక్త మహోదయులు (సఅసం) తన అనుచర సమాజం ఏ విధమయిన దుష్టవ్యూహంలో చిక్కుకుపోగలదో, ఏ విషయాలు దాని వినాశానికి కారణభూతం కాగలవో సూచించారు. అయితే ఒకటి గుర్తుంచుకోవాలి. ఇస్లామ్ అన్ని

(۱۸۳) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَعَنَ اللّٰهُ الْمُتَشَبِّهِيْنَ مِنَ الرِّجَالِ بِالنِّسَاءِ وَالْمُتَشَبِّهَاتِ مِنَ النِّسَاءِ بِالرِّجَالِ - (رواه البخاری - مشکوٰۃ - باب الترجل)

183. అబ్దుల్లా ఇబ్నె అబ్బాస్ ఇలా ఉల్లేఖించారు: ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం), "అల్లాహ్, స్త్రీలలా రూపు ధరించే పురుషులకూ, పురుషుల మాదిరి రూపుధరించే స్త్రీలకూ తన అభిశాపం కలగజేశాడు" అని తెలిపారు. (బుఖారి, మిష్కాత్)

(۱۸۴) عَنْ اَبِیْ ثَعْلَبَۃَ الْخُشَنِیِّ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اِنَّ اَحَبَّکُمْ اِلَیَّ وَاَقْرَبَکُمْ مِنِّیْ یَوْمَ الْقِیٰمَۃِ اَحَاسِنُکُمْ اَخْلَاقًا، وَاِنَّ اَبْغَضَکُمْ اِلَیَّ وَاَبْعَدَکُمْ مِنِّیْ مَسَاوِیْکُمْ اَخْلَاقًا، اَلثَّرْثَارُوْنَ وَالْمُتَشَدِّقُوْنَ وَالْمُتَفَیْہِقُوْنَ - (البیہقی - مشکوٰۃ - ص۴۱۲)

184. అబూ సఅలబ ఖుషని (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు: "ప్రళయ దినాన, నాకు అత్యంత చేరువలో ఉంటూ నాకు అత్యంత ప్రీతిపాత్రులయినవారు, మీలో నైతికత రీత్యా ఉత్తములయినవారు. నాకు అతి దూరంగా ఉండేవారు, అత్యధిక అప్రియులయినవారు మీలో నైతికత రీత్యా హీనమయినవారు. వీరు తమ వాచాలతతో మాయజేసేవారు, నోరు వంకరజేసి, మెడత్రిప్పుతూ మాట్లాడేవారు." (బైహకీ, మిష్కాత్)

---

విషయాల్లోనూ మధ్యేమార్గాన్ని ప్రబోధిస్తుంది. అటు సన్యాసుల్లా సర్వసంగపరిత్యాగుల్లా ప్రాపంచిక వరప్రసాదాలను విడనాడి, ఏ సుఖానికి నోచుకోకుండా జీవించడాన్నీ నిరసిస్తుంది. ఇటు ప్రపంచంలో పడిపోయి, జీవితపు నిజ ధ్యేయానికి దూరమైపోవటాన్నీ నిరసిస్తుంది. వీటికి భిన్నంగా ప్రపంచంలో ఉన్న దాన్ని అంటిముట్టనట్టుగా బ్రతకడం నేర్పుతుంది ఇస్లామ్.

ఈ ఉల్లేఖనంలో సిరిసంపదల ఆధిక్యతను లేదరికం, దారిద్ర్యం కన్నా ప్రమాదకర మయినదిగా పేర్కొనడం జరిగింది. ఆకలిదప్పులు, లేమి వల్ల కలిగే దుష్ప్రభావాలు

(۱۸۵) عَنْ اَسْمَاءَ بِنْتِ عُمَيْسٍ قَالَتْ زَفَفْنَا اِلٰى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَعْضَ نِسَائِهٖ فَلَمَّا دَخَلْنَا عَلَيْهِ اَخْرَجَ عُسًّا مِّنْ لَبَنٍ فَشَرِبَ مِنْهُ ثُمَّ نَاوَلَهٗ اِمْرَاَتَهٗ فَقَالَتْ لَا اَشْتَهِيْهِ فَقَالَ لَا تَجْمَعِيْ جُوْعًا وَّكِذْبًا۔

(المعجم الصغير للطبراني۔ ص۱۳۷)

185. అస్మా బిన్తు ఉమైస్ ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు, ప్రవక్త సతీమణుల్లో ఒకరిని మేము పెళ్ళికూతురుగా చేసి దైవసందేశహరుల (సఅసం) వద్దకు పంపాము. మేము ఆయన సన్నిధికి వెళ్ళినప్పుడు ఆయన ఓ గిన్నెలో పాలు తెచ్చి ముందు స్వయంగా తాను సేవించారు. ఆ తరువాత తన వధువుకు అందజేశారు. ఆవిడ 'నాకు ఇప్పుడు ఆకలిగా లేదు' అని పలుకగా ఆయన, "ఆకలినీ అబద్ధాన్నీ ఒకే చోట చేర్చకు" అని సెలవిచ్చారు.

(అల్ మో'జముస్సగీర్)

---

పరిమితమయి ఉంటాయి. వాటి వల్ల పాపభరితమయిన, అపరాధ పూర్వకమైన సమాజ వ్యవస్థ రూపొందదు. అయితే అదే ధన సంపదలు అధికమయినప్పుడు ఈ దుష్ట వ్యవస్థకు అమితమయిన ఊతం లభించి సభ్యతా సంస్కారాలు, నాగరికతా సంస్కృతులు ఆమూలాగ్రం సర్వనాశనమవుతాయి.

183. ఈ హదీసులో పేర్కొన్న విషయం సాధారణ విషయాల్లో లేక అవసరానికి తగిన స్వల్పమయిన, అప్రధానమయిన అనుకరణ కాదు. ఇలాంటి అనుకరణ అవసరం రీత్యా నిషిద్ధం కాదు. కాని మౌలికంగా వేషధారణ అయినా ప్రవర్తనలయినా స్త్రీ పురుషుల మధ్య ఉన్న సహజమయిన వ్యత్యాసాన్ని రూపుమాపేవిగా ఉండరాదన్నదే దీని ఉద్దేశ్యం.

184. దుర్వర్తనులకు సంబంధించిన అనేక గుణాలలో మాటకారితనం కూడా ఒకటి. రకరకాల భంగిమల్లో మాట్లాడటం, నోరు వంకర్లు త్రిప్పుతూ, మెడను విభిన్న కోణాల్లో పెడుతూ మాట్లాడటం, తన మాటను నమ్మింపజెయ్యడానికి వారు పడే పాట్లల్లోని భాగమే. ఇలాంటి వారు అబద్ధాన్ని కూడా సత్యంలా ధ్వనింపజెయ్యగల నిష్ణాతులు. ప్రళయ దినాన ప్రవక్త సహచర్యంలో సత్యవంతులు, నీతిమంతులే తప్ప మరెవరికీ చోటు లభించదు. నైతికతకు చోటివ్వని వీరు ఎలా స్థానం పొందగలరు?

185. ఆకలినీ అబద్ధాన్నీ ఒకే చోట చేర్చడమంటే ఆకలిగా ఉన్నా మొగమాటంతో ఆకలిగా లేదని చెప్పడం అని భావం. సాధారణంగా మిత్రులు, బంధువులు భోజనవేళకు పిలిచినప్పుడు, ఆకలిగా ఉన్నా, తినాలన్న కోరిక ఉన్నా కేవలం మొగమాటంతో

(۱۸۶) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا اُلْفِيَنَّ اَحَدَكُمْ يَضَعُ اِحْدٰى رِجْلَيْهِ عَلَى الْاُخْرٰى ثُمَّ يَتَغَنّٰى وَ يَدَعُ اَنْ يَقْرَأَ سُوْرَةَ الْبَقَرَةِ۔ (المعجم الصغير للطبراني ـ ص۲۷)

186. ఇబ్నె మస్‌ఊద్ ఇలా ఉల్లేఖించారు: దైవ సందేశహరులు (సఅసం), "మీలో ఎవరినీ నేను కాలుపై కాలు వేసుకుని పాడుకుంటూ ఉండగానూ, బకరా సూరా పఠించడానికి వెనకాడగానూ చూడగోరడం లేదు" అని సెలవిచ్చారు. (అల్ మో'జముస్సగీర్)

(۱۸۷) عَنْ جَابِرٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَهٗ فِرَاشٌ لِلرَّجُلِ وَفِرَاشٌ لِامْرَأَتِهٖ وَالثَّالِثُ لِلضَّيْفِ وَالرَّابِعُ لِلشَّيْطٰنِ (رواه مسلم، مشکوٰة ـ کتاب اللباس)

187. జాబిర్ ఉల్లేఖనం: దైవప్రవక్త (సఅసం) ఉపదేశించారు: "(ఇంటిలో) పడక ఒకటి పురుషునికి, మరొకటి అతని భార్యకు, ఇంకొకటి అతిథి కోసం ఉంటుంది. నాల్గవది ఉంటే అది షైతాన్ కోసమే!" (ముస్లిం, మిష్కాత్)

---

ప్రస్తుతం ఆకలిగా లేదని బుకాయిస్తారు. పై ప్రవచనంలో ఇలాంటి మొగమాటపు అబద్ధాన్నే కూడదని బోధించడం జరిగింది.

186. 'చూడగోరడం లేదు' అనంటే "ఇలా మీలో ఎవరూ ప్రవర్తించరాదు" అన్న మందలింపుతో కూడుకున్న తాకీదు ఇమిడి ఉందన్న మాట. కేవలం సంగీతంలోను, ఆటపాటల్లోనూ నిమగ్నమై ఉండటం షైతాన్ చేష్ట. దీన్నిబట్టి అసలు రాగయుక్తంగా ఏదీ పాడరాదని అర్థం కాదు. ఉత్తమమయిన సాహిత్యం, నిర్మాణాత్మకమైన గేయాలు, కవితలు వీనుల విందుగా పాడటంలో తప్పు లేదు. అయితే అందులోనూ పూర్తిగా లీనమైపోయి అసలు ధార్మిక కార్యకలాపాలనే వదలుకునే పరిస్థితి ఏర్పడరాదు. స్వయంగా దివ్య ఖుర్‌ఆన్‌ని కర్ణపేయంగా పారాయణం చెయ్యడాన్ని దైవప్రవక్త ఎంతో మెచ్చుకునేవారు. నేటికీ అలా పఠించగలిగే కళాకారులు అనేక మంది ప్రపంచ వ్యాప్తంగా ఉన్నారు. ఈ హదీసులో బకరా సూరాను ప్రత్యేకంగా ప్రస్తావించడానికి కారణం బహుశా ఏమిటంటే, ఆ సూరాలో కాపట్య రోగాన్నీ దాని నివారణను సవిస్తరంగా చర్చించడం జరిగింది. పాటలు పాడుకుంటూ ఉండటం మూలంగా కాపట్య కాలుష్యం అంటుకుంటుందన్న భావం మరో హదీసులో ఉంది. బకరా సూరా పఠనం,

(۱۸۸) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَرَّ بِسَعْدٍ وَهُوَ یَتَوَضَّأُ فَقَالَ مَا هٰذَا السَّرَفُ یَا سَعْدُ قَالَ اَفِی الْوُضُوْءِ سَرَفٌ قَالَ نَعَمْ وَاِنْ كُنْتَ عَلٰی نَهْرٍ جَارٍ۔ (رواہ احمد مشکوٰۃ باب سنن الوضوء۔ ص۳۹)

188. అమ్ర్ బిన్ ఆస్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ఓసారి దైవసందేశహరులు (సఅసం) సఅద్ (ర.అ) ఉంటున్న వైపుగా వెళ్ళారు. అప్పుడు ఆయన (సఅద్) వుజూ చేస్తున్నారు. ఆయన, "సఅద్, వృధా ఖర్చు చేస్తున్నావేమిటి?" అని అడిగారు. దానికి సఅద్, (ర.అ) "వుజూలోనూ వృధా ఖర్చు ఉంటుందా?" అని ప్రశ్నించగా దైవప్రవక్త, "అవును, నీవు పారే నది ఒడ్డున కూర్చున్నా సరే" అని తాకీదు చేశారు. (అహ్మద్, మిష్కాత్)

(۱۸۹) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ لَا یَنْظُرُ اللّٰهُ یَوْمَ الْقِیٰمَةِ اِلٰی مَنْ جَرَّ اِزَارَهٗ بَطَرًا۔ (مشکوٰۃ۔ کتاب اللباس)

189. అబూహురైరా (ర.అ) ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు ఇలా ప్రవచించారు: "తన ఇజార్‌ని అహంకారంతో నేల వరకు వ్రేళ్ళాడదీసి కట్టుకునేవాడిని అల్లాహ్ ప్రళయదినాన చూడబోవడం లేదు." (మిష్కాత్)

---

అధ్యయనంవల్ల అలాంటిచెడుగు దూరమవుతుందన్న ఉద్దేశ్యం ఈ హదీసులో ద్యోతకమవుతోంది.

187. ఇంటిలో ఉండే పడకలు, ఫర్నిచర్, ఇత్యాది అవసర సామగ్రి అవసరం మేరకు ఉండాలి. కాని అలాకాక కేవలం డాబుసరి, డంబాచారం ప్రకటించుకోవడానికి ఇంటి సామగ్రిని అమితంగా ప్రోగు చేసుకోవడం షైతాన్‌కు ప్రియమయిన చర్య అన్న ధ్వని ఈ హదీసులో వినవస్తోంది. ఇది దైవానికి ఏ మాత్రం ఇష్టం కాని వైఖరి. దుబారా ఖర్చు కూడా. పడకల సంఖ్యను, దానికి సంబంధించిన పరిమితిని తెలుపడం ఈ హదీసు ఉద్దేశ్యం కాదు. విలాస జీవితం, దుబారా ఖర్చులు చేసే తత్వం ఇత్యాది చెడుగులను నివారించడమే దీని ఉద్దేశ్యము.

188. 'పారే నది ఒడ్డున ఉన్నా' అన్న దానికి భావం, నది ఒడ్డున కూర్చుని వుజూ చేసినా తన అవసరం మేరకే జాగ్రత్తగా నీరు తీసుకుని వుజూ చెయ్యాలని భావం. అంటే దుబారా ఖర్చు చెయ్యడం, ఒకవేళ హానికరం కాకపోయినా అలాంటి చేష్టకు దూరంగా

(۱۹۰) عَنِ ابْنِ عُمَرَ اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مَنْ
شَرِبَ فِیْ اِنَاءِ ذَھَبٍ اَوْ فِضَّۃٍ اَوْ اِنَاءٍ فِیْہِ شَیْئٌ مِنْ ذٰلِکَ فَاِنَّمَا
یُجَرْجِرُ فِیْ بَطْنِہٖ نَارَ جَھَنَّمَ۔ (رواہ الدارقطنی مشکوٰۃ۔ باب الاشربہ)

190. అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు: "ఎవరయితే బంగారు లేక వెండి పాత్రతో లేదా ఈ రెంటిలో ఏదయినా మిశ్రమమయి ఉన్న పాత్రతో నీరు త్రాగుతారో వారు వాస్తవానికి తమ కడుపులో నరకాగ్ని కణాలు వేసుకున్నట్లు."
(మిష్కాత్)

(۱۹۱) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لَا
یَتَمَنَّیَنَّ اَحَدُکُمُ الْمَوْتَ مِنْ ضُرٍّ اَصَابَہٗ فَاِنْ کَانَ لَابُدَّ فَاعِلًا
فَلْیَقُلْ اَللّٰھُمَّ اَحْیِنِیْ مَا کَانَتِ الْحَیٰوۃُ خَیْرًا لِّیْ وَتَوَفَّنِیْ اِذَا کَانَتِ
الْوَفَاۃُ خَیْرًا لِّیْ۔ (بخاری۔ مشکوٰۃ۔ باب تمنی الموت)

191. హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖించారు: ప్రవక్త మహనీయులు ఒకసారి ఇలా బోధించారు, "మీలో ఎవరున్నా బాధలు, కష్టాలు దాపురించినపుడు చావును కోరుకోరాదు. ఒకవేళ మరీ దుర్భరం, దుస్సహమయిన పరిస్థితి ఏర్పడితే, 'దేవా, నాకు జీవితం మేలు కలిగించే వరకు జీవించి ఉండనివ్వు. చావే నాకు మేలయినప్పుడు నాకు చావు నివ్వు' అని అర్థించవచ్చు.
(బుఖారి, మిష్కాత్)

---

ఉండాలన్నదే దాని ఉద్దేశ్యం. నష్టకరం కాని వేళల్లో అబ్బిన దుర్గుణం నష్టకర సందర్భాల్లో ఇహపరాలకు హానికరంగా పరిణమించవచ్చు. అందువల్ల సతతం జాగ్రత్తగా అవసరం మేరకు ఖర్చు చేసే అలవాటు కలిగి ఉండటం ముఖ్యం. "అతి సర్వత్రావర్జయేత్" అన్నట్లు ప్రాపంచిక విషయాల్లో ఏ విధంగా నయితే పొదుపు పాటించడం అవసరమో ఆరాధనా వ్యవహారాల్లోనూ అతిగా ప్రవర్తించడం పాపకారణం కాగలదు.

189. 'ఇజార్' అంటే పైజామా, లుంగీ, పంచె, ప్యాంటు ఇత్యాదివాటిల్లో ఏదయినా

(۱۹۲) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ إِذَا وَجَدَ اَحَدُكُمْ فِیْ بَطْنِهٖ شَیْئًا فَاَشْكَلَ عَلَیْهِ أَخَرَجَ مِنْهُ شَیْئٌ اَمْ لَا فَلَا یَخْرُجَنَّ مِنَ الْمَسْجِدِ حَتّٰى یَسْمَعَ صَوْتًا اَوْ یَجِدَ رِیْحًا.

(رواہ مسلم۔ مشکوٰۃ۔ باب مایوجب الوضوء۔ ص۳۲)

192. హజ్రత్ అబూహురైరా (ర.అ) ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు: "మీలో ఎవరయినా కడుపులో అలజడి ఉన్నట్లు భావించి, వాయువు వెడలిందేమో అన్న అనుమానంతో శబ్దం వినకుండానే, వాసన చూడకుండానే మస్జిద్ (నమాజ్)ని వదలి వెళ్ళనవసరం లేదు.

(ముస్లిం, మిష్కాత్)

---

కావచ్చు. అది చీలమండలను దాటి క్రింద ఊడ్చుకుపొయ్యేలా ఉండటం పరిశుభ్రత రీత్యాను, సంస్కారం దృష్ట్యాను భావ్యమయిన విధానం కాదు. సాధారణంగా ఇలా కట్టుకునేవారు, అహంకారం, గర్వం కారణంగా ఇలా చేస్తారు. ఇస్లాం గర్వాన్ని, ప్రదర్శనా బుద్ధిని ఏ మాత్రం సహించదు, ఏ విధంగానూ ఇష్టపడదు. అందువల్లనే గర్వాన్ని, అహంకారాన్నీ ప్రదర్శించే చేష్టలనన్నింటినీ నిషేధించింది.

190. శ్రీమంతుల పోకడలను, అనవసరపు విలాస సామగ్రిని ఇస్లాం నిషేధించి ముస్లిం సమాజం వీటన్నింటికీ దూరంగా ఉండాలని కోరుతుంది. హదీసులో కేవలం త్రాగడాన్ని ప్రస్తావించడం జరిగింది. తిని త్రాగే పాత్రలన్నీ ఇక్కడ ఉద్దేశించబడ్డాయి.

191. ఇస్లాంలో ఆత్మహత్య అలా ఉంచి చావును కోరుకోవడం కూడా నిషిద్ధమే. కారణం ఏమిటంటే దైవమనుగ్రహించిన అసంఖ్యాకమయిన శుభవరాల్లో బ్రతుకు కూడా ఓ వరప్రసాదమే. అలాంటి మహావరాన్ని అర్థాంతరంగా అంతం చెయ్యమని కోరుకోవడం వాస్తవానికి కృతఘ్నత అనిపించుకుంటుంది. అది ఎంత ఘోరమయిన తప్పో తెలుస్తూనే ఉంది.

192. కొందరికి అనుక్షణం అనుమానాలు ముసురుకుని పీడిస్తూ ఉంటాయి. ఇది కూడా అలాంటి ఓ పరిస్థితిని సూచించే హదీసు. ఇందులో కేవలం అనుమానం కారణంగా నమాజ్‌ని భంగపరచడం భావ్యం కాదని, పూర్తి నమ్మకం కుదిరిన తరువాతే అలాంటి సమయాల్లో నిర్ణయం తీసుకోవాలని బోధించడం జరిగింది.



# 7. పరిశుద్ధ జీవితం

(۱۹۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ سَمِعْتُ اَبَاالْقَاسِمِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَقُوْلُ خَیْرُکُمْ اِسْلَامًا اَحَاسِنُکُمْ اَخْلَاقًا اِذَا فَقُهُوْا (الادب المفرد باب حسن الخلق اذا فقهوا ۔ ص۴۲)

193. హజ్రత్ అబూహురైరా (ర.అ.) తెలిపారు, నేనొకసారి అబుల్ కాసిం (దైవప్రవక్త సఅసం) ఇలా ఉపదేశించగా విన్నాను. "మీలో ఎవరయితే ఉత్తమగుణగణాలు గలవారో వారే ఇస్లాం అనుసరణలోనూ ఉత్తములు. అయితే వారికి ధర్మావగాహన ఉండాలి." (అల్ అదబుల్ ముఫ్రద్)

(۱۹۴) عَنْ اَبِیْ سَعِیْدِنِ الْاَنْصَارِیِّ قَالَ کَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَمْسَحُ مَنَاکِبَنَا فِی الصَّلٰوةِ وَیَقُوْلُ اِسْتَوُوْا وَلَا تَخْتَلِفُوْا فَتَخْتَلِفَ قُلُوْبُکُمْ لِیَلِیَنِیْ مِنْکُمْ اُوْلُوا الْاَحْلَامِ وَالنُّهٰی ثُمَّ الَّذِیْنَ یَلُوْنَهُمْ ثُمَّ الَّذِیْنَ یَلُوْنَهُمْ ۔ (صحیح مسلم ۔ مشکوٰة ۔ باب الامامة ۔ ص۹)

194. హజ్రత్ అబూ సయీద్ అన్సారి (ర.అ) ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు నమాజ్ కై నిలిచేటప్పుడు వరుసలు చక్కబరచడానికి మా భుజాలపై చెయ్యి వేసి, "సరిగ్గా నిల్చోండి. వరుసల్లో భిన్నత్వాన్ని, విచ్ఛిన్నాన్ని సృష్టించకండి. అలా చేస్తే మీ అంతర్యాల్లోనూ చీలికలుత్పన్నమవుతాయి, మీలో మేధాసంపన్నులు నాకు చేరువయి నిలువాలి. ఆ తరువాత వారికి సామీప్యం గలవారు, ఆ తరువాత వారికి సామీప్యం గలవారు." (ముస్లిం)

---

193. 'అబుల్‌కాసిం' అన్నది మహనీయ ముహమ్మద్ బిరుదు. ధార్మిక విషయాల్లో లోతు పాతుల అవగాహన, విజ్ఞానంతో పాటు వివేకం, విజ్ఞతలకు ఇస్లాం ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చింది. దానికి ఈ హదీసు ప్రత్యక్షనిదర్శనం. ధార్మిక వ్యక్తులు సాధారణంగా ఆధ్యాత్మిక చింతనలో ఎంత లోతెరిగిన వారయినా సాధారణ మానవీయ ప్రవర్తనల్లో

(١٩٥) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
إِنَّ الرَّجُلَ لَیَکُوْنُ مِنْ أَھْلِ الصَّلٰوۃِ وَالصَّوْمِ وَالزَّکٰوۃِ وَالْحَجِّ وَالْعُمْرَۃِ
حَتّٰی ذَکَرَ سِھَامَ الْخَیْرِ کُلَّھَا وَمَا یُجْزٰی یَوْمَ الْقِیٰمَۃِ إِلَّا بِقَدْرِ عَقْلِہٖ
(مشکوٰۃ۔ باب الحذر۔ ص ۴۲۲)

195. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఓసారి నమాజ్, రోజా, జకాత్, హజ్, ఉమ్రా ఇత్యాది సత్కార్యాలన్నింటిని గురించి ప్రస్తావిస్తూ "మనిషి వీటినన్నింటినీ ఆచరిస్తాడు కాని ప్రళయంనాడు అతనికి అతని బుద్ధిజ్ఞానాల కనుగుణంగానే ప్రతిఫలం దక్కుతుంది." (మిష్కాత్)

---

నైతిక నడవడిలో, సభ్యతా సంస్కారాల్లో వారు సామాన్య మనుషులకన్నా అధమ రీతిలో మెలిగే ఉదాహరణలున్నాయి. అందుకే దానికి ప్రాధాన్యతనిస్తూ నైతికతతో పాటు బుద్ధి కుశలత, ఆలోచనాపరత్వాలకు కూడా దైవప్రవక్త ప్రముఖ స్థానాన్నిచ్చారు.

194. నమాజ్‌లో క్రమశిక్షణకు తొలిమెట్టుగా వరుసల్ని తిన్నగా ఉంచడం ముఖ్యం. నమాజ్ వాస్తవానికి ముస్లిముల జీవన వ్యవస్థకు ప్రతీక. నమాజ్‌లోని క్రమశిక్షణ, దైవాదేశాల పాలన, ఒకే నాయకుని అనుసరణలో సామూహిక వ్యవస్థ ఏర్పాటు, నిజానికి ముస్లిముల సామూహిక జీవితానికి ఆదర్శం. ముస్లిములు సదా సంఘటిత సామూహిక వ్యవస్థలోనే ఇమిడి ఉండాలన్నది దైవ ప్రబోధం. ఆ సామూహిక వ్యవస్థ ఎంతో క్రమశిక్షణగలదయి ఉండాలన్న అంశాన్ని నమాజ్ ద్వారా నేర్పడం జరుగుతుంది. ఆ వ్యవస్థలో నాయకుని దగ్గరలో ఉండేవారు మేధావులు, బుద్ధికుశలత గలవారు, కార్య శీలురు, కర్తవ్యపరాయణులయి ఉండాలన్నది కూడా దైవాదేశమే. దానికనుగుణంగానే దైవప్రవక్త ఈ హదీసులో బోధించారు. నమాజ్‌లో ఇమామ్(నాయకుడు) వెనక వరుసలో ఇమామ్‌కు సమీపాన ఉండేవారు ధర్మాదేశాల్లో బాగా ప్రవేశమున్నవారు, సమయస్ఫూర్తిగలవారు, బుద్ధికుశలురు అయినవారుంటే నమాజ్‌లో ఇమామ్‌కు సహకారం లభిస్తుంది. వరుసల్లో అదే క్రమం ప్రకారం క్రమేణ తరువాతి స్థాయివారు నిలువాలి.

(۱۹۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا يُلْدَغُ الْمُؤْمِنُ مِنْ جُحْرٍ وَّاحِدٍ مَّرَّتَيْنِ ۔ (بخاری مسلم مشکوٰۃ ۔ ص ۴۲۹)

196. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనంలో దైవప్రవక్త ఇలా సెలవిచ్చారు: "విశ్వాసి ఒక బిలం నుండి రెండుసార్లు కాటుకు గురికాడు."

(బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(۱۹۷) عَنْ اَبِیْ سَعِیْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا حَلِيْمَ اِلَّا ذُوْ عَثْرَةٍ وَلَا حَكِيْمَ اِلَّا ذُوْ تَجْرِبَةٍ ۔ (رواہ احمد ۔ مشکوٰۃ باب الحذر ص ۴۲۱)

197. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రి (ర.అ) ఓసారి దైవ సందేశహరులు ఇలా బోధించినట్లు ఉల్లేఖించారు: "సంయమనం గల వ్యక్తివల్లనే పొరపాట్లు కూడా జరుగుతాయి. అనుభవజ్ఞుడయిన వ్యక్తియే వివేచనాపరుడు కాగలడు."

(అహ్మద్, మిష్కాత్)

---

195. ఆరాధనలు కేవలం లాంఛనప్రాయంగా చేసినట్లయితే అవి నెరవేరడం జరిగినా, ఆ ఆచరణకు తగిన ప్రతిఫలం ప్రళయం రోజున ప్రాప్తమయినా వాస్తవంగా సరైన ధార్మిక స్ఫూర్తితో, అవగాహనతో చేసిన ఆరాధనల్లోనే వాటి మాధుర్యం, కమ్మదనం మనిషికి లభిస్తుంది. అప్పుడే మనిషి ఆరాధనల అసలు లక్ష్యాన్ని పొందగలుగుతాడు. దేవుని నిజభక్తులు ఆరాధనల్లో పొందే హాయి, శాంతి, సంతృప్తి అతనికి సంప్రాప్తమవుతాయి. దీన్నే ఈ ఆయత్ కూడా ధృవపరుస్తుంది: "వారికి (దేవుని దాసులకు) వారి ప్రభువు ఆయత్‌లను జ్ఞాపకం చేసినప్పుడు వారు గుడ్డివారుగా, చెవిటివారుగా వాటిలో పడిపోరు." అంటే ఆలోచించకుండా, కేవలం అంధానుసరణగా, మూఢంగా దేన్నీ అవలంబించరు. బుద్ధిని, వివేకాన్ని, వివేచనను వినియోగించి మరీ ప్రవర్తిస్తారు. పరలోకంలో ప్రతిఫలం కూడా వారి ఈ సచేతనాచరణ కనుగుణంగానే లభ్యమవుతుంది.

196. అంటే దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించిన వ్యక్తి ఎంత వివేకవంతుడు, చతురుడు, సూక్ష్మ దృష్టికలవాడయి ఉంటాడంటే ఒక్కసారెప్పుడయినా మోసపోయినా, మరోసారి ఎవరి వంచనకూ లోనవడు. ఇక్కడ మరో విషయాన్ని గుర్తుంచుకోవాలి. దేవుని నిజదాసుడు దైవభక్తి, దైవభీతి వల్ల సదా ధర్మసమ్మతమయిన ఆదాయాన్నే కోరుకుంటాడు. అది ఎంత స్వల్పమయినా దానిపైనే సంతుష్టుడయి ఉంటాడు.

(۱۹۸) عَنْ أَبِيْ مَالِكٍ الْأَشْعَرِيْ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَلطُّهُوْرُ شَطْرُ الْإِيْمَانِ۔ (مسلم،مشکوٰۃ۔کتاب الطہارۃ۔صفحہ ۳۸)

198. దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలిపారని అబూ మాలిక్ అష్అరి (ర.అ) ఉల్లేఖించారు: "పరిశుద్ధత, పవిత్రతలు ఇస్లామీయ విశ్వాసంలో సగభాగం." (ముస్లిమ్, మిష్కాత్)

(۱۹۹) عَنْ عَائِشَةَ قَالَتْ كَانَتْ يَدُ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ الْيُمْنٰى لِطُهُوْرِهٖ وَطَعَامِهٖ وَكَانَتْ يَدُهُ الْيُسْرٰى لِخَلَائِهٖ وَمَا كَانَ مِنْ أَذًى۔ (رواہ ابوداؤد،مشکوٰۃ۔باب آداب الخلاء۔صفحہ ۴۲)

199. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖించారు: దైవ సందేశహరులు (సఅసం) కుడిచెయ్యిని వుజూ చెయ్యడానికి, భోజనపానీయాలకు వినియోగించేవారు. ఎడమ చెయ్యిని 'ఇస్తింజా' (మల మూత్ర పరిశుద్ధత) తదితర పనుల్లో వాడేవారు. (అబూదావూద్, మిష్కాత్)

---

దానికి భిన్నంగా అధర్మ సంపాదన రాసులు పడిఉన్నా కన్నెత్తి కూడా చూడడు. ఇతని ఈ వైఖరిని సాధారణంగా అవివేకంగా వర్ణిస్తారు ప్రజలు. ఈ కారణంగానే కొన్ని ఉల్లేఖనాల్లో విశ్వాసిని "భోలా ఉత్తముడు" అని, ద్వంద్వ స్వభావి అయిన కపటిని 'వంచకుడు, నీచుడు' అని ప్రస్తావించడం జరిగింది. ఇలాంటి భావాన్నే మరో ఉల్లేఖనంలోనూ సూచించడం జరిగింది: "నిస్సందేహంగా స్వర్గవాసులు సాదా సీదా మనుషులు."

197. పొరపాట్లు చేసినా నిలకడతో సంయమనంతో ముందుకు సాగడం గొప్ప విషయమే. అలాగే అనుభవంతో కూడుకున్న వివేచన ఉండటం కూడా గొప్ప విషయమే.

198. ఇస్లాం ఓ పరిపూర్ణ జీవన విధానం. ఇందులో భౌతిక, ఆధ్యాత్మిక ఉభయ విషయాలూ ఎంతో సుందరంగా సమ్మిళితమై జీవితంలో సమన్వయాన్నీ, సమతూకాన్నీ, సమగ్రతను ప్రసాదిస్తాయి. కేవలం నైతిక ఆధ్యాత్మిక పవిత్రతలనే బోధించక వాటితోపాటు బాహ్య పరిశుభ్రతను, పరిశుద్ధతను, సభ్యతను, సంస్కారాన్ని కూడా ప్రబోధిస్తుంది. అందువల్లనే ధార్మిక విశ్వాసంలో సగ భాగం పరిశుద్ధత, పరిశుభ్రతలని పేర్కొనడం జరిగింది.

199. కుడి చెయ్యి ప్రాధాన్యతను చాటిచెప్పే మరికొన్ని హదీసులూ ఉన్నాయి. మంచి పనులను కుడి చెయ్యితో చెయ్యడంతోపాటు కుడి వైపుగానే పని

(۲۰۰) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مُغَفَّلٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَبُوْلَنَّ اَحَدُكُمْ فِيْ مُسْتَحَمِّهٖ ثُمَّ يَغْتَسِلُ فِيْهِ اَوْ يَتَوَضَّأُ فِيْهِ
(رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب آداب الخلاء ص۳۵)

200. అబ్దుల్లా బిన్ మగప్ఫర్ ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారుః స్నానాల చోట మూత్ర విసర్జన చెయ్యడం, తరువాత అక్కడే స్నానం చెయ్యడం, వుజూ చెయ్యడం ఎన్నడూ జరగరాదు.

(۲۰۱) عَنْ اَبِیْ مُوْسٰی قَالَ كُنْتُ مَعَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ ذَاتَ يَوْمٍ فَاَرَادَ اَنْ يَّبُوْلَ فَاَتٰى دَمِثًا فِيْ اَصْلِ جِدَارٍ فَبَالَ ثُمَّ قَالَ اِذَا اَرَادَ اَحَدُكُمْ اَنْ يَّبُوْلَ فَلْيَرْتَدْ لِبَوْلِهٖ ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب آداب الخلاء ص۴۲)

201. అబూ మూసా (ర.అ.) ఉల్లేఖించారుః ఒక రోజున నేను దైవప్రవక్త (సఅసం) వెంట ఉన్నాను. ఆయనకు మూత్ర విసర్జన అవసరం కలిగింది. అప్పుడాయన ఓ గోడ చాటుగా మెత్తటి నేలను చూసి అక్కడ కూర్చొని తన అవసరం తీర్చుకున్నారు. ఆ తరువాత "మీలో ఎవరయినా మూత్ర విసర్జన చెయ్యదలచినప్పుడు మెత్తటి నేలను వెదికి మరీ చెయ్యాలి" అని బోధించారు. (అబూదావూద్, మిష్కాత్)

---

ప్రారంభించాలన్న బోధన కూడా మనకు లభిస్తుంది. పరిశుభ్రతకై పరిశుద్ధతకై ఎడమ చెయ్యిని వినియోగించడానికి ఈ హదీసులో ఉపదేశించడం జరిగింది. ముక్కు చీదడం మొదలుగా పారిశుద్ధ్య కార్యకలాపాలన్నీ ఎడమ చేతితోనే చెయ్యాలన్న బోధన స్పష్టంగా ఉంది.

200. సాధారణంగా ఈ నియమాన్ని చాలా మంది పాటించరు. మూత్రం అపరిశుద్ధమయింది. స్నానం చేసే చోటనే మూత్రం పోసినట్లయితే స్నానం చేసేటప్పుడు అపరిశుద్ధ పదార్థంపై పడ్డ నీటి తుంపర తిరిగి శరీరంపై పడే ప్రమాదముంటుంది. అందువల్ల మూత్రం పోసే చోటు వేరుగా ఉండాలి. స్నానాల చోటు, వుజూ చేసే చోటు వేరుగా ఉండాలి. స్నానాలు, వుజూ చేసే చోట మూత్రం పొయ్యరాదు. లేకపోతే శారీరక పారిశుద్ధ్యం అనుమానాస్పదమయి పోతుంది.

(۲۰۲) عَنْ عُمَرَ قَالَ رَاٰنِیَ النَّبِیُّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَاَنَا اَبُوْلُ قَائِمًا فَقَالَ یَاعُمَرُ لَا تَبُلْ قَائِمًا فَمَا بُلْتُ قَائِمًا بَعْدُ۔ (رواہ الترمذی ۔ مشکوٰۃ باب آداب الخلاء ۔ ص ۳۵)

202. హజ్రత్ ఉమర్ (ర.అ) ఉల్లేఖించారు: నేనొకసారి నిలబడి మూత్ర విసర్జన చేస్తూ ఉండగా దైవప్రవక్త గమనించారు, అప్పుడు నాతో, "ఉమర్ నిలబడి మరెన్నడూ మూత్రం చెయ్యకు" అని చెప్పారు. ఆ తరువాత మరెప్పుడూ నేను నిలబడి మూత్ర విసర్జన చెయ్యలేదు. (తిర్మిజి, మిష్కాత్)

(۲۰۳) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِنَّمَا اَنَا لَکُمْ مِّثْلُ الْوَالِدِ لِوَلَدِہٖ اُعَلِّمُکُمْ اِذَا اَتَیْتُمُ الْغَائِطَ فَلَا تَسْتَقْبِلُوا الْقِبْلَۃَ وَلَا تَسْتَدْبِرُوْھَا وَاَمَرَ بِثَلٰثَۃِ اَحْجَارٍ وَّنَھٰی عَنِ الرَّوْثِ وَالرِّمَّۃِ وَ نَھٰی اَنْ یَّسْتَطِیْبَ الرَّجُلُ بِیَمِیْنِہٖ۔ (رواہ ابن ماجہ ۔ مشکوٰۃ ۔ باب آداب الخلاء ص ۳۴)

203. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఓ తండ్రి తన సంతానం పట్ల ఎంత వాత్సల్యం కలిగి ఉంటాడో నేను మీ పట్ల అంతే హితైషిని. అందువల్లనే నేను మీకు (ప్రతి చిన్న విషయాన్నీ) బోధిస్తుంటాను. మీలో ఎవరయినా తన సహజ అవసరాల పరిపూర్తికై వెళ్ళినప్పుడు కిబ్లా (కాబాభిముఖం) వైపునకు తిరిగి గాని దానికి వీపు చూపుతూగాని కూచోరాదు." ఇంకా ఆయన, మూడు రాళ్ళతో పరిశుద్ధత పాటించమని, ఎండిన పెంటను ఎముకను పరిశుద్ధతకై వాడరాదని, పరిశుద్ధతకై కుడి చేతిని వినియోగించరాదని కూడా తాకీదు చేశారు. (ఇబ్నుమాజ, మిష్కాత్)

---

201. ఆ కాలంలో నేటిలా స్నానాల గదులు, మూత్ర శాలలూ ఉండేవి కావు. నేటికీ మన పల్లెప్రాంతాల్లో గ్రామాల్లో జనం "ఒర్రె గడ్డ"కు, "కాలువ గట్టు"కు "బయలు ప్రదేశా"నికి వెడుతుంటారు. ఈ హదీసులో దైవ సందేశహరులు (సఅసం) మనకు కొన్ని విధానాలు నేర్పారు: (1) ఏదయినా చాటు ప్రదేశంలో మూత్ర విసర్జనకైనా,

(۲۰۴) عَنْ عَائِشَةَ اَنَّهَا قَالَتْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ لَا صَلٰوةَ بِحَضْرَةِ الطَّعَامِ وَلَا هُوَ يُدَافِعُهُ الْاَخْبَثَانِ ـ (رواہ مسلم، مشکوٰۃ ـ باب الجماعۃ ـ ص۹۶)

204. హజ్రత్ ఆయిషా ఉల్లేఖించారు, నేను ప్రవక్త మహనీయులు ఇలా సెలవియ్యగా విన్నాను: "భోజనం సిద్ధంగా ముందుకు వచ్చినట్లయితే అప్పుడు నమాజ్ లేదు. అలాగే మల మూత్రాల ఆవశ్యకత కలిగినప్పుడు కూడా నమాజ్ లేదు." (ముస్లిమ్, మిష్కాత్)

---

మల విసర్జనకైనా కూచోవాలి. (2) గట్టి నేలపై మూత్రం పొయ్యరాదు. దాని తుంపర తిరిగి మన శరీరంపై పడే ప్రమాదముంటుంది. మెత్తటి మట్టి, ఇసుక నేల చూసి మరీ కూచోవాలి.

202 సర్వ సాధారణంగా కూచొనే మూత్ర విసర్జన చెయ్యాలి. ఏదయినా గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడితే నిలబడి చెయ్యవచ్చు కాని అప్పుడు కూడా మూత్రపు తుంపర ఒంటిపై, బట్టలపై పడకుండా, అంతా అశుద్ధమవకుండా జాగ్రత్తపడాలి. సామాన్య పరిస్థితుల్లో కూచొని చెయ్యడమే సరయిన పద్ధతి.

203. చిన్న చిన్న విషయాలు కూడా, తల్లిదండ్రులు బిడ్డలకు నేర్పే విధంగా దైవప్రవక్త మనకు బోధించారు. ఆయన చేసిన ఈ మహోపకారానికి మానవాళి ఆయనకు ఎంతయినా రుణపడి ఉందని చెప్పవచ్చు. ఈ హదీసు ద్వారా తెలిసిన కొన్ని ముఖ్య విషయాలు:

(1) కిబ్లా వైపునకుగాని ఆ వైపునకు వీపు త్రిప్పిగాని మల మూత్ర విసర్జన చెయ్య రాదన్న ఈ ఆదేశం కేవలం బయలు ప్రదేశాలకు, అడవి, ఎడారులకే వర్తిస్తుందని, జన వాసాల్లో దాన్ని పాటించడం మంచిదే కాని ఒకవేళ పాటించడానికి వీలుపడకపోతే తప్పులేదు.

(2) ఇస్తింజా (పారిశుద్ధ్యం) మూడు రకాలుగా చేసుకోవచ్చు. (అ) మూడు రాళ్ళు, లేక మట్టి పెడ్డలు ఉపయోగించడం (ఆ) నీటిని వాడడం (ఇ) ఈ రెండు విధానాలనూ వాడడం. అంటే ముందు మట్టి పెడ్డలతో శుభ్రం చేసి తరువాత నీటితో కడుక్కోవడం.

204. ఈ హదీసులో రెండు సందర్భాల్లో నమాజ్‌పై వేరే విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. (1) ఆకలిగా ఉన్నప్పుడు భోజనం సిద్ధమయి ఉన్నట్లయితే ముందు భోజనం చేసి ఆ తరువాత ఏకాగ్రతతో, నిశ్చల హృదయంతో నమాజ్

(٢٠٥) عَنْ مُعَاذٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِتَّقُوا
الْمَلَاعِنَ الثَّلٰثَةَ اَلْبَرَازَ فِى الْمَوَارِدِ وَقَارِعَةِ الطَّرِيْقِ وَالظِّلِّ۔ (رواہ ابوداؤد۔
مشکوٰۃ۔ باب آداب الخلاء۔ ص۳۵)

205. "మూడు అభిశాపపు ప్రదేశాల్లో మలమూత్రాలు చెయ్యకుండా జాగ్రత్తపడండి: (1) నదీ కాలువల, రేవు వద్ద, (2) వచ్చిపొయ్యే దారుల వెంట, (3) నీడ గల చోట" అని దైవ సందేశహరులు (సఅసం) బోధించినట్లు హజ్రత్ ముఆజ్ ఉల్లేఖించారు. (అబూదావూద్, మిష్కాత్)

(٢٠٦) عَنْ مُعَاوِيَةَ بْنِ قُرَّةَ عَنْ اَبِيْهِ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ نَهٰى عَنْ هَاتَيْنِ الشَّجَرَتَيْنِ يَعْنِى الْبَصَلَ وَالثُّوْمَ وَقَالَ مَنْ
اَكَلَهُمَا فَلَا يَقْرَبَنَّ مَسْجِدَنَا وَقَالَ اِنْ كُنْتُمْ لَابُدَّ اٰكِلِيْهِمَا
فَاَمِيْتُوْهُمَا طَبْخًا۔ (رواہ ابوداؤد، مشکوٰۃ۔ باب المساجد ص۶۲)

206. ముఆవియా బిన్ కుర్ర తన తండ్రి ద్వారా పరిగ్రహించి ఉల్లేఖించారు, "దైవ ప్రవక్త రెండు చెట్టు మొక్కలు – తెల్లుల్లిపాయలు, ఉల్లిగడ్డలు – తినడాన్ని వారించారు. ఆయన ఇలా సెలవిచ్చారు, "వీటిని తిన్న వారు మా మస్జిదుల వద్దకు రాకూడదు." ఆయన ఇంకా ఇలా అన్నారు: "వాటిని తినడం అనివార్యమే అయితే వండి వాటి దుర్వాసనను పారద్రోలాలి."
(అబూదావూద్, మిష్కాత్)

---

చెయ్యాలి. అయితే ఒకవేళ అంతగా ఆకలి లేనప్పుడు, ముందు నమాజ్ చేసుకోవడమే ఉత్తమం. (2) సహజ ఆవశ్యకతలయిన మల మూత్రాలను ఆపుకుని నమాజ్ చెయ్యడం ఎట్టి పరిస్థితిలోనూ తగదు. ముందు ఆ అవసరాలను తీర్చుకుని మరీ నమాజ్ చేసుకోవాలి.

205. 'అభిశాపపు ప్రదేశాలు' అంటే ఈ మూడు ప్రదేశాల్లో మలమూత్రాల విసర్జన వల్ల మనిషి దైవ సన్నిధిలో అభిశాపానికి గురవుతాడని అర్థం. కాలువలూ నదుల రేవులకు నీళ్ళ కోసం వచ్చిపోయే జనానికి ఇబ్బంది కలుగుతుంది. అలాగే సాధారణ

(۲۰۷) عَنْ عُمَرَ بْنِ اَبِیْ سَلْمَةَ قَالَ كُنْتُ غُلاَمًا فِیْ حِجْرِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَكَانَتْ يَدِىْ تَطِيْشُ فِى الصَّحْفَةِ فَقَالَ لِىْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِسْمِ اللّٰهِ وَكُلْ بِيَمِيْنِكَ وَكُلْ مِمَّا يَلِيْكَ۔

(بخاری، مسلم۔ مشکوٰۃ۔ کتاب الاطعمہ)

207. ఉమర్ బిన్ అబీ సల్మా (ర.అ) ఇలా ఉల్లేఖించారు: “నేను శిక్షణ, పోషణలకై బాల్యంలో దైవప్రవక్త(సఅసం) వద్ద ఉండేవాణ్ణి. భోంచేసేటప్పుడు నా చెయ్యి కంచం అంతటా తిరగాడేది. ఆయన (సఅసం) నాకు ఇలా బోధించారు, “బిస్మిల్లా పఠించు, కుడి చేత్తో తిను, నీకు సమీపాన ఉన్న భాగం నుండి తిను.” (బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

---

రాకపోకల బాటలు, రోడ్డులపై వచ్చిపొయ్యేవారికి ఇబ్బందికరమే. నీడగల స్థలాల్లోనయితే ఎండల్ని, వర్షాన్ని తప్పించుకునేందుకు నీడన నిలబడేవారికి ఇబ్బంది అవుతుందన్న విషయం తెలుస్తూనే ఉంది. ఈ ఆదేశంలో రెండు అంశాలు అంతర్లీనమై ఉన్నాయి. ఒకటి, అసభ్యకరమయిన, కుసంస్కారపు చేష్టను మనిషిలోని పారిశుద్ధ్యపు సహజ భావం అసహ్యించుకుంటుంది. రెండు, సాధారణ జనం వచ్చిపొయ్యే ప్రదేశాల్లో మలమూత్ర విసర్జన సిగ్గులేనితనానికి, అత్యంత స్వార్థపరతత్వానికి నిదర్శనం. వీటికి దూరంగా మెలగాలి.

206. పరిశుద్ధత, సభ్యతా సంస్కారాలకు, సామూహిక మర్యాదలకు ఇస్లామ్‌లో ఎంత ప్రాముఖ్యం ఉందంటే, సాధారణంగా అసహ్యమయిన వాసనలు వెదజల్లే పదార్థాలు భుజించి మస్జిదుల్లో ప్రవేశించడాన్ని నిషేధించడం జరిగింది. దీని ద్వారా రెండు విషయాలు ద్యోతకమవుతున్నాయి: ఒకటి, ఏ పదార్థాల వల్లనయితే అసహ్యకరమయిన వాసనలు పుడతాయో అలాంటివాటిని తినడంగాని, వాడడంగాని చెయ్యరాదు. రెండు, సభలూ సమావేశాల్లో, సామూహిక కార్యక్రమాల్లో పాల్గొనేటప్పుడు పై విషయంలో తమ తోటివారిని కూడా గమనించి మరీ మసలుకోవాలి.

207. ఉమర్ బిన్ అబీ సల్మా దైవ ప్రవక్త సతీమణి (విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా)కి తన మొదటి భర్త ద్వారా కలిగిన సంతానం. దైవ ప్రవక్త అతన్ని తన సంతానం మాదిరిగానే పెంచి శిక్షణ గరిపేవారు. కంచం మొత్తాన్ని కెలుకుతూ తినే అలవాటు చాలా మందికి ఉంటుంది. అలాంటి అలవాటే బహుశా ఉమర్ బిన్ అబీ సల్మాకు ఉండి ఉంటుంది. అందువల్లనే ‘నీకు సమీపాన ఉన్న భాగం’ అంటే కంచంలో

(۲۰۸) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ مَا عَابَ النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ طَعَامًا قَطُّ اِنِ اشْتَهَاهُ اَكَلَهٗ وَاِنْ كَرِهَهٗ تَرَكَهٗ (بخاری مسلم مشکوٰۃ کتاب الاطعمہ)

208. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం: "దైవ ప్రవక్త (సఅసం) భోజనంలో ఎన్నడూ తప్పుపట్టలేదు. ఆకలి కలిగి ఇష్టమయితే తినేవారు ఇష్టపడకపోతే మానేసేవారు." (బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

(۲۰۹) عَنْ وَحْشِيِّ بْنِ حَرْبٍ عَنْ اَبِيْهِ عَنْ جَدِّهٖ اَنَّ اَصْحَابَ رَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالُوْا يَا رَسُوْلَ اللّٰهِ اِنَّا نَاْكُلُ وَلَا نَشْبَعُ قَالَ فَلَعَلَّكُمْ تَفْتَرِقُوْنَ قَالُوْا نَعَمْ قَالَ فَاجْتَمِعُوْا عَلٰی طَعَامِكُمْ وَاذْكُرُوا اسْمَ اللّٰهِ يُبَارَكْ لَكُمْ فِيْهِ۔ (ابوداؤد، مشکوٰۃ۔ باب الضیافۃ)

209. వహ్షీ బిన్ హర్బ్ తన తండ్రి చెప్పగా, ఆయనేమో (వహ్షీ) తాత ప్రస్తావించగా (విని) ఉల్లేఖించారు: "సహచరులు ఓసారి దైవ సందేశహరులు (సఅసం)తో "మేము భోంచేసినా తృప్తి కలగదు" అని విన్నవించుకున్నారు. దానికి దైవ ప్రవక్త (సఅసం) ఇలా అడిగారు, "మీరు వేర్వేరుగా భోంచేస్తారేమో కదు." సమాధానంగా సహచరులు, అవునని ఒప్పుకున్నారు. అప్పుడు ఆయన, "అందరూ కలసి భోంచెయ్యండి. అల్లాహ్ నామం ప్రస్తావించి మరీ భోంచెయ్యండి. మీ అన్నపానీయాల్లో శుభం చేకూరుతుంది" అని ప్రబోధించారు. (అబూదావూద్, మిష్కాత్)

---

నీ ఎదుట ఉన్న అంచు దగ్గరి నుండి భోంచెయ్యమని, కంచం మొత్తం కెలకవద్దని నేర్పారు. స్థూలంగా చూస్తే ఇది అతి సాధారణమయిన విషయం. అయినప్పటికీ ఆయన (సఅసం) అతనికి హితవు గరిపి భోజన మర్యాదలు నేర్పారు. దీనివల్ల తెలిసేదేమిటంటే, తల్లిదండ్రులు, సంరక్షకులు పిల్లల పెంపకంలో అతి సాధారణ విషయాల పట్ల కూడా జాగ్రత్త వహించి వారి శిక్షణలో శ్రద్ధచూపవలసి ఉంటుంది.

208. చాలా మంది తినడానికే బ్రతుకుతుంటారు. కాని వాస్తవానికి బ్రతకడానికి మటుకే తినాలి. బ్రతుకు భోజనం కన్నా ఉన్నతమయిన లక్ష్యాలకై వినియోగమవ్వాలి. ఉన్నత ఆశయం గల వ్యక్తి భోజనంలాంటి అనుదిన విషయాల్లో తప్పులుపడుతూ,

(٢١٠) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
مَنْ بَاتَ وَفِیْ یَدِهٖ غَمَرٌ لَمْ یَغْسِلْهُ فَاَصَابَهٗ شَیْئٌ فَلَا یَلُوْمَنَّ اِلَّا نَفْسَهٗ
(رواہ الترمذی ، مشکوۃ ۔ کتاب الاطعمہ)

**210.** హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా ఉపదేశించారు: "ఎవరి చెయ్యికయినా (భోంచెయ్యడం వల్ల) జిడ్డుఅంటుకుని ఉండగా అతను దాన్ని కడుక్కోకుండా పడుకుంటే, ఆపైన అతనికి ఏమైనా హానికలిగితే అతను తన్నుతాను నిందించుకోవాలి." (తిర్మిజి, మిష్కాత్)

(٢١١) عَنْ یَعْلٰی بْنِ مَمْلَكٍ اَنَّهٗ سَاَلَ اُمَّ سَلَمَةَ عَنْ قِرَاءَةِ النَّبِیِّ
صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَاِذَا هِیَ تَنْعَتُ قِرَاءَةً مُفَسَّرَةً حَرْفًا حَرْفًا ۔
(رواہ الترمذی ، مشکوۃ ۔ کتاب فضائل القرآن)

**211.** యాలై బిన్ మమ్‌లక్ ఓ ఉల్లేఖనంలో ఇలా తెలిపారు, తాను హజ్రత్ ఉమ్మె సల్మాని ప్రవక్త మహనీయుల పారాయణం గురించి అడగ్గా ఆమె ఒక్కో అక్షరం స్పష్టంగా ఉచ్ఛరిస్తూ పారాయణం చేసి చూపారు. (తిర్మిజి, మిష్కాత్)

---

మాటిమాటికీ తన ఇంటివారిని మందలిస్తూ వారితో తగువుపడుతూ సమయం, శక్తి, సామర్థ్యాలు వృధా చెయ్యడు. ఏ గొప్ప ఆశయం లేకుండా తినడానికే బ్రతికేవారి వ్యాపకం ఇదంతా.

209. విడివిడిగా, ఎవరికివారు భోంచెయ్యడం తప్పు అనీ, అది షరీఅత్ ప్రకారం అనుమతించదగ్గ విషయంకాదని దీనికి అర్థం ఎంత మాత్రం కాదు. అయితే ఇది అందరూ కలసి భోంచెయ్యడం వల్ల శుభలాభాలు కలుగుతాయని తెలుపుతోంది. సామూహిక భోజనాల్లో పాల్గొన్నవారి నిత్యానుభవమే ఈ విషయం.

ఇక్కడ మరో విషయం కూడా మరువరాదు. భోజన విషయంలోనూ సామూహిక తత్వాన్ని పాటిస్తే దాని సత్ప్రభావం ఇలా ముందుకు వస్తుంది కదా, అసలు మొత్తం జీవితంలో సామూహిక తత్వం క్రియాశీలపాత్ర వహిస్తే దాని సత్ఫలితాలు ఎంత ఉత్తమంగా సుదీర్ఘంగా కలుగుతాయో ఊహించవలసి కాదు.

(۲۱۲) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
لَیْسَ مِنَّا مَنْ لَّمْ یَتَغَنَّ بِالْقُرْاٰنِ (رواہ البخاری۔ مشکوٰۃ۔ کتاب فضائل القرآن)

212. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు: "దివ్య ఖుర్ఆన్‌ని మధుర కంఠంతో పఠించనివారు మనలోనివారు కారు." (బుఖారి, మిష్కాత్)

(۲۱۳) عَنْ عَائِشَةَ قَالَتْ اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
لَمْ یَکُنْ یَسْرُدُ الْحَدِیْثَ کَسَرْدِکُمْ کَانَ یُحَدِّثُ حَدِیْثًا لَوْ عَدَّهُ الْعَادُّ
لَاَحْصَاهُ۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ باب اخلاق النبی صلی اللّٰہ علیہ وسلم)

213. హజ్రత్ ఆయిషా ఇలా ఉల్లేఖించారు, "దైవసందేశహరులు (సఅసం) మీలా ఇలా (వేగంగా) మాట్లాడేవారుకారు. ఆయన మాట్లాడితే ఎవరయినా మాటల్ని లెక్కపెట్టగోరితే లెక్కబెట్టుకోవచ్చు. ఆ విధంగా నెమ్మదిగా మాట్లాడేవారాయన." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

210. అజాగ్రత్త వల్ల భోంచేసి, చెయ్యి పరిశుభ్రంగా కడుక్కోకుండా నిర్లక్ష్యం వహిస్తే క్రిమికీటకాల వల్ల కీడు కలగవచ్చు. ఆ అజాగ్రత్తకు తన్ను తాను నిందించుకోవడం తప్ప మనిషి చెయ్యగలిగేదేముంది? అలాంటి దురవస్థ రాకుండా జాగ్రత్తపడటం ఉత్తమం.

211. పారాయణం అంటే దివ్య ఖుర్ఆన్ పారాయణం అని అర్థం చేసుకోవాలి. ఈ హదీసునుబట్టి దైవ ప్రవక్త దివ్య ఖుర్ఆన్‌ని నిలకడతో స్పష్టమయిన ఉచ్చారణతో హుందాగా పఠించేవారని తొందరపాటుతోగాని, వేగంగాగాని పఠించేవారుకారని ద్యోతకమవుతోంది. ప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించగోరేవారికి ఇది ఎంతయినా ఆత్మపరిశీలన చేసుకునే వీలు కల్పిస్తుంది.

212. మనిషికి సరళంగా, మధురంగా, వినసొంపుగా పఠించడం సులభసాధ్యమయితే అలానే పఠించాలి. అలా వీలుపడకపోతే కష్టపడి రానిపోని లాలిత్యం కోసం కృషి చేసి పఠించడం అభిలషణీయం కాదు. ఇది అల్లాహ్‌కు కూడా ఇష్టం కాదు. పోతే, రాగ యుక్తంగా పాడేందుకు కృషి చేసే కర్ణకఠోరంగా పఠించడం కూడా తప్పు. సాదాసీదాగా సరయిన ఉచ్చారణతో పఠిస్తే చాలు.

(۲۱۴) عَنْ اَنَسٍ قَالَ لَمْ يَكُنْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاحِشًا وَّلَا لَعَّانًا وَّلَا سَبَّابًا كَانَ يَقُوْلُ عِنْدَ الْمَعْتَبَةِ مَالَهٗ تَرِبَ جَبِيْنُهٗ (رواہ البخاری۔
مشکوٰۃ۔ باب اخلاق النبی صلی اللہ علیہ وسلم)

214. హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయుని (సఅసం) నోట ఎన్నడూ దుర్భాషలు, ఎత్తిపొడుపులు, దూషణలు వెలువడలేదు. కోపం వస్తే ఆయన, "అతనికేమైంది?", "అతని మాడు మట్టిలో గలువ" అని పలికేవారు. (బుఖారి, మిష్కాత్)

(۲۱۵) عَنْ جَابِرٍ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَبْصَرَ رَجُلًا ثَائِرَ الرَّاْسِ فَقَالَ لِمَ يُشَوِّهُ اَحَدُكُمْ نَفْسَهٗ وَاَشَارَ بِيَدِهٖ اَنْ يَّاْخُذَ مِنْهُ۔
(المعجم الصغیر للطبرانی۔ ص۲۲۳)

215. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఓ సంస్కారంలేని వ్యక్తిని చూసి, "మీలో కొందరు తమ రూపాన్ని వికారంగా ఎందుకు తయారు చేసుకుంటారు?" అని అంటూ జుత్తును కత్తిరించుకోమని తన చెయ్యితో తల జుత్తు వైపు సంజ్ఞ చేశారు.
(అల్ మోజముస్సగీర్)

---

213. కొందరికి త్వరత్వరగా మాట్లాడటం అలవాటయి ఉంటుంది. ఒక్కోసారి వినేవారికి ఆ మాట అర్థం చేసుకోవడమే కష్టమయిపోతుంది. ముఖ్యంగా ప్రజా కార్యకలాపాల్లో నిమగ్నులై ఉండేవారు నెమ్మదిగా నిలకడగా మాట్లాడటం నేర్చుకోవాలి. అది దైవప్రవక్త సంప్రదాయం అన్న భావంతో మాట్లాడితే పుణ్యప్రదం కూడా.

214. కోపం వచ్చినప్పుడు మనిషి తన్నుతాను అదుపులో ఉంచుకోలేడు. చాలా సౌమ్యంగా కనిపించేవారు సయితం ఆవేశంలో అవధులు దాటడం మన నిత్యానుభవమే. పోతే మనలో చాలా మంది తిట్లను, ఎత్తిపొడుపుల్ని, నిందల్ని ఊతపదాలుగా వాడుతుంటారు. ఈ హదీసు మనందరినీ మననోటి అదుపును గురించి హెచ్చరిస్తోంది.

215. జుత్తుకు తైల సంస్కారంతోబాటు మనిషి పరిశుభ్రంగా సంస్కారవంతంగా అగుపించాలని అనేక పర్యాయాలు ప్రవక్త మహనీయులు బోధించారు. అలాంటి బోధనల్లో ఒకటి ఈ హదీసులో ఉదాహరించబడింది. తలపై జుత్తు ఉన్నప్పుడు దానికి

(۲۱۶) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ الْحَارِثِ بْنِ جَزْءٍ قَالَ مَارَأَيْتُ أَحَدًا أَكْثَرَ تَبَسُّمًا مِّنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ (رواه الترمذی بشکوٰة - باب فی اخلاق النبی صلی اللہ علیہ وسلم)

216. అబ్దుల్లాహ్ బిన్ హారిస్ ఓ ఉల్లేఖనంలో, "నేను దైవ ప్రవక్త (సఅసం) కన్నా అధికంగా చిరునవ్వులు చిందించేవారినెవ్వరినీ చూడలేదు." అని అన్నారు. (తిర్మిజి, మిష్కాత్)

(۲۱۷) عَنْ عَائِشَةَ قَالَتْ مَارَأَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مُسْتَجْمِعًا قَطُّ ضَاحِكًا حَتّٰى أَرٰى مِنْهُ لَهَوَاتِهِ وَإِنَّمَا كَانَ يَتَبَسَّمُ ۔

(رواه البخاری ۔ مشکوٰة ۔ باب اخلاق النبی صلی اللہ علیہ وسلم)

217. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు, "నేను దైవ సందేశహరుల్ని ఎన్నడూ, కొండ నాలుక కనబడేలా విరగబడి నవ్వుతూ ఉండగా చూడలేదు. ఆయన సదా కేవలం చిరునవ్వు నవ్వేవారు." (బుఖారి - మిష్కాత్)

---

తగిన మర్యాదలు సయితం పాటించడం నాగరికతా లక్షణం అని ప్రవక్త బోధనకు సారాంశం.

216. ప్రవక్త మహనీయుల తత్వంలో అటుశుష్కత్వమూ లేదు, ఇటు మాటిమాటికీ పగలబడి నవ్వడమూ లేదు. ఈ రెండు అతివాదాల మధ్య ఆయన సదా సంతులిత విధానాన్ని అవలంబించి నగుమోముతో దర్శనమిచ్చేవారు. నగుమోముతో పలకరించడం కూడా పుణ్య కార్యమని బోధించారు. మూతి ముడుచుకు కూర్చోవడం భృకుటిపై నిత్యం ముడులు వేసుకుని కనపడటం ఆయన ఇష్టపడేవారు కాదు.

217. ఇంతకు ముందు హదీసును ఈ హదీసు విశదీకరిస్తుంది. సదా నగుమోముతో పలకరించడం ఎంత ఉత్తమమైన పద్ధతో అలాగే విరగబడి నవ్వడం, అదీ అసభ్యంగా నవ్వడం అంతే కుసంస్కారానికి చిహ్నం. మరీ అధికంగా నవ్వే సందర్భం వచ్చినా దవడలు కూడా కనబడేలా దైవ ప్రవక్త నవ్వేవారని, అప్పుడు పగలబడి, పొట్ట చెక్కలయ్యేలా నవ్వడం అనేది జరిగేది కాదని ఇంకా కొన్ని హదీసులు తెలుపుతున్నాయి. ఇదే మనకు ఆదర్శప్రాయమైన పద్ధతి.

(۲۱۸) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اَلسَّفَرُ قِطْعَةٌ مِّنَ الْعَذَابِ یَمْنَعُ اَحَدَكُمْ نَوْمَهٗ وَطَعَامَهٗ وَشَرَابَهٗ فَاِذَا
قَضٰی نَهْمَتَهٗ مِنْ وَّجْهِهٖ فَلْیُعَجِّلْ اِلٰی اَهْلِهٖ (بخاری ـ مسلم ـ مشکوٰۃ ـ باب آداب السفر)

218. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు: "ప్రయాణం, యాతనలో ఓ భాగం, అది మిమ్మల్ని అన్నపానీయాలకు, విశ్రాంతికి దూరం చేస్తుంది. మీలో ఎవరైనా సరే అవసరం పూర్తయిన వెంటనే తన భార్యాపిల్లల వద్దకు తిరుగు ప్రయాణానికి తొందర చెయ్యాలి." (బుఖారి, ముస్లిమ్ - మిష్కాత్)

(۲۱۹) عَنْ جَابِرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا
اَطَالَ اَحَدُكُمُ الْغَیْبَةَ فَلَا یَطْرُقْ اَهْلَهٗ لَیْلًا۔ (بخاری ـ مسلم ـ مشکوٰۃ ـ باب
آداب السفر)

219. హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు: "మీలో ఎవరయినా దీర్ఘకాలం వరకు ఇంటికి దూరంగా ఉన్న పరిస్థితిలో ఇంటికి తిరిగిరావడమన్నది రాత్రి వేళల్లో అకస్మాత్తుగా జరక్కూడదు." (బుఖారి, ముస్లిమ్ - మిష్కాత్)

---

218. ప్రవక్త (సఅసం) కాలంలో ప్రయాణం దుర్భరంగా ఉండేదేమోకాని నేడు అలా లేదుగా అని ఎవరికయినా సందేహం కలగవచ్చు. నేడు సయితం, ఎన్ని సౌలభ్యాలు, సౌకర్యాలు ప్రయాణంలో ఏర్పడినా తన ఇంటి పట్టున నుండే సౌకర్యాలు మనిషికి ఏ విమానంలోనూ లభించవు, ఏ అతిథి గృహంలోనూ ప్రాప్తం కావు. తాను ప్రయాణావస్థలో ఉన్నానన్న ఆలోచనే మనిషికి ఇబ్బందికరంగా పరిణమిస్తుంది. అందువల్లనే, అదో శిక్ష లాంటిదని దైవ సందేశహరులు సెలవిచ్చారు. ఈ శిక్షను తప్పించుకోవాలంటే తనవారి వద్దకు చేరి తాను కోల్పోయిన విశ్రాంతిని, శాంతిని, తృప్తిని పొందడానికి తొందరపడాలి. మానసికమయిన శాంతి లభించనిదే మనిషి తన బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించలేడు.

219. భావమేమిటంటే మనిషి దీర్ఘకాలం వరకు దూర ప్రదేశంలో ఉంటూ ఇంటివారికి

(۲۲۰) عَنْ كَعْبِ بْنِ مَالِكٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَقْدِمُ مِنْ سَفَرٍ اِلَّا نَهَارًا فِي الضُّحٰى فَاِذَا قَدِمَ بَدَأَ بِالْمَسْجِدِ فَصَلَّى فِيهِ رَكْعَتَيْنِ۔

(رواہ البخاری ۔ مشکوٰۃ ۔ باب آداب السفر)

220. కఅబ్ బిన్ మాలిక్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు, "దైవ ప్రవక్త (సఅసం) ప్రయాణం నుండి ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు సాధారణంగా పగల్లోనే వస్తారు. లేదా 'జుహా' వేళలో వేంచేస్తారు. వచ్చీరాగానే మస్జిద్‌కి వెళ్ళి రెండు రకాతులు నమాజ్ చేస్తారు." (బుఖారి - మిష్కాత్)

(۲۲۱) عَنْ رَجُلٍ مِّنْ اَصْحَابِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ بَاتَ عَلٰى اِنْجَارٍ فَوَقَعَ مِنْهُ فَمَاتَ بَرِئَتْ مِنْهُ الذِّمَّةُ وَمَنْ رَكِبَ الْبَحْرَ حِيْنَ يَرْتَجُّ فَهَلَكَ بَرِئَتْ مِنْهُ الذِّمَّةُ۔

(الادب المفرد ۔ باب من بات علی سطح لیس لہ سترۃ ۔ ص ۱۷۴)

221. ప్రవక్త(సఅసం) సహచరుల్లో (సహాబీల్లో) ఒకరు, దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చినట్లు తెలిపారు: ఇంటి కప్పు అంచున పడుకుని తరువాత క్రిందపడ్డవాని బాధ్యత ఎవరిపైనా లేదు. అలాగే తుఫానులో సముద్ర ప్రయాణం చేసినవాని బాధ్యత కూడా ఎవరిపైనా లేదు.

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

తానెప్పుడు వస్తున్నదీ తెలుపకుండా అకస్మాత్తుగా రాత్రి వేళ ఊడిపడితే ఇంటివారు మానసికంగా సంసిద్ధంగా ఉండకపోవచ్చు. పగలయితే కనీసం వచ్చినట్లు ముందుగా వార్తయినా అందే అవకాశముంటుంది. అయితే ఒకవేళ ముందే తాను వస్తున్నట్లు తెలిపిన సందర్భంలో ఎప్పుడు వచ్చినా ఫరవాలేదు. ఇంటివారు మానసికంగా సన్నద్ధులయి ఉండటమే కాక ఎదురుచూస్తూ ఉంటారు కూడా. మనోఘాతం (షాక్) ప్రమాదముండదు.

220. 'జుహా' వేళ అనంటే బారెడు పొద్దు ఎక్కిన తరువాత అన్నమాట. అంటే

(٢٢٢) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ سَرْجِسَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَبُوْلَنَّ اَحَدُكُمْ فِيْ جُحْرٍ (ابوداؤد-مشكوٰة - باب آداب الخلاء ص ٣٥)

222. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు అబ్దుల్లా బిన్ సర్జిస్ ఉల్లేఖించారు: "మీలో ఎవరున్నా కీటకాల బిలంలో మూత్రం పోయరాదు." (అబూదావూద్ - మిష్కాత్)

(٢٢٣) عَنْ اَبِيْ اُمَامَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَرَّ بِرَجُلٍ فِي الْمَسْجِدِ مُنْبَطِحًا لِوَجْهِهٖ فَضَرَبَهٗ بِرِجْلِهٖ وَقَالَ قُمْ نَوْمَةٌ جَهَنَّمِيَّةٌ - (الادب المفرد- باب الضجعة على وجهه ص ١٧٤)

223. అబూ ఉమామ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, దైవ ప్రవక్త (సఅసం) ఓసారి మస్జిద్‌లో ఓ వ్యక్తి బోర్లా పడుకుని ఉండగా చూసి అతని వద్దకు వెళ్ళారు. అతన్ని తన కాలితో కొట్టి "లే, లేచి నిలబడు, ఇది నరకవాసులు పడుకునే తీరు" అని భయపెట్టారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

సాధారణంగా 'ఫజ్ర్ నమాజ్‌కు పూర్వం వచ్చేవారు కారన్నమాట. బాగా పొద్దెక్కి అందరూ తమ కార్యకలాపాల్లో నిమగ్నులై ఉండే వేళల్లోనే ఆయన (సఅసం) ఇంటికి వచ్చేవారన్నమాట. వచ్చి రాగానే రెండు రకాతుల నమాజ్ దైవ సన్నిధిలో దాసుడు కృతజ్ఞతలు తెలుపుకునే మంచి పద్ధతి. బహు దూరపు ప్రయాణాన్నుండి ఇంటికి క్షేమంగా వచ్చినందుకు ప్రయాణపు ఒడిదుడుకుల్లో నుండి విజయంగా బయటపడినందుకు ఈ కృతజ్ఞతాంజలి.

221. ప్రయాణం ఎవరయినా ఎప్పుడయినా ఏ మాధ్యమం ద్వారానయినా చెయ్యవచ్చు కాని చూస్తూ చూస్తూ ప్రమాదకరమయిన మార్గాన ప్రయాణించడం వివేకం అనిపించుకోదు. అలాగే విశ్రామం కొరకు ఏ విధానాన్నయినా అవలంబించవచ్చు. కాని తెలిసి ప్రమాదం నోటిలో విశ్రమించడం బుద్ధికలవారి లక్షణం కాదు. ఇలాంటివారు ప్రమాదానికి గురైతే దాని బాధ్యత ఇతరులెవ్వరిపైనా రాదు. చివరికి ప్రభుత్వం కూడా ఎక్స్‌గ్రేషియా ఇవ్వదేమో. ఇస్లామీయ రాజ్యంలో ఉన్న 'సామాజిక భీమా' వ్యవస్థ కూడా ఆదుకోదు కాబోలు! ఇంకా, జీవితం దైవం ప్రసాదించిన వరప్రసాదం. దాన్ని నిర్లక్ష్యం వల్ల, అజాగ్రత్తవల్ల, ప్రమత్తత వల్ల అర్థరహితంగా అంతమొందించడం, లేదా నష్టం కలిగించడం విశ్వసించిన వ్యక్తికి ధర్మసమ్మతం కాదు.

(۲۲۴) عَنْ اَبِیْ قَیْسٍ اَنَّہٗ جَاءَ وَرَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَخْطُبُ فَقَامَ فِی الشَّمْسِ فَاَمَرَہٗ فَتَحَوَّلَ اِلَی الظِّلِّ (الادب المفرد۔ باب ما یجلس علی حرف الشمس۔ ص ۱۷۲)

224. అబూ కైస్ ఉల్లేఖించారు, ఓసారి దైవప్రవక్త (సఅసం) ఓ ప్రసంగం చేస్తూ ఉండగా తాను అక్కడికి వెళ్ళి ఎండలో నిలబడగా ఆయన తనను నీడలోకి జరగమని ఆదేశించారని. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۲۵) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لَا یَمْشِ اَحَدُکُمْ فِیْ نَعْلٍ وَّاحِدٍ لِیُحْفِھِمَا جَمِیْعًا اَوْ لِیُنْعِلْھُمَا جَمِیْعًا۔ (بخاری۔ مشکوٰۃ۔ کتاب اللباس)

225. దైవ సందేశహరులు (సఅసం) ఇలా నిర్దేశించినట్లు హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖించారు: మీలో ఎవరూ ఒక్క పాదరక్షతో నడవరాదు. రెంటినీ తొడుక్కోవాలి లేదా రెంటినీ వదలివెయ్యాలి.

(బుఖారి - మిష్కాత్)

---

222. విష కీటకాల బిలాల్లో మూత్రం పోస్తే అవి బయటికి వచ్చి హాని కలిగించడం సహజం. అందువల్ల ఆరుబయట మూత్ర విసర్జన చేసేవారు జాగ్రత్తగా మసలుకోవాలన్నది, ప్రాణానికి హాని కలిగించే ఎలాంటి చర్యకయినా దూరంగా మసలుకోవాలన్నది ఈ ప్రబోధ సారాంశం.

223. దైవ సందేశహరులు (సఅసం) తన అనుయాయులకు తెల్లవారుఝామున లేచిన దగ్గరి నుంచి సాయంత్రం పడుకునే వరకు, పుట్టినప్పటి నుండి గిట్టే వరకు కావలసిన అన్ని రంగాల్లోనూ తన బోధనలు, మార్గదర్శకసూత్రాలు అందజేసిపొయ్యారు. పడుకోవడం, దాని తీరు, తెన్నులు, పాటించవలసిన మర్యాదలు కూడా ఆయన తెలిపారు. కాలితో కొట్టడం అన్నది కేవలం ఆ తీరున పడుకోవడం పట్ల నిరసనను మాత్రమే కాక ఆయన తన అనుయాయులతో ఎంత చనువుగా ఉండేవారో కూడా తెలుపుతుంది.

224. కారుణ్యమూర్తి ముహమ్మద్(సఅసం) తన సహచరుల పట్ల, అనుయాయుల పట్ల ఎంత వాత్సల్యంతో, ఎంత ప్రేమానురాగాలతో మసలుకునేవారో ఈ హదీసు తెలుపుతోంది. ప్రసంగం మధ్యలో దాన్ని నిలిపివేసి ఓ సహచరుణ్ణి ఎండ నుండి నీడలోకి జరగమని చెప్పడం ఆయన కరుణా స్వరూపాన్ని ఆవిష్కరిస్తోంది. తన అనుయాయులకు అనవసరంగా ఏ మాత్రం హాని కలగడం, బాధ కలగడం ఆయన భరించేవారు కారు అని దీని వల్ల ద్యోతకమవుతోంది.

225. ఇది సభ్యతా సంస్కారాలకు సంబంధించిన సాధారణ విషయం. అలాగే రెండు కాళ్ళల్లో రెండు రకాల జోళ్ళు తొడగడం కూడా సంస్కారవంతమయిన పని కాదు.

# 8. సత్సమాజం రూపురేఖలు

(٢٢٦) عَنْ اَبِىْ اُسَيْدٍ قَالَ كُنَّا عِنْدَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
فَقَالَ رَجُلٌ يَا رَسُوْلَ اللّٰهِ هَلْ بَقِىَ مِنْ بِرِّ اَبَوَىَّ شَيْءٌ بَعْدَ مَوْتِهِمَا
اَبَرُّهُمَا فَقَالَ نَعَمْ خِصَالٌ اَرْبَعٌ اَلدُّعَاءُ لَهُمَا وَالْاِسْتِغْفَارُ لَهُمَا وَاِنْفَاذُ
عَهْدِهِمَا وَاِكْرَامُ صَدِيْقِهِمَا وَصِلَةُ الرَّحِمِ الَّتِىْ رَحِمَ لَكَ مِنْ قِبَلِهِمَا۔

(الادب المفرد۔ ص ٩)

226. ఉబూ ఉసైద్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు: మేము ఓసారి దైవ సందేశహరుని (సఅసం) సన్నిధిలో ఉండగా ఓ వ్యక్తి ఇలా అడిగాడు, "తల్లిదండ్రుల మరణానంతరం వారి ఎడల నేను సత్కార్యం చెయ్యగల విధానం ఏదయినా ఉంటుందా?" దానికి ఆయన ఇలా బోధించారు: (1)వారికై ప్రార్థన, క్షమాభిక్షకై అర్థింపు, (2) వారు చేసిన వాగ్దానం లేదా 'వీలు'ను నిర్వర్తించడం, (3) వారి మిత్రులు, పరిచయస్థులతో గౌరవాదరణలతో మెలగడం (4) వారి ద్వారా మీకు సంక్రమించిన సంబంధ బాంధవ్యాలను కలుపుకుపోవడం." (అల్ అదబుల్ ముఫ్రద్)

---

226. తల్లిదండ్రుల సేవ చెయ్యడంలోని మహత్తును ఎరిగిన సహచరులు (ర.అ) వారి మరణానంతరం కూడా ఏదయినా సేవ చెయ్యగలిగితే బావుంటుందని కోరుకున్న ధోరణి ఈ హదీసు వల్ల ద్యోతకమవుతోంది. వారి అపరాధాలకై మన్నింపును దైవం సన్నిధిలో వేడుకోవడం, వారికి స్వర్గ ప్రాప్తి కలగాలని కోరుకోవడం గొప్ప సేవే మరి. అలాగే వారు ఏవయినా వాగ్దానాలు చేసి నెరవేర్చలేక చనిపోతే వాటిని నెరవేర్చడం, వారి అభీష్టం మేరకు వారుకోరిన 'వీలు' (వ్రాసినా, నోటితో చెప్పినా ఒక్కటే)ను నిర్వర్తించడం లాంటివి వారి భారాన్ని తగ్గిస్తాయి. మిగతా రెండు విషయాలు ప్రపంచంలో సామాజిక అనుబంధాలను పటిష్ఠం చేస్తాయి. వారి ద్వారా సంక్రమించిన బాంధవ్యాలంటే బాబాయి, మేనత్త, మేనమామ, పిన్నిలాంటి బంధుత్వాలన్న మాట. వీటిని కాపాడటం మన ధర్మం.

(٢٢٧) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ جَاءَ رَجُلٌ اِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يُبَايِعُهُ عَلَى الْهِجْرَةِ وَتَرَكَ اَبَوَيْهِ يَبْكِيَانِ فَقَالَ اِرْجِعْ
اِلَيْهِمَا وَاَضْحِكْهُمَا كَمَا اَبْكَيْتَهُمَا۔ (الادب المفرد۔ للبخاری ص ۵)

227. అబ్దుల్లా బిన్ అమ్ర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, ఓ వ్యక్తి తన తల్లిదండ్రులు ఏడుస్తూ ఉండగా వదిలేసి 'హిజ్రత్' చేసే ప్రతిజ్ఞ బూనడానికి ప్రవక్త మహనీయుని (సఅసం) వద్దకు వచ్చాడు. ఆయన అతనికి "నీవు వారి వద్దకు తిరిగివెళ్ళి వారిని ఏ విధంగానయితే ఏడిపించి వచ్చావో అదే విధంగా సంతోషపరచి రా" అని ప్రబోధించి పంపారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(٢٢٨) عَنِ ابْنِ عَبَّاسٍ اَنَّ سَعْدَ بْنَ عُبَادَةَ اِسْتَفْتَى النَّبِيَّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ فِيْ نَذْرٍ كَانَ عَلَى اُمِّهٖ فَتُوُفِّيَتْ قَبْلَ اَنْ تَقْضِيَهُ فَاَفْتَاهُ اَنْ
يَّقْضِيَهُ عَنْهَا۔ (متفق علیہ مشکوٰۃ۔ باب فی النذر)

228. అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు: 'సఅద్ బిన్ ఉబాదా (ర.అ) తన తల్లి మొక్కుకున్న ఓ మొక్కుబడిని గురించి ప్రవక్త మహనీయుని (సఅసం) ప్రశ్నించారు – ఆ మొక్కుబడిని తీర్చకమునుపే ఆవిడగారు పరమపదించారు. దానికి ఆయన, "ఆవిడ తరఫున నీవు దాన్ని నెరవేర్చు" అని సెలవిచ్చారు.' (ముత్తఫకున్ అలైహి - మిష్కాత్)

---

227. 'హిజ్రత్' అంటే ధర్మ మార్గాన బ్రతకడం ఉన్నచోట కష్టతరమయినప్పుడు వలస వెళ్ళడం అన్నమాట. వృద్ధ మాతాపితల్ని బాధలో వదిలేసి వారు ఏడ్చుకుంటూ కూర్చుంటే తాను మటుకు హిజ్రత్ చెయ్యాలని బయల్దేరడం తగదని ఈ హదీసు బోధిస్తోంది. సేవకు అర్హులయిన తల్లిదండ్రులున్న పక్షంలో వారికి తోడ్పాటునిచ్చి వారిని సేవించుకోవడం 'హిజ్రత్' లాంటి ఘనమయిన కార్యంకన్నా ఉత్తమమయింది.

228. తల్లిదండ్రులు చనిపోయేముందు చేసిన వాగ్దానం గురించి పైన ప్రస్తావన వచ్చింది. ఇక్కడ దైవికమయిన హక్కును ప్రస్తావించడం జరిగింది. కేవలం దైవాన్ని మాత్రమే మొక్కుకోవాలని, మంచి కార్యాలు నెరవేరాలని మాత్రమే మొక్కుకోవాలని, మొక్కుబడి కూడా షరీఅత్‌కు లోబడిన విషయమై ఉండాలని ఇక్కడ మరువరాదు.

(٢٢٩) عَنْ بَكَّارٍ عَنْ اَبِيْهِ عَنْ جَدِّهٖ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ كُلُّ ذُنُوْبٍ يُؤَخِّرُ اللّٰهُ مِنْهَا مَاشَاءَ اِلٰى يَوْمِ الْقِيٰمَةِ اِلَّا الْبَغْيَ وَعُقُوْقَ الْوَالِدَيْنِ اَوْ قَطِيْعَةَ الرَّحِمِ يُعَجِّلُ لِصَاحِبِهَا فِي الدُّنْيَا قَبْلَ الْمَوْتِ. (الادب المفرد- باب البغى-ص ٨٧)

229. 'బక్కార్' ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "అల్లాహ్ తన ఇచ్ఛ ప్రకారం ఏ పాపాన్నయినా (శిక్షించేందుకు) ప్రళయం వరకు వాయిదా వేస్తాడు. అయితే మూడు పాప కార్యాలకు శిక్ష మనిషి తన మృత్యువుకు పూర్వమే అనుభవించవలసి ఉంటుంది. (1) తిరుగుబాటు, తలబిరుసుతనం, (2) తల్లిదండ్రుల పట్ల అవిధేయత, (3) బంధుత్వాల తెగతెంపులు." (అల్ అదబుల్ ముఫ్రద్)

(٢٣٠) عَنْ اَبِيْ سَعِيْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَاتَصُوْمُ امْرَاَةٌ اِلَّا بِاِذْنِ زَوْجِهَا - (ابوداؤد)

230. అబూ సయీద్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు: "ఏ స్త్రీ అయినా తన భర్త అనుమతి లేకుండా 'రోజా' వ్రతాన్ని పాటించరాదు." (అబూదావూద్)

---

229. మనిషి అపరాధాలు చేస్తుంటాడు. అయితే దైవం తాను తలచిన అపరాధాలను మన్నించి, తాను తలచినవాటికి ప్రపంచంలోనే శిక్షించి, తానుతలచిన వాటికి పర లోకంలో శిక్షించడం జరుగుతుందని ఈ హదీసు వల్ల బోధపడుతోంది. అయితే మూడు రకాల పాప కార్యాలకు ఎట్టి పరిస్థితిలోనూ మనిషి ప్రపంచంలోనే శిక్ష అనుభ విస్తాడని కూడా తెలుస్తోంది. ఆ మూడు అపరాధాలు సామాజిక ప్రాధాన్యతగలవి కావ డం గమనార్హం. తిరుగుబాటు అంటే వ్యవస్థతో తిరుగుబాటు మటుకే కాదు, దైవాదేశా లకు షరీఅత్ విధులకు తిరుగుబాటు అని కూడా అర్థం. బంధువులకు దూరమవడం, బంధుత్వాలను తెంచుకోవడం కూడా సామాజికమయిన చెడుగే.

230. ఇక్కడ ప్రస్తావనలో వచ్చింది 'నఫిల్' అదనపు రోజా అని మరువరాదు. 'ఫర్జ్' విధి అయిన రోజానయితే ఎట్టి పరిస్థితిలోనూ – భర్త అనుమతించినా అనుమతించక పోయినా పాటించవలసిందే.

(٢٣١) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ تُنْکَحُ الْمَرْاَةُ لِاَرْبَعٍ لِمَالِهَا وَلِحَسَبِهَا وَلِجَمَالِهَا وَلِدِیْنِهَا فَاظْفَرْ بِذَاتِ الدِّیْنِ تَرِبَتْ یَدَاکَ (بخاری۔مسلم۔مشکوٰۃ۔کتاب النکاح ص ٢٣٩)

231. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖించారు, "స్త్రీని నాలుగు విషయాలు చూసి పెళ్ళి చేసుకుంటారు. (1) ధనం, (2) సౌందర్యం, (3) ఉన్నత కుటుంబం, (4) ధర్మం." ఆయన ఆపైన ఇలా ఉపదేశించారు "మీరు 'ధర్మం' గల మహిళను పెళ్ళాడండి - మీ చేతులకు మట్టి తగల!" (బుఖారీ,ముస్లిమ్)

(٢٣٢) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَ سَلَّمَ اَلدُّنْیَا کُلُّهَا مَتَاعٌ وَخَیْرُ مَتَاعِ الدُّنْیَا الْمَرْاَةُ الصَّالِحَةُ۔ (صحیح مسلم۔مشکوٰۃ۔ص ٢٣٩)

232. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు, "ఈ ప్రపంచం సమస్తం ఉపయోగకరమైన సంపదే. పోతే ఈ సంపదలో అత్యుత్తమమైంది సద్వర్తనురాలైన మహిళ" అని ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు. (సహీహ్ ముస్లిమ్, మిష్కాత్)

---

231. వివాహ విషయంలో విశ్వసించినవారు పాటించవలసిన ముఖ్యమయిన అంశం ఇందులో ప్రస్తావించడం జరిగింది. కాని నేడు మనుషులు చేస్తున్నదేమిటి? దైవ ప్రవక్త వేటినయితే నిరసించారో ఆ మూడింటికే ప్రాధాన్యత నేడు లభిస్తోంది. ధర్మానికి, నైతికతకు అసలు విలువే లేకుండా పోయింది. 'చేతులకు మట్టి తగలడం' అన్నది అరబీనానుడి. మనిషి పిల్లాజెల్లతో సుఖసంతోషాలతో గడపడాన్ని అలా అంటారు.

232. వాస్తవంగా మనిషి ఎంతటి సౌశీల్యవంతుడు, ధర్మనిష్ఠాపరుడూ అయినప్పటికీ అతని అర్ధాంగి సద్వర్తనురాలు కాకపోతే అతను ఎన్నటికీ ప్రశాంతంగా, సంతృప్తిగా జీవించలేడు. జీవన సంగ్రామంలో తనతో సదా సహకరించే, తనతో పాటు సుఖ దుఃఖాలను పంచుకునేందుకు సతతం తహతహలాడే సహపత్ని ప్రాప్తం కావడం నిజంగా ఉభయులకూ ఎంతో సుఖదాయకం, ఆనందప్రదం.

(٢٣٣) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَ
سَلَّمَ اِذَا خَطَبَ اِلَیْکُمْ مَّنْ تَرْضَوْنَ دِیْنَہٗ وَخُلُقَہٗ فَزَوِّجُوْہُ اِنْ لَّا تَفْعَلُوْہُ
تَکُنْ فِتْنَۃٌ وَ فَسَادٌ عَرِیْضٌ - (رواہ الترمذی مشکوٰۃ - کتاب النکاح ص ٢٣٩)

233. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉద్బోధించారు: "మీ వద్దకు పెళ్ళి సంబంధానికి సమాచారం పంపినప్పుడు, అతని ధార్మిక నైతికత మీకు నచ్చినట్లయితే అతనితో పెళ్ళి జరపండి. మీరు ఒకవేళ అలా చెయ్యకపోతే సమాజంలో విస్తృతంగా అనర్థం, అరాచకత్వం ఛెలరేగుతాయి." (తిర్మిజి, మిష్కాత్)

(٢٣٤) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ رَضِیَ اللّٰہُ عَنْہُ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی
اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لَا یَفْرَكْ مُؤْمِنٌ مُؤْمِنَۃً اِنْ کَرِہَ مِنْھَا خُلُقًا رَضِیَ مِنْھَا
اٰخَرَ - (رواہ مسلم - مشکوٰۃ - ص ٢٧٢)

234. దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రబోధించినట్లు హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖించారు: "విశ్వసించిన పురుషుడు (భర్త) విశ్వసించిన స్త్రీ (భార్య) పట్ల విద్వేషం కలిగి మెలగరాదు. ఒకవేళ ఆమెకున్న లోటు ఒకటి అతనికి నచ్చకపోతే మరో లక్షణం అతనికి ఎంతో నచ్చవచ్చు."

(ముస్లిమ్, మిష్కాత్)

---

233. పెళ్ళి సంబంధం వచ్చినప్పుడు చూడవలసిన ముఖ్యాంశాలేవో ఈ హదీసులో చూపెట్టడం జరిగింది. అవి ధార్మికత, నైతికతలు. మనిషి ధర్మం పట్ల సరయిన అవగాహన, అనుసరణ కలవాడయితే అతని నడవడి సరయిన దిశలో ఉన్నట్లయితే మిగతా విషయాలు ఎలా ఉన్నా జీవితం ప్రశాంతంగా, సాఫీగా సాగుతుంది. అందువల్లనే కులగోత్రాలు, సిరి సంపదలు, కట్టుబాట్లను చూసుకుని వాటి ఆధారంగా మంచి సంబంధాలను తిరస్కరించడం సమాజంలో మంచి వారికి తగిన గుర్తింపు లభించక దుర్మార్గులే సమాజంలో పెద్ద మనుషులుగా చెలామణి అయి అనేక అవకతవకలు, ఉపద్రవాలు, అనర్థాలు, అరాజకాలకు కారణభూతమయ్యే ప్రమాదముంది. దాన్నే హదీసులో విస్తృత అరాచకంగా పేర్కొనడం జరిగింది.

(٢٣٥) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ النَّبِیَّ صَلَّی اللهُ عَلَیْهِ وَسَلَّمَ کَانَ اِذَا
رَفَّاَ الْاِنْسَانَ اِذَا تَزَوَّجَ قَالَ بَارَكَ اللهُ لَكَ وَبَارَكَ عَلَیْكُمَا وَجَمَعَ
بَیْنَكُمَا فِیْ خَیْرٍ۔ رواہ احمد۔ مشکوٰۃ ۔ باب الدعوات ۔ ص ۲۰۷)

235. అబూహురైరా (ర.అ) ఉల్లేఖించారు, ప్రవక్త మహనీయులు ఎవరికైనా పెళ్ళి జరిగినప్పుడు అభినందించేటప్పుడు "బారకల్లాహు లక వ బారక అలైకుమా వ జమఅ బైనకుమా ఫీ ఖైర్" అని అభినందించేవారు.
(అహ్మద్, మిష్కాత్)

(٢٣٦) عَنْ عَائِشَةَ اَنَّهَا كَانَتْ مَعَ رَسُوْلِ اللهِ صَلَّی اللهُ عَلَیْهِ وَ
سَلَّمَ فِیْ سَفَرٍ قَالَتْ فَسَابَقْتُهٗ فَسَبَقْتُهٗ عَلٰی رِجْلَیَّ فَلَمَّا حَمَلْتُ اللَّحْمَ
سَابَقْتُهٗ فَسَبَقَنِیْ ۔ قَالَ هٰذِهٖ بِتِلْكَ السَّبْقَةِ ۔ (ابوداؤد۔ مشکوٰۃ ۔ص ۲۸۳)

236. హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు, "ఓసారి నేను ప్రవక్త మహనీయుని (సఅసం)తో ప్రయాణంలో వెంట ఉండగా నేను ఆయన (సఅసం)తో పరుగు పోటీలో పాల్గొన్నాను. అప్పుడు పరుగులో నేను ఆయనకన్నా ముందున్నాను. (కొంత కాలం తరువాత) నేను కాస్త లావెక్కినప్పుడు ఆయనతో పరుగిడితే ఆయన నాకన్నా ముందున్నారు. అప్పుడు ఆయన (సఅసం), 'ఇది మునుపటి గెలుపుకు చెల్లుబాటు' అని చమత్కరించారు. (అబూ దావూద్, మిష్కాత్)

---

234. స్త్రీ సకల విధాలా లోపరహితంగా ఉండాలన్నది అసాధ్యం. ఆ మాటకు వస్తే పురుషుడి విషయమూ అంతే. ఏదయినా లోపం భార్యలో కానవచ్చినా ఆ కారణంగా ఆమె పట్ల ద్వేషం పెంచుకోవడం భావ్యం కాదు. ఆమెలోని మంచి కోణాలనేకం ఉండవచ్చు. వాటినీ దృష్టిలో ఉంచుకోవాలి. విశ్వసించే వ్యక్తి బొమ్మకు ఇరువైపులా ప్రశాంత హృదయంతో చూడగలిగే స్థితికి ఎదగాలి.

235. బంధువుల్లో మిత్రుల్లో వివాహాది శుభకార్యాలెన్నో జరుగుతూ ఉంటాయి. వాటిలో పాల్గొనడం, వారి ఆనందంలో పాలుపంచుకోవడం తమ ఆనందాన్నీ శుభాకాంక్షల్ని తెలుపుకోవడం మంచి నాగరికతకు ప్రతీకలు. శుభాకాంక్షలు

(٢٣٧) عَنْ عَائِشَةَ قَالَتْ كُنْتُ أَلْعَبُ بِالْبَنَاتِ عِنْدَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَكَانَ لِي صَوَاحِبُ يَلْعَبْنَ مَعِي فَكَانَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا دَخَلَ يَنْقَمِعْنَ مِنْهُ فَيُسَرِّبُهُنَّ إِلَيَّ فَيَلْعَبْنَ مَعِي۔

(متفق علیہ مشکوٰۃ۔ ص ٢٧٢)

237. ఆయిషా(ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా నుడివారు, "నేను ప్రవక్త మహనీయుని ఇంటనున్నప్పుడు ఆట బొమ్మలతో ఆడుకునేదాన్ని. నాతో ఆడుకునేందుకు చెలికాండ్రు కూడా నా వద్దకు వచ్చేవారు. ఆయన (సఅసం) ఇంటికి వచ్చినప్పుడు వారు (చెలికాండ్రు) దాక్కునేవారు. ఆయన వారిని ఎక్కడున్నా వెదకి నా వద్దకు పంపుతూ ఉండేవారు, వారు నాతో పాటు ఆడుకోవాలని." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

తెలుపుకోవడంలోనూ విశ్వాసికి మూలాధారాలైన ఆధ్యాత్మికత, ధార్మికతలు గోచరిస్తుంటాయి. ప్రవక్త మహనీయులు తెలిపిన శుభాకాంక్షలకు భావం, "అల్లాహ్ నీకు శుభం చేకూర్చుగాక, మీ ఇద్దరిపై ఆయన శుభాలను వర్షింపజెయ్యుగాక, మీ ఇద్దరి బాంధవ్యానికి శుభం, శ్రేయం ఆధారం అవుగాక!" అని.

236. ఈ హదీసు ద్వారా కొన్ని విషయాలు ద్యోతకమవుతాయి: (1) ప్రవక్త మహనీయులు సాధారణంగా మత గురువుల్లా ఎప్పుడూ లేనిపోని గాంభీర్యం ముఖానికి పులుముకుని జీవించలేదు. సాధ్యమయినప్పుడల్లా తన ఇంటివారితో ఉల్లాసంగా గడిపిన క్షణాలు పయితం ఉన్నాయి. (2) భార్యాభర్తలు వేళాకోళాలాడుకోవడం, ఛలోక్తులు విసురుకోవడం, ఆటల పోటీలలో పాల్గొనడం సహజం. ధర్మసమ్మతం మాత్రమే కాదు వాంఛనీయం కూడా. (3) జీవితంలో ఇలా గడిపిన మధుర క్షణాలను నెమరువేసుకుని ఆనందం పొందడం ద్వారా సమాజంలో ఉత్తమ అభిరుచిని పెంపొందించవీలవుతుంది.

237. ఈ హదీసు కూడా పై హదీసు మాదిరిగానే ఇంటివారి సహజమయిన ఉల్లాసభరితమైన క్షణాల్లో వారికి తోడ్పడడం ప్రవక్త సంప్రదాయమని, ఆయన (సఅసం) ఇలాంటి సందర్భాల్లో ఏ మాత్రం కోపగించుకునేవారు కాదని, పైగా ఆడుకునేవారితో సరదాగా తానూ కాస్త కాలక్షేపం చేసుకునేవారని తెలుస్తోంది. ఇది ప్రవక్త మహనీయుని సతీమణి, విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా(ర.అ) పెళ్ళి జరిగిన తొలి రోజులలో జరిగిన సంఘటన అన్న విషయం ఇక్కడ గుర్తుంచుకోవాలి.

(٢٣٨) عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
إِذَا أَرَادَ سَفَرًا أَقْرَعَ بَيْنَ نِسَائِهِ فَأَيَّتُهُنَّ خَرَجَ سَهْمُهَا خَرَجَ بِهَا مَعَهُ،
(متفق عليه۔ مشكوٰة۔ ص ٢٧١)

238. హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు: 'దైవ సందేశహరులు (సఅసం) ప్రయాణ సంకల్పం చేసుకున్నప్పుడు తన సతీమణుల (పేర్ల) మధ్య చీటివేసి ఎవరి పేరు వెలికి వస్తే ఆవిడని ప్రయాణంలో తనకు తోడుగా తీసుకువెళ్ళేవారు." (ముత్తఫకున్ అలైహ్)

(٢٣٩) عَنِ ابْنِ عُمَرَ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ أَبْغَضُ
الْحَلَالِ إِلَى اللّٰهِ الطَّلَاقُ۔ (رواه ابوداؤد۔ مشكوٰة۔ ص ٢٧٥)

239. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "ధర్మ సమ్మతమయిన (హలాల్) పనులన్నింటిలోనూ అల్లాహ్‌కు అధికంగా ఇష్టంలేని పని తలాక్ (విడాకులు) ఇవ్వడం." (అబూ దావూద్, మిష్కాత్)

(٢٤٠) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ يَا رَسُوْلَ اللّٰهِ أَيُّ الصَّدَقَةِ أَفْضَلُ قَالَ
جُهْدُ الْمُقِلِّ وَابْدَأْ بِمَنْ تَعُوْلُ (رواه ابوداؤد۔ مشكوٰة۔ باب فضل الصدقة)

240. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ఓసారి ఆయన దైవ ప్రవక్తను "దైవప్రవక్తా, ఎలాంటి దానం అత్యుత్తమమయింది?" అని ప్రశ్నించగా ఆయన (సఅసం) ఇలా బోధించారు: "నిరాశ్రయుడయిన నిరుపేద కష్టార్జితంతో చేసింది!" ఇంకా ఆయన ఇలా అన్నారు, "ముందు నీ పోషణలోని వారితో ప్రారంభించు." (అబూదావూద్, మిష్కాత్)

---

238. ఈ హదీసువల్ల కొన్ని విషయాలు ద్యోతకమవుతున్నాయి: 1. దైవ సందేశహరులు తన ఇంటివారి హృదయోల్లాసానికి కూడా ప్రాధాన్యత నిచ్చేవారు. వారి సుశిక్షణకై ఏర్పాట్లు చెయ్యడంలో ప్రయాణావస్థలో సయితం సచేతనంగా ఉండేవారు.

(٢٤١) عَنْ اَبِیْ هُرَیْرَةَ وَحَکِیْمِ بْنِ حِزَامٍ قَالَا قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ خَیْرُ الصَّدَقَةِ مَا کَانَ عَنْ ظَهْرِ غِنًى وَابْدَاْ بِمَنْ تَعُوْلُ (رواه البخاری۔ مشکوٰة ۔ باب فضل الصدقة)

241. హజ్రత్ అబూ హురైరా (ర.అ), హకీమ్ బిన్ హిజామ్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో, దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారని పలికారు: "ఉత్తమమయిన సదకా (దానం) ఏదంటే, అది చేసిన తరువాత కూడా సంపన్నత మిగలాలి. ఇంకా, ముందు నీ పోషణలో ఉన్నవారితో ప్రారంభించు."

(బుఖారి, మిష్కాత్)

---

వారిని తోడుగా తీసుకువెళ్ళి ఉత్తమ సామాజిక రీతుల్ని సంస్థాపించారు. 2. వివాదగ్రస్త విషయాల్లో ఏదో ఓ పక్షానికి ప్రాధాన్యత లేక ప్రాముఖ్యత నిచ్చే అపవాదు, నింద వచ్చే ప్రమాదమున్నచోట లేక రెండు సమానస్థాయి విషయాల్లో ఏదో ఒకదాన్నే ఎన్నుకునే అవకాశమున్నచోట చీటివేసి నిర్ణయం తీసుకోవడం సరయిన పద్ధతే.- 3. బహుభార్యాత్వపు అనుమతి ద్వారా లాభమొందేవారు తమ భార్యల మధ్య న్యాయం, సమానత్వపు పద్ధతి ననుసరించాలి. చివరికి, ప్రయాణంలో ఏ భార్యను తోడుగా తీసుకువెళ్ళాలి అన్న విషయంలోనూ అకారణపు ప్రాధాన్యత నివ్వకుండా చీటీ పద్ధతినయినా సరే అనుసరించవలసిందే.

239. వైవాహిక బంధం ఒక్కోసారి స్త్రీ పురుషుల మధ్య నరకాన్ని సృష్టిస్తుంది. ఈ పరిస్థితి నుండి తప్పించుకోవడానికి విడాకుల పద్ధతి ఒక్కటే మార్గం. అందుకోసమే దైవం దీన్ని ధర్మ సమ్మతం (హలాల్) గా నిర్ణయించాడు. అయినా ఇది దైవానికి ఏ మాత్రం ఇష్టం లేని అవాంఛనీయ కార్యమని ఈ హదీసు తెలుపుతుంది. ఇది అవాంఛనీయమని ఎందుకు అనడం జరిగిందంటే విడాకులు ముస్లిం సమాజంలో ఓ ఆట పరికరంగా మారరాదని, పరస్పర ప్రేమానురాగాల మార్గాలన్నీ మూసుకుపోయి నటువంటి క్లిష్టతర సందర్భాల్లోనే దైవానికి ఇష్టంలేని ఈ కార్యానికి మనిషి ఒడిగట్టాలి.

240. ఈ హదీసు ద్వారా రెండు విషయాలు ముందుకు వచ్చాయి. 1. సదకా లేక దానం ఏదయినా సరే, ఎంత స్వల్పమయిందయినా సరే చిత్తశుద్ధితో ఇచ్చింది దైవదృష్టిలో స్వీకార పాత్రమవుతుంది. కాని ఓ నిరుపేద, నిరాధార వ్యక్తి ఏదో కష్టం చేసి సంపాయించిన దానిలో నుండి ఖర్చుచేసినప్పుడు ఆ దానం దైవదృష్టిలో ప్రేమకు, ఉత్తమస్థాయికి పాత్రమవుతుంది. 2. మనిషికి తొలుత, తాను పోషణ భారం స్వీకరించిన వారిని ఆదుకోవడం, వారి అవసరాలను తీర్చడం అవసరం. కొన్ని

(۲۴۲) عَنِ ابْنِ عُمَرَ اَنَّ رَجُلًا كَانَ عِنْدَهٗ وَلَهٗ بَنَاتٌ فَتَمَنّٰى
مَوْتَهُنَّ فَغَضِبَ ابْنُ عُمَرَ فَقَالَ اَاَنْتَ تَرْزُقُهُنَّ ۔ (الادب المفرد۔ ص ۱۶)

242. అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ద్వారా ఉల్లేఖితం: ఓ రోజా ఆయన దగ్గర ఓ వ్యక్తి కూర్చొని ఉన్నాడు. అతనికి ఆడ సంతానమే ఎక్కువ. అతను, (మాటల సందర్భంలో) వీళ్ళంతా చచ్చిపోతే ఎంత బావుండేది? అని కోరుకున్నాడు. దానికి అబ్దుల్లాబిన్ ఉమర్(ర.అ)అతనిపై మండిపడ్డారు, "వీళ్ళ పోషణ దాతవు నీవా?" అని గదమాయించారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۴۳) عَنْ نَبِيْطِ بْنِ شَرِيْطٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اِذَا وُلِدَ لِلرَّجُلِ ابْنَةٌ بَعَثَ اللّٰهُ عَزَّوَجَلَّ مَلَائِكَةً
يَّقُوْلُوْنَ السَّلَامُ عَلَيْكُمْ اَهْلَ الْبَيْتِ يَكْتَنِفُوْنَهَا بِاَجْنِحَتِهِمْ وَيَمْسَحُوْنَ بِاَيْدِيْهِمْ
عَلٰى رَاْسِهَا وَيَقُوْلُوْنَ ضَعِيْفَةٌ خَرَجَتْ مِنْ ضَعِيْفَةٍ اَلْقَيِّمُ عَلَيْهَا مُعَانٌ
اِلٰى يَوْمِ الْقِيٰمَةِ ۔ (المعجم الصغير للطبرانی ۔ ص ۱۴)

243. నబీత్ ఇబ్నె షరైత్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "ఒకని ఇంట్లో పాప పుట్టినప్పుడు అల్లాహ్ అతని ఇంటికి దైవదూతల్ని పంపుతాడు. వారు, 'ఓ గృహస్థులారా, మీపై శాంతి నెలకొనుగాక' అని దీవిస్తారు. వారు ఆ పాపను తమ రెక్కల ఛాయలో తీసుకుని పాప తల నిమురుతూ ఇలా అంటారు, 'ఇదొక అబల ప్రాణి, మరో అబల ప్రాణినుండి జన్మించింది. ఈ పాపను పెంచి పోషించిన వ్యక్తికి ప్రళయం వరకు దైవ సహాయం తోడవుతుంది."

(అల్ మోజముస్సగీర్ - తిబ్రాని)

---

సందర్భాల్లో సామాజిక స్థాయి కారణంగా, పేరు ప్రతిష్ఠల వాంఛమూలంగా మనిషి దగ్గరి బంధువులు, అగత్యపరులయిన ఆప్తుల్ని వదిలేసి బయట దానధర్మాల వర్షం కురిపిస్తాడు. ఇదే తప్పు అని తెలుపడం జరిగింది.

(۲۴۴) عَنْ عَائِشَةَ قَالَتْ جَاءَتْنِي امْرَأَةٌ وَمَعَهَا ابْنَتَانِ لَهَا تَسْأَلُنِي فَلَمْ تَجِدْ عِنْدِي غَيْرَ تَمْرَةٍ وَّاحِدَةٍ فَأَعْطَيْتُهَا إِيَّاهَا فَقَسَمَتْهَا بَيْنَ ابْنَتَيْهَا وَلَمْ تَأْكُلْ مِنْهَا ثُمَّ قَامَتْ فَخَرَجَتْ فَدَخَلَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَحَدَّثْتُهُ فَقَالَ مَنِ ابْتُلِيَ مِنْ هٰذِهِ الْبَنَاتِ بِشَيْءٍ فَأَحْسَنَ إِلَيْهِنَّ كُنَّ لَهُ سِتْرًا مِّنَ النَّارِ - (متفق علیہ مشکوٰۃ باب الشفقۃ - ص ۴۱۳)

244. హ్జ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం: ఆమె ఇలా అన్నారు, 'నా వద్దకు ఓ రోజున ఓ మహిళ తన ఇద్దరు కూతుళ్ళను తీసుకువచ్చింది. ఆమె, (ఏమయినా ఇవ్వమని) నన్ను అర్థించింది. ఆనాడు నా వద్ద ఓ ఖర్జూరఫలం మటుకే ప్రాప్తమైంది. నేనదే ఆమెకు ఇచ్చాను. ఆమె ఆ ఫలాన్ని ఇద్దరమ్మాయిలకు పంచిపెట్టింది. తానేమీ తీసుకోలేదు. ఆ తరువాత ఆమె లేచి వెళ్ళిపోయింది. (అప్పుడు) దైవ ప్రవక్త (సఅసం) విచ్చేశారు. నేను ఆయనకు ఈ ఉదంతాన్ని సాంతం వినిపించాను. అది విని ఆయన ఇలా ప్రబోధించారు: "ఎవరైతే ఈ ఆడపిల్లల విషయంలో పరీక్షించబడతాడో, అతను వాళ్ళ పట్ల సవ్యంగా వ్యవహరిస్తే ఈ కూతుళ్ళు అతనికి నరకాగ్ని నుండి కాపాడే డాలులా రూపొందుతారు."

(ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

241. ఈ హదీసు, పై (240) హదీసు మాటల్లో కాస్త వైరుధ్యం ఉన్నట్టు పైకి అనిపిస్తుంది. కాని నిజం అదికాదు. పై హదీసు, నిరుపేద వ్యక్తి తన లేమి వల్ల దాన ధర్మాలు చేస్తే అవి ధనికుడు చేసే దాన ధర్మాల సమక్షంలో ఏ పాటివి? అన్న న్యూనతా భావం నిరుపేదలో చోటుచేసుకోరాదన్న ఉద్దేశాన్ని సూచిస్తుంది. అంటే దైవ ప్రసన్నతకు, ఆయన స్వీకారాన్ని పొందే ఉద్దేశ్యంతో చేసే ఏ చిన్న దానమయినా దాని వెనకనున్న చిత్తశుద్ధి ఆధారంగానే దైవం పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడని అది తెలుపుతుంది. ఇక రెండవ హదీసులో తెలిపిన విషయం ఏమిటంటే మనిషి ఆవేశానికి ఉద్రేకానికి లోనయి ఉన్నదంతా దాన ధర్మాల్లో ఖర్చుపెట్టేసి తన వారికి ఏమీ లేకుండా చేసినట్లయితే దాని ప్రభావం వారిపై పడి వారు తన తండ్రినీ, ఆయన ధార్మికతను, దానధర్మాలను ఏవగించుకునే పరిస్థితి రావచ్చు. వారు ధర్మానికి దూరమయి లేమివల్ల

(۲۴۵) عَنِ النُّعْمَانِ بْنِ بَشِيْرٍ قَالَ اَعْطَانِىْ اَبِىْ عَطِيَّةً فَقَالَتْ عُمْرَةُ بِنْتُ رَوَاحَةَ لَا اَرْضٰى حَتّٰى تُشْهِدَ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَاَتٰى رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ اِنِّىْ اَعْطَيْتُ ابْنِىْ مِنْ عُمْرَةَ عَطِيَّةً فَاَمَرَتْنِىْ اَنْ اُشْهِدَكَ يَا رَسُوْلَ اللهِ قَالَ اَعْطَيْتَ سَائِرَ وَلَدِكَ مِثْلَ هٰذَا، قَالَ لَا، قَالَ فَاتَّقُوا اللهَ وَاعْدِلُوْا بَيْنَ اَوْلَادِكُمْ قَالَ فَرَجَعَ وَرَدَّ عَطِيَّتَهُ. وَفِىْ رِوَايَةٍ قَالَ اِنِّىْ لَا اَشْهَدُ عَلٰى جَوْرٍ (بخاری۔ مسلم۔ مشکوۃ۔ باب العطایا)

245. నోమాన్ బిన్ బషీర్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు, 'నా తండ్రి నాకు ఓ కానుకనిచ్చారు. దానికి నా తల్లి, రవాహ్ కూతురు ఉమ్రా, నా తండ్రితో, 'మీరు ఈ విషయంలో దైవప్రవక్త (సఅసం)ను సాక్షిగా పెట్టనంతవరకు నేను ఒప్పుకోను' అని చెప్పింది. తదుపరి ఆయన (నోమాన్ తండ్రి) దైవ ప్రవక్త సన్నిధిలో హాజరయ్యారు. ఆయన, 'దైవ ప్రవక్తా! ఉమ్రా కడుపున పుట్టిన నా కొడుకుకు నేనొక కానుకనిచ్చాను. దీనికి మిమ్మల్ని సాక్షిగా పెట్టాలని ఉమ్రా నాకు తాకీదు చేసింది' అని విన్నవించుకున్నాడు. దానికి ఆయన, 'నీవు నీ ఇతర సంతానానికీ ఇలాగే కానుకలిచ్చావా?' అని ప్రశ్నించగా (నోమాన్ తండ్రి) లేదని బదులిచ్చాడు. అప్పుడు ఆయన (సఅసం) ఇలా ఉపదేశించారు, "అల్లాహ్‌కు భయపడు, సంతానం మధ్యన న్యాయంగా వ్యవహరించు." ఆ మీదట నోమాన్ తండ్రి తిరిగివచ్చి తన కానుక వాపసు తీసుకున్నాడు. మరో ఉల్లేఖనం ప్రకారం ఆయన (సఅసం), "నేను అన్యాయానికి సాక్షిగా నిలువను" అని అన్నారని కూడా ఉంది. (బుఖారి, ముస్లిమ్, మిష్కాత్)

---

అధర్మ కార్యకలాపాలకు ఒడిగట్టవచ్చు. అందువల్ల అన్నిటా మధ్యస్థ మార్గమే అనుసరణీయం.

242. మన కాలంలోనూ ఆడ సంతానం పుడితే బాధపడే కుటుంబాలు లేకపోలేదు.

(٢٤٦) عَنْ مَيْمُوْنَةَ بِنْتِ الْحَارِثِ اَنَّهَا اَعْتَقَتْ وَلِيْدَةً فِيْ زَمَانِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَذَكَرَتْ ذٰلِكَ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ لَوْ اَعْطَيْتِهَا اَخْوَالَكِ كَانَ اَعْظَمَ لِاَجْرِكِ ۔ (بخاری مسلم۔ مشکوٰۃ۔ باب فضل الصدقۃ)

246. హారిస్ కుమార్తె మైమూనా ఉల్లేఖనం: ఆవిడ దైవప్రవక్త (సఅసం) కాలంలో ఒక బానిస స్త్రీని విడుదల చేసి దాని గురించి ప్రవక్త మహనీయులతో ప్రస్తావించారు. దానికి ఆయన (సఅసం), "నీవు ఈ బానిస స్త్రీని నీ మేనమామలకు ఇచ్చి ఉంటే నీకు మరింత పుణ్యఫలం లభించేది" అని అన్నారు. (బుఖారి, ముస్లిమ్)

---

ఇస్లాంకు పూర్వపు సామాజిక వ్యవస్థలోనూ స్త్రీ జాతిని గౌరవంగా చూసేవారు కారు అరబ్బులు. అయితే ఇస్లాం ఆవిర్భావం తరువాత స్త్రీ సామాజిక స్థాయి పురుషునికి సమానంగా ఎదగగలిగింది. అయినప్పటికీ పూర్వపు అజ్ఞానపు ఛాయలు పోనివారు పై హదీసులో మాదిరిగా ఆడ పిల్లలంటే ఏవగించుకునేవారు. అలాంటి వారికే హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ మందలింపు.

243. పైన పేర్కొన్న విధంగా అజ్ఞాన కాలంలో (ఇస్లాంకు పూర్వం) అరబ్బులు ఆడ పిల్లల్ని సజీవంగా మట్టిలో పాతిపెట్టే కిరాతకానికి ఒడిగట్టేవారు. మన కాలంలోనూ పుట్టేది ఆడకూతురు అని తెలుసుకుని పిండాన్ని చంపివేసే నాగరిక కిరాతకులు అనేకమంది దర్శనమిస్తుంటారు. ఈ మనస్తత్వాన్ని మార్చడానికే హదీసుల్లో ఆడ పిల్లల పెంపకం, వారి శిక్షణల పట్ల అధికంగా ఉద్బోధించడం జరిగింది.

244. ఈ హదీసు ద్వారా దైవ ప్రవక్త ఇంటి ఆర్థిక పరిస్థితి కూడా ద్యోతకమవుతోంది. అర్థించే వారికి ఇవ్వాలన్నా ఇంట్లో ఓ ఖర్జూర ఫలం తప్ప లేకపోవడం ప్రవక్త ఇంటివారెలాంటి లేమిని అనుభవించారో తెలుపుతోంది. తల్లి ప్రేమ ఎలాంటిదో కూడా దీనివల్ల వ్యక్తమయింది. తాను తినకపోయినా ఉన్నదేదో తన కూతుళ్ళ కడుపున పడాలన్న ఆ తల్లి తాపత్రయం గోచరిస్తుంది. సామాన్యంగా ఆడపిల్లలంటే ప్రజలు కొంత అసహనం చూపెడతారు. ఆడపిల్లల్ని పెంచి, వారి ఎడల ఉత్తమరీతిలో వ్యవహరిస్తే తల్లిదండ్రుల ఈ చర్య దైవానికి ఎంతో నచ్చి, వారు చేసిన అనేక అపరాధాలను ఆయన మన్నించి, నరకాగ్ని నుండి విముక్తిని ప్రసాదిస్తాడని ప్రవక్త మహనీయులు ఇచ్చిన శుభవార్త కూడా ఈ హదీసులో ఉంది.

(٢٤٧) عَنْ جَابِرٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ ثَلٰثٌ مَنْ كُنَّ فِيْهِ يَسَّرَ اللّٰهُ حَتْفَهٗ وَاَدْخَلَهٗ جَنَّتَهٗ رِفْقٌ بِالضَّعِيْفِ وَشَفَقَةٌ عَلَى الْوَالِدَيْنِ وَاِحْسَانٌ اِلَى الْمَمْلُوْكِ۔ (رواه الترمذی مشکوٰۃ۔ باب النفقات)

247. హ॥జత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "మూడు విషయాలు ఎవరిలో చోటుచేసుకుంటాయో అల్లాహ్ ఆ వ్యక్తి మరణాన్ని సరళతరం చేస్తాడు, అతనికి స్వర్గ ప్రవేశం కల్పిస్తాడు. (ఆ మూడు విషయాలు ఇవి:) బలహీనుల పట్ల మార్దవం, తల్లిదండ్రులతో ప్రేమానురాగాలు, నౌకరులతో మంచి నడవడి."

(తిర్మిజి, మిష్కాత్)

---

245. సంతానానికి తమ తల్లిదండ్రులపై ఉన్న హక్కుల్లో ఇదీ ఒకటి, తల్లిదండ్రులు తమ సంతానానికి ఇచ్చిపుచ్చుకోవడాల్లో సంతానం పట్ల న్యాయంగా వ్యవహరించాలి, సమానతను పాటించాలి. కొడుకూ కూతుళ్ళ మధ్యన వారసత్వంలో కారణాంతరాల వల్ల హెచ్చు తగ్గులుండటాన కొందరు కానుకలు ఇచ్చిపుచ్చుకునే విషయంలోనూ అది పాటించాలని అంటారు. అది సరయిన పద్ధతి కాదు. కానుకల విషయంలో ఎలాంటి తారతమ్యాన్ని పాటించనవసరంలేదు. కొడుకు, కూతురు ఉభయులకూ సమానంగానే ఇవ్వాలి.

246. బానిసలు ఆ కాలంలో అన్ని జాతుల్లోనూ ఉండేవారు. వారి క్రయవిక్రయాలు అన్ని జాతుల మాదిరిగానే అరబ్బుల్లోనూ ఉండింది. ఇస్లామ్ ఆవిర్భావం తరువాత మనిషికి మనిషి దాస్యం సరయినది కాదని తేల్చి చెప్పింది. తదనుగుణంగా ముస్లిములు అసంఖ్యాకమయిన బానిసలకు స్వేచ్ఛనిచ్చారు. అది ఎంతో పుణ్యకార్యంగా ఖుర్ఆన్ హదీసుల్లోనూ ఉంది. ఈ విధంగా బానిస వ్యవస్థను రూపుమాపేందుకు కృషి జరిగింది. ఈ హదీసు ద్వారా తెలిసేదేమిటంటే దానధర్మం సత్కార్యమే. ఆ సత్కార్యం బంధువుల ఎడల జరిగితే పుణ్యఫలం రెండింతలవుతుంది. సత్కార్యం చేసిన పుణ్యం, ఆప్తుల ఎడల కనికరం చూపెట్టినందుకు పుణ్యం.

247. ఈ హదీసులో ప్రస్తావించిన మూడు విషయాలూ దయార్ద్రత, ప్రేమ, సాను భూతి, సద్వర్తనకు సంబంధించినవి. ఇస్లామ్‌లో నైతిక నడవడికి, బలహీనుల పట్ల ప్రత్యేక ప్రవర్తనకు, ఎల్లెడలా సద్వర్తనకు ఎంతో ప్రాముఖ్యమివ్వడం జరిగింది. ఈ

(۲۴۸) عَنْ اَنَسٍ وَعَنْ عَبْدِ اللّٰهِ قَالَا قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلْخَلْقُ عِيَالُ اللّٰهِ فَاَحَبُّ الْخَلْقِ اِلَى اللّٰهِ مَنْ اَحْسَنَ اِلٰى عِيَالِهٖ۔
(رواه البيهقي مشكوٰة۔ باب الشفقة۔ ص۲۱۶)

248. హజ్రత్ అనస్, హజ్రత్ అబ్దుల్లా ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారుః సృష్టి యావత్తు దేవుని సంతానం. దేవుని సంతానం ఎడల, అంటే బలహీనులు, అశక్తుల ఎడల మేలు చేసేవారు దేవుని ప్రేమపాత్రులవుతారు. (బైహకీ, మిష్కాత్)

(۲۴۹) عَنْ سَهْلِ بْنِ سَعْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ سَيِّدُ الْقَوْمِ فِي السَّفَرِ خَادِمُهُمْ فَمَنْ سَبَقَهُمْ بِخِدْمَةٍ لَمْ يَسْبِقُوْهُ بِعَمَلٍ اِلَّا الشَّهَادَةَ۔ (رواه البيهقي مشكوٰة۔ باب آداب السفر)

249. హజ్రత్ సహల్ బిన్ సఅద్ ఉల్లేఖనంః దైవప్రవక్త (సఅసం) ఇలా నుడివారుః ప్రయాణావస్థలో ప్రజల నాయకుడు ప్రజల సేవకుడయి ఉంటాడు. ప్రజల సేవచేసి సేవలో అందరికన్నా మున్ముందుండే వ్యక్తిని మరెవరయినా మరే సత్కార్యం చేసి అయినా మించిపోలేరు: అయితే షహీద్ స్థానం జనసేవ చేసే యోధునికన్నా ఉన్నతమయింది.
(బైహకీ, మిష్కాత్)

---

హదీసులోని మూడు అంశాలనూ పరిశీలించండి. బలహీనులంటే, ఆరోగ్యం రీత్యా, సామాజిక కట్టుబాట్ల రీత్యా, ఆర్థిక పరిస్థితుల రీత్యా, రాజకీయ వత్తిడుల రీత్యా బలహీనులయినవారంతా ఈ కోవకు చెందినవారే. తల్లిదండ్రులూ సంతానాన్ని పోషించి పెద్ద చేసి తాము ఏమీ చెయ్యలేని వయసుకు చేరిన తరువాత పిల్లల నుంచి ప్రేమానురాగాలు తప్ప మరేమి వాంఛిస్తారు, అవి వారికి ఎంత అవసరమవుతాయి? అలాగే నౌకరులు, చేతి క్రింద పనిచేసే అమాయక జనులు కూడా తమ పైవారి సానుభూతి, ఉదార వైఖరిని ఎంతో ఆశిస్తారు.

248. సృష్టికర్త ఆరాధన తరువాత ప్రాముఖ్యంగల మరోకార్యం ఇస్లాంలో ఏదయినా ఉంటే అది సంఘసేవా కార్యాలు. అంటే సమాజంలో అనాథలు, అగత్యపరులు,

(۲۵۰) عَنْ نَافِعٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مِنْ سَعَادَةِ الْمَرْءِ الْمُسْلِمِ الْمَسْكَنُ الْوَاسِعُ وَالْجَارُ الصَّالِحُ وَالْمَرْكَبُ الْهَنِيْءُ ۔

(الادب المفرد ص۲۵)

250. హజ్రత్ నాఫె ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు: ముస్లిమ్ అయిన వ్యక్తి సౌభాగ్యానికి, శుభశ్రేయాలకు మూడు విషయాలు సంకేతాలని చెప్పవచ్చు: ఒకటి, విశాలమయిన ఇల్లు; రెండు మంచి పొరుగువారు; మూడు అనువయిన సముచితమయిన వాహనం. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۵۱) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَجُلٌ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَارَسُوْلَ اللّٰهِ كَيْفَ لِيْ اَنْ اَعْلَمَ اِذَا اَحْسَنْتُ وَاِذَا اَسَأْتُ فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا سَمِعْتَ جِيْرَانَكَ يَقُوْلُوْنَ قَدْ اَحْسَنْتَ فَقَدْ اَحْسَنْتَ وَاِذَا سَمِعْتَ يَقُوْلُوْنَ قَدْ اَسَأْتَ فَقَدْ اَسَأْتَ۔ (رواه ابن ماجه۔ مشکوٰۃ۔ باب الشفقۃ ص۴۲۱)

251. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (ర.అ) ఉల్లేఖనం రీత్యా ఓ వ్యక్తి దైవ సందేశహరుల సన్నిధికి వచ్చి, దైవ ప్రవక్తా, నేను మంచిపనులే చేస్తున్నానో, దుష్కార్యాల్లోనే మునిగి ఉన్నానో తెలుసుకోవడం ఎలా? అని ప్రశ్నించాడు. దానికి ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: నీ పొరుగు వారు నిన్ను గురించి నీవు మంచి పనులే చేస్తున్నట్టు పలికితే నీవు నిజంగా మంచి పనులే చేస్తున్నట్టు గ్రహించు. నీవు చెడ్డ పని చేస్తున్నట్లు వారన్నట్టు నీవు విన్నట్లయితే నిజంగానే నీవు చెడ్డపనుల్లో పడ్డావని తెలుసుకో. (ఇబ్నుమాజ మిష్కాత్)

---

బలహీనులూ అయిన వారి సహాయ సహకారాలు, వారి సేవ అన్నమాట. వాస్తవంగా ఇది కూడా ఓ విధమయిన ఆరాధనే. దేవుని సంతానమయిన అగత్యపరులకు తోడ్పాటు అందజెయ్యడం దైవానికి ప్రీతి పాత్రమయిన కార్యమనడంలో సందేహమేలేదు.

(٢٥٢) عَنْ اَبِیْ شُرَیْحٍ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
قَالَ مَنْ کَانَ یُؤْمِنُ بِاللّٰہِ وَالْیَوْمِ الْاٰخِرِ فَلْیَقُلْ خَیْرًا اَوْ لِیَصْمُتْ وَمَنْ
کَانَ یُؤْمِنُ بِاللّٰہِ وَالْیَوْمِ الْاٰخِرِ فَلْیُکْرِمْ ضَیْفَہٗ جَائِزَتُہٗ یَوْمٌ وَ
لَیْلَۃٌ وَالضِّیَافَۃُ ثَلَاثَۃُ اَیَّامٍ فَمَا بَعْدَ ذٰلِکَ فَہُوَ صَدَقَۃٌ وَلَا یَحِلُّ
لَہٗ اَنْ یَثْوِیَ عِنْدَہٗ حَتّٰی یُحْرِجَہٗ۔ (الادب المفرد۔ باب لایقیم عندہ حتی یحرجہ)

252. హజ్రత్ అబూ షురైహ్ ఉల్లేఖించిన దాని ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: మీలో అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసించేవాడు సతతం మంచి మాటనే పలకాలి లేదా నోరు మెదపకుండా ఉండాలి. అల్లాహ్‌ను, అంతిమ దినాన్నీ విశ్వసించే వ్యక్తి అతిథిని సత్కారించాలి. అతిథి ధర్మం (కాలం) ఒక పగలు, ఒక రేయి. సాధారణ అతిథి సేవా కాలం మూడు రోజులు. ఆ తరువాత చేసేదంతా, ధర్మం అన్నమాట. అతిథేయునికి ఇబ్బంది కలిగేంత మేరకు అతిథి అతని ఇంట బసచెయ్యడం ధర్మం కాదు.

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

దేవునికి ఇష్టమయిన రీతిలో మసలుకోవడమేగా ఆరాధనంటే – అందువల్లనే మానవుల సేవ కూడా ఓ విధమయిన ఆరాధనే.

249. ప్రయాణావస్థలో మనిషి గుణగణాలు స్పష్టంగా గోచరమవుతాయన్నది అనుభవపూర్వకంగా వెల్లడయ్యే సత్యం. ఇలాంటి పరిస్థితుల్లో నాయకత్వం వహించడం సులువే కావచ్చుగాని సేవ చేసేందుకు ముందుకు రావడం అతి కఠినమయిన విషయం. అందువల్లనే నాయక మన్యులు (సఅసం) ప్రజల సేవ చేసేవాడే నిజమయిన నాయకుడు అని నాయకత్వాన్ని సరికొత్తగా నిర్వచించారు. సేవకు మించిన ధర్మకార్యం లేదన్నది ఈ హదీసు ద్వారా మరోసారి పునరుద్ఘాటించడం జరిగింది. అయితే మానవ సేవలో మనిషి కొస్త తన సమయాన్ని, కొస్త ధనాన్ని, కొస్త సామర్థ్యాన్ని వినియోగిస్తాడు. కాని షహాదత్ (అమరగతి)లో మనిషి తన ఉనికినే శాశ్వతంగా ధారబోస్తాడు. అందువల్ల దానికి విలువ మరింత గొప్పనయినది.

250. ధన సంపాదన చేసేది మనిషి కేవలం తన సౌలభ్యాలు, సౌకర్యాలు సాధించడానికే. ఈ హదీసులో ప్రస్తావించబడిన మూడు అంశాలూ ప్రాపంచిక జీవితంలో ఎంతో విలువయినవి. వీటికి మించిన ఐశ్వర్యం, ఐశ్వర్యానికి మరో లక్ష్యం ఏది కాగలదు?

(۲۵۳) عَنْ اَبِیْ ذَرٍّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
اِخْوَانُکُمْ جَعَلَہُمُ اللّٰہُ تَحْتَ اَیْدِیْکُمْ فَمَنْ جَعَلَ اللّٰہُ اَخَاہُ تَحْتَ یَدَیْہِ
فَلْیُطْعِمْہُ مِمَّا یَاْکُلُ وَلْیُلْبِسْہُ مِمَّا یَلْبَسُ وَلَا یُکَلِّفْہُ مِنَ الْعَمَلِ مَا
یَغْلِبُہٗ فَاِنْ کَلَّفَہٗ مَا یَغْلِبُہٗ فَلْیُعِنْہُ عَلَیْہِ۔ (بخاری۔مسلم۔مشکوٰۃ۔باب النفقات)

253. హజ్రత్ అబూజర్ గిఫారి (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఈ దాస దాసీ జనం మీ సోదరతుల్యులు. వీరిని అల్లాహ్ మీ అధీనం చేశాడు. బాగా గుర్తుంచుకోండి ఎవరి అధీనంలోనయితే ఈ సోదరులుంటారో వారు తాము తినేదే వీరికి తినిపించాలి. తాము తొడిగేదే వీరికి తొడిగించాలి. వారు చెయ్యనలివి కాని పనికై వారిపై ఒత్తిడి చెయ్యరాదు. వారి శక్తికి మించిన పని చెయ్యవలసి వస్తే తాను స్వయంగానూ వారికి చేయూతనివ్వాలి."

(బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

251. ఇక్కడ పొరుగువారంటే ఏ విధంగా, ఏ స్థాయినయినా సరే పొరుగున ఉన్నవారని, సమీపాన ఉండేవారని అర్థం. వీటిలో ఇంటి ఇరుగు పొరుగు వారూ కావచ్చు. స్కూల్లో పొరుగువాడు, ప్రయాణంలో పొరుగువాడూ కావచ్చు. ఈ హదీసులో వారందరూ పొరుగువారి క్రిందే లెక్క. అంటే సమీపాన ఉంటూ మనం చేసే ప్రతి పనిని కానగలిగిన వారు, దాని ప్రభావానికి గురయ్యేవారన్నమాట. వారి సాక్ష్యం అందరికంటే బలవత్తరమయింది, విశ్వసనీయమయింది. అయితే స్వయంగా సాక్ష్యం పలికే వారి మనస్తత్వమే పాపభూయిష్టమయి, తిరస్కార ప్రాయమయి కలుషితమయి ఉంటే వారి సాక్ష్యం గణనీయంకాదు.

252. దైవ విశ్వాసం, పరలోక విశ్వాసం – రెంటివల్ల ఏర్పడే రెండు బాధ్యతల్ని ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. 1. నోటిపై అదుపు. అంటే పరోక్షనింద, దుర్భాషలాడటం, వ్యర్థ ప్రలాపనలకు దూరంగా ఉంటూ నోటిని మంచి మాటలకు వినియోగించడం. 2. విశాల హృదయం, దాతృత్వం, ఉదార స్వభావం. వీటికి ఒక రూపం, ఎవరయినా ప్రయాణీకుడు మన ఇంట బస చెయ్యదలచినపుడు లేదా అతిథులెవరయినా ఇంటికి వచ్చినప్పుడు ఎలాంటి హృదయ సంకుచితత్వం లేకుండా విశాల మనస్సుతో అతిథుల అన్నపానీయాలకు, బసకు ఏర్పాట్లు చెయ్యడం. ఆతిథేయునికి ఇలా బోధించి అతిథిని కూడా సంబోధించడం జరిగింది. అతనూ అభిమానధనుడయి మూన్నాళ్ళకన్నా అధికంగా తన ఆతిథేయునికి భారం వెయ్యకుండా చూడాలి. ఈ విధంగా ఆతిథేయుని తరపున దాతృత్వం, ఉదారవైఖరి, అటు అతిథి

(۲۵۴) عَنْ عَلِيٍّ قَالَ كَانَ اٰخِرُ كَلَامِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَلصَّلٰوةُ اَلصَّلٰوةُ اِتَّقُوا اللّٰهَ فِيْمَا مَلَكَتْ اَيْمَانُكُمْ۔ (الادب المفرد ص۲۶)

254. హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) పలికిన అంతిమ వచనాలు ఇవి: "నమాజ్, నమాజ్... మీ అధీనంలో ఉన్న వారి విషయంలో దైవానికి భయపడుతూ ఉండండి."
(అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۵۵) عَنْ اَبِيْ عَزِيْزِ بْنِ عُمَيْرٍ اَخِيْ مُصْعَبِ بْنِ عُمَيْرٍ قَالَ كُنْتُ فِي الْاُسَارٰى يَوْمَ بَدْرٍ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِسْتَوْصُوْا بِالْاُسَارٰى خَيْرًا وَّكُنْتُ فِيْ نَفَرٍ مِّنَ الْاَنْصَارِ فَكَانُوْا اِذَا قَدَّمُوْا غَدَائَهُمْ اَوْ عَشَائَهُمْ اَكَلُوا التَّمْرَ وَاَطْعَمُوْنِي الْخُبْزَ بِوَصِيَّةِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِيَّاهُمْ۔ (المعجم الصغير للطبراني ص۸۵)

255. హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమైర్ (ర.అ) సోదరుడు అబూ ఉజైర్ బిన్ ఉమైర్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు: "నేను బద్ర్ యుద్ధ ఖైదీలతో పాటు పట్టుబడి ఉన్నాను. అప్పుడు ప్రవక్త మహనీయులు తన సహచరుల్ని "ఖైదీల పట్ల ఉత్తమరీతిలో వ్యవహరించండి." అని బోధించారు. నేను అన్సారుల్లో ఒకరి వద్ద ఉన్నాను. ప్రొద్దున, రాత్రి పూట భోజనాలు పెట్టేటప్పుడు స్వయంగా వారు ఖర్జూరపు పళ్ళు తిని నాకు రొట్టె పెట్టేవారు. ఇది విశ్వకారుణ్య మూర్తి బోధనా ఫలం."
(అల్ మో'జముస్సగీర్)

---

వైపుగా అభిమానం వ్యక్తమయినప్పుడు సమాజంలో, సామూహిక జీవితంలో ఆనంద భరితమయిన, ఉల్లాసవంతమయిన వాతావరణం ఏర్పడడానికి అవకాశముంటుంది.

253. ఆ కాలంలో నేటి కట్టుబానిస (Bonded Labour) మాదిరిగా బానిసల్ని డబ్బు వెచ్చించి కొనుక్కునే వారు. వారిని తమ ఇంటి పనులకు, బయటి పనులకు, వాణిజ్య వ్యవహారాలకు వ్యవసాయ పనులకు కార్మికులుగా వినియోగించుకునేవారు. ఆ

(٢٥٦) قَالَ رَسُوْلُ اللّٰهِ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اللّٰهَ لَا يُقَدِّسُ اُمَّةً لَا
يُؤْخَذُ لِلضَّعِيْفِ فِيْهِمْ حَقُّهٗ - (شرح السنة۔ مشکوٰة۔ باب احیاء الاموات۔ ص ٢٥٩)

256. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారుః "బలహీనులకు, ఉపేక్షితులకు వారి హక్కులను ఇప్పించని వాతావరణం ఉన్న సమాజాన్ని అల్లాహ్ పరిశుద్ధపరచడం జరగదు." (షర్హుస్సున్న, మిష్కాత్)

(٢٥٧) عَنْ مُصْعَبِ بْنِ سَعْدٍ قَالَ رَاٰى سَعْدٌ اَنَّ لَهٗ فَضْلًا عَلٰى
مَنْ دُوْنَهٗ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ هَلْ تُنْصَرُوْنَ وَ
تُرْزَقُوْنَ اِلَّا بِضُعَفَآئِكُمْ - (رواہ البخاری۔ مشکوٰة۔ باب فضل الفقراء)

257. ముస్ అబ్ బిన్ సఅద్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారుః సఅద్ (తన తండ్రి) తన కన్నా హీనులయిన వారిపై తనకు ఆధిక్యత గల దని అభిప్రాయపడేవారు. దానికి ఆదర్శమూర్తి (సఅసం) ఇలా ఉపదేశిం చారు. "నీకు దైవం తరఫున లభించే సహాయం, సంపాదన అంతా ఈ బలహీనవర్గాలు, ఉపేక్షిత జనం మూలంగానే సంప్రాప్తమవుతోంది. గుర్తుంచుకో." (బుఖారి)

---

బానిసబంధనాల నుండి విముక్తిని కలిగించడాన్ని ఉత్తమమయిన పుణ్య కార్యంగా ప్రేరేపించడమే కాక అలా చెయ్యలేని వారు కనీసం వారి ఎడల తమతో సమానంగా చూసుకోవాలని బోధించారు మహనీయ ముహమ్మద్ (సఅసం). ఫలితంగా వందలాది మంది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందారు. ముస్లిమ్ సమాజంలో గొప్ప నేతలుగా అలరారారు. ఆ ఉపదేశాల్లాంటి ఉపదేశమే ఇదీను.

254. అంటే నమాజ్ స్థాపనలో దాని నియమాలన్నింటినీ పాటించడంతో పాటు దాస దాసీ జనం పట్ల మంచిప్రవర్తన కనబరచాలన్నది బోధన. నమాజ్(దైవారాధన)తో పాటు దాసుల విషయం ప్రస్తావించడం వల్ల ద్యోతకమయ్యే దేమిటంటే, మనిషి నమాజ్ స్థాపన ద్వారా దేవుని మహిమను గ్రహించి ఆయన భయభక్తులు అంతర్యంలో ఏర్పరచుకుంటే అతని దృష్టిలో దేవుని దాసులే అయిన తోటి మానవుల్లోని అత్యంత బలహీన వర్గం పట్ల కూడా ప్రేమానురాగాలు జనిస్తాయి. వారిపై చెయ్యి చేసుకునేందుకు మనిషి సాహసించలేడు.

(۲۵۸) عَنْ اَبِيْ سَعِيْدِنِ الْخُدْرِيِّ قَالَ بَيْنَمَا نَحْنُ فِيْ سَفَرٍ مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذْ جَآءَهٗ رَجُلٌ عَلٰى رَاحِلَةٍ فَجَعَلَ يَضْرِبُ يَمِيْنًا وَّ شِمَالاً۔ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ كَانَ مَعَهٗ فَضْلُ ظَهْرٍ فَلْيَعُدْ بِهٖ عَلٰى مَنْ لَا ظَهْرَ لَهٗ وَمَنْ كَانَ لَهٗ فَضْلُ زَادٍ فَلْيَعُدْ بِهٖ عَلٰى مَنْ لَا زَادَ لَهٗ قَالَ فَذَكَرَ مِنْ اَصْنَافِ الْمَالِ حَتّٰى رَاَيْنَا اَنَّهٗ لَا حَقَّ لِاَحَدٍ مِّنَّا فِيْ فَضْلٍ۔ (رواه مسلم۔ مشكوٰة۔ باب آداب السفر)

258. అబూ సయీద్ ఖుద్రి ఇలా ఉల్లేఖించారుః మేము ఒకసారి దైవ ప్రవక్త (సఅసం)తో పాటు ప్రయాణం చేస్తున్నాము. అకస్మాత్తుగా వాహనంపై స్వారీ చేస్తున్న ఓ వ్యక్తి ఆయన (సఅసం) వద్దకు వచ్చాడు. అతను ఒకసారి కుడికి పోతే మరోసారి ఎడమకు ఒరుగుతున్నాడు. (అతను తన వాహనం సరిగ్గా లేక పోవడం చేత బాధపడుతున్నాడు) అప్పుడు ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రకటించారుః "తమ వద్ద అదనపు వాహనం ఉన్నవారు అసలు వాహనమే లేని వారికి దాన్ని ఇచ్చివెయ్యాలి, అదనంగా ప్రయాణావసరాలున్న వారు అవి ఏ మాత్రం లేని వారికి అందజెయ్యాలి..." ఈ విధంగా ఆయన అనేక రకాల సామాగ్రిని గురించి ప్రకటించారు. చివరికి మేము, మా అదనపు సామగ్రిపై ఇక మాకు ఎలాంటి హక్కూ లేదేమో అని అనుకున్నాము.' (ముస్లిం, మిష్కాత్)

---

255. ఇస్లామీయ ప్రభుత్వానికి ఆనాడు యుద్ధ ఖైదీలను పోషించే స్తోమత లేదు. అందువల్ల ఆయా ముస్లిం కుటుంబాల స్తోమతను బట్టి వారికి యుద్ధ ఖైదీలను పంచి వారి బాగోగులు చూడమని పురమాయించారు. ఆ ఏర్పాటులో అబూ ఉజైర్ (అప్పటికి ఇంకా ఇస్లాం స్వీకరించ లేదు. తిరస్కారుల సైన్యంలో ఉండి పట్టుబడ్డారు) ఆ అన్సారుల ఇంట చేరారు. ప్రవక్త మహనీయులు బోధించిన దాన్ని తు.చ. తప్పకుండా పాటించే సహచరులు స్వయంగా తాము ఏదో భుజించి ఆనాటి ఉత్తమ భోజనమయిన రొట్టెలు తమ ఖైదీలకు పెట్టేవారు. ఇస్లాం బలహీనుల హక్కులకు ఎంత ప్రాధాన్యత నిచ్చిందో దీనివల్ల తేట తెల్లమవుతోంది. ఖైదీలు సంపాయించి తినే స్తోమత కలిగి ఉండరు కాబట్టి వారిని ఉత్తమ రీతిలో ఆదుకోవాలన్నది ప్రవక్త ప్రబోధం. కేవలం ముస్లి

(۲۵۹) عَنْ عَبْدِ اللهِ بْنِ جَعْفَرٍ قَالَ لَمَّا جَاءَ نَعْيُ جَعْفَرٍ قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِصْنَعُوْا لِآلِ جَعْفَرٍ طَعَامًا، فَقَدْ اَتَاهُمْ مَا يُشْغِلُهُمْ۔ (رواه الترمذی۔ مشکوٰۃ ۔ باب البکاء علی المیت)

259. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ (రజి అల్లాహు అన్హు) ఓ ఉల్లేఖనంలో ఇలా తెలిపారుః హజ్రత్ జాఫర్ (ర.అ) అమరగతులయినట్లు సమాచారం అందినప్పుడు ప్రవక్త మహనీయులు (సఅసం) "జాఫర్ ఇంటివారి కొరకు అన్నం వండి పంపండి, వారిపై ఆపద వచ్చి పడింది. అది వారిని అలుముకోగా వారు (ప్రపంచాన్నే మరిచి) అందులో మునిగిపొయ్యారు" అని పురమాయించారు. (తిర్మిజి, మిష్కాత్)

---

ములయిన బలహీన వర్గాలనే కాదు ముస్లిమేతరులు, అందునా ఇస్లాం విరోధులు అయినా సరే వారి ఎడల ముస్లిం సమాజంలో ఉత్తమ ప్రవర్తనే సరయినదని ఈ బోధన తెలుపుతోంది.

256. ఈ హదీసు పూర్వ రంగాన్ని తెలుసుకోవడం ఈ సందర్భంలో సముచితంగా ఉంటుంది. ఒకసారి దైవ సందేశహరులు (సఅసం) మదీనాలో హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్(ర.అ)కు కొంత భూమిని ప్రసాదించారు. ఈ భూమి అన్సారుల ఇండ్ల దగ్గర ఒయాసిస్సు సమక్షాన ఉండింది. బనూ అబ్ద్ బిన్ జహరా (అన్సారుల ఓ వంశం) వాళ్ళు అబ్దుల్లా బిన్ మస్ఊద్ని సంబోధించి, 'ఉమ్మె సయీద్ కుమారుడా, ఇక్కడి నుండి వైదొలగు' అని అన్నారు. ఆ సందర్భంలో ఆయన(సఅసం), "అయితే నన్ను దైవం తన ప్రవక్తగా చేసి ఎందుకు పంపినట్లు?" అని ప్రశ్నించారు. అంటే, నేను ప్రభవించడానికి కారణం, బలహీనులను, దళితులను, బలం గల వారి, ఆధిక్యత గలవారి అత్యాచారాల బారి నుండి రక్షించడం. కాని నేను ప్రభవించిన తరువాత కూడా బలహీనులపై అత్యాచారాలు కొనసాగితే వారిని వారి భూమి నుండి తొలగిస్తే ఇక నా రాకకు అర్థమేముంటుంది? అని భావం. సమాజంలో ఎవరి హక్కులు వారికి లభించేందుకు ఎలాంటి అవరోధాలు లేని వాతావరణం నెలకొనేలా కృషి చెయ్యాలి. ఒక వర్గం ప్రజలు కేవలం బలహీనులవడం చేత ఇతరుల దౌర్జన్యాలకు గురవుతూ ఉంటే అలాంటి సమాజంలో శుభమన్నదేదీ మిగలదు. పైగా బలహీనుల్లో అత్యాచారాలకు వ్యతిరేకత జనించి క్రియ, ప్రతి క్రియల పరంపర ప్రారంభమయి సమాజంలో అరాచకత్వం, అశాంతి ప్రబలుతాయి. పరిశుద్ధ వాతావరణం, శీలవంతమయిన పరిస్థితులు నెలకొనజాలవు.

(٢٦٠) عَنْ ابْنِ عُمَرَ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَرَانِيْ
فِي الْمَنَامِ اَتَسَوَّكُ بِسِوَاكٍ فَجَاءَنِيْ رَجُلَانِ اَحَدُهُمَا اَكْبَرُ مِنَ الْاٰخَرِ
فَنَاوَلْتُ السِّوَاكَ الْاَصْغَرَ مِنْهُمَا فَقِيْلَ لِيْ كَبِّرْ فَدَفَعْتُهُ اِلَى الْاَكْبَرِ مِنْهُمَا۔
(بخاری مسلم۔ مشکوٰۃ۔ باب السواک۔ ص٣٧)

260. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త శ్రేష్ఠులు ఇలా సెలవిచ్చారు, "నేను మిస్వాక్ చేసుకుంటున్నట్లు కలగన్నాను. అప్పుడు నావద్దకు ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారిలో ఒకతను పెద్ద వయసున్నవాడు. నేను ఆ ఇద్దరిలో చిన్న వానికి మిస్వాక్ నిచ్చి వేశాను. పెద్ద వానికి ఇవ్వమని నన్ను ఆదేశించడం జరిగింది. తరువాత నేను పెద్దవానికి ఇచ్చాను." (బుఖారి, ముస్లిం)

(٢٦١) عَنْ عَائِشَةَ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَنْزِلُوا
النَّاسَ مَنَازِلَهُمْ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب الشفقۃ۔ ص٤٢٦)

261. ప్రవక్త మహనీయులు ఇలా బోధించినట్లు హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖించారు: "జనులతో వారి స్థాయిని బట్టి వ్యవహరించండి"
(అబూదావూద్, మిష్కాత్)

---

257. అంటే ఆర్థికంగా, శారీరకంగా, సామాజికంగా బలహీనులయిన వారిని హీనంగా చూడరాదు, దేవుడు ఎవరికయినా సామాజికంగా, శారీరకంగా, ఆర్థికంగా ప్రాబల్యాన్ని ప్రసాదిస్తే అది నిజంగా దైవం తరఫున ఓ పరీక్ష. తన సంపన్న దాసులు తమ వరప్రసాదాలను పొంది ఉపేక్షితులు, బలహీనులు, దళితులయినవారిని మరచి పోతారో లేక ఆదుకుంటారో అన్నది ఆ పరీక్ష.

258. అది యుద్ధ సమయం కాబట్టి ప్రభుత్వంకూడా ఇలాంటి పరిస్థితుల్లో అదనపు. సామగ్రిలేని వానికి ఇప్పించడం, యుద్ధం కారణంగా అదనపు పన్నులు విధించడం, అగత్యపరులకు అందులో నుండి పంచి ఇవ్వడం అంతా సబబే. ఇలాంటి అత్యవసర పరిస్థితుల్లో సామాన్యంగా పరిపాలకులకు ప్రత్యేకఅధికారాలు సంక్రమించడం మామూలే.

259. సాధారణంగా ఇంట ఎవరిదయినా మృత్యువు సంభవించినప్పుడు, ఇంటివారు అన్నపానీయాలను పట్టించుకునే స్థితిలో ఉండరు. ఆ పరిస్థితినే దైవ సందేశహరులు

(۲۶۲) عَنِ ابْنِ عُمَرَ قَالَ اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا وَدَّعَ رَجُلًا اَخَذَ بِیَدِہٖ فَلَا یَدَعُھَا حَتّٰی یَکُوْنَ الرَّجُلُ ھُوَ یَدَعُ یَدَ النَّبِیِّ وَیَقُوْلُ اَسْتَوْدِعُ اللّٰہَ دِیْنَکَ وَاَمَانَتَکَ وَاٰخِرَ عَمَلِکَ۔ وَفِیْ رِوَایَۃٍ وَخَوَاتِیْمَ عَمَلِکَ۔

(رواہ الترمذی۔ مشکوٰۃ۔ باب الدعوات)

262. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఎవరినయినా సాగనంపేటప్పుడు అతని చెయ్యి పట్టుకుని, స్వయంగా అతను తన చెయ్యి వదలనంత వరకు ఆయన తన చెయ్యిని వదిలేవారుకారు. ఇంకా (సాగనంపుతూ) ఇలా సెల విచ్చేవారు: "నేను నీ ధర్మాన్నీ, నీ అప్పగింతను; నీ ఆచరణల ముగింపును దైవానికి అప్పగిస్తున్నాను." (తిర్మిజి, మిష్కాత్)

---

ఈ హదీసులో పేర్కొన్నారు. వారి అవసరాలను ఇరుగు పొరుగు వారు గమనించి తీర్చే ప్రయత్నం చెయ్యాలన్నది ఈ ప్రబోధానికి సారాంశం. కష్టాల్లో ఉన్న వారిని చేతనయినంత మేరకు ఆదుకోవాలన్న శిక్షణ ఇందులో ఉంది.

260. ఇద్దరు వ్యక్తుల్ని ఆదరించి కానుకనిచ్చే అవకాశమున్నప్పుడు వయసులో పెద్దవారయిన వారికి ప్రాధాన్యత నివ్వాలన్నది ఈ ప్రబోధ సారం.

261. ధనికుడయినా నిరుపేద అయినా, హోదా గలవాడయినా, ఏ హోదాలేనివాడయినా, ఉన్నత పదవిలో ఉన్నా, పదవీహీనుడయినా, మంచివాడయినా చెడ్డవాడయినా, చిన్నవాడయినా పెద్దవాడయినా చట్టం దృష్టిలో అందరూ సమానులే. దైవాదేశాల పాలనలో, దైవాజ్ఞల అమలులో వీరి మధ్య ఎలాంటి తారతమ్యాన్ని ఏమాత్రమయినా పాటించడానికి వీల్లేదు, వినాయింపు నివ్వడానికి వీల్లేదు. కాని సాధారణ వ్యవహారాల్లో, వ్యక్తిగత మర్యాదల్లో విజ్ఞానం, దైవభక్తి, ధర్మనిష్ఠ, ఇంకా ఇతర విషయాల సహజమయిన వ్యత్యాసాలను పరిగణనలోకి తీసుకోవడం తప్పుకాదు. ఇదే విషయాన్ని ఈ హదీసులో బోధించడం జరిగింది. సామూహిక మర్యాదలు ధార్మికతకు వ్యతిరేకం కాదు. ధర్మంలోని అంతర్భాగమే అని గమనించాలి.

262. కలుసుకునేందుకు ఎవరైనా వచ్చినప్పుడు వారిని సాగనంపేందుకు వారితో పాటు కొంత దూరం నడవటం, విడిపోతూ చేసే కరచాలనం ద్వారా తన మైత్రిని, అనుబంధాన్ని తెలుపడం, అతనిలో మళ్ళీ కలుసుకునే వాంఛ కలిగేలా ప్రవర్తించడం సామూహిక, సందేశాత్మక కార్యకలాపాల్లో నిమగ్నులయి ఉండేవారి ప్రత్యేకత.

(۲۶۳) عَنْ بَكْرِبْنِ عَبْدِ اللهِ كَانَ أَصْحَابُ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَتَبَادَحُوْنَ بِالْبِطِّيْخِ فَإِذَا كَانَتِ الْحَقَائِقُ كَانُوْا هُمُ الرِّجَالُ - (الادب المفرد، باب المزاح - ص۱۴۱)

263. హజ్రత్ బక్ర్ బిన్ అబ్దుల్లా ఉల్లేఖనం ప్రకారం మహనీయులైన ప్రవక్త సహచరులు (వేళాకోళంగా) తర్బూజ్ పండ్లను ఒకరిపై ఒకరు విసురుకొనేవారు. కాని వాస్తవంగా రక్షణకై పోరాడవలసి వచ్చినప్పుడు ఆ రంగంలో యోధుల్లా వ్యవహరించేవారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۶۴) عَنْ مُحَمَّدِ بْنِ زِيَادٍ قَالَ أَدْرَكْتُ السَّلَفَ أَنَّهُمْ لَيَكُوْنُوْنَ فِي الْمَنْزِلِ الْوَاحِدِ بِأَهَالِيْهِمْ فَرُبَّمَا نَزَلَ عَلَى بَعْضِهِمُ الضَّيْفُ وَ قِدْرُ أَحَدِهِمْ عَلَى النَّارِ فَيَأْخُذُهَا صَاحِبُ الضَّيْفِ لِضَيْفِهِ فَيَفْقِدُ الْقِدْرَ صَاحِبُهَا فَيَقُوْلُ مَنْ أَخَذَ الْقِدْرَ فَيَقُوْلُ صَاحِبُ الضَّيْفِ نَحْنُ أَخَذْنَاهَا لِضَيْفِنَا فَيَقُوْلُ صَاحِبُ الْقِدْرِ بَارَكَ اللهُ لَكُمْ فِيْهَا قَالَ مُحَمَّدٌ وَالْخُبْزُ مِثْلُ ذَالِكَ إِذَا خَبَزُوْا - (الادب المفرد - باب دالة بعض اہل الاسلام علی بعض - ص۱۰۹)

264. ముహమ్మద్ బిన్ జియాద్ ఓ ఉల్లేఖనంలో ఇలా తెలుపుతున్నారు: 'నేను సజ్జనులయిన పూర్వీకుల్ని చూశాను. వారి కుటుంబాలు అనేకం ఒకే ఇంటిలో బస చేసేవి. అనేక మార్లు వింత జరిగేది. ఒకని ఇంట్లో అతిథి ఎవరయినా వచ్చినప్పుడు మరొకరి ఇంట్లో వంట అవుతుంటే, ఆతిథేయుడు తన అతిథి కోసం ఆ వంట పాత్రను తీసుకువెళ్ళేవాడు. తరువాత వంట చేసుకున్న వ్యక్తి వచ్చినప్పుడు తన భోజన పాత్ర ఏమయిందోనని వెదుక్కునేవాడు. 'నావంట' పాత్ర ఏమయిందని ఇతరుల్ని అడగ్గా ఆతిథేయుడు, 'మేము మా ఇంట వచ్చిన అతిథి కోసం తీసుకువెళ్ళాము' అని తెలిపేవాడు. అప్పుడు వంట చేసుకున్న వ్యక్తి, 'దైవం అందులో నీకు శుభాన్ని చేకూర్చుగాక' అని చెప్పి తన ఆనందాన్ని వ్యక్తం చేసేవాడు.

రొట్టెకాల్చుకున్నప్పుడు సయితం ఇలానే జరిగేది అని ముహమ్మద్ తెలిపారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(٢٦٥) عَنْ عَبْدِ الرَّحْمٰنِ قَالَ لَمْ يَكُنْ اَصْحَابُ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مُتَحَزِّقِيْنَ وَلَا مُتَمَاوِتِيْنَ وَكَانُوْا يَتَنَاشَدُوْنَ الشِّعْرَ فِىْ مَجَالِسِهِمْ وَيَذْكُرُوْنَ اَمْرَ جَاهِلِيَّتِهِمْ فَاِذَا اُرِيْدَ اَحَدٌ مِّنْهُمْ عَلٰى شَيْءٍ مِّنْ اَمْرِ اللّٰهِ دَارَتْ حَمَالِيْقُ عَيْنَيْهِ كَاَنَّهٗ مَجْنُوْنٌ۔

(الادب المفرد۔ باب الكبر۔ ص۸۱)

265. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా అంటున్నారు: దైవ సందేశహరుని సహచరులు శుష్క వైజం గల వారు కారు, నిర్జీవ మనుష్యులూ కారు, వారు తమ సమావేశాల్లో కవితలు ఆలాపించుకొనేవారు, అజ్ఞాన కాలపు ప్రస్తావన సయితమూ వచ్చేది. కాని అల్లాహ్ ఆదేశానికి భిన్నమయింది ఏదయినా వారిలోని ఎవరినయినా చెయ్యమంటే అతని కనుగ్రుడ్లు గిర్రున తిరిగేవి అతనికి మతి చలించిందా అన్నట్లుగా. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

263. ధర్మాచరణ, ధర్మనిష్ఠ, ధర్మపరాయణత, భక్తి ప్రపత్తులు – అనగానే చిరునవ్వు కూడా పెదాలపై తారసపడని ముఖాలని ఎంత మాత్రం అర్థంకాదు. ఎప్పుడు చూసినా సీరియస్‌గా ఉండనవసరంలేదు. అవసరం, వాతావరణాన్ని దృష్టిలో ఉంచుకుని దైవ ప్రవక్త, ఆయన సహచరులు సయితం సభ్యతా సంస్కారాల హద్దులో ఉంటూ హాస్యరసాన్ని ఆస్వాదించే వారని ఈ హదీసు ఇంకా ఇలాంటి అనేక హదీసులు తెలుపుతాయి. అయితే ఈ పరిస్థితి యదార్థంగానే గడ్డు పరిస్థితులు ఎదురయినప్పుడు వారిని ఏకంచేసి దైవధర్మ మార్గాన యోధులుగా నిలబెట్టగలిగేది కూడా.

264. పూర్వం నెలకొని ఉన్న లేమిస్థితిలో, సాధారణ, నిరాడంబర, మొగమాటం లేని వాతావరణంలో ఇలాంటి సంఘటనలు తరుచుగా జరిగేవన్నది వాస్తవమయినా, పరస్పరం ప్రేమానురాగాలు, నమ్మకం, సుహృద్భావం ఉన్నప్పుడే ఇలా జరగడానికి వీలవుతుంది. లేకపోతే ఇలా మొహమాటం లేకుండా వ్యవహరిస్తే నెగటు ఏర్పడి వైమనస్యాలకు దారితీయవచ్చు. తీపి అనుభవాలకు బదులు కేవలం చేదు మిగలవచ్చు. అందువల్ల మొదట ఇలాంటి వాతావరణాన్ని సృజించేందుకు ప్రయత్నించాలి.

265. 'శుష్క వైజం' 'నిర్జీవ మనుష్యులు' అనంటే, మిత్రుల మధ్య కూడా భృకుటి ముడి వేసుకుని ఉల్లాసమే కరువయినట్లు ప్రవర్తించడం అభిప్రాయం. ఈ హదీసు వల్ల ప్రవక్త మహనీయుల సహచర్యంలో ఆయన సహచరులు అటు సన్యాసులూ, బైరాగుల్లానూ

(۲۷۱) عَنْ جَابِرٍ قَالَ قُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ مِمَّا اَضْرِبُ يَتِيْمِيْ قَالَ
مِمَّا كُنْتَ ضَارِبًا مِنْهُ وَلَدَكَ غَيْرَ وَاقٍ مَالَكَ بِمَالِهٖ وَلَا مُتَأَثِّلًا
مِّنْ مَّالِهٖ مَالًا (المعجم الصغير للطبرانی۔ ۵۸)

271. హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖనం: నేనొకసారి ఇలా అడిగాను, 'దైవ ప్రవక్తా నేను నా సంరక్షణలో ఉన్న అనాధను ఏ కారణంగా శిక్షించగలను?' దానికి దైవ సందేశహరులు (సఅసం), "ఏ కారణంగానైతే నీవు నీ సంతానాన్ని కొడతావో అదే కారణంగా అనాధ బాలలనూ కొట్టే హక్కు నీకుంటుంది. అయితే నీవు అనాధల సొమ్మును ఆధారం చేసుకుని నీ సొంత సొమ్మును కాపాడుకోవడం గాని లేదా ఆ సొమ్ములోనుండి ఎంతో కొంత ప్రోగు చేసుకోవడంగాని చెయ్యరాదు." అని ఉపదేశించారు.

(అల్ మో'జముస్సగీర్, త్రిబాని)

---

తీసుకువేవారని ఇతర అనేక హదీసుల ద్వారా కూడా బోధపడుతోంది. మరో విషయం ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే ఎవరయినా ఏ కారణం వల్లనయినా జనాజా నమాజ్‌లో పాల్గొనలేకపోతే సమాధి వద్దకు వెళ్ళి జనాజా నమాజ్ చెయ్యవచ్చు.

270. దీని ద్వారా మానవ హక్కులను నెరవేర్చడానికి గల ప్రాధాన్యత బోధపడుతోంది. దైవమార్గంలో కృషిచెయ్యడమయినా; రాత్రంతా నమాజ్ చేస్తూ నిలబడటమయినా, ఎడతెగకుండా ఉపవాసాలు పాటించడమయినా – కేవలం ఇవే ధార్మిక కార్యాలు కాదు. అగత్యపరునికి సహాయపడటం కూడా ధార్మికమయిన విధే అని దీన్నిబట్టి తెలుస్తోంది.

271. అనాధ శరణాలయాలను ఏర్పరచి అనాధల్ని పెంచే పద్ధతికి ఇస్లామీయ సమాజంలో అంతగా ప్రోత్సాహం ప్రాప్తం కాదు. ఎందుకంటే శరణాలయాల వాతావరణంలో పెరిగిన బాలలు మానసికంగా ఎదగలేరు. లేదా వారు పెడత్రోవ త్రొక్కే అవకాశాలూ మెండుగా ఉంటాయి. అందువల్ల అనాధల్ని తోటి సమాజంలోని వారు తమ ఇండ్లల్లో తమ సంతానం వలే పెంచి పోషించడం అభిలషణీయంగా పరిగణించబడుతుంది. అనాధలు ఒకవేళ ఆస్తిపరులయితే వారి ఆస్తిని కాపాడి వారు ప్రాజ్ఞులయిన తరువాత చట్టబద్ధంగా వారికి అప్పగించడం ధర్మబద్ధమైన విషయం. పెంచేవారు మరీ అగత్యపరులయితే అవసరం మేరకు ఆ ఆస్తి నుండి ప్రయోజనం పొందవచ్చు. కాని దాన్ని కాజేసే ఉద్దేశ్యంతో ఏ చర్య తీసుకున్నా ఇస్లామీయ సమాజమూ క్షమించదు. దైవం దృష్టిలోనూ అది క్షమార్హమయిన నేరం కాదు. ఆ విషయాన్నే ఈ హదీసులో చాటడం జరిగింది. అనాధల పట్ల ప్రవక్త సహచరులు (ర.అ) ఎంతగా భయపడేవారంటే, వారిని అవసరమయితే కొట్టడం కూడా తప్పో ఏమో అన్న అనుమానం కలిగేది. అలాంటి ఓ సందర్భాన్నే ఈ హదీసు సూచిస్తుంది.

(۲۷۲) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
اِذَا صَنَعَ لِاَحَدِکُمْ خَادِمُهٗ طَعَامَهٗ ثُمَّ جَآءَ بِهٖ وَقَدْ وَلِیَ حَرَّهٗ وَدُخَانَهٗ
فَلْیُقْعِدْهُ مَعَهٗ فَلْیَاْکُلْ فَاِنْ کَانَ الطَّعَامُ مَشْفُوْهًا قَلِیْلًا فَلْیَضَعْ فِیْ یَدِهٖ
مِنْهُ اُکْلَةً اَوْ اُکْلَتَیْنِ ـ (رواہ مسلم مشکوۃ ـ باب النفقات)

272. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారుః "మీలో ఒకరి సేవకుడు వంటింటి వేడినీ, పొగను సహించి భోజనం తయారు చేసి తెచ్చినప్పుడు వారు తమ సేవకుణ్ణి సయితం తమతోపాటు కూర్చుండబెట్టుకోవాలి. అలాగే సేవకుడు సయితం జంకకుండా భోజనంలో పాలుపంచుకోవాలి. ఒకవేళ భోజనం తక్కువగా ఉన్నట్లయితే కనీసం అతనికి ఎంతో కొంత పెట్టాలి." (ముస్లిం, మిష్కాత్)

(۲۷۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
قَرَصَتْ نَمْلَةٌ نَبِیًّا مِّنَ الْاَنْبِیَآءِ فَاَمَرَ بِقَرْیَتِهٖ مِّنَ النَّمْلِ فَاُحْرِقَتْ فَاَوْحَی
اِلَیْهِ تَعَالٰی اَنْ قَرَصَتْكَ نَمْلَةٌ اَحْرَقْتَ اُمَّةً مِّنَ الْاُمَمِ تُسَبِّحُ ـ بخاری۔
مسلم مشکوۃ ـ باب ما یحل اکله)

273. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనంః దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చారు, "ప్రవక్తల్లో ఒకరికి ఓ చీమ కుట్టింది. ఆయనేమో చీమల సీమనంతా కాల్చివెయ్యాలని ఆదేశించారు. అప్పుడు అల్లాహ్ ఆ ప్రవక్తకు తన వాణి ద్వారా, "నీకు కేవలం ఒక్క చీమ మాత్రమే కుట్టింది. అయితే నీవు దైవనామ సంకీర్తనం చేసే ఓ జాతి (చీమలు)నే కాల్చివేశావు" అని సందేశం పంపాడు. (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

272. నౌకర్లతో సమాన స్థాయిలో వ్యవహరించాలన్నది దీని ముఖ్య ఉద్దేశ్యం. నౌకర్లలో నుండి ఆత్మ న్యూనతాభావం తీసివేసి సమాజంలో అందరితో పాటు సమున్నతి సాధించాలన్నదే ఇస్లాం ప్రబోధసారం.

273. మరో హదీసు ద్వారా, అగ్నితో శిక్షించడాన్ని నిషేధించినట్లు తెలుస్తోంది. అందువల్లనే కొందరు విద్వాంసులు నల్లుల్ని మరిగే నీటితో సంహరించడాన్ని ఒప్పుకోరు. అయితే మధ్యేమార్గంగా అత్యవసర పరిస్థితుల్లో అగ్ని ద్వారానూ విష కీటకాలను చంపవచ్చు.

నీయుల సన్నిధిలో హాజరవుతాను. (ఈ వృత్తాంతమంతా వినిపిస్తాను)' అని చెప్పి (ఆయన వద్దకు వెళ్ళారు) ఆయనకు, 'దైవప్రవక్తా, మేము (పొలాలకు నీరు తోడే) ఒంటెలున్న వాళ్ళము. పగలంతా పనుల్లో మాకు తీరిక దొరకదు. ముఆజ్ ఏమో మీతో పాటు ఇషానమాజ్ చేశాడు, తిరిగి తన వారి వద్దకు వచ్చి బకర సూరా ప్రారంభించాడు' అని విన్నవించుకున్నాడు. దానికి దైవ సందేశహరులు ముఆజ్ వైపునకు తిరిగి ఇలా ఉపదేశించారు, "ముఆజ్, నీవు మనుషుల్ని విపత్తులో పడవెయ్యాలనుకుంటున్నావా? షమ్స్ సూరా, లైల్ సూరా, ఆలా సూరా లాంటివి పఠించు."

(బుఖారి, ముస్లిం - మిష్కాత్)

(٢٦٩) عَنْ اَبِیْ هُرَيْرَةَ اَنَّ امْرَأَةً سَوْدَاءَ كَانَتْ تَقُمُّ الْمَسْجِدَ اَوْ شَابٌّ فَفَقَدَهَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَسَاَلَ عَنْهَا اَوْعَنْهُ فَقَالُوْا مَاتَ فَقَالَ اَفَلَا كُنْتُمْ اٰذَنْتُمُوْنِیْ قَالَ فَكَاَنَّهُمْ صَغَّرُوْا اَمْرَهَا اَوْاَمْرَهٗ فَقَالَ دُلُّوْنِیْ عَلٰى قَبْرِهٖ فَدَلُّوْهُ فَصَلّٰى عَلَيْهَا۔ (بخاری مسلم۔ مشکوۃ۔ باب المشی بالجنازہ)

269. హజ్రత్ అబూహురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, ఓ నల్లని స్త్రీ లేదా యువకుడు మస్జిద్ తుడిచేవాడు. ఓ రోజున దైవ ప్రవక్త (సఅసం) అతన్ని కానక అతన్ని గురించి విచారించగా అతను చనిపొయ్యాడని అక్కడున్నవారు తెలిపారు. 'నాకు తెలుపలేదేమిటి' అని అడిగారాయన. అతని చావును ఓ సాధారణ సంఘటనగా భావించి జనులు ఆయనకు దాన్ని గురించి తెలుపలేదు. 'నాకు అతని గోరిని చూపించండి' అని ఆయన కోరగా ఆయనకు గోరిని చూపించారు. ఆయన గోరి వద్దకు వెళ్ళి జనాజా నమాజ్ చేశారు. (బుఖారి, ముస్లిం)

---

కాకుండా ఇటు ప్రపంచ వ్యామోహంలో పడి సతతం విలాసాల్లో, కథలు, జోకుల్లో తేలియాడే వారిలానూ కాకుండా కాలక్షేపం, హాస్య రసాలతో పాటు ధార్మిక చైతన్యం, ఆధిమానం కూడా వారిలో తొణికిసలాడేదన్న విషయం ద్యోతకమవుతోంది. అందుకే దైవాదేశాలకు భిన్నమయిన విషయం ప్రస్తావించబడినప్పుడు వారికి ఆగ్రహం కలిగేది.
266. తేలికయిన నమాజ్ అనంటే, ప్రవక్త సంప్రదాయానికి భిన్నంగా అతి దీర్ఘ

(٢٧٠) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

اَلسَّاعِيْ عَلَى الْأَرْمِلَةِ وَالْمِسْكِيْنِ كَالسَّاعِيْ فِيْ سَبِيْلِ اللّٰهِ وَأَحْسِبُهُ

قَالَ كَالْقَائِمِ لَا يَفْتُرُ وَكَالصَّائِمِ لَا يُفْطِرُ - متفق عليه - مشكوٰة -

باب الشفقة - ص٤٢٣

270. అబూ హురైరా (ర) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "ఉపేక్షితులు, అగత్యపరులు, అనాథలయిన వారి సహాయం కొరకు కృషిచేసే వ్యక్తి, దైవ మార్గంలో కృషిచేసే వానికి సమానం." (ఉల్లేఖకుని అభిప్రాయంలో ఆయన ఇలా తెలిపారు) "ఇలాంటి వ్యక్తి రాత్రంతా నిలబడి అదనపు ఆరాధన చేస్తూ అలసిపోని వ్యక్తిలాంటివాడు లేదా తన ఉపవాస వ్రతాలను ఎడతెగకుండా పాటించే వ్యక్తిలాంటివాడు."

(ముత్తఫకున్ అలైహ్ - మిష్కాత్)

---

పారాయణం, రుకూ, సజ్దాలు చెయ్యరాదని అర్థం. నమాజ్‌లోని ప్రధానాంశాలు నెరవేర్చుతున్నప్పుడు త్వరత్వరగా కానిచ్చి, నమాజ్‌లోని హుందాను, ప్రశాంతతను, సంతృప్తిని నాశనం చెయ్యాలని దీనికి అర్థం ఎంత మాత్రం కాదు. అలాగే జమాఅత్ తోటి నమాజ్‌లో అందరికీ సముచితమయిన రీతిని అవలంబించి ఒంటరిగా చేసుకునే నమాజ్‌లో సుదీర్ఘమయిన గ్రంథపారాయణం, రుకూ, సజ్దాలు చెయ్యవచ్చని బోధించడం జరిగింది.

267. రాత్రిపూట ప్రశాంతంగా దైవధ్యానం చెయ్యడంలో గల మాధుర్యాన్ని ఈ హదీసు వ్యక్తం చేస్తోంది. అయితే సామూహికంగా విధి అయిన నమాజులు వ్యక్తిగత అభిరుచులకనుగుణంగా కాక సమాజంలోని అన్ని వర్గాల ప్రజల్ని దృష్టిలో ఉంచుకుని చెయ్యవలసి ఉంటుంది గనక ప్రవక్త మహనీయులు తనకు ఇష్టమయినప్పటికీ బలహీనులు, వ్యాధిగ్రస్తులు, శ్రామికులను దృష్టిలో ఉంచుకోవలసిన అగత్యాన్ని దీని ద్వారా బోధపరిచారు.

268. పై హదీసులోని బోధనను ఇక్కడ గుర్తుంచుకోవాలి. మరో విషయం ఏమిటంటే ఫర్జ్ నమాజ్ జమాఅత్‌తో జరుగుతున్నప్పుడు నఫిల్ సంకల్పంతో అందులో చేరి నమాజ్ చేసుకోవచ్చు అన్న అంశమూ ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అయితే నఫిల్ నమాజ్ జమాఅత్‌తో జరుగుతున్నప్పుడు ఫర్జ్ సంకల్పంతో అందులో చేరడానికి మటుకు ఆస్కారంలేదని ఇక్కడ తెలుసుకోవాలి.

269. సాధారణంగా సమాజంలో తమ విద్యా విజ్ఞానాలు, సిరిసంపదలు, హోదా వృత్తుల కారణంగా అల్పంగా భావించబడే వారిని గురించి అందరూ పట్టించుకోరు. కాని దైవ సందేశహరులు వారిని సయితం తమ తోటివారుగానే పరిగణించాలన్న ఉపదేశాన్ని ఆచరణాత్మకంగా అందజేశారు. ప్రవక్త మహనీయులు ఇలాంటి వారి పట్ల ప్రత్యేక శ్రద్ధ

(۲٦٦) عَنْ أَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
إِذَا صَلّٰی اَحَدُكُمْ لِلنَّاسِ فَلْیُخَفِّفْ فَإِنَّ فِیْهِمِ الضَّعِیْفَ وَالسَّقِیْمَ وَالْكَبِیْرَ
وَفِیْ رِوَایَةٍ وَذَا الْحَاجَةِ وَإِذَا صَلّٰی اَحَدُكُمْ لِنَفْسِهٖ فَلْیُطَوِّلْ مَا شَاءَ ۔
(بخاری، مسلم، مشکوٰة ۔ باب ما جاء علی الامام ۔ ص۹۳)

266. హజ్రత్ అబూహురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు, "మీలో ఎవరయినా నమాజ్ చేయిస్తే కాస్త తేలికయినదిగా చేయించాలి. ఎందువల్లనంటే వెనక నమాజ్ జేసేవారి (ముక్తదీల)లో బలహీనులు, వ్యాధిగ్రస్తులు, వృద్ధులూ, (మరో ఉల్లేఖనం ప్రకారం అగత్యపరులు కూడా) ఉంటారు. కాని మీలో ఎవరైనా వేరుగా ఒక్కరే నమాజ్ చేస్తున్నట్లయితే ఇష్టమయిన విధంగా సుదీర్ఘంగా చెయ్యవచ్చు." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(۲٦٧) عَنْ أَبِیْ سَعِیْدٍ قَالَ صَلَّیْنَا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
صَلٰوةَ الْعِشَاءِ فَلَمْ یَخْرُجْ حَتّٰی مَضٰی نَحْوٌ مِّنْ شَطْرِ اللَّیْلِ فَقَالَ خُذُوْا مَقَاعِدَكُمْ
فَاَخَذْنَا مَقَاعِدَنَا فَقَالَ إِنَّ النَّاسَ قَدْ صَلَّوْا وَاَخَذُوْا مَضَاجِعَهُمْ وَإِنَّكُمْ
لَنْ تَزَالُوْا فِیْ صَلٰوةٍ مَّا انْتَظَرْتُمُ الصَّلٰوةَ وَلَوْلَا ضُعْفُ الضَّعِیْفِ وَسُقْمُ السَّقِیْمِ
لَاَخَّرْتُ هٰذِهِ الصَّلٰوةَ إِلٰی شَطْرِ اللَّیْلِ ۔ (ابوداؤد ۔ مشکوٰة ۔ باب
تعجیل الصلوٰة ۔ ص۵۲)

267. హజ్రత్ అబూ సయీద్ (ర) ఇలా ఉల్లేఖించారు: మేము ఒకసారి ప్రవక్త మహనీయులతో పాటు ఇషా నమాజ్ చేశాము. (అప్పుడు జరిగిందేమిటంటే) ఆయన చాలా సేపటి వరకు (నమాజ్ కొరకు ఇంటి) బయటికి రాలేదు. చివరికి దాదాపు అర్ధరాత్రి గడిచింది. (అప్పుడువచ్చి) ఆయన మీ మీ స్థానాల్లో కూర్చోండి అని మాతో అన్నారు. మేము మా

స్థానాల్లో కూర్చున్నాము. ఆయన ఇలా సెలవిచ్చారు, "జనులు నమాజ్ చేసుకున్నారు. తమ పడకగదుల్లో విశ్రమిస్తున్నారు. మీరు నమాజ్ కొరకు నిరీక్షిస్తున్నంతకాలం నమాజ్ (స్థితి)లోనే పరిగణించబడతారు. ఒకవేళ బలహీనుడి బలహీనత, వ్యాధిగ్రస్తుని వ్యాధి దృష్టిలో లేకపోతే నేను ఈ నమాజ్‌ని అర్ధరాత్రి చేసేలా నిర్ణయించేవాడిని."

(అబూదావూద్ - మిష్కాత్)

(٢٦٨) عَنْ جَابِرٍ قَالَ كَانَ مُعَاذُ بْنُ جَبَلٍ يُصَلِّي مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ ثُمَّ يَأْتِي فَيَؤُمُّ قَوْمَهُ فَصَلَّى لَيْلَةً مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ الْعِشَاءَ ثُمَّ أَتَى قَوْمَهُ فَأَمَّهُمْ فَافْتَتَحَ بِسُورَةِ الْبَقَرَةِ فَانْحَرَفَ رَجُلٌ فَسَلَّمَ ثُمَّ صَلَّى وَحْدَهُ وَانْصَرَفَ فَقَالُوا لَهُ نَافَقْتَ يَا فُلَانُ، قَالَ لَا وَاللهِ لَآتِيَنَّ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ يَا رَسُولَ اللهِ إِنَّا أَصْحَابُ نَوَاضِحَ نَعْمَلُ بِالنَّهَارِ وَإِنَّ مُعَاذًا صَلَّى مَعَكَ الْعِشَاءَ ثُمَّ أَتَى قَوْمَهُ فَافْتَتَحَ بِسُورَةِ الْبَقَرَةِ فَأَقْبَلَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ عَلَى مُعَاذٍ فَقَالَ يَا مُعَاذُ أَفَتَّانٌ أَنْتَ إِقْرَأْ وَالشَّمْسِ وَضُحٰهَا وَاللَّيْلِ إِذَا يَغْشٰى، وَسَبِّحِ اسْمَ رَبِّكَ الْأَعْلٰى۔ (بخاری۔ مسلم۔ مشکوٰۃ۔ باب القراءۃ فی الصلوٰۃ۔ ص٧)

268. హజ్రత్ జాబిర్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు, "ముఆజ్ బిన్ జబల్ దైవ సందేశహరులతో నమాజ్ చేసి తన ప్రజలవద్దకు వచ్చి నమాజ్ చేయించేవారు. ఓ రోజున ఆయన ఇషా నమాజ్ ప్రవక్త మహనీయులతో పాటుచేసి తన ప్రజల వద్దకు వచ్చి ఇమామత్ (నమాజ్ నాయకత్వం) చెయ్యసాగారు. నమాజ్‌లో బకర సూరా ప్రారంభించారు. ఒక వ్యక్తి మధ్యలోనే సలామ్ చెప్పి (జమాఅత్ నుండి) వేరయి ఒంటరిగా నమాజ్ చేసుకుని ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆ తరువాత జనులు అతనితో, 'అరె, నీవు మునాఫిక్ (కపటివి) అయిపొయ్యావా?' అని నిందించి అడిగారు. అతను దానికి సమాధానంగా, 'కాదు, దైవం సాక్షిగా, నేను ప్రవక్త మహ

(٢٧٤) عَنْ سُهَيْلِ بْنِ الْحَنْظَلِيَّةِ قَالَ مَرَّ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِبَعِيْرٍ قَدْ لَحِقَ ظَهْرُهُ بِبَطْنِهٖ قَالَ اتَّقُوا اللّٰهَ فِيْ هٰذِهِ الْبَهَائِمِ الْمُعْجَمَةِ فَارْكَبُوْهَا صَالِحَةً وَاتْرُكُوْهَا صَالِحَةً۔ (رواہ ابوداؤد مشکوٰۃ۔ باب النفقات)

274. సుహైల్ హన్జల ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి తన దారిలో ఓ ఒంటెను చూశారు. దాని డొక్క వీపు వరకు పీక్కుపోయింది. అప్పుడాయన ఇలా బోధించారు, "ఈ నోరులేని పశువుల విషయంలో అల్లాహ్‌కు భయపడండి. ఇవి స్వారీకి యోగ్యమయి ఉన్న స్థితిలోనే వాటిపై కెక్కి స్వారీ చెయ్యండి. ఇంకా అవి కొంత బలిమి కలిగి ఉన్నప్పుడే వాటిని వదలివేయండి." (అబూదావూద్, మిష్కాత్)

(٢٧٥) عَنْ جَرِيْرِ بْنِ عَبْدِ اللّٰهِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَرْحَمُ اللّٰهُ مَنْ لَا يَرْحَمُ النَّاسَ۔ (متفق علیہ مشکوٰۃ۔ باب الشفقۃ ص ۴۱۳)

275. మహనీయ ముహమ్మద్ (సఅసం) "ఎవరయితే స్వయంగా ఇతర మానవులపై కరుణ చూపరో అలాంటి వారిని అల్లాహ్ సయితం కరుణించడు" అని సెలవిచ్చారని జరీద్ బిన్ అబ్దుల్లాహ్ ఉల్లేఖించారు.(ముత్తఫకున్ అలైహ్)

---

274. పశువులచేత పని చేయించుకుని వాటికి తగినంత విశ్రాంతి, ఆహారం ఇవ్వక పోవడం మహాపాపం. వాటిచేత పనీ చేయించుకోవాలి, తగినంత ఆహారం, విరామం కూడా ఇవ్వాలి. పని చేయించుకుంటూ అవి మృత్యువుకు సమీపమయ్యేలా వ్యవ హరించకూడదు. ఇంకా బలంగా ఉన్నప్పుడే వాటికి విశ్రాంతినిచ్చి తిరిగి పనికివచ్చేలా శక్తిని పుంజుకునే అవకాశమివ్వాలి.

275. ఇలాంటిదే మరో హదీసులో దైవ ప్రవక్త (సఅసం) నేలపై నుండే వారిని కనిక రించండి, నింగిన ఉండేవాడు మిమ్మల్ని కనికరిస్తాడు అని సెలవిచ్చారు. అదే భావాన్ని నకారాత్మకంగా ఈ హదీసులో బోధించడం జరిగింది. నిజమే మరి, కరుణ అంటే ఏమిటో, దయాగుణం దేన్నంటారో తెలియని వ్యక్తి స్వయంగా దయాదాక్షిణ్యాలకు ఎలా అర్హుడవుతాడు.

# 9. సామూహిక సద్గుణాలు

(۲۷۶) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ اَلْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ لَا يَخْذُلُهُ وَلَا يَكْذِبُهُ وَلَا يَظْلِمُهُ
وَإِنَّ أَحَدَكُمْ مِرْآةُ أَخِيْهِ فَإِنْ رَأَى أَذًى فَلْيُمِطْ عَنْهُ۔ (ترمذی، مشکوٰۃ

276. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: ముస్లిమ్ మరొక ముస్లింనకు సోదరుడు. అతన్ని నిస్సహాయుణ్ణిగా వదలివెయ్యరాదు, అతనితో అబద్ధం పలుకరాదు, అతనిపై దౌర్జన్యం జరపరాదు; నిస్సందేహంగా మీరు ఒకరి కొకరు అద్దంతో సమానం, అతనిలో ఏదైనా లోపం చూస్తే దూరం చెయ్యాలి." (తిర్మిజి, మిష్కాత్)

(۲۷۷) عَنْ أَنَسٍ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اُنْصُرْ
أَخَاكَ ظَالِمًا أَوْ مَظْلُومًا فَقَالَ رَجُلٌ أَنْصُرُهُ مَظْلُومًا فَكَيْفَ أَنْصُرُهُ
ظَالِمًا قَالَ تَمْنَعُهُ مِنَ الظُّلْمِ فَذَالِكَ نَصْرُكَ إِيَّاهُ۔ (متفق علیہ۔ مشکوٰۃ
باب الشفقۃ۔ صـ۴۲۳)

---

276. ఒక ఇస్లామీయ సమాజంలో ముస్లిములు ఏ విధంగా మెలగవలసి ఉంటుందో ఈ హదీసు తెలుపుతోంది. ఇందులో ప్రత్యేకంగా ఓ ముస్లిం మరో ముస్లిం ఎడల అద్దంలా వ్యవహరించాలన్న బోధన ఉంది. ఇది ఎంతో అర్థవంతమయిన ఉపమానం. దీని ద్వారా ముస్లిముల పరస్పర సంబంధాలు ఎలా ఉండాలో ద్యోతకమవుతుంది. వాటిని పరిశీలిద్దాము. 1. అద్దం ముఖంలోని మచ్చల్ని కురుపుల్ని ఎన్ని ఎలా ఉన్నాయో అన్నింటినీ అలానే చూపిస్తుంది. వాటిని హెచ్చించి చూపదు, తగ్గించి చూపదు. 2. ఈ మచ్చల్ని కురుపుల్ని సయితం అద్దం మనిషి తన సమక్షంలో ఉన్నప్పుడే తెలుపుతుంది. మనిషి అద్దం ముందు నుండి తొలగగానే అద్దమూ నోరు మెదపదు. 3. మనిషి అద్దంలో తన మచ్చల్ని కురుపుల్ని చూసుకుని చీదరించుకున్నట్లు

284. హజ్రత్ అనస్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చినట్లు తెలిపారు: " 'ఇస్తిఖారా' చేసిన వ్యక్తి నష్టపోడు. ముఖ్య కార్యమేదయినా చేపట్టేముందు సలహా సంప్రతింపులు జరిపే వ్యక్తి పశ్చాత్తాపానికి గురికాడు. ఆదాయ వ్యయాల్లో సంతులనాన్ని పాటించే వ్యక్తి దారిద్ర్యానికి లోనవడు." (అల్ మో'జముస్సగీర్)

(٢٨٥) عَنْ اَسْمَاءَ بِنْتِ يَزِيْدَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ ذَبَّ عَنْ لَحْمِ اَخِيْهِ بِالْمَغِيْبَةِ كَانَ حَقًّا عَلَى اللّٰهِ اَنْ يُّعْتِقَهُ مِنَ النَّارِ ۔ (رواہ البیہقی مشکوٰۃ ۔ باب الشفقۃ ۔ ص ۴۲۴)

285. హజ్రత్ అస్మా బిన్తు యజీద్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా ప్రవచించారు: "ఎవరయితే తన సోదరుని 'మాంసాన్ని' అతను లేనప్పుడు సమర్థిస్తారో వారిని నరకాగ్ని నుండి విముక్తం చెయ్యడం అల్లాహ్‌కు తప్పనిసరవుతుంది." (బైహకీ, మిష్కాత్)

---

ఆచార వ్యవహారాలతో ముడిపడి లేదన్నది స్పష్టమవుతోంది. నీతి నిజాయితీలు కూడా ధర్మంలో ముఖ్య భాగంగా భాసిల్లుతాయి. ఇవి లేకుండా కేవలం పూజాపురస్కారాలకు దైవం దృష్టిలో ఎలాంటి ప్రాముఖ్యం లేదు.

284. 'ఇస్తిఖారా' అన్నది ఏదయినా సందిగ్ధావస్థలో ఉన్నప్పుడు, రెండు సమమయిన మంచి పనుల్లో ఏది చెయ్యాలి, ఏది వదులుకోవాలి అన్న మీమాంస పుట్టినప్పుడు మనస్సును ఏదేని ఒక దానిపై స్థిరపరచుకునేందుకు ప్రవక్త మహనీయులు బోధించిన ఓ విధానం. దీని ప్రకారం చిత్తశుద్ధితో రెండు రకతుల దీక్షాబద్ధమయిన నమాజ్ చేసి దైవాన్ని మేలైనదాన్ని గ్రహించే సద్బుద్ధి కోసం వేడుకోవాలి. అప్పుడు మనస్సు ఏ విషయంపై లగ్నమవుతుందో దాన్ని గ్రహించి ఆచరించాలి. అలా చేసినప్పుడు దైవ సహాయమూ తోడవుతుంది. అందువల్ల హాని కలిగే, విఫలమయ్యే ప్రసక్తే ఉండదు. అలాగే ఓ ముఖ్యకార్యం చెయ్యబోయే ముందు యోగ్యులయిన వారి సలహానర్థిస్తే ఆ కార్యం విజయవంతమయ్యే మార్గాలు గోచరిస్తాయి. సంప్రతించకపోతే, తరువాత పశ్చాత్తాపం కలగవచ్చు. అలాగే ఖర్చుల్లో సంతులనాన్ని పాటించడంలో గల గొప్పదనం వివరించనవసరం లేదు.

285. దివ్య ఖుర్‌ఆన్‌లో పరోక్ష నిందను "మృతసోదరుని మాంసం భుజించడం"తో సమానంగా పోల్చడం జరిగింది. ఈ హదీసులో 'మాంసం' అన్న పదం ఆ భావంలోనే

(۲۸۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ حُسْنُ الظَّنِّ مِنْ حُسْنِ الْعِبَادَةِ۔ (رواه احمد۔ مشکوٰة۔ ص۴۲۱)

286. "మంచిని ఊహించడం, సదభిప్రాయం కలిగి ఉండటం కూడా ఆరాధనలో ఓ భాగం" అని దైవ సందేశహరులు సెలవిచ్చినట్లు హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖించారు. (అహ్మద్, మిష్కాత్)

(۲۸۷) عَنْ عَبْدِ اللّٰهِ قَالَ قَالَ النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذَا کُنْتُمْ ثَلَاثَةً فَلَا یَتَنَاجٰی اِثْنَانِ دُوْنَ الثَّالِثِ فَاِنَّهٗ یُحْزِنُهٗ فِیْ ذَالِكَ وَفِیْ رِوَایَةٍ قُلْنَا فَاِنْ کَانُوْا اَرْبَعَةً قَالَ لَا یَضُرُّهٗ۔ (الادب المفرد۔ باب اذا کانوا اربعة۔ ص۱۶۱)

287. హజ్రత్ అబ్దుల్లా (ర.అ) ఉల్లేఖనం: 'ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం), "ముగ్గురు కలసి ఉన్నప్పుడు మీలో ఇద్దరు మూడవవానికి ఎడంగా వెళ్ళి మాట్లాడుకోకండి. ఎందుకంటే ఇలా చెయ్యడం ఆ మూడవవానికి బాధ కలిగిస్తుంది" అని సెలవియ్యగా (మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది) మేము ఆయన్ని 'నలుగురుంటేనో' అని అడిగాము. దానికి ఆయన "అప్పుడు ఫరవాలేదు" అని పలికారు.' (అల్ అదబుల్ ముఫ్రద్)

---

ప్రయోగించడం జరిగింది. అంటే ఎక్కడయినా తోటి సోదరుని పరోక్షంగా జనులు నిందలు మోపుతున్నప్పుడు విన్నే వారు దాన్ని వారించాలి. ఎవరిపైనయితే ఆ నిందలు మోపడం జరుగుతున్నదో అతన్ని సమర్థించాలి. అంటే అతను ఉంటే తన్నుతాను ఎలా సమర్థించుకునేవాడో ఆ విధంగా నన్నమాట.

286. 'మంచి ఊహ' అన్న పదాన్ని 'అపోహ'కు వ్యతిరేకార్థంలో ప్రయోగించాము. తోటి సోదరుడు చేసిన దాన్ని గురించి పూర్తిగా అర్థం కానప్పుడు దాన్ని గురించి, ఆ సోదరుని గురించి సదభిప్రాయమే కలిగి ఉండాలి. అతను దానికి భిన్నంగా రుజువు కానంతవరకు, అతని పోకడలు దానికి భిన్నంగా కానరానంత వరకు సద్భావమే సరయిన విధానం.

287. అందరితోపాటు కూర్చున్నప్పుడు కొందరు వేరుగా గుసగుసలాడుకోవడం మిగిలిన వారికి బాధ కలిగించడం సహజం. ముఖ్యంగా ముగ్గురే ఉన్నప్పుడు ఇద్దరు ఏదో మాట్లాడుకుంటూ ఉంటే మూడవ వానికి బాధకలగడం అనివార్యం. అందువల్ల ప్రవక్త

280. హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం: "విశ్వాసి ప్రేమ స్వరూపుడు. ఎవరినీ ప్రేమించనివాడు, ఎవరికీ ప్రేమ పాత్రుడుకాని వానిలో మేలన్నది ఏదీ లేదు." (అహ్మద్, మిష్కాత్)

(۲۸۱) عَنْ اَبِىْ قَتَادَةَ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ اَنْظَرَ مُعْسِرًا اَوْ وَضَعَ عَنْهُ اَنْجَاهُ اللّٰهُ مِنْ كُرَبِ يَوْمِ الْقِيَامَةِ ۔ (رواہ مسلم ۔ مشکوٰۃ ۔ ص۲۵۱)

281. అబూకతాద(ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఎవరయితే లేమిలో ఉన్నవానికి వ్యవధినిస్తాడో లేదా అతన్నుండి రావలసిన తన హక్కును క్షమించి వదలుకుంటాడో అతనికి దైవం ప్రళయ దిన యాతననుండి విముక్తిని కలిగిస్తాడు." (ముస్లిం,మిష్కాత్)

(۲۸۲) عَنْ جَابِرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ رَحِمَ اللّٰهُ رَجُلًا سَمْحًا اِذَا بَاعَ وَاِذَا اشْتَرٰى وَاِذَا اقْتَضٰى ۔ (رواہ البخاری مشکوٰۃ باب المساہلہ ۔ ص۲۴۳)

---

280. 'మానవు'ణ్ణి అరబీలో 'ఇన్సాన్' అనంటారు. 'ఉన్స్' అన్న ధాతువు నుంచి ఏర్పడిందే ఈ పదం. 'ఉన్స్' అంటే అనురాగం అని అర్థం. ఆర్ద్రతలేని మనిషి, ప్రేమ భావం, సానుభూతి, అనురాగంలేని మనిషి అసలు మనిషే కాడని ఎవరయినా ఒప్పుకుంటారు. ఒకర్ని ప్రేమించే మనిషినే ఇతరులూ ప్రేమిస్తారు. ప్రేమ, ద్వేషం అన్నవి ఇచ్చిపుచ్చుకునే గుణాలు. ప్రేమిస్తే ప్రేమ జనిస్తుంది. ప్రేమైక స్వరూపునికి ఎల్లెడలా ఆదరం లభిస్తుంది. విరోధులు కూడా ప్రేమిస్తారు!

281. లేమికి గురయిన వ్యక్తి అప్పులు చెయ్యడం సహజం. అలాంటి వ్యక్తి నిజ స్థితిని గమనించి బాగా వ్యవధినివ్వడమయినా, లేదా వీలయితే అతని బకాయిని మన్నించివెయ్యడమయినా ఎంతో శుభప్రదమని, అలా మాఫీ చేసే వ్యక్తి దయార్ద్రత అతన్ని ప్రళయదినాన కఠిన పరిస్థితుల నుండి కాపాడుతుందని ఈ హదీసు బోధిస్తుంది. తన దాసులపై కనికరించే వారిని ప్రభువూ కనికరిస్తాడనడానికి ఇంతకన్నా వేరే నిదర్శనం ఏముంది?

282. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా నుడివారని హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖించారుః "క్రయవిక్రయాల్లోను, అప్పు వసూలు చేసేటప్పుడును నెమ్మదిని, విశాల హృదయతను చూపే వ్యక్తిపై దైవం కరుణ చూపుగాక!" (బుఖారి, మిష్కాత్)

(۲۸۳) عَنْ اَبِیْ سَعِیْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّے اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَلتَّاجِرُ الصَّدُوْقُ الْاَمِیْنُ مَعَ النَّبِیِّیْنَ وَالصِّدِّیْقِیْنَ وَالشُّھَدَاءِ۔ (الترمذی مشکوٰۃ۔ باب المساہلہ۔ ص۲۴۳)

283. అబూ సయీద్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారుః "నిజాయితీపరుడు, నీతిమంతుడు అయిన వ్యాపారి అంతిమ పరిణామం, ప్రవక్త(నబి) లతో, సత్యసంధు (సిద్దీక్)లతో, అమరగతు (షహీద్)లతో పాటు సంభవిస్తుంది." (తిర్మిజి, మిష్కాత్)

(۲۸۴) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّے اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ مَا خَابَ مَنِ اسْتَخَارَ وَلَا نَدِمَ مَنِ اسْتَشَارَ وَلَا عَالَ مَنِ اقْتَصَدَ۔ (المعجم الصغیر۔ ص۲۰۰)

---

282. సాంఘిక జీవితంలో తరచుగా జరిగే ఈ వ్యవహారాలు – ఇచ్చిపుచ్చుకోవడాలు, అప్పులు, క్రయవిక్రయాలు – సౌమ్యంగా, దయార్ద్ర హృదయంతో, సానుభూతి భావనతో జరిగినప్పుడు సమాజం ప్రేమమయమయి అలరారుతుంది. అలాకాక నిక్కచ్చిగా, నియమానుసారం, ఖరాఖండిగా జరిగే వ్యవహారాల్లో పరస్పర ప్రేమానురాగాలు కొరవడతాయి. దూరాలు పెరుగుతాయి. ఇది సామాజిక జీవితానికి గొడ్డలి పెట్టు. ఇస్లాం స్వభావానికి ప్రతిఘాతం.

283. ప్రవక్తలు, ప్రవక్తల్ని ఎలాంటి అరమరికల్లేకుండా విశ్వసించిన సిద్దీకులు (సత్యస్వరూపులు), ప్రవక్తల సందేశ వ్యాప్తిలో అసువులు బాసిన షహీదులు(అమరగతులు) సాధారణంగా ధార్మిక వ్యక్తిత్వాలు. వారితో పాటు అంతిమ పరిణామం లభించడం ధార్మిక ప్రాముఖ్యాన్ని సూచిస్తోంది. అంటే ధర్మం కేవలం కొన్ని ఆరాధనా భావాలతో,

277. హజ్రత్ అనస్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు: ఒకసారి ప్రవక్త మహనీయులు, 'నీ సోదరునికి సహాయపడు అతను పీడించేవాడయినా, పీడితుడయినా' అని పలుకగా ఒక వ్యక్తి, 'దైవ ప్రవక్తా, పీడితుడయిన పక్షంలో నేను అతనికి సహాయపడగలను కాని అతను పీడించేవాడయినట్లయితే అతనికి సహాయపడడమెలా?' అని అడిగాడు. అప్పుడు దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు, "అతన్ని అత్యాచారం చెయ్యకుండా ఆపడమే అతనికి నీవు చేసే సహాయం." (ముత్తఫకున్ అలైహ్)

(۲۷۸) عَنْ اَبِیْ مُوْسٰی عَنِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اَلْمُؤْمِنُ لِلْمُؤْمِنِ کَالْبُنْیَانِ یَشُدُّ بَعْضُہٗ بَعْضًا ثُمَّ شَبَّکَ بَیْنَ اَصَابِعِہٖ۔

(متفق علیہ۔ مشکوٰۃ۔ باب الشفقۃ۔ ص۴۲۲)

---

ఆగ్రహించినట్లు మనం ఎక్కడా వినలేదు. దీనికి బదులు దానికి పరోక్షంగా కృతజ్ఞతలు తెలుపుకుని దాన్ని శుభ్రపరచుకుంటాడు. 4. అద్దం ముఖానికి సమస్థాయిలో ఉన్నప్పుడే మచ్చల్ని సరిగ్గా చూపగలుగుతుంది. ముఖానికన్నా పైకి ఉన్నా క్రిందికి ఉన్నా దానివల్ల ప్రయోజనం చేకూరదు.

ఈ ఉపమానాన్ని కాస్త మన నిజ జీవితంతో అన్వయించుకుని చూద్దాము. 1. మన తోటి సోదరునిలో ఏదయినా లోపమున్నట్లయితే అది వాస్తవంగా ఏ మేరకు ఉందో దాన్ని ఆ మేరకే తెలపాలి. పెంచి లేదా తగ్గించి తెలుపరాదు. 2. లోపాన్ని అతని సమక్షంలోనే, అతనికే తెలుపాలి, ఇతరులకు కాదు. 3. ఒకరు మన లోపాలు తెలిపినప్పుడు చీదరించుకోకుండా, ఆగ్రహించకుండా అతనికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. 4. విమర్శించేవారు సయితం విమర్శించేటప్పుడు తన ఘనతనో, గొప్పదనాన్నో చాటుకోవడమో, లేదా అతని పట్ల ముఖస్తుతికి లోనయి విమర్శలోనూ ఎదుటివాణ్ణి సంతోషపెట్టే ధోరణిని అవలంబించరాదు.

277. 'తప్పయినా ఒప్పయినా నాదేశం, నా జాతి, నా వంశం' అనే ధోరణి అజ్ఞాన కాలపు ధోరణి. దాన్ని ప్రవక్త మహనీయులు (సఅసం) ఈ విధంగా మలిచారు. బాధించేవాడు తమ వాడయితే అతన్ని ఆ అత్యాచారం చెయ్యకుండా నిరోధించడమే అతని పట్ల మన సహాయం అన్నది విప్లవాత్మకమయిన బోధన.

278. హ॥జత్ అబూ మూసా అష్అరి (ర.అ) ఉల్లేఖనం ప్రకారం మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా ఉపదేశించారు: "విశ్వాసికి మరొక విశ్వాసితో గల సంబంధం, కట్టడం లాంటిది. అందులోని ఒకభాగం మరో భాగానికి ఆధారమవుతుంది." అంటూ ఆయన ఉదాహరణగా తన చేతుల వ్రేళ్ళను ఒక దానిలో ఒకటి దూర్చి చూపారు. (ముత్తఫకున్ అలైహి, మిష్కాత్)

(۲۷۹) عَنِ النُّعْمَانِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلْمُؤْمِنُوْنَ كَرَجُلٍ وَّاحِدٍ اِنِ اشْتَكٰى عَيْنُهٗ اِشْتَكٰى كُلُّهٗ، وَاِنِ اشْتَكٰى رَأْسُهٗ اِشْتَكٰى كُلُّهٗ۔ (مشكوٰة۔ باب الشفقة۔ ص۴۲۲)

279. దైవ సందేశహరులు (సఅసం) సెలవిచ్చినట్లు హ॥జత్ నోమాన్ (ర.అ) ఉల్లేఖించారు: "విశ్వాసులందరూ ఒక వ్యక్తి శరీరానికి పోలి ఉన్నారు. అతని కన్ను నొప్పిపెడితే శరీరం మొత్తం వ్యాకులపడుతుంది. తలలో నొప్పి కలిగితే దేహమంతా బాధననుభవిస్తుంది." (మిష్కాత్)

(۲۸۰) عَنْ اَبِىْ هُرَيْرَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَلْمُؤْمِنُ مَالَفٌ وَلَاخَيْرَ فِيْمَنْ لَايَالَفُ وَلَايُوْلَفُ۔ (رواه احمد، مشكوٰة۔ باب الشفقة۔ ص۴۲۵)

---

278. గోడలో ఇటుకలు ఒకదానికొకటి బలాన్ని చేకూర్చుతాయి. కట్టడంలో ఓ గోడ మరో గోడకు, గోడలన్నీ కప్పుకు బలాన్నిస్తాయి. అలాగే ముస్లిం సమాజంలోని సభ్యులందరూ పరస్పర సహాయ సహకారాలతో చేతి వ్రేళ్ళల్లా కలిసిమెలిసి జీవించాలన్నది ఈ హదీసు ప్రబోధం.

279. ముస్లిం సమాజంలోని వ్యక్తులందరూ కలిసి ఒకే శరీరంలా వ్యవహరించాలని, శరీరంలో ఓ భాగానికి బాధ కలిగితే ఎలా శరీరమంతా ఆ పీడనను అనుభవిస్తుందో అదే విధంగా సమాజంలోని ఒక సభ్యుడు కష్టాల్లో ఉన్నట్లయితే మొత్తం సమాజం సహకరించి అతన్ని ఆ బాధ నుండి విముక్తిని కలగజేసేందుకు యత్నించాలన్నది దీని సారాంశం.

(۲۸۸) عَنْ سَعِيْدِ الْمَقْبُرِيِّ قَالَ مَرَرْتُ عَلَى ابْنِ عُمَرَ وَمَعَهُ رَجُلٌ يَتَحَدَّثُ فَقُمْتُ إِلَيْهِمَا فَلَطَمَ فِي صَدْرِي فَقَالَ إِذَا وَجَدْتَ اثْنَيْنِ يَتَحَدَّثَانِ فَلَا تَقُمْ مَعَهُمَا وَلَا تَجْلِسْ مَعَهُمَا حَتَّى تَسْتَأْذِنَهُمَا فَقُلْتُ أَصْلَحَكَ اللهُ يَا أَبَا عَبْدِ الرَّحْمٰنِ إِنَّمَا رَجَوْتُ أَنْ أَسْمَعَ مِنْكُمَا خَيْرًا۔

(الادب المفرد، باب اذا رای قوما یتناجون فلا یدخل علیهم۔ ط۱۶۱)

288. సయీద్ మక్బరి ఇలా ఉల్లేఖిస్తున్నారుః "ఒకసారి నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ దగ్గరకు వెళ్ళాను. అప్పుడు ఆయనతో ఒక వ్యక్తి మాట్లాడుతూ ఉన్నాడు. నేను వాళ్ళవద్దకు వెళ్ళి నిల్చున్నాను. ఆయన నా రొమ్ముపై చేత్తో కొట్టి, "నీవు ఇద్దరు మాట్లాడుతూ ఉండగా చూస్తే వాళ్ళ వద్దకు వెళ్ళి నిల్చోనూరాదు, కూర్చోనూరాదు. వారి వద్ద అనుమతి పొందనంతవరకు వారికి దూరంగానే మసలుకోవాలి." దానికి నేను, 'అబూ అబ్దుర్రహ్మాన్, దైవం నీకు మేలు చేకూర్చుగాక, మీరిద్దరి దగ్గర ఏదయినా మంచి మాట వినవచ్చునని ఆశించానే తప్ప మరే ఉద్దేశ్యం లేదయ్యా' అన్నాను."

(అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۸۹) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ إِذَا تَنَخَّعَ بَيْنَ يَدَيِ الْقَوْمِ فَلْيُوَارِ بِكَفَّيْهِ حَتَّى تَقَعَ نُخَاعَتُهُ إِلَى الْأَرْضِ وَإِذَا صَامَ فَلْيَدَّهِنْ لَا يُرَى عَلَيْهِ أَثَرُ الصَّوْمِ۔ (الادب المفرد۔ باب اذا تنخع وہو مع القوم ط۸۹)

---

మహనీయులు (సఅసం) సత్సమాజ రూపకల్పనలో చిన్న చిన్న విషయాలను పయితం పాటించవలసినదిగా తన అనుయాయులకు బోధించారు.

288. నలుగురితో మసలుకునే విధానాలు, సభలో సంస్కారవంతంగా వ్యవహరించే తీరును ప్రవక్త మహనీయులు తన అనుయాయులకు అతి సూక్ష్మంగ, అత్యంత క్షుణ్ణంగా బోధించారు. ఆ బోధనే ఈ విధంగా అబ్దుల్లా బిన్ ఉమర్ మాటల్లో ప్రతిఫలించింది. అదే విధంగా ప్రవక్త సహచరులు కదా ఏదయినా మంచిమాట బోధిస్తున్నారేమో తెలుసుకుందాము అన్న జిజ్ఞాస కారణంగా సయీద్ మక్బరిగారు ఆయన దగ్గరికి వెళ్ళారు.

289. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఇలా బోధించారు, "సభలో (అందరి మధ్య) ముక్కు చీదవలసివస్తే రెండు అరచేతుల్ని అడ్డంగా పెట్టుకుని చీముడు నేలపై పడేవరకు ముక్కు చీది పరిశుభ్రపరచుకోవాలి. ఉపవాస వ్రతం పాటించే వారు తలకు నూనె రాసుకోవాలి తద్వారా రోజా ప్రభావం కానరాదు." (అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۹۰) عَنْ جَابِرٍ قَالَ يَسْتَأْذِنُ الرَّجُلُ عَلٰى وَلَدِهٖ وَاُمِّهٖ وَاِنْ كَانَتْ عَجُوْزًا وَاَخِيْهِ وَاُخْتِهٖ وَاَبِيْهِ - (الادب المفرد - باب يستاذن على ابيه و ولده، ص۱۵۵)

290. హజ్రత్ జాబిర్ (ర.అ) బిన్ అబ్దుల్లా ఓ ఉల్లేఖనంలో ఇలా పలికారు, "మనిషి తనసంతానం, వృద్ధురాలైన తల్లి, సోదరుడు, సోదరి, తండ్రి- వీరందరి వద్దకు (గదుల్లోకి) అనుమతిపొందే ప్రవేశించాలి."(అల్ అదబుల్ ముఫ్రద్)

(۲۹۱) عَنْ اَبِىْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلْمَرْءُ عَلٰى دِيْنِ خَلِيْلِهٖ فَلْيَنْظُرْ اَحَدُكُمْ مَنْ يُّخَالِلُ - (مسند احمد مشكوٰة باب الحب - ص۲۱۹)

291. అబూహురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "మనిషి తన మిత్రుని ధర్మాన్ని (జీవిత విధానాలను) అనుకరిస్తాడు. ఎలాంటి వారితో మైత్రి చేస్తున్నావో ముందుగానే గమనించి మరీ మైత్రి చెయ్యాలి." (ముస్నద్ అహ్మద్, మిష్కాత్)

---

289. ముక్కును పరిశుభ్రపరచుకోవడంలో తుంపరలు వ్యాపించకుండా చేతులు అడ్డం పెట్టుకోవడం కూడా నేర్పడం నేటి నాగరిక ప్రపంచంలో మనకు విడ్డూరమనిపించవచ్చు. కాని నేడు కూడా రోడ్లపై సభలూ సమావేశాల్లో అసహ్యంగా ప్రవర్తించేవారిని చూస్తే ప్రవక్త తన సహచరులకు అతి చిన్న విషయాన్నీ నేర్పడం సమంజసమే అనిపిస్తుంది.

290. ఇదీ సంస్కారవంతుల లక్షణాల్లో ఒకటి. ఎవరి గదిలోనయినా సరే వారికి తాను వస్తున్నట్లు తెలుపకుండా, వారి అనుమతి లభించనిదే దూరి వెళ్ళడం ఇందులో వారించబడింది.

(۲۹۲) عَنِ الْمِقْدَامِ بْنِ مَعْدِ يْكَرِبَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ إِذَا أَحَبَّ الرَّجُلُ أَخَاهُ فَلْيُخْبِرْهُ أَنَّهُ يُحِبُّهُ۔ (رواہ ابو داؤد مشکوٰۃ
باب الحب ۔ صـ ۴۱۸)

292. మిక్దామ్ బిన్ మాదీ కరబ్ (ర.అ) ఉల్లేఖించిన దాని ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఒకవ్యక్తి తోటి సోదరుని ప్రేమిస్తున్నట్లయితే తాను అతన్ని ప్రేమిస్తున్న విషయాన్ని అతనికి తెలుపాలి."
(అబూ దావూద్, మిష్కాత్)

(۲۹۳) عَنْ أَبِي سَعِيْدٍ أَنَّهُ سَمِعَ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
يَقُوْلُ لَا تُصَاحِبْ إِلَّا مُؤْمِنًا وَلَا يَأْكُلْ طَعَامَكَ إِلَّا تَقِيٌّ۔ (رواہ الترمذی۔
مشکوٰۃ۔ باب الحب۔ صـ ۲۱۸)

293. అబూ సయీద్ (ర.అ) ఒక ఉల్లేఖనంలో, తాను ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రబోధిస్తూ ఉండగా విన్నానని చెప్పారు: "కేవలం విశ్వాసులతోనే సహచర్యం, స్నేహం చెయ్యండి. మీ భోజనాసనాలపై కేవలం ధర్మ నిష్ఠగలవారే భోంచెయ్యాలి."
(తిర్మిజి, మిష్కాత్)

---

291. మనిషి ఎవరి మధ్యన సహవాసం చేస్తాడో, ఎవరి సహచర్యంలో అధికంగా కాలం గడుపుతాడో వారి పోకడలు అబ్బే అవకాశం ఎంతో ఉంటుంది. అందువల్ల సద్గుణవంతుల సహవాసంలో, సంస్కారవంతుల సహచర్యంలో గడపడం మంచిది.

292. సమాజంలో కలిసిమెలిసి జీవిస్తున్నప్పుడు కొందరి మధ్య విభిన్న కారణాల వల్ల ప్రేమానురాగాలు జనించడం సహజం. ఇది మానసికమయినదయినా దాన్ని ఎదుటి వ్యక్తి సమక్షంలో వ్యక్తం చెయ్యడం మూలాన ఇద్దరి మధ్య వాతావరణంలో మరింత సాన్నిహిత్యం చోటు చేసుకుంటుంది. మొహమాటపు విధానాలు దూరమయి స్వేచ్ఛ, ప్రేమపూరితమయిన వాతావరణం ఏర్పడుతుంది.

293. పై హదీసులో మాదిరిగానే, విశ్వాసులతో సహవాసం, స్నేహ సంబంధాలు మనిషి విశ్వాసంలో పెరుగుదలకు అవకాశం కల్పిస్తాయి. విశ్వాసులు కాని వారిలో సంస్కారవంతులు, సహృదాభావం గల వారితో కూడా స్నేహం చెయ్యరాదని దీని

(۲۹۴) عَنْ اَبِیْ مُوْسٰی قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ مَثَلُ الْجَلِیْسِ الصَّالِحِ وَالسَّوْءِ کَحَامِلِ الْمِسْکِ وَنَافِخِ الْکِیْرِ فَحَامِلُ الْمِسْکِ اِمَّا اَنْ یُّحْذِیَکَ وَاِمَّا اَنْ تَبْتَاعَ مِنْہُ وَاِمَّا اَنْ تَجِدَ مِنْہُ رِیْحًا طَیِّبَۃً وَنَافِخُ الْکِیْرِ اِمَّا اَنْ یُّحَرِّقَ ثِیَابَکَ وَاِمَّا اَنْ تَجِدَ رِیْحًا خَبِیْثَۃً

(متفق علیہ۔ مشکوٰۃ۔ باب الحب۔ ص ۴۱۸)

294. హజ్రత్ అబూ మూసా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "సద్వర్తనుడు లేక దుర్వర్తనుడయిన మిత్రుని ఉపమానం కస్తూరి మోసేవాడు లేదా కమ్మరి కొలిమి ఊదేవాడులాంటిది. కస్తూరి వాడు మీకు ఏదయినా ఇవ్వగలడు లేదా మీరే అతని వద్ద ఏదయినా కొనుక్కోగలరు లేదా కనీసం అతని వద్దసుగంధమయినా ఆఘ్రాణించగలరు. కాని కొలిమి ఊదేవాడు మీ బట్టలనయినా కాల్చివేస్తాడు, లేదా మీరు భరింపరాని దుర్గంధాన్ని చవిచూస్తారు." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

(۲۹۵) عَنْ اَسْلَمَ عَنْ عُمَرَ قَالَ لَا یَکُنْ حُبُّکَ کَلَفًا وَلَا بُغْضُکَ تَلَفًا فَقُلْتُ کَیْفَ ذَالِکَ قَالَ اِذَا اَحْبَبْتَ کَلِفْتَ کَلَفَ الصَّبِیِّ وَاِذَا اَبْغَضْتَ اَحْبَبْتَ لِصَاحِبِکَ التَّلَفَ۔ (الادب المفرد۔ ص ۱۹۱)

---

అర్థం కాదు. సన్నిహిత సంబంధాలు, అంతరంగిక మైత్రీ సంబంధాలు కేవలం విశ్వసనీయ గుణశీలురతోనే పెట్టుకోవాలి అన్నదే దీని సారాంశం. అలాగే ధర్మ నిష్ఠగల వారు ఇంట్లో భోంచేసినప్పుడు వారి రాకపోకవల్ల ఇంటిలోని వారికి వారి సద్గుణాలు అబ్బే అవకాశం ఉంటుంది. వారి దుఆ వల్ల ఇంటిలో శుభాలు, దైవ కారుణ్యం అవతరిస్తాయి. అందువల్ల ధర్మపరాయణులకు భోజనం చేయించడం శుభకరం, పుణ్యప్రదం.

294. ఈ హదీసులో పై హదీసుల్లోని భావాన్ని ఉపమాన శైలిలో వివరించడం జరిగింది. మంచి వాడి స్నేహం వల్ల కనీసం మరే ప్రయోజనం ఒనగూడకపోయినా అతని మంచి గుణాలు నేర్చుకునే అవకాశమన్నా ఉంటుంది. అలాగే చెడ్డవాని

295. హజ్రత్ ఉమర్ (ర.అ) ఇలా బోధించారని అస్లమ్ ఉల్లేఖించారు: "నీ ప్రేమ ఉన్మాద స్థాయికి చేరుకోరాదు, నీ శత్రుత్వం హానికరంగా మారరాదు." దానికి నేను (అస్లం) "అదెలా?" అని అడగ్గా ఆయన తిరిగి ఇలా బోధించారు: "ఎలాగంటే నీవు ప్రేమించినప్పుడు చిన్న పిల్లల్లా వ్యవహరించ మొదలెట్టడం, లేదా ఎవరినయినా ద్వేషిస్తే అతని ధన ప్రాణాలను సయితం నాశనం చెయ్యాలని కోరుకోవడం." (అల్ అదబుల్ ముఫ్రద్)

(٢٩٦) عَنْ عُبَيْدِ الْكِنْدِيِّ قَالَ سَمِعْتُ عَلِيًّا يَقُوْلُ اَحْبِبْ حَبِيْبَكَ
هَوْنًا مَّا عَسٰى اَنْ يَّكُوْنَ بَغِيْضَكَ يَوْمًا مَّا وَاَبْغِضْ بَغِيْضَكَ هَوْنًا مَّا عَسٰى
اَنْ يَّكُوْنَ حَبِيْبَكَ يَوْمًا مَّا۔ (الادب المفرد۔ باب احبب حبیبک ص۱۹۱)

296. 'ఉబైద్ కిన్దీ', తాను హజ్రత్ అలీ (ర.అ) ఇలా బోధిస్తూ ఉండగా విన్నట్లు ఉల్లేఖించారు: "నీ మిత్రునితో మైత్రీ వ్యవహారంలో కాస్త నెమ్మది (మధ్యస్థ మార్గం) అవలంబించు, అతను ఎప్పుడయినా నీ శత్రువుగా మారవచ్చు. అలాగే శత్రువు పట్ల శత్రుత్వంలోనూ నెమ్మది (సంతులనాన్ని)పాటించు అతను ఎప్పుడయినా నీ మిత్రుడుగా మారవచ్చు."

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

సహచర్యంలో మరే నష్టం జరగకపోయినా మనకు తెలియకుండానే వారిలోని చెడు గుణాలు అబ్బే ప్రమాదం ఉంటుంది.

295. ప్రేమ గుడ్డిది, ప్రేమలో పిచ్చివాడయ్యాడు, అన్న మాటలు మనం వింటూ ఉన్నాము. కాని ప్రపంచంలో బాధ్యతాయుతమయిన జీవితం గడపవలసిన స్త్రీ పురుషులు స్నేహాన్ని ఇలా పిచ్చి ప్రేమగానో, గుడ్డి ప్రేమగానో మలచుకోవడానికి సమ్మతించరు. పిచ్చివాడి చేష్టలు పిల్లవాని చేష్టలనే పోలి ఉంటాయని హజ్రత్ ఉమర్ వివరణలో చెప్పారు. అలాగే శత్రుత్వం అన్నది పుడితే అది విద్వేషం, కక్ష, కార్పణ్యాలను సృజించి విరోధికి ప్రాణ హాని, ధన నష్టం కలిగించేలా చేస్తుంది. ఇలాంటి వార్తలు మనం వింటూనూ ఉంటాము, మన చుట్టు ప్రక్కల్లో చూస్తూనూ ఉంటాము. తన చేష్టలన్నింటికీ ఓ రోజున సమాధానం చెప్పుకోవలసి ఉందని, వాటికి ఫలితాలను అనుభవించవలసి వుందని నమ్మే ఏ వ్యక్తి కూడా ఇలాంటి హానికరమైన విధానాలకు పాల్పడడు. అదే హజ్రత్ ఉమర్ బోధనాసారం.

(٢٩٧) عَنْ اَنَسٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لِاِمْرَأَةٍ عَجُوْزٍ اِنَّهٗ لَا تَدْخُلُ الْجَنَّةَ عَجُوْزٌ فَقَالَتْ مَا لَهُنَّ وَكَانَتْ تَقْرَءُ الْقُرْاٰنَ فَقَالَ لَهَا اَمَا تَقْرَئِيْنَ الْقُرْاٰنَ اِنَّا اَنْشَاْنَاهُنَّ اِنْشَاءً فَجَعَلْنَاهُنَّ اَبْكَارًا عُرُبًا اَتْرَابًا۔ (مشکوٰۃ۔ باب المزاح۔ ص٤١٦)

297. హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి ఓ వృద్ధ మహిళతో, 'వృద్ధ మహిళలు స్వర్గంలో ప్రవేశించలేరు' అని అన్నారు. ఆవిడ 'వృద్ధ మహిళలు చేసిన పాపమేమిటీ?' అని అడిగింది. ఈ మహిళ ఖుర్ఆన్ పారాయణం చేసేది. ఆయన ఆవిడతో, "నీవు ఖుర్ఆన్‌లో ఇది చదవలేదా? 'మేము వారిని మళ్ళీ పుట్టిస్తాము. అప్పుడు వారు నవయువతులుగా ఉంటారు, సమ వయస్కురాళ్ళయి ఉంటారు, తమ భర్తల ప్రేమ పుష్కలంగా నిండిన గుండెలతో వారు అలరారుతారు." (మిష్కాత్)

---

296. హజ్రత్ అలీ బోధనలోనూ మైత్రీ శత్రుత్వాలలో ఓ విశ్వాసి - దైవ విశ్వాసి, పరలోక విశ్వాసి అనుసరించవలసిన విధానం - మధ్యస్థ విధానం - సూచించడం జరిగింది. అయితే దానికి బాహ్యమైన ఓ హేతువు కూడా హజ్రత్ అలీ చూపారు. ఏదో చిన్న కారణాలవల్ల మిత్రులు శత్రువులవడం, శత్రువులు మిత్రులవడం మన దైనందిన అనుభవమే. అందువల్ల దీన్ని దృష్టిలో ఉంచుకుని మైత్రీ వ్యవహారంలోనైనా, శత్రుత్వపు తీరుతెన్నుల్లోనయినా సంతులనాన్ని మధ్యస్థ విధానాన్ని అవలంబించడం ఉభయత్రా శ్రేయస్కరమని బోధించారు.

పై రెండు ప్రవచనాలు ప్రవక్త మహనీయులు (సఅసం) నుడివినవి కాకపోయినను ఆయన శిక్షణలో రాటుదేలిన ఇద్దరు మహనీయుల సూక్తులు గనక ఆ మూల వెలుగుకు ప్రతిరూపాలే అన్న భావంతో హదీసు పుస్తకాల్లో చేర్చబడ్డాయి. అయితే ఉల్లేఖకులు, ప్రోక్తలు స్పష్టంగా మనకు దర్శనమిస్తారు. ఈ విషయంలో ఎలాంటి సందేహాస్పద వచనమూ కానరాదు.

297. దైవ సందేశహరులు(సఅసం) శుష్కముఖంతో నవ్వు సయితం తొణికిసలాడని వదనంతో దర్శనమిచ్చే వారు కారు. ఎన్ని పనుల భారమున్నా, ఎంతగా దైవధర్మ వ్యాప్తి కార్యక్రమాల్లో నిమగ్నులయి ఉన్నా, ఎంతగా దైవధ్యానంలో, పరలోక చింత నలో మునిగి ఉన్నా ఆయన అప్పుడప్పుడు సత్య దూరం కాని విధంగా తన తోటి

(۲۹۸) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَخَذَ النَّبِیُّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ بِیَدِ الْحَسَنِ اَوِالْحُسَیْنِ ثُمَّ وَضَعَ قَدَمَیْهِ عَلٰی قَدَمَیْهِ ثُمَّ قَالَ تَرَقَّ- (الادب المفرد- باب المزاح مع الصبی- ص۱۴۲)

298. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ఒకసారి ప్రవక్త మహనీయులు (సఅసం) హజ్రత్ హసన్ లేక హజ్రత్ హుసైన్ (ర.అ) (ఇద్దరిలో ఎవరో ఒకరి) పాదాలను తన పాదాలపై పెట్టి "అబ్బాయీ, ఎక్కాయ్" అని అన్నారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

---

వారితో హాస్యాలాడేవారు. ఈ వృద్ధ మహిళ కూడా అలా పరిచితురాలయిన మహిళ. అందువల్ల అలా పరాచికాలాడారు. ముసలవ్వలకు స్వర్గ ప్రవేశం లభించని మాట ఓ విధంగా అబద్ధం కాదు. కాని ఆ నిజం ముసలవ్వకు కాస్త తికమక పెట్టింది. కారణం విని ఆవిడ ఆనందభరితురాలయి ఉంటుంది. స్వర్గవాసులందరూ నవ యొవ్వన వసంతంతో నవనవలాడుతూ శాశ్వత సుఖాలను, దైవ ప్రసాదిత వరాలను అనుభవిస్తారన్నది ఖురాన్ హదీసుల ద్వారా తెలిసే సత్యం.

298. పై హదీసుల్లో దైవ సందేశహరులు ముసలి వారితో హాస్యమాడినట్లే ఈ హదీసులో పసివారితో ఆడుకున్న సంఘటనను ఉటంకించడం జరిగింది. పిల్లలతో ఆడుకోవడం, వారితో ఆనందంగా కాస్సేపు గడపడం భయభక్తుల, నిష్ఠాగరిష్ఠ, ధార్మిక మార్గానికి పొసగని విషయమేమీ కాదు. మనిషి ప్రపంచంలో సహజంగా చెయ్యవలసిన, చెయ్యదగిన పనులూ, పాల్గొనవలసిన కార్యకలాపాలూ అన్నింటినీ సంతులనంతో దైవధర్మానికి లోబడి ఆచరించడమే ధర్మానుసరణ. అదే ఇస్లామీయ జీవన విధానంలోని ప్రత్యేకత. అది మనిషిని అటు పూర్తిగా ప్రపంచంలో మునిగి తేలియాడనివ్వదు, ఇటు ప్రపంచాన్ని త్యజించి ధ్యాన, జ్ఞాన మార్గాన అడవుల్లో కొండల్లో, మఠాల్లో, ఆరాధనాలయాల్లో వెళ్ళి కూర్చోమని కూడా చెప్పదు. ఆధ్యాత్మికత, భౌతికతల మధ్య సామంజస్యాన్ని సామరస్యాన్ని సంతులనాన్ని పాటించమంటుంది.



# 10. సామాజిక దౌష్ట్యాలు

(۲۹۹) عَنْ سَهْلٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

مَنْ يَّضْمَنْ لِّيْ مَا بَيْنَ لِحْيَيْهِ وَمَا بَيْنَ رِجْلَيْهِ اَضْمَنْ لَهُ الْجَنَّةَ۔ (بخاری مشکوٰة۔ ص۴۱۳)

299. హజ్రత్ సహల్ (ర.అ) ఉల్లేఖించిన దాని ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: నాకు ఎవరైనా తన మాట, శీలం (రెండు విషయా)ల గ్యారంటి ఇచ్చినట్లయితే నేను వారికి స్వర్గప్రాప్తిని గురించి గ్యారంటి ఇస్తాను. (బుఖారి, మిష్కాత్)

(۳۰۰) عَنْ اَبِىْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

كَفٰى بِالْمَرْءِ كَذِبًا اَنْ يُّحَدِّثَ بِكُلِّ مَا سَمِعَ۔ (رواه مسلم مشکوٰة۔ باب الاعتصام۔ ص۲۰)

300. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం! దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు, మనిషి అబద్ధం పలికేవాడు అనడానికి అతను విన్నదివిన్నట్లుగానే (విచారణ జరపకుండా) చెప్పివెయ్యడం చాలు. (ముస్లిం, మిష్కాత్)

---

299. హదీసులో రెండు దవడల మధ్యనున్న దాన్ని గురించి, రెండు తొడల మధ్యనున్న దాన్ని గురించి, అంటే నోరు, మర్మాంగం గురించి గ్యారంటీ కోరారు ప్రవక్త మహనీయులు. నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందన్నది నానుడి. మనిషి సృష్టించే అనేకానేక ఇబ్బందులకు కారణం అతను మాట్లాడే మాటలే అన్నది ఎవరూ కాదనలేని సత్యం. అలాగే ప్రపంచంలో జరిగే చెడుగులకు మూలం అధికాంశం శీలమే అన్నది కూడా నిర్వివాదాంశం. అందువల్లనే దైవ సందేశహరులు ఈ రెంటి గ్యారంటీని కోరారు.

300. విన్నది ఎంతవరకు నిజం, ఒక పక్షంగా ఓ మాట విన్నాం, మరో పక్షంగా మరో మాటను వినాలిగా అన్న విచక్షణతో మాట్లాడకుండా విన్నది విన్నట్టుగానే ఇతరులకు చెప్పినట్లయితే అది అబద్ధపు మాట అయిన పక్షంలో అలాంటి వ్యక్తి అబద్ధాన్ని

(٣٠١) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ اِنَّ الشَّيْطَانَ لَيَتَمَثَّلُ فِيْ صُوْرَةِ الرَّجُلِ فَيَأْتِي الْقَوْمَ فَيُحَدِّثُهُمْ بِالْحَدِيْثِ مِنَ الْكَذِبِ فَيَتَفَرَّقُوْنَ فَيَقُوْلُ الرَّجُلُ مِنْهُمْ سَمِعْتُ رَجُلًا اَعْرِفُ وَجْهَهٗ وَلَا اَدْرِيْ مَا اِسْمُهٗ يُحَدِّثُ ـ (مسلم مشکوٰۃ ـ ص ۴۱۴)

301. అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు: షైతాన్ మానవాకారంలో జనం వద్దకు వెడతాడు, వారికి అబద్ధపు పుకార్లు వినిపిస్తాడు, జనం చెదిరిపోయిన తరువాత వారిలో ఒకడు, 'నేను ఓ వ్యక్తి ఇలా చెప్పడం విన్నాను. అతను ఎలా ఉంటాడో చెప్పగలనుగాని అతని పేరేమిటో తెలీదు' అనంటాడు.

(٣٠٢) عَنْ عَائِشَةَ قَالَتْ قُلْتُ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حَسْبُكَ مِنْ صَفِيَّةَ كَذَا وَكَذَا تَعْنِيْ قَصِيْرَةً فَقَالَ لَقَدْ قُلْتِ كَلِمَةً لَوْ مُزِجَ بِهَا الْبَحْرُ لَمَزَجَتْهُ ـ (ترمذی ـ مشکوٰۃ ـ ص ۴۱۴)

302. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం: 'నేనొకసారి ప్రవక్త మహనీయులు (సఅసం)తో ఇలా అన్నాను, సఫియా ఆ విధంగా, ఈ విధంగా ఉండటం అంటే పొట్టిగా ఉండటం చాలదా మీకు? దానికి ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, 'నీవు పలికిన మాట ఎంత తీవ్రమయిందంటే దాన్ని సముద్రంలో కలిపివేసినా అది దాన్ని కలుషితం చేసివేస్తుంది!'

(తిర్మిజీ)

---

వ్యాపింపజేసిన వాడవుతాడు. అందుకే విన్న మాటలోని మంచీ చెడ్డలు విచారించి మరీ చెప్పాలన్నది ఈ బోధన.

301. అంటే షైతానే అలా మారువేషంలో రానవసరం లేదు. ఆ విధంగా పుకార్లను నిజానిజాలు తెలుసుకోకుండా వ్యాపింపజెయ్యడం, అలా ఎవరో ముక్కూ మొహం తెలీని వారు చెప్పింది నమ్మేయడం, రెండూ షైతాన్ పనులని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

(۳۰۳) عَنْ عَائِشَةَ اَنَّ رَجُلًا اِسْتَاْذَنَ عَلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ سَلَّمَ فَقَالَ ائْذَنُوْا لَهٗ بِئْسَ اَخُو الْعَشِيْرَةِ فَلَمَّا جَلَسَ تَطَلَّقَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْ وَجْهِهٖ وَانْبَسَطَ اِلَيْهِ فَلَمَّا انْطَلَقَ الرَّجُلُ قَالَتْ عَائِشَةُ يَا رَسُوْلَ اللّٰهِ قُلْتَ لَهٗ كَذَا وَكَذَا ثُمَّ تَطَلَّقْتَ فِيْ وَجْهِهٖ وَانْبَسَطْتَ اِلَيْهِ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَتٰى عَاهَدْتِنِيْ فَحَّاشًا، اِنَّ شَرَّ النَّاسِ مَنْزِلَةً يَوْمَ الْقِيٰمَةِ مَنْ يَتْرُكُهُ النَّاسُ اِتِّقَاءَ شَرِّهٖ اَوِاتِّقَاءَ فُحْشِهٖ

(بخاری۔ مشکوٰۃ ۔ ص۴۱۲)

303. హజ్రత్ ఆయిషా ఓ ఉల్లేఖనంలో ఇలా పలికారు, 'ఓ వ్యక్తి ఆయన (సఅసం) సన్నిధిలో హాజరయ్యేందుకు అనుమతి కోరాడు. ఆయన తన ఇంటివారితో, 'అతన్ని లోనికి రానివ్వండి, ఇతను తన తెగ ప్రజల్లో అతి దుష్టమయినవాడు' అని అన్నారు. ఆ తరువాత అతను ఆయన సమక్షంలోకి వచ్చి కూర్చున్నప్పుడు నగుమోముతో సంభాషించారు. ఆ వ్యక్తి వెళ్ళిపోయిన తరువాత హజ్రత్ ఆయిషా, 'దైవ ప్రవక్తా, మీరు ఆ వ్యక్తిని గురించి ముందరయితే అలా అన్నారే, కాని తరువాత అతను కలిసినప్పుడు నవ్వి పలకరించారు?' అని అడిగారు. దానికి ఆయన, 'నేను దుర్భాషలాడగా నీవెప్పుడు చూశావ్?' అని తిప్పి అడిగి, ఇంకా ఇలా అన్నారు, 'ఎవరి దుర్భాష కారణంగా, దౌష్ట్యం కారణంగా జనులు అతనితో తప్పుకు తిరుగుతారో అతనే ప్రళయ దినాన అత్యంత దుష్టుడైన వ్యక్తి.' (బుఖారి, ముస్లిం)

---

302. ఈ హదీసులోని కొన్ని విషయాలు తెలుసుకుందాము:

1. హజ్రత్ సఫియా, హజ్రత్ ఆయిషాకు సవతి. అంటే ప్రవక్త మహనీయుల సతీమణి.

2. హజ్రత్ సఫియా పొట్టిగా ఉండటాన్ని ఎత్తిపొడుస్తూ హజ్రత్ ఆయిషా, 'ఆవిడ పొట్టిగా ఉండటం చాలదా మీకు. ఆవిడ లోపభూయిష్టమయిందనడానికి' అని ప్రవక్త (సఅసం)ను హజ్రత్ సఫియాకు ప్రతికూలంగా పురికొలిపారు.

3. సవతుల మధ్య పరస్పర ఈర్ష్యా ద్వేషాల వ్యవహారం ప్రకృతి సహజమయింది. స్త్రీ దైవధర్మ నిష్ఠా శిఖరాలపై ఉన్నప్పటికీ ఈ సహజ గుణాన్నుంచి పూర్తిగా

(۳۰۴) عَنْ اَبِیْ قَتَادَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
اِیَّاکُمْ وَکَثْرَۃَ الْحَلْفِ فِی الْبَیْعِ فَاِنَّہٗ یُنَفِّقُ ثُمَّ یَمْحَقُ۔ (رواہ مسلم۔
باب المسامحۃ فی المعاملہ۔ ص۲۴۳)

304. హజ్రత్ అబూ కతాద (ర.అ) ఉల్లేఖనం ప్రకారం మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా సెలవిచ్చారు. "క్రయ విక్రయాల్లో అధికంగా ప్రమాణం చెయ్యడాన్ని మానుకోండి. ఎందువల్లనంటే ఈ ప్రమాణం తొలుత వ్యాపారాన్ని వృద్ధి చేస్తుంది. ఆ తరువాత శుభాన్ని రూపుమాపుతుంది." (ముస్లిం)

---

తప్పించుకోజాలదు. ఈ గుణాన్ని పూర్తిగా అంతమొందించడం సాధ్యం కాదు. అయితే ఈ గుణాల వెగటును బోధనా శిక్షణల ద్వారా అథమ స్థాయికి తీసుకుపోవడం సాధ్యమే. ఈ కారణంగానే ప్రవక్త మహనీయులు (సఅసం) తత్కాలమే హెచ్చరించి సంస్కరించారు.

4. తన భార్యాపిల్లలకు సకాలంలో ధార్మిక నైతిక శిక్షణ గరపడం భర్తపై విధించబడిన మహత్తరమైన బాధ్యత. ఈ విషయంలో ఒక్క క్షణం కూడా ఏమరుపాటు వహించరాదు.

5. మాటలాడేటప్పుడు వారు అతి జాగ్రత్తగా ఏప్పాలి. ఒక్కొక్క మాట చూడటానికి అతి స్వల్పమయిందిగా అగుపించినా ఎన్నో ఉపద్రవాలకు కారణభూతమవవచ్చు, ఇహపరలోకాల్లో అత్యంత భయంకర విషమ ఫలితాలను తీసుకురావచ్చు. ముఖ్యంగా మహిళలు తమ సంభాషణల్లో అజాగ్రత్తగా వ్యవహరిస్తారు. పరోక్షనింద, చాడీలు, దుర్భాష, ఇత్యాది విషయాలు మనస్సును ఆక్రమించుకున్నప్పుడు మత్తుగొన్న వారిలా వ్యవహరించి తన వారూ పరాయివారూ అన్న విచక్షణ లేకుండా అందరూ ఆ ధాటికి గురికావలసి వస్తుంది.

303. ఈ హదీసులో ప్రస్తావించబడిన వ్యక్తి కల్లోల జనకుడు గనకనే ప్రవక్త మహనీయులు అతని దౌష్ట్యం నుంచి అందరినీ రక్షించడానికి అతను లేనప్పుడు అతని అసలు రూపాన్ని ఇతరుల ముందుంచారు. ఇలా చెయ్యడం ప్రజల మేలు దృష్ట్యా సమంజసమే. మరో విషయం ఏమిటంటే, పరస్పరం పలకరించుకునేటప్పుడు నగుమోములో, సంతోషం వ్యక్తం చేస్తూ పలకరించుకోవాలి. చీదరించుకోవడం, చిటపటలాడటం, దుర్భాషలాడటం, అల్లాహ్‌కు సుతరామూ ఇష్టంలేదు. కుసంస్కారం ప్రపంచంలోనూ నష్టదాయకమే పరలోకంలోనయితే చెప్పనక్కరలేదు.

(۳۰۵) عَنْ عَائِشَةَ قَالَتْ مَرَّ رَجُلٌ مُصَابٌ عَلَى نِسْوَةٍ فَتَضَاحَكْنَ
بِهٖ يَسْخَرْنَ فَأُصِيبَ بَعْضُهُنَّ ۔ (الادب المفرد۔ باب الجزیہ ص۱۲۹)

305. హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు: 'ఓ రోగ బాధిత వ్యక్తి కొందరు మహిళలున్న వైపుగా వెళ్ళాడు. స్త్రీలు అతన్ని చూసి ఎగతాళిగా నవ్వారు. (ఫలితంగా) వారిలో ఓ స్త్రీ ఆ వ్యాధికే గురయింది.'
(అల్ అదబుల్ ముఫ్రద్)

(۳۰۶) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
إِيَّاكُمْ وَالظَّنَّ فَإِنَّ الظَّنَّ أَكْذَبُ الْحَدِيثِ ۔ (مشکوٰۃ ۔ ص۴۲۷)

306. అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు, "అనుమానం, నిరాధారమయిన ఊహలకు దూరంగా మెలగండి. ఎందుకంటే అనుమానం మహా అసత్యం" అని బోధించారు. (మిష్కాత్)

(۳۰۷) عَنْ بِلَالِ بْنِ سَعْدٍ أَنَّ مُعَاوِيَةَ كَتَبَ إِلَى أَبِي الدَّرْدَاءِ
أُكْتُبْ إِلَيَّ فُسَّاقَ دِمَشْقَ، فَقَالَ مَا لِي وَفُسَّاقُ دِمَشْقَ وَمِنْ أَيْنَ
أَعْرِفُهُمْ، فَقَالَ ابْنُهُ بِلَالٌ أَنَا أَكْتُبُهُمْ، فَكَتَبَهُمْ قَالَ مِنْ أَيْنَ
عَلِمْتَ مَا عَرَفْتَ أَنَّهُمْ فُسَّاقٌ إِلَّا وَأَنْتَ مِنْهُمْ ابْدَأْ بِنَفْسِكَ وَلَمْ
يُرْسِلْ بِأَسْمَائِهِمْ ۔ (الادب المفرد۔ باب الظن۔ ص۱۸۸)

---

304. ప్రతి చిన్న పెద్ద విషయంలో ప్రమాణం చెయ్యడం క్రమేణ మనిషిని లోకువగా రూపొందిస్తుంది. అదీ వ్యాపార వ్యవహారంలోనయితే మనిషి విలువను దెబ్బతీసి వ్యాపారం పట్ల అపనమ్మకాన్ని సృష్టిస్తుంది. అందుకే ప్రారంభంలో ఏవో లాభాలు వచ్చినట్టు అగుపడినా తరువాత్తరువాత ప్రజల్లో నమ్మకం సడలి వ్యాపారంలోని శుభం దూరమవుతుంది. అందువల్ల అనవసరంగా ఒట్టు పెట్టుకోవడం, ప్రమాణం చెయ్యడం మంచిది కాదు.

305. ఒకరి బాధను చూసి ఎగతాళి చెయ్యడం మనిషిలోని అల్ప స్వభావాన్ని, నీచ ప్రవృత్తిని చాటుతుంది. అలాంటి వారికి అప్పుడప్పుడు దైవం పరీక్షకు లోనుచేసి

307. బిలాల్ బిన్ సఅద్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు: అమీర్ ముఆవియా, అబుద్దర్దా (ర.అ)కు లేఖ వ్రాస్తూ 'నాకు దిమాష్కస్‌లోని రౌడీ మూక జాబితా వ్రాసి పంపు' అని కోరారు. దానికి అబుద్దర్దా, 'నాకు దిమాష్కస్ రౌడీలతో పనేమి? వారిని నేనెలా గుర్తు పట్టగలను?' అని బదులిచ్చారు. అప్పుడు ఆయన (అబుద్దర్దా) కుమారుడు బిలాల్ (ర.అ) కలగజేసుకుని, నేను వాళ్ళ పేర్లు వ్రాసి ఇస్తానని అన్నాడు. ఆ ప్రకారమే అతను వాళ్ళ పేర్లు వ్రాసి ఇచ్చాడు కూడా. అబుద్దర్దా అతన్ని 'ఈ పేర్లు నీకు ఎలా తెలిశాయి, రౌడీల పేర్లు నీకు తెలిశాయంటే స్వయంగా నీకు కూడా వాళ్ళతో సంబంధం ఉన్నప్పుడే అది సాధ్యం. అందువల్ల జాబితాలో ప్రప్రథమంగా నీ పేరు వ్రాసుకో' అని నిలదీశారు. ఎట్టకేలకు అబుద్దర్దా ఆ జాబితాను అమీర్ ముఆవియా వద్దకు పంపనే లేదు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(٣٠٨) عَنْ اَنَسٍ اَنَّ اَعْرَابِيًّا اَتٰى بَيْتَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاَلْقَمَ عَيْنَهٗ خَصَاصَ الْبَابِ فَاَخَذَ سَهْمًا اَوْ عُوْدًا مُحَدَّدًا فَتَوَخَّى الْاَعْرَابِيَّ لِيَفْقَأَ عَيْنَ الْاَعْرَابِيِّ فَذَهَبَ فَقَالَ اَمَا اِنَّكَ لَوْ ثَبَتَّ لَفَقَأْتُ عَيْنَكَ۔ (الادب المفرد- باب النظر في الدور- ص١٥٩)

---

ఇతరులకు గుణపాఠం కలిగేలా చెయ్యడం కూడా జరుగుతుంది. అలాంటిదే ఈ హదీసులోని అంశం కూడా. ఆ వ్యాధి బహుశా మూర్ఛ వ్యాధి కావచ్చు. వ్యాధిగ్రస్తుని ఆటపట్టించిన మహిళ ఒకర్తె దైవికంగా అలాంటి పరీక్షకే గురయింది. దైవం మన్నించుగాక.

306. అనుమానం పెనుభూతం అన్నట్టు అది అనుమానించే వారినీ అనుమానింపబడే వారినీ ఉభయత్రా మింగేస్తుంది. అనుమానం అన్నది నిరాధారం గనక అది అబద్ధం అవడంలో సందేహమే లేదు. కొన్ని అనుమానాలు మహా పాతకాలని కూడా దివ్య ఖుర్ఆన్ అంటోంది.

307. రౌడీల జాబితా వ్రాయడమంటే కేవలం ఊహించి ఫలానా వారు రౌడీలయి ఉంటారని వ్రాయడమన్న మాట లేదా వాళ్ళల్లో బాగా తిరిగి గుర్తించి వ్రాయవలసి ఉంటుంది. అందుకే తన కొడుకు తనకు తెలిసిన రౌడీల పేర్లను వ్రాస్తానని అన్నా అది నిరాధారమయిన మాట, ఊహాజనితమయిన అనుమానమే గనక ఆ జాబితాను ఆయన తన అమీర్ వద్దకు పంపలేదు. ఒకరిని గురించి ఇదమిద్ధంగా తెలియనంత వరకు వారిపై ఆరోపణ చెయ్యడం సరయిన పద్ధతి కాదని దీనివల్ల రూఢమవుతోంది.

308. హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖనం: ఓ పల్లెటూరి అరబ్బు దైవ సందేశహరుల వద్దకు వచ్చాడు. అతను ప్రవక్త గదిలోకి చూడటానికి తలుపులో ఉన్న సందులో కన్ను పెట్టి చూడసాగాడు. ప్రవక్త మహనీయులు బాణమో లేక మొనదేలిన కర్ర ముక్కనో చేతపట్టుకుని ఆ పల్లెవాని వైపునకు అడుగు వేశారు – అతని కన్ను పొడుద్దామన్నట్టు. అది చూసిన పల్లెవాడు అక్కణ్ణుంచి జారుకున్నాడు. అప్పుడు ప్రవక్త మహనీయులు, 'నీవు ఇక్కడ నిల్చుని ఉంటే నేను నీ కన్ను పొడిచేసే వాణ్ణి' అని భయపెట్టారు. (అల్ అదబుల్ ముఫ్రద్)

(۳۰۹) عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا يُبَلِّغُنِيْ اَحَدٌ مِّنْ اَصْحَابِیْ عَنْ اَحَدٍ شَيْئًا، فَاِنِّیْ اُحِبُّ اَنْ اَخْرُجَ اِلَيْكُمْ
وَاَنَا سَلِيْمُ الصَّدْرِ ـ ترمذی ـ ریاض الصّالحین ـ باب حفظ اللسان ـ ص۲۲۸)

309. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు (సల్లల్లాహు అలైహివ సల్లం) ఇలా బోధించారు. "నా సహచరుల్లో ఎవ్వరిని గురించి అయినా నాకు ఎలాంటి విషయాన్నీ చేరవెయ్యకండి. ఎందుకంటే నేను మిమ్మల్ని కలుసుకున్నప్పుడు నా ఆంతర్యం మీ అందరి పట్ల పరిశుద్ధమయి ఉండాలన్నది నా కోరిక." (తిర్మిజి, రియాజుస్సాలిహీన్)

---

308. అవసరం లేకున్నా ఒకరి ఆంతరంగిక వ్యవహారాలను తెలుసుకోవాలన్న అత్యుత్సాహం, దొంగచాటుగా నిఘా వేసి ఒకరి లోపాలను తెలుసుకోవాలన్న బుద్ధి, అవి తెలుసుకుని ఆనందం అనుభవించడం అన్నది కుత్సిత నేర బుద్ధికి తార్కాణం. ఈ హదీసులో తెలిపిన చేష్ట అతి హేయమయిన, నీచమయిన చేష్ట. అందువల్లనే దైవ ప్రవక్త ఆ వ్యక్తిపై అంతగా ఆగ్రహించారు. ఇస్లామీయ షరీఅత్ ప్రకారం ఇతరుల అంతరంగ విషయాలను తెలుసుకునేందుకు యత్నించడం నిషిద్ధం. ప్రభుత్వ పాలనా వ్యవహారాల రీత్యా నిఘా విభాగం అవసరం మేరకు వ్యవహరించడం వేరు.

309. సమాజంలో పరస్పర సదవగాహన ఉండాలంటే చాడీలు చెప్పేవారిని నిరుత్సాహపరచడం అవశ్యం. లేకపోతే ఎంత మంచి మనసయినా చెడుమాటలు విని తమ మిత్రుల పట్ల కూడా ద్వేషం జనించడం సహజం. అందువల్లనే పవిత్ర మూర్తి మహనీయ ముహమ్మద్ (సఅసం) కూడా తాను చాడీలకు ప్రభావితుడయ్యే

(۳۱۰) عَنْ اَبِىْ هُرَيْرَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ
اَتَدْرُوْنَ مَا الْغِيْبَةُ قَالُوْا اللّٰهُ وَرَسُوْلُهٗ اَعْلَمُ قَالَ ذِكْرُكَ اَخَاكَ
بِمَا يَكْرَهُ قَالَ اَفَرَاَيْتَ اِنْ كَانَ فِىْ اَخِىْ مَا اَقُوْلُ، قَالَ اِنْ كَانَ
فِيْهِ مَا تَقُوْلُ فَقَدِ اغْتَبْتَهٗ، وَاِذَا قُلْتَ مَا لَيْسَ فِيْهِ فَقَدْ بَهَتَّهٗ۔
(مسلم۔ مشکوٰۃ۔ ص۴۱۲)

310. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఓ ఉల్లేఖనంలో మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా అడిగినట్లు పేర్కొన్నారు: 'పరోక్ష నింద అంటే ఏమిటో మీకు తెలుసా?' దానికి సహచరులు, దైవం, దైవ ప్రవక్త బాగా ఎరుగుదురు అని బదులిచ్చారు. అప్పుడు ఆయన, 'మీరు మీ సోదరుని ప్రస్తావన అతను ఇష్టపడని రీతిలో చెయ్యడం' అని సెలవిచ్చారు. దానికి సహచరులు, 'మా సోదరునిలో ఆ లోపం ఉండగా చూసే మేము దాన్ని ప్రస్తావిస్తే?' అని ప్రశ్నించారు. దానికి ప్రవక్త మహనీయులు (సఅసం), "అతనిలో ఉన్న లోపాన్ని చెప్పినప్పుడే అది పరోక్ష నింద అవుతుంది. అతనిలో లేని దాన్ని గురించి మీరు ప్రస్తావిస్తే అది అపనింద అవుతుంది" అని బోధించారు. (ముస్లిం, మిష్కాత్)

---

ప్రమాదముందని, అందువల్ల ఎవ్వరూ తనకు తన సహచరుల పట్ల ఎలాంటి చాడీలు చెప్పవద్దని హెచ్చరించారు. చాడీలకు ప్రభావితమయిన మనస్సు వల్ల వెంటనే ప్రవర్తనలో మార్పును తీసుకువస్తుంది. ఎవరి పట్ల కూడా ద్వేషం లేకుండా సుహృద్భావంతో కలసుకోవాలన్న అభిలాష, కృషి, చాడీలు చెప్పేవారిని నిరుత్సాహపరచడం అవసరమని ఈ హదీసు మనకు తెలుపుతోంది.

310. 'గీబత్' లేక పరోక్ష నిందను దివ్య ఖుర్ఆన్ మృత సోదరుని మాంసం తినడంతో సమానమని చాటింది. మనిషిలో ఉన్న ఓ చెడుగును అతను లేని సమయంలో ఇతరులకు చెప్పడం, అతనికి రుచించని రీతిలో చెప్పడం, తద్వారా వినేవారి అంతర్యాలను మలినం చెయ్యడం పరోక్ష నింద అనబడుతుంది. చాలా మంది, అతనిలో లేనిది చెప్పలేదే అని తమ పరోక్ష నిందను సమర్థించుకుంటారు. మహనీయ ముహమ్మద్ అదే అపరాధమని, లేనిది చెప్పినట్లయితే అది అపనిందగా మరింత ఘోర శిక్షకు పాత్రమయినదిగా తెలిపారు.

(۳۱۱) عَنْ فَاطِمَةَ بِنْتِ قَيْسٍ قَالَتْ اَتَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ سَلَّمَ فَقُلْتُ اِنَّ اَبَا الْجَهْمِ وَ مُعَاوِيَةَ خَطَبَانِىْ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَمَّا مُعَاوِيَةُ فَصُعْلُوْكٌ وَ اَمَّا اَبُوْ جَهْمٍ فَلَا يَضَعُ الْعَصَا عَنْ عَاتِقِهٖ (بخاری - ریاض الصالحین مصری - ص۲۲۷)

311. కైస్ కుమార్తె ఫాతిమా ఇలా ఉల్లేఖించారు: నేనొకసారి దైవ సందేశహరులు (సఅసం) సన్నిధిలో హాజరయి, 'నా వద్దకు అబూ జహ్మ్ (ర.అ), ముఆవియా (ర.అ) వివాహ ప్రతిపాదన పంపారు. (మీరేమంటారు)' అని అడిగాను. దానికి ఆయన ఇలా బదులిచ్చారు, 'ముఆవియా అయితే కటిక దరిద్రుడు, అబూ జహ్మ్ అయితే తన కర్రను భుజాన్నుండి అసలు దించనేదించడాయె. (అంటే పోరాట గుణం కలవ్యక్తి)'.

(బుఖారి, రియాజుస్సాలిహీన్)

(۳۱۲) عَنْ عَائِشَةَ قَالَتْ هِنْدُ اِمْرَأَةُ اَبِىْ سُفْيَانَ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اَبَا سُفْيَانَ رَجُلٌ شَحِيْحٌ وَلَيْسَ يُعْطِيْنِىْ مَا يَكْفِيْنِىْ وَ وَلَدِىْ اِلَّا مَا اَخَذْتُ مِنْهُ وَهُوَ لَا يَعْلَمُ قَالَ خُذِىْ مَا يَكْفِيْكِ وَوَلَدَكِ بِالْمَعْرُوْفِ (بخاری - ریاض الصالحین - ص۲۲۷)

312. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం అబూ సుఫ్యాన్ భార్య హింద దైవ ప్రవక్త సన్నిధిలో హాజరయి, 'అబూ సుఫ్యాన్ పిసినారి మనిషి. అతను నాకూ నా పిల్లల ఖర్చుకు సరిపోయేంత సొమ్ము ఇవ్వడు.

---

311. ఈ ఉల్లేఖనం వల్ల తెలిసేదేమిటంటే, సంఘంలో పెద్దలు, బాధ్యతాయుత స్థానంలో ఉన్నవారు, ఎవరి గురించి అయినా వివరాలు అడిగినప్పుడు, సలహా ఇవ్వవలసి వచ్చినప్పుడు సంబంధిత వ్యక్తిలోని లోపాలు ఎత్తి చూపడం పరోక్ష నింద అనిపించుకోదు. ఇంకా పలుమార్లు ఇలా చెయ్యడం, సామాజిక అవసరాల రీత్యా ధర్మసమ్మతమేకాదు, విధిగా కూడా పరిణమిస్తుంది.

312. ఈ ఉల్లేఖనం వల్ల తెలిసే విషయాలు:

(1) పరోక్ష నింద సాధారణంగా ధర్మ సమ్మతం కాదు. కాని ధర్మవేత్తల వద్ద ఏదయినా

అయితే నేను అతనికి తెలియకుండా ఖర్చుకు సరిపడా తీసుకుంటూ ఉంటాను' అని చెప్పగా దైవ సందేశహరులు (సఅసం), "నీకూ నీ సంతానానికీ సరిపడేంత సొమ్ము ప్రసిద్ధ రీతిలో నియమానుసారం, తీసుకో" అని అనుమతించారు. (బుఖారి, రియాజుస్సాలిహీన్)

(۳۱۳) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَا أَظُنُّ فُلَانًا وَفُلَانًا يَعْرِفَانِ مِنْ دِيْنِنَا شَيْئًا۔ (البخاری۔ ریاض الصالحین)

313. హజ్రత్ ఆయిషా ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా పలికారు: "ఫలానా, ఫలానా వ్యక్తులకు మన ధర్మం గురించి ఏమయినా తెలిసి ఉంటుందని నేననుకోవడం లేదు." (బుఖారి, రియాజుస్సాలిహీన్)

(۳۱۴) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا
تَسُبُّوا الْأَمْوَاتَ فَإِنَّهُمْ قَدْ أَفْضَوْا إِلٰى مَا قَدَّمُوْا۔ (رواہ البخاری۔ مشکوٰۃ۔ باب المشی
بالجنازہ)

---

సమస్యకు పరిష్కారం కనుగొనడం కోసం మూల విషయాన్ని తెలుపడానికి సంబంధిత వ్యక్తుల్లోని లోపాలను బయలుపరచవలసి వస్తే అందులో తప్పులేదు. (2) భార్యాపిల్లల అవసరాలను తీర్చడంలో భర్త అశ్రద్ధ కనబరిస్తే లేదా పూర్తి బాధ్యత వహించకపోతే, భార్య తన భర్త సొమ్ములో నుంచి తగినంత సొమ్ము, అతని అనుమతి లేకుండా వాడుకోవడంలో ఎలాంటి తప్పులేదు. (3) ప్రసిద్ధ రీతిలో అని అంటే సామాజిక వ్యవహారాల్లో, సమాజంలో చెలామణిలో ఉన్న నియమాలను పాటించడం సమంజసమే అని బోధపడుతోంది. షరీఅత్ విధించిన నియమాలు స్పష్టంగా ఉన్న వ్యవహారాల్లో తప్ప మరే ఇతర సందర్భాల్లోనయినా ప్రసిద్ధ రీతుల్ని అవలంబించవచ్చని తెలుస్తోంది.

313. స్థూలంగా చూస్తే ఇది కూడ పరోక్ష నిందలా అగుపిస్తోంది. కాని కాస్త లోతుగా పరిశీలిస్తే సమాజంలోని ఇతర వ్యక్తులకు, సంబంధిత వ్యక్తుల ధర్మజ్ఞత, ధర్మ నిష్ఠ పట్ల అపోహ కలిగి, అతిశయ భావం ఏర్పడి మోసపొయ్యే అవకాశమున్న చోట వారిలోని చెడుగును తెలుపడం సమంజసమేనని తెలుస్తోంది. అయితే ఇలా తెలుపడంలో వ్యక్తిగత కక్షలుగాని, ద్వేషంగాని, మానసిక తృప్తి లాంటి దుష్టభావాలు మూలం కారాదు. ధార్మిక అవసరాలకు తప్ప ఇలా చెయ్యడానికి అసలు అనుమతే లేదు.

314. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "మృతులను దూషించకండి, ఎందుకంటే తాము ముందుగా పంపినదంతా వారు ఈ పాటికి పొందే ఉంటారు."
(బుఖారి, మిష్కాత్)

(۳۱۵) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
تَجِدُوْنَ شَرَّ النَّاسِ یَوْمَ الْقِیٰمَةِ ذَا الْوَجْهَیْنِ الَّذِیْ یَاْتِیْ هٰؤُلَاءِ بِوَجْهٍ
وَهٰؤُلَاءِ بِوَجْهٍ ۔ (بخاری مسلم، مشکوٰۃ ۔ ص۴۱۱)

315. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం: దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చారు, "ప్రళయ దినాన జనుల్లో దుష్టాతి దుష్టులుగా కానవచ్చే వారు ద్విముఖులు. వారు ఒకరికి ఓ ముఖంతోనూ మరొకరికి మరో ముఖంతోనూ దర్శనమిస్తారు." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(۳۱۶) عَنِ الزُّبَیْرِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
دَبَّ اِلَیْكُمْ دَاءُ الْاُمَمِ قَبْلَكُمُ الْحَسَدُ وَالْبَغْضَاءُ هِیَ الْحَالِقَةُ لَا اَقُوْلُ
تَحْلِقُ الشَّعْرَ وَلٰكِنْ تَحْلِقُ الدِّیْنَ ۔ (رواہ احمد مشکوٰۃ)

---

314. అంటే ఒకరు మరణించిన తరువాత వారి చెడుగులను ఎత్తి చూపడం ధర్మ సమ్మతం కాదు. తాను చేసిన దుష్కార్యాలకు శిక్ష అతను దైవసన్నిధిలో ఎలాగూ అనుభవిస్తున్నాడు. ఇప్పుడు అతన్ని నిందించి ప్రయోజనం ఏమిటి, అతనా బాగుపడలేడు. అతని చెడుగులు చెప్పుకుని మనం మన కర్మపత్రాన్ని మలినపరచుకోవడం దేనికి?

315. ద్విముఖులంటే ద్వంద్వ స్వభావులన్న మాట. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా దర్శనమిచ్చేవారు. ఇక్కడ ఓ రంగయితే అక్కడ మరో రంగులో అగుపడతారు. ఎలా వీలు పడితే, ఎలా అవకాశం కలసి వస్తే అలా వ్యవహరిస్తారన్న మాట. ద్వంద్వ స్వభావం, కపట వ్యవహారం వారి ప్రవృత్తి అయిపోతుంది. అలాంటి వారు నీచాతినీచమయిన మనుషులని, వారికి అత్యంత హీనమయిన శిక్ష ప్రాప్తమవుతుందని చెప్పడమే ఈ హదీసు ఉద్దేశ్యం.

316 హజ్రత్ జుబైర్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో, దైవ ప్రవక్త(సఅసం) ఇలా నుడివినట్లు తెలిపారు: "మీలో (మీకు తెలియకుండానే) పూర్వపు జాతుల రోగాలు చోటుచేసుకున్నాయి – ఈర్ష్యా విద్వేషాలు. ఈర్ష్య రోగమయితే ముండనం చేస్తుంది. ఇది మీ శిరోముండనం చేస్తుందని నేననడం లేదు, మీ ధర్మాన్ని క్షవరం చేసివేస్తుంది." (అహ్మద్, మిష్కాత్)

(۳۱۷) عَنْ اَبِیْ هُرَیْرَةَ عَنِ النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ اِیَّاکُمْ وَالْحَسَدَ فَاِنَّ الْحَسَدَ یَاْکُلُ الْحَسَنَاتِ کَمَا تَاْکُلُ النَّارُ الْحَطَبَ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب ما ینہی۔ ص۴۲۸)

317. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా ప్రబోధించారు, "ఈర్ష్యకు దూరంగా ఉండండి. ఎందుకంటే ఈర్ష్య సత్కార్యాలను మింగివేస్తుంది – నిప్పు కట్టెల్ని హరించివేసినట్లు." (అబూదావూద్, మిష్కాత్)

(۳۱۸) عَنْ اَبِیْ اَیُّوْبَ الْاَنْصَارِیِّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ لَا یَحِلُّ لِلرَّجُلِ اَنْ یَّهْجُرَ اَخَاهُ فَوْقَ ثَلَاثِ لَیَالٍ یَلْتَقِیَانِ فَیُعْرِضُ هٰذَا وَیُعْرِضُ هٰذَا وَخَیْرُهُمَا الَّذِیْ یَبْدَاُ بِالسَّلَامِ۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ باب النہی عن التہاجر۔ ص ۴۱۹)

---

316. విద్వేషం, వైషమ్యం, ఈర్ష్యా అసూయలు ఇస్లామీయ బోధనలకు శిక్షణలకు కడు విరుద్ధమైనవి. శిరోముండనం జరిగిన మనిషి ఎలా అందం, రక్షణలు కోల్పోతాడో అలాగే ఈ దుర్గుణాలు మనిషిలోని ధర్మ పరాయణతను తొలగించి మార్గ విహీనుడిగా వికృతంగా రూపొందిస్తాయి. ధర్మ విహీనమయిన జీవితం వికృత జీవితమనడంలో సందేహమేముంది? అతను ఇహంలోనూ సుఖపడలేడు, పరంలోనయితే శిక్ష, బాధలెలాగూ తప్పవు.

317. ఈర్ష్య ఓ జ్వాలాముఖిలాంటిది. అది దేనికి సోకినా దాన్నే భస్మీపటలం చేసివేస్తుంది. మనిషిలోని సకల సద్గుణాలను దహించివేస్తుంది. మనిషి మంచి

318. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారి ఉల్లేఖించిన దాని ప్రకారం దైవ సందేశహరులు మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఏ వ్యక్తీ తన సోదరుణ్ణి మూన్నాళ్ళకన్నా అధికంగా కలువకుండా ఉండరాదు. ఉభయులూ ఎదురుపడినప్పుడు ఒకడు అటు ముఖం త్రిప్పుకుంటే మరొకడు మరో వైపునకు మరలిపోతుంటాడు. సలామ్ చెయ్యడానికి ముందంజ వేసినతను వారిరువురిలో ఉత్తముడు." (ముత్తఫకున్ అలైహ్)

(۳۱۹) عَنِ الْوَلِيْدِ اَنَّ عِمْرَانَ بْنَ اَبِىْ اَنَسٍ حَدَّثَهٗ اَنَّ رَجُلًا
مِنْ اَسْلَمَ مِنْ اَصْحَابِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حَدَّثَهٗ عَنِ النَّبِيِّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ هِجْرَةُ الْمُؤْمِنِ سَنَةً كَسَفْكِ دَمِهٖ -
(الادب المفرد - باب من ہجر اخاہ سنۃ - ص۶۰)

319. అస్లమ్ తెగకు చెందిన వ్యక్తికి ప్రవక్త సహచరుడయ్యే భాగ్యం లభించింది. అతను ఓ ఉల్లేఖనంలో దైవ సందేశహరులు ఇలా బోధించారని తెలిపాడు, "ఓ విశ్వాసితో సంవత్సర కాలం సంబంధాలు త్రెంచుకుని ఉండటం అతని రక్తం చిందించడంతో సమానం." (అల్ అదబుల్ ముఫ్రద్)

(۳۲۰) عَنْ جَابِرٍ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنِ
اعْتَذَرَ اِلٰى اَخِيْهِ فَلَمْ يَعْذِرْهُ اَوْلَمْ يَقْبَلْ عُذْرَهٗ كَانَ عَلَيْهِ مِثْلُ
خَطِيْئَةِ صَاحِبِ مَكْسٍ - (رواہ البیہقی - مشکوۃ - باب ما ینہی عنہ من التہاجر - ط۴۲۸)

---

చెయ్యబోయి చెడులో కాలు వేస్తాడు. మంచి చేస్తూ చెడుకు లోనవుతాడు. అంటే అతనిలో ఉన్న ఇతర మంచి గుణాలు సయితం అవగుణాలుగా రూపొందుతాయి. ఎప్పుడయినా ఆ గాలి సోకినప్పుడు మన అంతర్యం, దాని స్థితి ఎలా ఉంటుందో ఊహించుకుంటే ఈర్ష్య ఎలాంటి జ్వరమో బోధపడుతుంది.

318. ఇస్లాం నెలకొల్పగోరే సమాజంలో ప్రేమానురాగాలే తప్ప అన్యమేదీ కానరాదన్నదే దాని అభిమతం. అందువల్లనే ఏవయినా విభేదాల కారణంగా తోటి సోదరునిపై ఆగ్రహం కలిగినా దాని కాల పరిమితి మూడు రోజులే అని ఈ హదీసు తెలుపుతోంది.

320. హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ఒక వ్యక్తి తన సోదరుణ్ణి (చేసిన తప్పుకు) క్షమాపణ వేడుకున్నప్పుడు ఆ వ్యక్తిని అతను క్షమించకపోయినా, అతని వేడుకోలును అంగీకరించకపోయినా పన్నుల వానివలే శిక్ష అనుభవించవలసి ఉంటుంది." (బైహకీ, మిష్కాత్)

(۳۲۱) عَنْ اَبِىْ اُمَامَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ

مِنْ شَرِّ النَّاسِ مَنْزِلَةً يَّوْمَ الْقِيٰمَةِ عَبْدٌ اَذْهَبَ اٰخِرَتَهُ بِدُنْيَا غَيْرِهٖ ۔

(رواه ابن ماجه بشكوة ـ باب الظلم ـ ص۴۳۵)

321. అబూ ఉమామ ఓ ఉల్లేఖనంలో, దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారని తెలిపారు, "(దైవ సన్నిధిలో) ప్రళయ దినాన స్థానం రీత్యా అత్యంత దుష్టుడయిన వ్యక్తి, ఇతరుల ఇహలోక నిర్మాణం కొరకు తన పరలోకాన్ని నాశనం చేసుకునేవాడు." (ఇబ్ను మాజ, మిష్కాత్)

---

మరో హదీసులో దైవ ప్రవక్త (సఅసం) సలామ్ చెయ్యడానికి ముందుకు వచ్చే వ్యక్తి అహంకారం, గర్వం లేని వాడు అని అన్నారు.

319. సంవత్సర కాలం ఓ సోదరునితో తెగ తెంపులు చేసుకోవడమంటే ఏదో చిక్కుతో కూడుకున్న విషయమే అయి ఉంటుంది. అయినప్పటికీ ధార్మిక ప్రధానమయిన కారణం లేకుండా సంవత్సర కాలం విడిపోవడం వల్ల అతనికి తగిన శిక్షే లభించింది. దాన్నే రక్తం చిందించడంతో సమానమన్నారు దైవ ప్రవక్త. ఇక ఆ తరువాత కూడా విడిగానే ఉండటం దోషభరితమయిపోతుందని దాని భావం.

320. 'పన్నుల వాడు' అనంటే పన్నులు, రుసుములు, టాక్సులు వసూలు చేసే ప్రభుత్వాధికారి అన్న మాట. వీరిలో అక్రమానికి, అత్యాచారానికి పాల్పడి లంచం తీసుకుని తన బొక్కసాలు నింపుకునే వారిని ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. ఇలాంటి వారికి పరలోకంలో లభించే శిక్ష, తోటి సోదరుడు అర్థించినప్పుడు క్షమాభిక్ష నివ్వని వానికి కూడా లభిస్తుందని హదీసు తెలుపుతోంది.

321. అంటే ఇతరులను సంతోషపెట్టడానికి, వారికి ప్రపంచంలో వీలయినన్ని ప్రయోజనాలు చేకూర్చడానికి, ధర్మాధర్మాల విచక్షణ లేకుండా ప్రవర్తించే వ్యక్తి తన

(۳۲۲) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ لَاَنْ یَّمْتَلِیَٔ جَوْفُ رَجُلٍ قَیْحًا خَیْرٌ مِّنْ اَنْ یَّمْتَلِیَٔ شِعْرًا۔ (الادب المفرد۔ باب من الشعر حکمۃ۔ ص۱۲۶)

322. "ఒక వ్యక్తి కడుపు చీముతో నిండిపోవడం, కవితల కాలుష్యంతో కలుషితమవడం కన్నా నయమయినది" అని ప్రవక్త మహనీయులు సెల విచ్చినట్లు అబూహురైరా (ర.అ) ఉల్లేఖించారు. *(అల్ అదబుల్ ముఫ్రద్)*

(۳۲۳) عَنْ عَبْدِ اللّٰهِ قَالَ لَا یَصْلُحُ الْکِذْبُ فِیْ جِدٍّ وَّلَا هَزْلٍ وَّلَا اَنْ یَعِدَ اَحَدُکُمْ وَلَدَهٗ شَیْئًا ثُمَّ لَا یُنْجِزُ لَهٗ۔

323. హజ్రత్ అబ్దుల్లాహ్ ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు, "అబద్ధం, వాస్తవానికి (అబద్ధంగా) పలికినా, కేవలం వేళాకోళంగా పలికినా ధర్మసమ్మతం కాదు. ఇంకా మీలో ఎవరయినా తన సంతానంతో ఏదయినా వాగ్దానం చేసి దాన్ని పూర్తి చెయ్యకపోవడం కూడా ధర్మసమ్మతం కాదు."

---

చేష్టల ఫలంగా పరలోకంలో శిక్షకు గురికావలసి వస్తుందన్న మాట. తన సంతానం కోసం ఏ గడ్డయినా కరవడానికి వెరువని వారు గమనించాలి.

322. సాధారణంగా కవిత్వం, సాహిత్యం ఆశయ రహితంగా, నైతిక ప్రమాణాలకు భిన్నంగా, పఠితల లేక శ్రోతల నైతికతను భంగపరిచే విధంగా సాగుతుంది. కవులూ సాహితీకారులు ఏ విలువలకూ విలువనివ్వకుండా క్షుద్రమయిన భావాల వ్యక్తీకరణకు తమ కళను వినియోగిస్తారు. అలాంటి కవిత్వాన్నే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. పోతే ఉత్తమ లక్ష్యంతో, ఉన్నత నైతిక ప్రమాణాల పరిపోషణకు వినియోగపడే సాహిత్యం సర్వదా అభిలషనీయమే.

323. కావాలని అసత్యాన్ని సృష్టించి పలికినా లేక కేవలం వేళాకోళానికో లేక పిల్లల్ని సముదాయించడానికో పలికినా సర్వత్రా అది గర్హనీయం. కూర్చొని బాతాఖానీ చేసేవారు అప్పుడప్పుడు ఎవరికీ హాని కలగదని భావించి అబద్ధాలు సృష్టిస్తుంటారు. అది ప్రపంచంలో అనర్థాలకు దారితీయడం అలా ఉంచి పరలోకంలోనూ నష్టదాయకమే.

(۳۲۴) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّے اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
خَصْلَتَانِ لَا تَجْتَمِعَانِ فِیْ مُنَافِقٍ حُسْنُ سَمْتٍ وَلَا فِقْهٌ فِی الدِّیْنِ ۔
(مشکوٰۃ ۔ صـ۲۶)

324. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించినట్లు హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించారు, “రెండు గుణాలు ద్వంద్వనీతిపరుని (మునాఫిక్ = కపటాచారి)లో చేరజాలవు. (1) ప్రసన్నత నిండిన ప్రవర్తన, (2) సరయిన ధర్మావగాహన.” (మిష్కాత్)

(۳۲۵) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّے اللّٰهُ عَلَیْهِ
وَسَلَّمَ اَرْبَعٌ مَنْ کُنَّ فِیْهِ کَانَ مُنَافِقًا خَالِصًا وَمَنْ کَانَتْ فِیْهِ خَصْلَةٌ
مِّنْهُنَّ کَانَتْ فِیْهِ خَصْلَةٌ مِّنَ النِّفَاقِ حَتّٰی یَدَعَهَا اِذَا اؤْتُمِنَ خَانَ وَ
اِذَا حَدَّثَ کَذَبَ وَاِذَا عَاهَدَ غَدَرَ وَاِذَا خَاصَمَ فَجَرَ

325. అబ్దుల్లా బిన్ అమ్ర్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చారు, “ఏ వ్యక్తిలోనయితే నాలుగు విషయాలు గోచరిస్తాయో అతను పచ్చి కపటాచారి (మునాఫిక్). మరెవరిలోనయినా వీటిలోని ఒక విషయం ఉంటే అతనిలో కాపట్యపు ఓ గుణం ఉందన్న మాట. అతను దాన్ని మానుకున్నంత వరకు (కాపట్యం అతన్ని వీడిపోదు). (1) అతని వద్ద ఏదయినా అప్పగింత భద్రపరచినప్పుడు అతను అందులో నమ్మకద్రోహానికి పాల్పడతాడు. (2) నోరు విప్పితే అబద్ధాలు పలుకుతాడు. (3) వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు. (4) వాదులాడితే అసహ్యంగా నోరు పారేసుకుంటాడు.”

---

324. మనసులో కాపట్యం నిండి ఉన్నప్పుడు ప్రవర్తనలో దాని ప్రభావం తప్పనిసరిగా పడుతుంది. కపటాచారి ప్రసన్న వర్తనుడు కాజాలడు. రెండవ విషయం స్పష్టమయిందే. మనిషి ధర్మం పట్ల ద్వంద్వనీతి అవలంబిస్తున్నప్పుడు, చిత్తశుద్ధి లోపించినప్పుడు ఎంత మంచి మాటయినా అవగతమవదు, ధర్మం అంతకన్నా దర్శనమివ్వదు.

(٣٢٦) عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ إِنَّمَا أَخَافُ عَلٰى هٰذِهِ الْأُمَّةِ كُلَّ مُنَافِقٍ يَتَكَلَّمُ بِالْحِكْمَةِ وَيَعْمَلُ بِالْجَوْرِ۔ (رواه البيهقي۔ مشكوٰة۔ باب الرياء)

326. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ ఓ ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారని అన్నారు: 'నాకు ఈ అనుచర సమాజం గురించి, ద్వంద్వ స్వభావం గల ప్రతి మునాఫిక్ వల్ల భయం కలుగుతోంది. అతను విజ్ఞతతో కూడుకున్న మాటలెన్ని చేసినా పనులు మాత్రం దౌర్జన్యపరమయినవే చేస్తాడు.' (బైహకి - మిష్కాత్)

(٣٢٧) عَنْ جَابِرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِتَّقُوا الظُّلْمَ فَإِنَّ الظُّلْمَ ظُلُمَاتٌ يَّوْمَ الْقِيٰمَةِ وَاتَّقُوا الشُّحَّ فَإِنَّ الشُّحَّ أَهْلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ حَمَلَهُمْ عَلٰى أَنْ سَفَكُوْا دِمَآئَهُمْ وَاسْتَحَلُّوْا مَحَارِمَهُمْ۔ (رواه مسلم۔ مشكوٰة۔ باب النفاق)

---

325. కాపట్యం ఉన్న వ్యక్తిలో ఆ దుర్గుణాలుండడం అలా ఉంచి, ఆ దుర్గుణాలున్న వ్యక్తిలో - అవి ఏ మేరకు ఉంటే ఆ మేరకు - కాపట్యం ఉంటుందన్న మాట చాలా భయంకరమయినది. ఆంతర్యాలను శోధించి ఆత్మ పరిశీలన జరుపుకుని ఆంతర్యంలోని, నడవడిలోని అవగుణాలను మార్చుకుంటే తప్ప పరలోకంలో సాఫల్యం ప్రాప్తం కాదు. దైవం మన్నించి సద్బుద్ధి ప్రసాదించు గాక.

326. ఈ అనుచర సమాజం అన్న దానికి ముస్లిం సమాజం అని భావం. ఈ హదీసులో, మాటిమాటికీ ఇస్లాంను, దాని వ్యవస్థను ప్రస్తావిస్తూ ఆచరణా సమయం రాగానే ఇస్లామీయ పరిధుల్ని అతిక్రమించడంలో అగ్రగణ్యులుగా నిలిచే వారిని సూచించడం జరిగింది. ఇలాంటి వారిని కపటులుగా, మునాఫిక్‌లుగా ద్వంద్వ స్వభావులుగా పేర్కొనడం గమనార్హం. ఉత్తుత్తి మాటల్ని వల్లించే వారు ఆత్మ పరిశీలన చేసుకునే తరుణం ఇది.

327. హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖించిన ఓ హదీసులో దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు, 'దౌర్జన్యానికి దూరంగా ఉండండి, ఎందుకంటే దౌర్జన్యం ప్రళయ దినాన అంధకారానికి కారణభూతమవుతుంది. పిసినారితనం, పేరాశలకూ దూరంగా మెలగండి. ఎందుకంటే ఇవి పూర్వం వారినీ తుద ముట్టించాయి, అవి మానవ రక్తాన్ని చిందించడానికీ మానాభిమానాలను కాలరాయడానికీ పురికొలిపాయి.' (ముస్లిం, మిష్కాత్)

(۳۲۸) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ اَعَانَ ظَالِمًا بِبَاطِلٍ لِّيُدْحِضَ بِبَاطِلِهٖ حَقًّا فَقَدْ بَرِئَ مِنْ ذِمَّةِ اللّٰهِ
عَزَّوَجَلَّ وَذِمَّةِ رَسُوْلِهٖ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَمَنْ اَكَلَ دِرْهَمًا مِّنْ
رِّبًا فَهُوَ مِثْلُ ثَلَاثَةٍ وَّ ثَلَاثِيْنَ زَنْيَةً وَمَنْ نَبَتَ لَحْمُهٗ مِنْ سُحْتٍ
فَالنَّارُ اَوْلٰى بِهٖ - (المعجم الصغير للطبرانی - ص۱۴۴)

328. అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ ఉల్లేఖనం ప్రకారం, దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: 'అసత్యత ద్వారా సత్యాన్ని లొంగదీయడానికి ఎవరయితే దౌర్జన్యపరునికి తోడ్పడుతారో వారు అల్లాహ్ రక్షణ, ఆయన ప్రవక్త రక్షణలకు దూరమయ్యారు. ఎవరయినా ఒక్క దిర్‌హమ్ వడ్డీని తిన్నా అతని పాపం 33 సార్లు వ్యభిచరించిన దానికి సమానం. మరే కండరాలు అధర్మ జీవికతో పోషించబడ్డాయో వాటికి అగ్నియే అత్యంత అనువయినది." (అల్ మో'జముస్సగీర్ - తిబ్రాని)

(۳۲۹) عَنْ عَلِیٍّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِيَّاكَ
وَدَعْوَةَ الْمَظْلُوْمِ فَاِنَّمَا يَسْاَلُ اللّٰهَ تَعَالٰى حَقَّهٗ وَاِنَّ اللّٰهَ لَا يَمْنَعُ ذَا حَقٍّ
حَقَّهٗ - (مشكوٰة - باب الظلم - ص۴۳۵)

---

327. మూలంలో "షుహ్హ్" అన్న పదం ప్రయోగించడం జరిగింది. దానికి పిసినారితనమూ, పేరాశా రెండూ మిళితమయిన అత్యంత హేయమయిన స్థితి అని అర్థం. ఈ రెంటికీ గురయిన వారు అటు మానవుల ప్రాణాలను, మానాలను రెంటినీ

329. దైవ సందేశహరులు (సఅసం) బోధించినట్లు హజ్రత్ అలీ ఉల్లేఖించారు: 'బాధితుని ఆర్తనాదాన్ని తప్పించుకోండి. ఎందుకంటే అతను అల్లాహ్‌ను కేవలం తన హక్కు కొరకు అర్థిస్తాడు. ఆ పరమ ప్రభువేమో ఎవరి హక్కునూ కాదనడు.' (మిష్కాత్)

(۳۳۰) عَنْ سَعِيْدِ بْنِ زَيْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ اَخَذَ شِبْرًا مِّنَ الْاَرْضِ ظُلْمًا فَاِنَّهٗ يُطَوَّقُهٗ يَوْمَ الْقِيٰمَةِ مِنْ سَبْعِ اَرْضِيْنَ ۔ (بخاری مسلم مشکوٰۃ ۔ باب الغصب ۔ ص ۲۵۴)

330. హజ్రత్ సయీద్ బిన్ జైద్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: 'ఎవరయినా దౌర్జన్యపరంగా ఒక జానెడు నేలను కాజేసినా ప్రళయదినాన అతని కంఠంలో ఏడు భూముల కంఠబంధాన్ని వెయ్యడం జరుగుతుంది.' (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

ఖాతరు చెయ్యకుండా అన్యాయంగా రక్తపాతం సృష్టించడానికి, అక్రమంగా ఇతరుల మానాలతో చెలగాటమాడటానికి వెనుకాడరని తెలుపడం జరిగింది. ఈ రెండు మహా పాతకాలు, ఎలాంటి వైచ్యానికి దారి తీసి పరలోకాన ఎలాంటి హీనస్థితికి కారణ మవుతాయో చెప్పనవసరం లేదు.

328. అల్లాహ్ రక్షణ, ప్రవక్త రక్షణ అనంటే ఇస్లామీయ రాజ్యం అందజేసే భద్రత ఏర్పాట్లన్నమాట. దౌర్జన్యపరుడంటే వ్యక్తియే కాదు, ఎలాంటి అన్యాయపరమయిన కార్యాన్ని సమర్థించినా అది మహా పాతకం అన్నమాట. పరలోకంలో ఎలాగూ శిక్షననుభవించక తప్పదు కాని ఇహలోకంలోనూ ఇస్లామీయ ప్రభుత్వభద్రతకు అలాంటి వారు దూరమవుతారన్న యదార్థాన్ని ఈ హదీసు వ్యక్తపరుస్తోంది.

329. బాధితుడు లేక బాధితురాలు తన్నుతాను రక్షించుకోలేకపోవడం, తన్నుతాను దౌర్జన్యపరుని బారి నుండి కాపాడుకోలేకపోవడం చేతనే దైవానికి మొరపెట్టుకుంటారు. అలాంటి వారు ఆ సందర్భంలో దైవానికి మరీ సమీపాన ఉంటారు. వారి ఆర్తనాదం దైవ స్వీకృతి పొందడం అత్యంత సహజం, సమంజసం కూడా. అందువల్ల ఒకరికి బాధించడం ఎంత ఘోరమయిన పరిణామానికి గురి చేస్తుందో గుర్తుంచుకుని మరీ మెలగాలి. ఎందుకంటే అల్లాహ్ తన సంప్రదాయం ప్రకారం బాధితుల హక్కును అందజెయ్యడం(వారి మొరాలకించి సహాయపడటం)లో ఎంత మాత్రం వెనుదీయడు.

(٣٣١) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَحْلِبَنَّ أَحَدٌ مَاشِيَةَ امْرِئٍ بِغَيْرِ إِذْنِهِ أَيُحِبُّ أَحَدُكُمْ أَنْ تُؤْتَى مَشْرَبَتُهُ فَتُكْسَرَ خِزَانَتُهُ، فَيُنْتَقَلَ طَعَامُهُ وَإِنَّمَا يَخْزُنُ لَهُمْ ضُرُوْعُ مَوَاشِيْهِمْ أَطْعِمَاتِهِمْ۔ (رواه مسلم مشكوٰة - باب الغصب - ص٢٥٤)

331. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఉల్లేఖించారు: ఎవరయినా సరే ఒకరి పశువుల నుండి వారి అనుమతి లేకుండా పాలు పిండుకోరాదు. మీలో ఎవరయినా తమ భోజనాగారానికి మరొకరు వచ్చేసి దాన్ని విరగ్గొట్టి అందులోని భోజన సామగ్రిని ఎత్తుకు పోవడాన్ని యిష్టపడతారా? (అలాగే) ఒకరి పశువుల పాల స్తనాలు వారికి ఆహారాగారాలు. (ముస్లిం, మిష్కాత్)

(٣٣٢) عَنْ عُبَادَةَ بْنِ الصَّامِتِ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ يَقُوْلُ أَدُّوا الْخِيَاطَ وَالْمَخِيْطَ وَإِيَّاكُمْ وَالْغُلُوْلَ فَإِنَّهُ عَارٌ عَلَى أَهْلِهِ يَوْمَ الْقِيٰمَةِ۔ (رواه النسائى - مشكوٰة - باب قسمة الغنائم - ص٣٤٣)

332. ఉబాదా బిన్ సామిత్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రబోధించేవారు: "సూదీ, దారం కూడా తిరిగి ఇచ్చివెయ్యండి. నమ్మకద్రోహానికి పాల్పడకండి. ఎందుకంటే ఈ నమ్మకద్రోహం ప్రళయ దినాన అవమానానికి కారణభూతమవుతుంది, సిగ్గుపడేలా చేస్తుంది"

(నసాయి, మిష్కాత్)

---

330. అన్యాయంగా ఒకరి భూమిని హరించివేస్తే ఏడు భూగోళాల బరువుగల కడియాన్ని కంఠంలో మొయ్యవలసి వస్తుందని, అలా చెయ్యడం మహా పాతకమని ఈ హదీసు తెలుపుతోంది.

331. అరబ్బులకు పాలు ఆహారంలో భాగం. ఆకలిగొన్నవారు పశువులు, గొర్రెలు, మేకలు, ఆవులు, ఒంటెలు కనబడితే పాలు పిండుకుని త్రాగేవారు. అయితే యజమాని అనుమతి లేకుండా కాపరికి ఏదో ఇచ్చేసి లేదా దొంగచాటుగా అలా పాలు త్రాగడం మంచి పద్ధతి కాదని, ఇదీ ఒక విధంగా దౌర్జన్యమే అని ఈ హదీసు తెలుపుతోంది. భోజనాగారం అంటే నేడు భోజన పానీయాలు దాచి ఉంచుకునే అల్మారాలు లేక ఫ్రిజ్‌లాంటివన్న మాట.

(۳۳۳) عَنْ عَبْدِ اللّٰہِ بْنِ عَمْرٍو قَالَ کَانَ عَلٰی ثِقْلِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ رَجُلٌ یُقَالُ لَہٗ کِرْکِرَۃُ فَمَاتَ فَقَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ ھُوَ فِی النَّارِ فَذَھَبُوْا یَنْظُرُوْنَ فَوَجَدُوْا عَبَاءَۃً قَدْ غَلَّھَا۔ (رواہ البخاری۔ مشکوٰۃ۔ باب قسمۃ الغنائم)

333. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త సామగ్రిని కాపలాకాయడానికి 'కర్కరా' అనే వ్యక్తిని నియమించారు. ఆ వ్యక్తి చనిపోయాడు. దైవ ప్రవక్త అతన్ని గురించి, 'ఇతను నరకాగ్నిలో పడిపోయాడు' అని పలికారు. జనం అతన్ని చూడటానికి వెళ్ళినప్పుడు, అతని వద్ద అతను దొంగలించిన 'అబా' (ఓవర్ కోటులాంటి వస్త్రం) ఒకటి కనిపించింది. (బుఖారి, మిష్కాత్)

(۳۳۴) عَنْ عَبْدِ اللّٰہِ بْنِ عَمْرٍو قَالَ لَعَنَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَلرَّاشِیَ وَالْمُرْتَشِیَ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ باب الولایا وہدایاہم)

334. దైవ సందేశహరులు (సఅసం) లంచం ఇచ్చే వానికి, లంచం పుచ్చుకునేవానికి శపించారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ ఉల్లేఖించారు. (అబూ దావూద్, మిష్కాత్)

---

332. సూదీ, దారం లాంటి అతి స్వల్పమయిన, అల్పమయిన వస్తువును సయితం ఎవరిది వారికి అప్పజెప్పడమే విశ్వసనీయతకు, నిజాయితీకి చిహ్నం. అలా చెయ్యక అశ్రద్ధ వహించడం ప్రళయదినాన మనిషికి భారమయి, పరాభవకారణమయి, అందరి ముందూ సిగ్గుచేటుగా పరిణమిస్తుంది. దైవం మన్నించుగాక.

333. ఈ సంఘటన ఓ యుద్ధం సందర్భంలో జరిగింది. దైవ మార్గంలో ప్రాణాలు సయితం లెక్క చెయ్యకుండా పోరాడటం అన్నది మహోన్నతమైన సత్కార్యం కాని అది కూడా అవినీతి, నమ్మకద్రోహాల వల్ల దైవం సమక్షంలో విలువ కోల్పోతుంది. ఇలాంటి వ్యక్తి ఘోరమయిన శిక్షను అనుభవించడం కూడా సంభవమే అన్నది ఈ హదీసు బోధన.

334-335. ఈ రెండు హదీసుల ద్వారా లంచగొండితనం వల్ల వ్యక్తికి సంభవించే హాని, ఒకజాతికి కలిగే కీడు రెండూ తెలుపడం జరిగింది. జాతిలో పిరికిదనం అన్నది

(۳۳۵) عَنْ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَا مِنْ قَوْمٍ يَظْهَرُ فِيْهِمُ الزِّنَا إِلَّا أُخِذُوْا بِالسَّنَةِ وَمَا مِنْ قَوْمٍ يَظْهَرُ فِيْهِمُ الرِّشَا إِلَّا أُخِذُوْا بِالرُّعْبِ۔ (رواہ احمد مشکوٰۃ۔کتاب الحدود)

335. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్, తాను దైవ ప్రవక్త (సఅసం) చెప్పగా విన్నట్టు ఇలా తెలిపారు, "ఏ జాతిలోనయితే వ్యభిచారం సర్వసాధారణ మయిపోతుందో అది కరవుకాటకాలకు గురవకుండా ఉండదు, అలాగే ఏ జాతిలో అవినీతి అధికమయిపోతుందో అది సదా భయభ్రాంతులకు లోనయి ఉంటుంది." (అహ్మద్ - మిష్కాత్)

(۳۳۶) عَنْ أَبِيْ حُمَيْدٍ السَّاعِدِيِّ قَالَ اسْتَعْمَلَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ رَجُلًا مِّنَ الْأَزْدِ يُقَالُ لَهُ ابْنُ اللُّتْبِيَّةِ عَلَى الصَّدَقَةِ فَلَمَّا قَدِمَ قَالَ هٰذَا لَكُمْ وَهٰذَا أُهْدِيَ لِيْ فَخَطَبَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَحَمِدَ اللّٰهَ وَأَثْنٰى عَلَيْهِ ثُمَّ قَالَ أَمَّا بَعْدُ فَإِنِّيْ أَسْتَعْمِلُ رِجَالًا عَلٰى أُمُوْرٍ مِّمَّا وَلَّانِيَ اللّٰهُ فَيَأْتِيْ أَحَدُهُمْ فَيَقُوْلُ هٰذَا لَكُمْ وَهٰذِهٖ هَدِيَّةٌ أُهْدِيَتْ لِيْ فَهَلَّا جَلَسَ فِيْ بَيْتِ أَبِيْهِ وَأُمِّهٖ، فَيَنْظُرَ أَيُهْدٰى لَهٗ أَمْ لَا، وَالَّذِيْ نَفْسِيْ بِيَدِهٖ لَا يَأْخُذُ أَحَدٌ مِّنْهُ شَيْئًا إِلَّا جَاءَ بِهٖ يَوْمَ الْقِيٰمَةِ يَحْمِلُهٗ عَلٰى رَقَبَتِهٖ إِنْ كَانَ بَعِيْرًا لَهٗ رُغَاءٌ أَوْ بَقَرًا لَهٗ خُوَارٌ أَوْ شَاةً تَيْعِرُ ثُمَّ رَفَعَ يَدَيْهِ حَتّٰى رَأَيْنَا عُفْرَةَ إِبْطَيْهِ ثُمَّ قَالَ اَللّٰهُمَّ هَلْ بَلَّغْتُ اَللّٰهُمَّ هَلْ بَلَّغْتُ۔ (بخاری، مسلم مشکوٰۃ۔کتاب الزکوٰۃ)

336. అబూ హమీద్ సాయిది ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) 'ఇబ్నుల్లుత్ బియ్యా' అనే వ్యక్తిని జకాత్ వసూలు చెయ్యడానికి నియమించారు. అతను వసూలు చేసుకువచ్చి దైవ ప్రవక్త సన్నిధిలో ధనం అప్పజెప్పుతూ 'ఇది మీ (బైతుల్ మాల్) వాటా, మరి ఇదేమో నాకు కానుకగా దొరికింది' అని పలికాడు. ఆ సందర్భంలో ప్రవక్త మహనీయులు

ఓ ప్రసంగం చేస్తూ దైవ స్తోత్రం తరువాత ఇలా బోధించారు. "దైవం నాకు అప్పగించిన బాధ్యత నిర్వహణకు నేను కార్యకర్తల్ని నియమిస్తాను. వారిలో ఒకతను వచ్చి నాతో 'ఇది నీది, ఇదేమో నాకు కానుకగా దొరికింది' అని అంటాడు. అతను తన అమ్మ నాన్నల వద్ద ఇంట్లో ఎందుకు కూర్చోలేదు. అప్పుడు కానవచ్చేది కానుకలు దొరికేవో లేదో. ముహమ్మద్ ప్రాణం గుప్పెట్లో ఉంచుకున్న దైవం సాక్షి ఈ సొమ్ములో నుంచి ఎవరు ఏమి తీసుకున్నా అతను ప్రళయంనాడు దాన్ని తన భుజాలపై మోస్తూ (దైవం సన్నిధిలో) హాజరవుతాడు. అది (అతను తీసుకున్నది) ఒంటె అయినట్లయితే అతని నోటి నుండి అలాంటి శబ్దమే వెలువడుతుంది. ఆవు అయితే దాని శబ్దం వెలువడుతుంది. మేకనో, గొర్రెనో అయినట్లయితే అలానే 'మేమే' అంటాడు." ఆ తరువాత ఆయన తన రెండు చేతుల్ని పైకెత్తారు. మేము ఆయన చంకల్లోని తెలుపును చూడగలిగాము. అప్పుడాయన ఇలా అన్నారు: "అల్లాహ్, నీవే సాక్షి, నేను నీ ఆదేశాన్నిచేరవేశాను, అల్లాహ్ నేను నీ ఆదేశాన్ని చేరవేశాను." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(۳۳۷) عَنْ اَبِیْ اُمَامَۃَ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مَنْ شَفَعَ لِاَحَدٍ شَفَاعَۃً فَاَھْدٰی لَہٗ ھَدِیَّۃً عَلَیْھَا فَقَبِلَھَا فَقَدْ اَتٰی بَابًا عَظِیْمًا مِّنْ اَبْوَابِ الرِّبٰا۔ (رواہ ابوداؤد، باب الولاۃ و ھدایاھم)

337. హజ్రత్ అబూ ఉమామ ఉల్లేఖనం: ఇందులో దైవప్రవక్త ఇలా తెలిపారు: "ఏ వ్యక్తి అయితే ఒకరికొరకు సిఫారసు చేస్తాడో అతనికి సిఫారసు చేయించుకున్న వ్యక్తి ఏదయినా కానుక ఇవ్వగా అతను దాన్ని స్వీకరిస్తే నిస్సందేహంగా అతను వడ్డీ ద్వారాల్లో ఓ పెద్ద ద్వారంలోకి ప్రవేశించినట్లు." (అబూదావూద్)

---

వేర మనస్తత్వం వల్ల జనిస్తుంది. ధన పిపాస వల్ల వృద్ధి అవుతుంది. లంచగొండితనం ప్రబలిన జాతిలో ఈ రెండు అవగుణాలూ చోటు చేసుకోవడం ఫలితంగా జాతి మొత్తం పిరికిదిగా తయారవడం యదార్థం.

(۳۳۸) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا اَقْرَضَ اَحَدُکُمْ قَرْضًا فَاَھْدٰی اِلَیْہِ اَوْحَمَلَہٗ عَلَی الدَّآبَّۃِ فَلَا یَرْکَبْہُ وَلَا یَقْبَلْھَا اِلَّآ اَنْ یَّکُوْنَ جَرٰی بَیْنَہٗ وَ بَیْنَہٗ قَبْلَ ذَالِکَ۔ (ابن ماجہ۔ مشکوٰۃ۔ باب الربا۔ ص۲۴۶)

338. హజ్రత్ అనస్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు: "మీలో ఎవరయినా మరొకరికి అప్పు ఇచ్చిన సందర్భంలో రుణగ్రస్తుడు అతనికి ఏదయినా కానుక ఇచ్చినా, లేదా ఏదయినా వాహనంలో ఎక్కించుకునే అవకాశం కల్పించినా అతను ఆ కానుకనూ స్వీకరించరాదు, వాహనాన్నీ అంగీకరించరాదు. అయితే మొదటి నుంచి (ఈ లావాదేవీలు) కొనసాగుతున్న పక్షంలో (ఫరవాలేదు)." (ఇబ్నుమాజ, మిష్కాత్)

(۳۳۹) عَنْ اَبِیْ مُوْسٰی قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا مَرَّ اَحَدُکُمْ فِیْ مَسْجِدِنَا اَوْ فِیْ سُوْقِنَا وَمَعَہٗ نَبْلٌ فَلْیُمْسِکْ عَلٰی نِصَالِھَا اَنْ یُّصِیْبَ اَحَدًا مِّنَ الْمُسْلِمِیْنَ مِنْھَا بِشَیْءٍ۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ باب مایضمن من الجنایات)

339. హజ్రత్ అబూ మూసా (ర.అ) ఓ ఉల్లేఖనంలో, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించినట్లు తెలిపారు, "మీలో ఎవరయినా మస్జిద్ లో, బజారులో తిరిగేటప్పుడు అంబులు చేత పట్టుకుని ఉన్నట్లయితే అతను దాని మొనను జాగ్రత్తగా పట్టుకోవాలి – దానివల్ల ఎవరికైనా హాని కలగకుండా ఉండేందుకు." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

336. ఈ హదీసులో సామూహిక బాధ్యతలకై నియుక్తులయిన వారిని గురించి స్పష్టంగా తెలుపడం జరిగింది. జనులు వారిని మెచ్చుకుని ఏదయినా బహుమానాలు, కానుకలు ఇచ్చినా దానికి కారణం వారి వ్యక్తిగత ప్రతిభా, శక్తి సామర్థ్యాలయినప్పటికీ వాటిని రాణింపజేసిన వేదిక సామూహిక వ్యవస్థే గనక దానికే ఆ ఖ్యాతి, కానుకలూ చెందుతాయి. అయితే సామూహిక వ్యవస్థే గనక కానుకల్ని అనుమతించినా, లేక

(۳۴۰) عَنْ جَابِرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّ الشَّيْطَانَ قَدْ أَيِسَ مِنْ أَنْ يَّعْبُدَهُ الْمُصَلُّوْنَ فِيْ جَزِيْرَةِ الْعَرَبِ وَلٰكِنْ فِي التَّحْرِيْشِ بَيْنَهُمْ۔ (رواه مسلم مشكوٰة۔ باب فی الوسوسة۔ ص١٨)

**340. హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు, "అరేబియాద్వీపంలోని నమాజ్ చేసేవారు తన్ను ఆరాధిస్తారన్న ఆశ షైతాన్‌కు ఇక లేదు. కాని ముస్లిముల మధ్య వైష మ్యాగ్నిని రేకెత్తించే విషయంలో అతను నిరాశచెందలేదు."(ముస్లిం, మిష్కాత్)**

---

దాతలు స్పష్టంగా వ్యక్తిగతంగానే అందజేసినప్పుడు వ్యవస్థకు తెలిపి తీసుకున్నా అందులో తప్పులేదు. వ్యవస్థను ప్రక్కకు నెట్టి కానుకలు పుచ్చుకోవడం కేవలం అనుమానాలకు దారి తీయడమేకాక, నేర ప్రవృత్తిని సయితం మనిషిలో జనింపజేస్తుంది. ఈ తీరు మనిషికి ప్రళయదినాన కూడా పరాభవ కారణమవుతుంది.

337 వడ్డీ అన్నది మనిషికి అధర్మంగా ఎలాంటి హక్కులేకుండా సంప్రాప్తమయ్యే సొమ్ము. అది సమాజంలో ఆర్థిక అసమానతలకు మూలమయ్యే దుష్ట సంప్రదాయం. దాన్ని నిషేధించడంతోపాటు ఇస్లాం, అది ఎన్నిమార్గాల ద్వారానయితే సంక్రమించే ఆస్కారముందో వాటన్నింటినీ మూసివెయ్యాలని సంకల్పించింది. అందుకే ఒకరి ద్వారా ఏదయినా సహాయం పొందిన వ్యక్తి తనకు ఉపకారం చేసిన వారికి కానుకగా ఏదయినా సమర్పించుకోవాలని అనుకోవడం సహజం. కాని అదికూడా ఓ విధమయిన అధర్మ సంపాదనకు మార్గం సుగమం చేసే సంప్రదాయంగా రూపొందుతుందన్న దృష్టితో, సహాయం చేసిన వ్యక్తి దాన్ని స్వీకరించకుండా ఆపారు దైవప్రవక్త.

338 అప్పు ఇవ్వడం అన్నది సమాజంలో పరస్పర సహాయ సహకారాల ప్రాతిపదికగా జరగాలి కాని ఉపకారం చేసి దానికి ప్రతిఫలం పొందే బుద్ధి జనించరాదు. అందుకే రుణదాతలు రుణగ్రస్తుల నుండి కానుకలనే కాదు మామూలుగా వాహనంలో లిఫ్టునయినా సరే స్వీకరించరాదని బోధించడం జరిగింది. అయితే వ్యాపార సంబంధ మయిన లావాదేవీలు, స్నేహితులమధ్య మామూలుగా సాగే ఇచ్చిపుచ్చుకోవడాలకు ఇక్కడ మినహాయింపు ఇవ్వడం కూడా జరిగింది. ఇన్ని జాగ్రత్తలు ప్రతిపాదించిన ఇస్లామీయ వ్యవస్థను నేడు ముస్లిములు తమ అవగుణాల కారణంగా ఎంతగా భ్రష్టు పట్టిస్తున్నారు?

339 జనులు అధికంగా తిరుగాడే చోట మొనదేలిన ఆయుధాలతో సంచరించేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తను నేర్పడం జరిగింది. రోడ్డుపై ఇతరులకు ఇబ్బంది కలిగించే సరకును మోసుకుపోయేటప్పుడు కూడా దీన్ని దృష్టిలో ఉంచుకోవాలి.

(۳۴۱) عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو اَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَ سَلَّمَ
قَالَ زَوَالُ الدُّنْيَا اَهْوَنُ عَلَى اللهِ مِنْ قَتْلِ رَجُلٍ مُسْلِمٍ (الترمذی مشکوٰۃ کتاب القصاص)

341. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (ర.అ) ఉల్లేఖనం: అందులో దైవ సందేశహరులు, "దేవుని దృష్టిలో ఒక ముస్లిం వ్యక్తి హత్యకు ప్రతిగా ప్రపంచమంతా నాశనమయిపోవడం కూడా తేలికయినదే." అని నుడివారు.

(తిర్మిజి, మిష్కాత్)

(۳۴۲) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
اَبْغَضُ النَّاسِ اِلَى اللهِ ثَلٰثَةٌ مُلْحِدٌ فِي الْحَرَمِ وَمُبْتَغٍ فِي الْاِسْلَامِ سُنَّةَ
الْجَاهِلِيَّةِ وَمُطَّلِبُ دَمِ امْرِئٍ مُسْلِمٍ بِغَيْرِ حَقٍّ لِيُهْرِيْقَ دَمَهُ۔ (رواہ البخاری
مشکوٰۃ - باب الاعتصام ص۱۹)

342. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు: "అల్లాహ్ దృష్టిలో అందరికన్నా అత్యంత ఆగ్రహపాత్రులయిన వారు మూడు రకాల వ్యక్తులు, (1) 'హరమ్'లో నాస్తికతను ప్రచారం చేసేవాడు (2) ఇస్లాంలో అజ్ఞానకాలపు సంప్రదాయాలను వెదికేవాడు (3) అధర్మంగా ఓ ముస్లింని చంపాలని వెంటాడేవాడు."

(బుఖారి, మిష్కాత్)

---

340. మూలంలో 'అల్ ముసల్లీన్ – నమాజ్ చేసేవారు – అనే పదం ప్రయోగించడం జరిగింది. అంటే ముస్లిములని అర్థం. నమాజ్‌ను క్రమం తప్పకుండా నియమానుసారం పాటించేవారు దైవం పట్ల భయభక్తులు కలవారయి ఉండటాన షైతాన్ ప్రభావానికి లోనవరు, వాని ప్రేరేపణలకు దాసోహమవరు. ఇక్కడ ఆరాధన అంటే "పూజ" అన్నదే భావం కాదు. జీవితంలోని అన్ని రంగాల్లోనూ షైతాన్ చూపే మార్గాన్ని, షైతాన్ పోకడలను అనుసరించడం అన్నమాట. షైతాన్ నిజమయిన ముస్లిముల్ని దైవ మార్గం నుంచి తప్పించలేకపోయినా వారి మధ్య విభేదాలు సృష్టించి వాటిని వైరత్వం, వైషమ్యాలవరకు గొనిపోగలడు. షైతాన్ ఈ విషయంలో సాధించిన విజయాలు నేడు మనం కళ్ళారా చూస్తున్నాము. మనం ఇంకా షైతాన్ అడుగుజాడల్లోనే నడవాలని అనుకుంటున్నామా?

(۳۴۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَرَّ عَلٰی صُبْرَةِ طَعَامٍ فَاَدْخَلَ یَدَهٗ فِیْهَا فَنَالَتْ اَصَابِعُهٗ بَلَلًا فَقَالَ مَا هٰذَا یَا صَاحِبَ الطَّعَامِ قَالَ اَصَابَتْهُ السَّمَآءُ یَا رَسُوْلَ اللّٰهِ قَالَ اَفَلَا جَعَلْتَهٗ فَوْقَ الطَّعَامِ حَتّٰی یَرَاهُ النَّاسُ مَنْ غَشَّ فَلَیْسَ مِنِّیْ۔ (رواه مسلم، مشکوٰة ص۳۴۸)

343. హజ్రత్ అబూహురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఓసారి ధాన్యం కొట్టుమీదుగా వెళ్ళారు. ఆయన ధాన్యం రాశిలోకి చెయ్యివేశారు. ఆయన వేళ్ళకు కాస్త తడి తగిలింది. ఆయన ధాన్యం అమ్మే వాణ్ణి సంబోధించి ఇదేమిటయ్యా అని ప్రశ్నించారు. దానికి అతను, ఈ రాశిపై వర్షం నీళ్ళు కురిసాయి అని బదులిచ్చాడు. దాని మీదట ఆయన అతనితో, 'నీవు తడిసిన ధాన్యం పైన ఉంచవలసింది జనం దాన్ని చూసు కునే వారు. మోసగించే వారికి నాతో ఎలాంటి సంబంధమూ లేదు' అని అన్నారు. (ముస్లిం, మిష్కాత్)

---

341 దైవప్రవక్త బోధనలు సాధారణంగా ఇస్లామీయ సమాజంలో జరిగినవి గనక ఆ సందర్భాన్ని సదా దృష్టిలో ఉంచుకోవాలి. ఈ హదీసును దివ్య గ్రంథంలోని ఓ వచనం – అల్ మాఇదా: 32 వెలుగులో అర్థం చేసుకోవాలి.

342. హరమ్ (పవిత్రస్థలం) అనంటే మక్కా నగరమని అర్థం. నాస్తికతను ప్రచారం చెయ్యడం ప్రతిచోటా దుష్టమయినదే కాని అదే దేవుని ఏకత్వం చాటేచోట కూడా జరిగితే మరీ హేయమయినది. అలాగే ఇస్లాం విజ్ఞానానికి, దైవజ్ఞానానికి, సభ్యతా సంస్కారాలకు మారుపేరు. అది గ్రహించి తిరిగి అజ్ఞానపు పోకడలకై వెంపర్లాడటం నీచత్వం అవడంలో సందేహమేముంది. తోటి సోదరుని హత్యచేసే ఉద్దేశ్యంతో అతని వెంటపడటం, హత్య చెయ్యలేక పోయినా నీచమయినదే. హత్య చేసివేస్తే ఇక దాని చెడుగును గురించి చెప్పనవసరం లేదు.

343. ఆ ధాన్యం అమ్మే వానికి మోసం చేసే ఉద్దేశ్యం లేకపోవచ్చు. కాని తడిసిన ధాన్యం కనపడకుండా ఉంటే కొనేవాడు మోసపొయ్యే ప్రమాదముంటుంది. అందువల్ల అమ్మే వస్తువులో ఏదయినా లోపముంటే దాన్ని బహిర్గతపరచడం అమ్మే వాని బాధ్యత. కొనేవాడు అడక్కుండానే లోపం తెలుసుకునేలా చెయ్యడం అమ్మేవాని సద్బుద్ధికి నిదర్శనం. అలా చెయ్యకపోవడం నేరం.

(٣٤٤) عَنْ مَّعْمَرٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنِ احْتَكَرَ فَهُوَ خَاطِئٌ۔ (رواه مسلم، مشكوة۔ باب الاحتكار)

344. హజ్రత్ మోమర్ ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు, "ధాన్యం దొంగ నిల్వలుంచుకునే వ్యక్తి అపరాధి" అని సెలవిచ్చారు.
(ముస్లిం, మిష్కాత్)

(٣٤٥) عَنْ جَابِرٍ اَنَّهُ سَمِعَ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ عَامَ الْفَتْحِ وَهُوَ بِمَكَّةَ اِنَّ اللّٰهَ وَرَسُوْلَهُ حَرَّمَ بَيْعَ الْخَمْرِ وَالْمَيْتَةِ وَالْخِنْزِيْرِ وَالْاَصْنَامِ فَقِيْلَ يَا رَسُوْلَ اللّٰهِ اَرَاَيْتَ شُحُوْمَ الْمَيْتَةِ فَاِنَّهُ تُطْلٰى بِهِ السُّفُنُ وَيُدْهَنُ بِهِ الْجُلُوْدُ وَيَسْتَصْبِحُ بِهَا النَّاسُ فَقَالَ لَا هُوَ حَرَامٌ ثُمَّ قَالَ عِنْدَ ذٰلِكَ قَاتَلَ اللّٰهُ الْيَهُوْدَ اِنَّ اللّٰهَ لَمَّا حَرَّمَ شُحُوْمَهَا اَجْمَلُوْهُ ثُمَّ بَاعُوْهُ فَاَكَلُوْا ثَمَنَهُ۔ (بخاری، مسلم۔ مشکوۃ۔ ط٢٤١)

345. మక్కా విజయం జరిగిన సంవత్సరం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవివ్వగా విన్నట్లు హజ్రత్ జాబిర్ (ర.అ) ఉల్లేఖించారు. అప్పుడు ఆయన (సఅసం) మక్కాలోనే ఉన్నారు. దైవం, దైవ ప్రవక్త మద్యాన్ని, మృత జంతువును, పందిని విగ్రహాలను అమ్మడాన్ని నిషేధించారు. "మృత జంతువు క్రొవ్వును గురించి మీ అభిప్రాయం ఏమిటి దైవ ప్రవక్తా, దాని ద్వారా పడవలకు పాలిష్ చేస్తారు, తోళ్ళను మెత్తపరుస్తారు. దాన్ని దీపాల్లో చమురుగా కూడా వాడతారు." అని ప్రశ్నించగా ఆయన "కాదు, అది నిషిద్ధం" అని చెప్పి అప్పుడు ఆయన తిరిగి ఇలా సెలవిచ్చారు. "దైవం యూదుల్ని నాశనం చెయ్య, మృతజంతువు క్రొవ్వును దైవం నిషేధించగా వారు దాన్ని కాచి కరగించి అమ్మి సొమ్ము చేసుకుని తిన్నారు."
(బుఖారి, ముస్లిం - మిష్కాత్)

---

344. ధాన్యాన్ని లేక మరేదయినా నిత్యావసర వస్తువును ధరలు పెరిగే వరకు నిలువలుంచి అమ్మడాన్ని దొంగ నిల్వలు (Hoarding) అనంటారు. ఇలాంటి వ్యాపారులు వాస్తవానికి దేశ ప్రజల అవసరాన్ని, వారి అశక్తతను ఆసరాగా తీసుకుని

(۳۴۶) عَنْ عَمْرِوبْنِ شُعَيْبٍ عَنْ اَبِيْهِ عَنْ جَدِّهٖ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ تَطَبَّبَ وَلَمْ يُعْلَمْ مِنْهُ طِبٌّ فَهُوَ ضَامِنٌ۔ (رواہ ابوداؤد والنسائی۔ مشکوٰۃ۔ باب الدیات)

346. అమ్ర్ బిన్ షుయీబ్, తన తండ్రి ద్వారాను, ఆయన తన తండ్రి ద్వారానూ ఉల్లేఖించిన దాని ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "రోగం, చికిత్స ఇత్యాది విషయాల జ్ఞానం, అనుభవం ఏమీ లేకుండానే వైద్యం చెయ్యదొడిగితే అతనే (రోగి మరణానికో లేదా రోగం కుదరడానికో) బాధ్యుడవుతాడు." (అబూ దావూద్, నసాయి, మిష్కాత్)

(۳۴۷) عَنْ اَبِىْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَخْطُبُ الرَّجُلُ عَلٰى خِطْبَةِ اَخِيْهِ حَتّٰى يَنْكِحَ اَوْيَتْرُكَ۔ (متفق علیہ۔ مشکوٰۃ۔ ص۲۶۳)

347. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "మీలో ఎవ్వరున్నా తన సోదరుని పెళ్ళి ప్రతిపాదనపై తమ ప్రతిపాదనను ముందుంచరాదు. అతను పెళ్ళి చేసుకోవడమో లేక దాన్ని మానుకోవడం జరిగేంతవరకు నిరీక్షించాలి."
(ముత్తఫకున్ అలైహ్ - మిష్కాత్)

---

ఇలాంటి స్వార్థపరమయిన ఎత్తుగడకు పాల్పడతారు. దీన్ని ఓ ముస్లిం సమాజంలో ఎంత మాత్రం సహించడం జరగదు. కొందరు పండితుల దృష్టిలో ఒక్క ధాన్యమే కాదు, నిత్యావసర వస్తువులు ఏవయినా నిల్వలుంచరాదు. ఉదాహరణకు ఇంధనం, మందులు, చక్కెర వగైరా. మరో ఉల్లేఖనంలో ఆయన నిల్వలుంచేవాణ్ణి శాపగ్రస్తుడని పేర్కొన్నారు.

345. ఓ నిషిద్ధ వస్తువును ఏదయినా సాకుతో ధర్మసమ్మతమయిందిగా చేయడం ఎంతో ప్రమాదభరితమయిన చర్య. ఇదో ఉపద్రవం, దీనివల్ల మొత్తం సమాజంలో అవినీతి, వంచన, వ్యాపిస్తాయి. క్రమేణ షరీఅత్ ఉద్దేశ్యం కళ్ళకు దూరమయి కేవలం ప్రాపంచిక ప్రయోజనమే ప్రాముఖ్యం అవుతుంది.

346. ఏదయినా అధీకృత సంస్థ, విద్యాలయం ద్వారా అనుమతి పొందకుండానే

(۳۴۸) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ
مَطْلُ الْغَنِیِّ ظُلْمٌ فَاِذَا اُتْبِعَ اَحَدُکُمْ عَلٰی مَلِیْءٍ فَلْیَتْبَعْ ۔ (بخاری، مسلم، مشکوٰۃ
باب الافلاس والانظار)

348. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "సంపన్నుడయిన వ్యక్తి (ఒకరి హక్కును లేదా అప్పును తీర్చడంలో) జాప్యం చెయ్యడం అక్రమం. మీలో ఎవరినయినా ఆ సంపన్న వ్యక్తి వెంటపడి, తన పలుకుబడి, పరపతిని వినియోగించి తన సోదరుని హక్కును ఇప్పించాలి." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(۳۴۹) عَنْ اَسْمَاءَ بِنْتِ یَزِیْدَ الْاَنْصَارِیَّةِ مَرَّ بِیَ النَّبِیُّ صَلَّی اللّٰهُ
عَلَیْهِ وَسَلَّمَ وَاَنَا فِیْ جَوَارٍ اَتْرَابٍ لِیْ فَسَلَّمَ عَلَیْنَا وَقَالَ اِیَّاکُنَّ وَکُفْرَ
الْمُنْعِمِیْنَ قَالَ لَعَلَّ اِحْدٰکُنَّ تَطُوْلُ اَیْمَتُهَا مِنْ اَبَوَیْهَا ثُمَّ یَرْزُقُهَا
اللّٰهُ زَوْجًا وَیَرْزُقُهَا مِنْهُ وَلَدًا فَتَغْضَبُ الْغَضْبَةَ فَتَکْفُرُ فَتَقُوْلُ مَا رَاَیْتُ
مِنْكَ خَیْرًا قَطُّ ۔ (الادب المفرد۔ باب التسلیم علی النساء۔ ص ۱۵۳)

349. యజీద్ అన్సారియా కుమార్తె అస్మా (ర.అ) ఇలా ఉల్లేఖించారు: ఒకసారి దైవ ప్రవక్త (సఅసం) నేనున్న ప్రాంతం వైపుగా వెళ్ళారు. అప్పుడు నేను సమవయస్కులైన యువతుల సహచర్యంలో ఉన్నాను. ఆయన మాకు సలామ్ చేశారు. తరువాత ఇలా సెలవిచ్చారు. "మేలు చేసిన వారి కృతఘ్నతకు దూరంగా ఉండండి. మీలో ఎవరయినా తన తల్లిదండ్రుల వద్ద బహుకాలం వరకు ఉంటుంది. తరువాత ఆమెకు దైవం భర్త సహచర్యాన్ని అనుగ్రహిస్తాడు. ఆ తరువాత వాళ్ళింట సంతానం సందడి ఏర్పడుతుంది. (ఇంత జరిగి) ఎప్పుడయినా భర్తతో ఏదయినా తగాదా వచ్చినప్పుడు (ఈ సుదీర్ఘ సహచర్యాన్ని విస్మరించి) 'నీవు నా యెడల ఎన్నడూ మంచిగా మెలగలేదు' అని నిందిస్తుంది." (అల్ అదబుల్ ముఫ్రద్)

(٣٥٠) عَنْ اَسْمَاءَ اَنَّ امْرَأَةً قَالَتْ يَا رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ لِیْ ضَرَّةً فَهَلْ لِیْ جُنَاحٌ اِنْ تَشَبَّعْتُ مِنْ زَوْجِیْ غَيْرَ الَّذِیْ يُعْطِيْنِیْ فَقَالَ الْمُتَشَبِّعُ بِمَا لَمْ يُعْطَ كَلَابِسِ ثَوْبَیْ زُوْرٍ۔ (متفق علیہ مشکوٰۃ۔ ۲۸۳)

350. హజ్రత్ అస్మా ఉల్లేఖనం ప్రకారం, ఓ మహిళ దైవ ప్రవక్తతో, 'ప్రవక్తా నాకు ఒక సవతి ఉంది. అయితే నాకు నా భర్త ఇచ్చిన దానికి మించిన సంపద ఉన్నట్లు వస్త్రధారణ గట్రా చేసి ఆమెకెదురుగా ప్రదర్శించడం ఏమయినా అభ్యంతరకరమా?' అని అడిగింది. దానికి ప్రవక్త మహనీయులు, "యదార్థానికి విరుద్ధంగా సంపన్నతను ప్రదర్శించే వారు అబద్ధపు వస్త్రధారణ చేసిన వారితో సమానం" అని సెలవిచ్చారు.(ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

వైద్య వృత్తి చేపట్టడం ఘోరమయిన అపరాధం. దీనికి ఇస్లామీయ రాజ్యంలో కఠినాతి కఠినమయిన శిక్ష పడటం సంభవమే.

347. ఒకరు ఓ చోట పెళ్ళి సంబంధం కొరకు సంప్రదింపులు ప్రారంభించినప్పుడు ఏదో ఓ నిర్ణయం జరక్క మునుపే అదే చోట మరో వ్యక్తి తన కోసమో తన ఆత్మీయుల కోసమో మరో ప్రతిపాదన పంపడం ధర్మసమ్మతం కాదు. ఇలాంటి వైఖరి షరీఅత్‌లో అత్యంత నీచమయినదిగా స్వార్థపూరితమయినదిగా పరిగణించబడుతుంది. పెళ్ళి పెటాకుల మాదిరిగానే ఇతర వ్యాపార వ్యవహారాల్లోనూ ఈ నియమం పాటించాలని షరీఅత్ ప్రతిబంధం పెట్టింది. దాన్ని ఎన్నటికీ మరువరాదు.

348 అప్పు ఇచ్చిన వాడు తీసుకున్న వాడి పట్ల కాస్త మెతక వైఖరి నవలంబించాలన్నది సాధారణ బోధన. కాని తీసుకున్నవాడు స్థితిపరుడయితే లేక స్థితిపరుడయిన వ్యక్తి ఇతరుల హక్కును అందజెయ్యడంలో జాప్యం చేస్తున్నట్లయితే అది కేవలం అన్యాయం, అక్రమం తప్ప మరేమీ కాదు. అలాంటి వ్యక్తి వెంట పడి తన శక్తియుక్తుల్ని వినియోగించి హక్కుదారునికి అతని హక్కును అందజెయ్యడం ఎంత ముఖ్యమో ఈ హదీసు తెలుపుతోంది. ఒకరి హక్కును ఎవరయినా కాజేస్తూ ఉంటే సమాజంలోని పలుకుబడిగల వర్గం తమాషా చూస్తూ చేతులు ముడుచుకు కూర్చోవడం తగదు. బలహీనుడు, తన హక్కును సాధించుకోలేకపోతున్న వ్యక్తికి సహాయపడి అతని హక్కు అతనికి అందేలా యత్నించడం వారి ధర్మం.

349. ఈ ఉల్లేఖనం వల్ల అనేక విషయాలు వెల్లడవుతున్నాయి:

(1) కొందరు స్త్రీలు సమావేశమయి ఉన్నప్పుడు అనుమానాలు తలెత్తవన్న నమ్మకముంటే

(۳۵۱) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
مَنْ تَشَبَّہَ بِقَوْمٍ فَھُوَ مِنْھُمْ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ کتاب اللباس)

351. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ ఉల్లేఖనం: దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చారు, "ఎవరు ఏ జాతి పోలికను అనుకరిస్తాడో అతను వారితోపాటే గణించబడతాడు." (అబూదావూద్, మిష్కాత్)

---

అపరిచిత వ్యక్తి వారికి సలామ్ చెయ్యవచ్చు, వారితో సంభాషించవచ్చు. (2) ఈ హదీసులో స్త్రీ మనస్తత్వంలోని ఓ సున్నిత విషయాన్ని స్పర్శించడం జరిగింది. సాధారణంగా సున్నిత మనస్కురాలయిన స్త్రీలు తన్ను ప్రేమించే భర్తతో చిన్న తగాదా వచ్చినా భరించలేక నిత్యం అలానే గడిచినట్లు తలపోస్తారు, భర్తను నిందిస్తారు. భర్తలోని ఏదో ఓ చిన్న లోపాన్ని చూసుకుని అతనిలోని సద్గుణాలన్నింటినీ విస్మరిస్తారు. దాన్నే ఇక్కడ ఎత్తి చూపి అలా కాక మంచివైపునూ చూడాలని బోధించడం జరిగింది. అలానే మరోచోట భార్యలోనూ ఏదో చిన్న లోపం చూసి అసలు ఆవిడలో మంచి అన్నదే లేనట్లు ప్రవర్తించడం సరయిన పద్ధతి కాదని భర్తలకూ బోధించడం జరిగింది. "విశ్వాసి అయిన భర్త విశ్వాసురాలయిన భార్య పట్ల విద్వేషం పెంచుకోరాదు. ఆమెలో ఏదైనా ఓ గుణం నచ్చకపోతే ఇతర గుణాలను పరిశీలించండి అవి మీకు నచ్చుతాయి" అని తెలుపడం జరిగింది.

350. సవతిని వెక్కిరించడానికి భర్త తన్ను ఆవిడ కంటే అధికంగా ఆదరిస్తాడని, అనుగ్రహిస్తాడని చాటడానికి లేని సంపదను ఉన్నట్లు ప్రదర్శించడం స్త్రీలోని సహజ ఈర్ష్యా విద్వేషాల మనస్తత్వాన్ని చాటుతోంది. వాస్తవ విరుద్ధమయిన అలాంటి ప్రదర్శన, లేక గర్వంతో, లేని గొప్పదనాన్ని చాటే బుద్ధితో చేసే ప్రదర్శనలు కూడా ఓ విధమయిన అబద్ధాలే. మనిషి తన స్థితి ఎలా ఉందో తన వస్త్రధారణ, తదితర విషయాల ద్వారా కూడా అలావే కనబడాలి.

351. పోలిక, అనుకరణ రెండు విధాలు కావచ్చు.

(1) తన నిజమయిన వేషభూషణ, జీవనసరళి, పలుగురితో మసలుకునే తీరును మార్చుకుని, భిన్నమయిన వ్యక్తిగా కన్పించడానికి చేసే యత్నం. ముస్లిం అయిన వ్యక్తి, ఇతను ముస్లిమా, కాదా అన్న అనుమానం వచ్చే విధంగా రూపొందడం.

(2) ఓ సమాజం మొత్తం దాని వ్యక్తిత్వాన్ని ఇతర జాతుల్లా మార్చివెయ్యడం లేదా వారి చిహ్నాలను అనుకరించడం. ముస్లిముల సమాజం ముస్లిమేతర సమాజంలా వారి చిహ్నాలను, ఆచార వ్యవహారాలను, వేషభూషణలను, మొత్తానికి వారి విధానాలను అనుకరించడం.

(٣٥٢) عَنْ أَبِي الْهَيَاجِ الْأَسَدِيِّ قَالَ قَالَ لِي عَلِيٌّ أَبْعَثُكَ عَلَى مَا بَعَثَنِي عَلَيْهِ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ أَنْ لَا تَدَعَ تِمْثَالًا إِلَّا طَمَسْتَهُ وَلَا قَبْرًا مُشْرِفًا إِلَّا سَوَّيْتَهُ - (رواه مسلم۔مشکوٰۃ۔باب دفن المیت)

352. అబుల్ హయాజ్ అసది ఓ ఉల్లేఖనంలో ఇలా తెలిపారు: హజ్రత్ అలి ఒకసారి, "నన్ను దైవ ప్రవక్త ఏ కార్యనిర్వహణకు పంపారో దానిగ్గాను నేను నిన్ను పంపుతున్నాను. నీవు ఎక్కడ ఏ బొమ్మను చూసినా దాన్ని చెరిపివెయ్యి. ఎక్కడ ఏ ఎత్తయిన గోరిని చూసినా దాన్ని నేలమట్టం చెయ్యి." అని నన్ను పురమాయించారు. (ముస్లిం, మిష్కాత్)

(٣٥٣) عَنْ قُدَامَةَ قَالَ رَأَيْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَرْمِي الْجَمْرَةَ يَوْمَ النَّحْرِ عَلَى نَاقَةٍ صَهْبَاءَ لَيْسَ ضَرْبٌ وَلَا طَرْدٌ وَلَيْسَ قِيلَ إِلَيْكَ إِلَيْكَ - (رواه الشافعی۔مشکوٰۃ۔باب رمی الجمار)

353. 'కుదామ' (ర.అ) ఓ ఉల్లేఖనంలో ఇలా తెలిపారు: "నేను ప్రవక్తను కుర్బానీ దినాన తెలతెల్లగా, ఎర్రఎర్రగా ఉండే ఓ ఒంటెపై స్వారీ చేస్తూ 'జమ్రహ్'ను చిన్నచిన్న కంకర రాళ్ళతో కొట్టగా చూశాను. ఆ సమయంలో బంట్రోతుల లాఠీలు లేవు, మందలింపులూ హెచ్చరికలు లేవు, తప్పుకోండి, తప్పుకోండి అన్న నినాదాలూ లేవు." (మిష్కాత్ - షాఫయీ)

---

అయితే ముస్లిమేతర నాగరికతల్లోని లేదా ఆచార వ్యవహారాల్లోని ఏవయినా ప్రయోజనకరమయిన, ఇస్లామీయ సంప్రదాయాలకు వ్యతిరేకం కాని అంశాలను అనుసరిస్తే అందులో తప్పు లేదు. ఇక్కడ ఓ సముదాయంగా ముస్లిములు తమ వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతను కోల్పోకుండా వారించడమే ఉద్దేశ్యం.
ఓ ఉల్లేఖనం ప్రకారం రోమనులు వాడే ఓవరుకోటులాంటి దాన్ని ప్రవక్త మహనీయులు నిరభ్యంతరకరంగా వాడవచ్చు అని బోధించారు. అలాగే ఉమ్మె హబీబా (ర.అ)సలహా మేరకు అబిసీనియా సంప్రదాయం ప్రకారం మహిళల జనాజా (శవ పేటిక)పై అర్ధచంద్రాకారపు కప్పును నిర్మించారు. ఇవన్నీ ప్రయోజనకరమయిన విధానాలు, వాటి పట్ల అభ్యంతరం లేదు.

(۳۵۴) عَنْ اَبِیْ مَسْعُوْدِنِ الْاَنْصَارِیْ قَالَ نَھٰی رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَنْ یَّقُوْمَ الْاِمَامُ فَوْقَ شَیْئٍ وَالنَّاسُ خَلْفَہٗ یَعْنِیْ اَسْفَلَ مِنْہُ۔ (رواہ الدارقطنی۔مشکوٰۃ۔باب المشی بالجنازۃ)

354. 'ప్రవక్త మహనీయులు, నమాజ్ లో ఇమామ్ (నాయకుడు) ఎత్తయిన ప్రదేశంలో నిల్చొని జనం ఆయన వెనకాల అనగా క్రింది ప్రదేశంలో నిల్చోవడాన్ని వారించారు.' అని అబూ మస్ఊద్ అన్సారి (ర.అ) ఉల్లేఖించారు. (దార్ కుత్ని - మిష్కాత్)

(۳۵۵) عَنْ عَبْدِاللّٰہِ عَنِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ بَیْنَ یَدَیِ السَّاعَۃِ تَسْلِیْمُ الْخَاصَّۃِ وَفُشُوُّ التِّجَارَۃِ حَتّٰی تُعِیْنَ الْمَرْاَۃُ زَوْجَھَا عَلَی التِّجَارَۃِ وَقَطْعُ الْاَرْحَامِ وَفُشُوُّ الْعِلْمِ وَظُھُوْرُ الشَّھَادَۃِ بِالزُّوْرِ وَکِتْمَانُ شَھَادَۃِ الْحَقِّ۔ (الادب المفرد۔باب من کرہ تسلیم الخاصۃ۔ص۱۵۵)

355. హజ్రత్ అబ్దుల్లా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "ప్రళయ దినం రాకకు పూర్వం కొన్ని విషయాలు వ్యాప్తిలోకి వస్తాయి, (1) ప్రముఖులకు సలాము చెయ్యడం (2) వాణిజ్య వ్యవహారాల వ్యాప్తి - చివరికి స్త్రీ కూడా తన భర్తకు సాయపడ వలసి వస్తుంది. (3) బంధువుల ఎడల నిరాదరణ (4) విజ్ఞాన వ్యాప్తి (5) అబద్ధపు సాక్ష్యాలు విపరీతమవడం, సత్యసాక్ష్యం పూజ్యమయిపోవడం."

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

352. బహుదైవారాధన, విగ్రహారాధన, వీరపూజ (Hero worship) కారణాలలోని రెండు ముఖ్య కారణాలను పేర్కొని వాటిని తుడిచివెయ్యాలని ఇక్కడ బోధించడం జరిగింది.

353 కుర్బానీ దినం అనంటే జిల్‌హజ్జ 10వ తారీఖున అన్న మాట. 'జమ్రహ్' అన్నది హజ్ సమయంలో ఆచరించే 'రమి' అన్న కంకర రాళ్ళు రువ్వే సంప్రదాయానికి గురి. ఈ హదీసులో చెప్పవచ్చిందేమిటంటే దైవ ప్రవక్త ఆనాడు ఇస్లామీయ రాజ్యాధి

(۳۵۶) عَنْ عَائِشَةَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِنَّ اَعْظَمَ النَّاسِ جُرْمًا اِنْسَانٌ شَاعِرٌ يَهْجُوا الْقَبِيْلَةَ مِنْ اَسْرِهَا وَرَجُلٌ يَنْفِيْ مِنْ اَبِيْهِ۔ (الادب المفرد۔ باب مایکرہ من الشعر۔ص ۱۲۷)

356. హజ్రత్ ఆయిషా ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "జనుల్లో రెండు రకాల అపరాధులు హీనమయిన వారు. (1) తన తెగవారిని ఎట్టి పరిస్థితుల్లోనూ తెగడడంలోనే గడిపే కుకవి. (2) తన తండ్రిని తండ్రి కాదని తిరస్కరించేవాడు."

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

నేత, దేవుని అంతిమ ప్రవక్త అయినప్పటికీ ఆయన చుట్టూ బంట్రోతులు, తప్పు కోండి అని గోల పెట్టే భట్రాజులు ఇత్యాది రాజ ఠీవి ఉట్టిపడే ఏ హంగామా లేదు అన్నది. ప్రవక్త మహనీయులు అత్యంత నిరాడంబర జీవి అన్న దానికి ఇదొక ఉదాహరణ.

354. నమాజ్ చేయించే ఇమామ్ (నాయకుని) ని ఆయన గొప్పదనాన్ని చాటడానికి ఎత్తయిన ప్రదేశంలో నిలబెట్టరాదు. అయితే ఆయనతో పాటు మరికొందరు వెనుక నమాజ్ చేసేవారు సయితమూ ఆ ఎత్తయిన ప్రదేశంలో నిలుస్తే అప్పుడు అందులో తప్పులేదు. అలాగే కేవలం అందరికీ వినపడాలన్న ఉద్దేశ్యంతో వక్తకు ఎత్తయిన వేదిక మీద నిలబెట్టడంలోనూ తప్పులేదు. ఎవరికీ మరొకరిసమక్షంలో కేవలం వారి హోదా కారణంగా ప్రత్యేక స్థానాన్ని కల్పించడం భావ్యం కాదన్నదే ఈ హదీసు ప్రబోధం.

355. ఇందులో ప్రస్తావించిన నాలుగు విషయాలకు భావం (1) పెద్దలయినా సరే సామాన్య మనుషులకు సలామ్ చేసే అలవాటు పోయి కేవలం పెద్దలనబడే వారికే సలాము చెయ్యడం సమాజంలో పెరుగుతుందన్నమాట. (2) ధనార్జనా పిపాస ఎంతగా పెరిగిపోతుందంటే పురుషుడు సంపాదించేది సరిపోకపోగా స్త్రీ సయితం పురుషునితోబాటు ధనార్జనలో చేదోడువాదోడుగా నిలవటం ముఖ్యమని భావిస్తుంది. (3) మనుషుల్లో స్వార్థం పెరిగి, బంధువులు, ఆత్మీయులు, తనవారు, మిత్రులు అన్న పాశం తెగిపోయి ఎవరికి వారే యమునా తీరే అవుతారన్నమాట. (4) విజ్ఞాన పరివ్యాప్తి అయితే మెండుగా జరుగుతుందిగాని జనంలో మంచితనం, సభ్యతా సంస్కారాలు, గౌరవ, మర్యాదలు, నైతికతా ప్రమాణాలు అనుదినం దిగజారిపోతుంటాయన్న మాట. (5) మొత్తానికి చెడుగు అన్నది వ్యాపించి ఆధిక్యత పొంది, దుర్జనుల ధాటికి భయపడి సజ్జనులు సయితం నిజం పలకడానికి వెనుకాడుతారు. సమాజం మొత్తం దౌష్ట్య పంకిలంలో తలమునకలయి ఉన్నందున వ్యక్తిగత నిష్ఠా పరాయణులు సయితం చెడుగు సమక్షంలో నోరు మెదిపేందుకు సాహసించలేరు.

(٣٥٧) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
شَرُّ الطَّعَامِ طَعَامُ الْوَلِيْمَةِ يُدْعٰى لَهَا الْاَغْنِيَاءُ وَيُتْرَكُ الْفُقَرَاءُ وَمَنْ
تَرَكَ الدَّعْوَةَ فَقَدْ عَصَى اللّٰهَ وَرَسُوْلَهٗ۔ (بخاری، مسلم، مشکوٰة ص۲)

357. దైవ సందేశహరులు బోధించినట్లు హజ్రత్ అబూ హురైరా ఇలా ఉల్లేఖించారు: "విందుల్లో అత్యంత హేయమయింది కలిగిన వారిని ఆహ్వానించి నిరుపేదల్ని వదలివేసిన వలీమా విందు. ఇంకా ఎవరయితే (బలమయిన కారణం లేకుండానే) విందు పిలుపును తిరస్కరిస్తాడో అతను దైవం, దైవ ప్రవక్తలకు అవిధేయుడయ్యాడు." (బుఖారి, ముస్లిం)

(٣٥٨) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَا يَخْلُوَنَّ رَجُلٌ بِامْرَأَةٍ وَلَا تُسَافِرَنَّ امْرَأَةٌ اِلَّا وَمَعَهَا مَحْرَمٌ فَقَالَ
رَجُلٌ يَارَسُوْلَ اللّٰهِ اُكْتُتِبْتُ فِيْ غَزْوَةٍ كَذَا وَكَذَا وَخَرَجَتِ امْرَأَتِيْ حَاجَّةً
قَالَ اذْهَبْ فَاحْجُجْ مَعَ امْرَأَتِكَ۔ (بخاری، مسلم، مشکوٰة۔ کتاب المناسک)

358. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఓ ఉల్లేఖనంలో దైవ ప్రవక్త ఇలా బోధించారని తెలిపారు: "పురుషుడు పర స్త్రీతో ఏకాంతంగా ఉండకూడదు. స్త్రీ ముహ్రమ్ పురుషుడు తోడుగా లేకుండా ప్రయాణం చెయ్యరాదు." దానికి అక్కడున్న ఓ వ్యక్తి 'నా పేరు ఫలానా యుద్ధంలో (పాల్గొనే వారితో పాటు) వ్రాసుకున్నారు. నా భార్య ఏమో హజ్ సంకల్పంతో బయలుదేరు తోంది.' అని విన్నవించుకున్నాడు. అప్పుడాయన, 'వెళ్ళి నీ భార్యతో పాటు హజ్ నిర్వర్తించు' అని పురమాయించారు. (బుఖారి, ముస్లిం)

356. కవులు తమ వాక్పటిమ కారణంగా నందిని పంది, పందిని నంది చెయ్యగలరన్నది లోకోక్తి. అయితే ఇలాంటి కుకవులు సమాజంలోని దుష్టుల్లోనూ అధములన్నమాట. అలాగే మనిషి నైచ్యానికి ఇది పరాకాష్ఠ. తన ఉనికికి కారణభూతుడయిన తండ్రిని తండ్రి కాదని నిరాకరించడం ఒకవైపు పితృనిందతో పాటు మాతృ నిందగా కూడా పరిణమిస్తుంది.

(۳۵۹) عَنْ اُمَیْمَةَ بِنْتِ رُقَیْقَةَ قَالَتْ بَایَعْتُ النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فِیْ نِسْوَةٍ فَقَالَ لَنَا فِیْمَا اسْتَطَعْتُنَّ وَاَطَقْتُنَّ قُلْتُ اللّٰهُ وَرَسُوْلُهٗ اَرْحَمُ بِنَا مِنَّا بِاَنْفُسِنَا قُلْتُ یَارَسُوْلَ اللّٰهِ بَایِعْنَا تَعْنِیْ صَافِحْنَا قَالَ اِنَّمَا قَوْلِیْ لِمِائَةِ امْرَاءَةٍ کَقَوْلِیْ لِامْرَأَةٍ وَاحِدَةٍ۔ (رواہ مالک ۔مشکوٰۃ۔ باب الصلح)

359. ఉమైమా బిన్తె రుకైకా ఉల్లేఖనం: నేను మహిళల ఓ వర్గంతోపాటు ప్రవక్త మహనీయుని ఎదుట ధార్మిక ప్రతిజ్ఞ చేసుకున్నాను. అప్పుడు ఆయన, 'నీవు చెయ్యగల కార్యాల ప్రతిననే నేను చేయిస్తాను' అని అనగా నేను, 'అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) మాపట్ల మాకన్నా అధికంగానే దయగలవారు' అంటూ ఇంకా ఇలా అన్నాను: 'దైవ ప్రవక్తా మాచేత ప్రతిన చేయించండి (అంటే) కరచాలనం చెయ్యండి.' దానికి ఆయన, 'నేను వంద మంది మహిళలతో నోటి ప్రతిన చేయించడమైనా ఒక్క మహిళతో నోటి ప్రతిన చేయించడమయినా ఒక్కటే' అని అన్నారు. (మిష్కాత్)

(۳۶۰) عَنْ اُمِّ سَلَمَةَ اَنَّهَا کَانَتْ عِنْدَ رَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ وَمَیْمُوْنَةُ اِذْ اَقْبَلَ ابْنُ اُمِّ مَکْتُوْمٍ فَدَخَلَ عَلَیْهِ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِحْتَجِبَا مِنْهُ فَقُلْتُ یَارَسُوْلَ اللّٰهِ اَلَیْسَ هُوَ اَعْمٰی لَا یُبْصِرُنَا فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اَفَعَمْیَاوَانِ اَنْتُمَا اَلَسْتُمَا تُبْصِرَانِهٖ۔ (رواہ الترمذی ۔مشکوٰۃ۔ باب النظر الی المخطوبۃ)

---

357. సమాజంలో సమానతను ఆచరణలోకి తీసుకురాగల ప్రతి సందర్భాన్ని వినియోగించాలంటుంది ఇస్లాం. కేవలం సిద్ధాంతాలు వల్లించడంతో సరిపుచ్చక క్రియాత్మకంగా ఒక్కో సందర్భాన్ని పేర్కొని అక్కడల్లా సర్వసమానత్వాన్ని ఎలా ప్రతిబింబింపజెయ్యాలో తెలియపరుస్తుంది. అందువల్లనే 'వలీమా' (పెళ్ళి తరువాత వరుని తరఫున ఇచ్చే విందు) విందులో సమాజంలోని నిరుపేదల్ని సయితం పిలువాలని తాకీదు చెయ్యడం జరిగింది.

358 స్త్రీ మానాభిమానాల రక్షణకు ఇస్లాం ఎలాంటి ప్రాముఖ్యాన్నిస్తుందో, ముందు జాగ్రత్తల్ని ఎలా అమలుపరచ నిర్ణయిస్తుందో ఈ హదీసు ద్వారా ద్యోతకమవుతుంది.

360. ఉమ్మె సల్మా ఉల్లేఖనం ప్రకారం, తాను, మైమూనాతో పాటు ప్రవక్త మహనీయుల సన్నిధిలో హాజరయి ఉన్నప్పుడు ఇబ్నె ఉమ్మె మక్తూమ్ అక్కడికి వచ్చారు. ప్రవక్త మాతో, 'ఆయనకు చాటుగా వెళ్ళండి' అని అనగా నేను, 'వీరు గుడ్డివారు కదా, ఈయన మమ్మల్ని చూడలేరు కదా,' అని అన్నాను. దానికి ఆయన "మీరు ఇద్దరూ గుడ్డివారు కాదుకదా, మీరు ఆయన్ని చూడటం లేదా?" అని ఎదురు ప్రశ్నవేశారు.

(తిర్మిజి, మిష్కాత్)

(۳۶۱) عَنْ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَخْلُوَنَّ رَجُلٌ بِامْرَأَةٍ اِلَّا كَانَ ثَالِثَهُمَا الشَّيْطٰنُ۔ (رواه الترمذی۔ مشکٰوة۔ ص۲۶۱)

361. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారుః "ఏ పురుషుడైనా ఒక (అపరిచిత, హరామ్ కాని) స్త్రీతోపాటు ఒంటరిగా ఉన్నట్లయితే అక్కడ మూడవ వాడు షైతాన్ కూడా ఉంటాడు." (తిర్మిజి, మిష్కాత్)

---

చెడును నిషేధించడం మాత్రమే కాదు, చెడుకు గొనిపొయ్యే మార్గాలన్నింటినీ ఇస్లాం మూసివెయ్యాలని సంకల్పించింది. ఫలితంగా దుర్మార్గం ఏ మార్గం గుండా మనిషి గుండెల్లోకి చొరబడుతుందో చెప్పలేము గనక ఒంటరిగా పర స్త్రీతో పురుషుడు క్షణమయినా ఉండరాదని హెచ్చరించింది. అలాగే స్త్రీ దూర ప్రయాణానికి సన్నద్ధురాలయినప్పుడు ముహ్రమ్ (పెళ్ళికి నిషిద్ధమయిన బంధుత్వం గల పురుషుడు) తోడు ఉన్నప్పుడే ప్రయాణం చెయ్యాలని కట్టడి చేశారు దైవ ప్రవక్త (సఅసం).

359 ప్రవక్త కాలంలో స్త్రీలు, పురుషులు ఎవరయినాసరే ఇస్లాం స్వీకరించిన తరువాత ఆయన సమక్షంలో ప్రతిన చేసేవారు. పురుషులయితే ప్రవక్త చెయ్యిమీద చెయ్యివేసి కరచాలనం చేస్తూ- ప్రతిన చేసేవారు. స్త్రీలచేత ప్రతిజ్ఞ చేయించేటప్పుడు నోటితో చేయించినా సరిపోతుందని ప్రవక్త బోధన. ఈ హదీసు కూడా ఆ విషయాన్నే తెలుపుతోంది. ప్రవక్త అయితే తన సమాజానికి తండ్రి వంటి వాడేకాదు, అంతకన్నా అధికమే. అయినప్పటికీ ఆయన స్త్రీలతో కరచాలనాన్ని కాదన్నారు. అప్పుడు ఆయన అలా చెయ్యకపోతే ప్రళయం వరకు తప్పుదారి పట్టిన మత గురువులు దాని సాకుతో సున్నత్ అన్న పేరు చెప్పి ఎన్ని లజ్జలేని కార్యాలు, నీతి మాలిన పనులు చెయ్యడానికి సాహసించేవారో!

360 ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (ర.అ) అత్యంత ఉన్నత స్థాయి ప్రవక్త సహచరులు.

(٣٦٢) عَنْ اَبِیْ سَعِیْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
اِنَّ مِنْ شَرِّ النَّاسِ عِنْدَ اللّٰہِ مَنْزِلَۃً یَّوْمَ الْقِیٰمَۃِ الرَّجُلُ یُفْضِیْ اِلٰی امْرَأَتِہٖ
وَتُفْضِیْ اِلَیْہِ یَنْشُرُ سِرَّھَا۔ (رواہ مسلم۔ مشکوٰۃ۔ ص۲۷۶)

362. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ఉపదేశించారని అబూ సయీద్ (ర.అ) ఉల్లేఖించారు: ప్రళయదినాన దైవం సమక్షంలో తన స్థాయి దృష్ట్యా అత్యంత హీనమయిన వ్యక్తి ఎవడంటే, తన భార్య చెంతకు వెళ్ళినప్పుడు ఆవిడ అతన్ని సమీపించగా (ఆ తరువాత జనుల్లో) అతను ఆవిడ రహస్యాలు (గోప్య విషయాలన్నీ) బహిరంగపరుస్తూ తిరుగుతాడు.

(ముస్లిం, మిష్కాత్)

(٣٦٣) عَنْ جَرِیْرِ بْنِ عَبْدِ اللّٰہِ قَالَ سَاَلْتُ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ
عَلَیْہِ وَسَلَّمَ عَنْ نَظْرِ الْفُجَاءَۃِ فَاَمَرَنِیْ اَنْ اَصْرِفَ بَصَرِیْ۔ (صحیح مسلم۔ مشکوٰۃ
باب النظر الی المخطوبۃ۔ ص۲۶۸)

363. జరీర్ బిన్ అబ్దుల్లా ఇలా ఉల్లేఖించారు, "నేను దైవ ప్రవక్తను, అకస్మాత్తుగా పడే చూపును గురించి ప్రశ్నించాను. దానికి ఆయన, నేను నా చూపును మరల్చుకోవాలి అని తాకీదు చేశారు." (ముస్లిం, మిష్కాత్)

---

ఆయనకు పైగా కనుచూపులేదు. అలాంటి వారి ఎదుట కూడా రాకూడదని ప్రవక్త. సతీమణులంతటి పరిశుద్ధ శీలవతులకు దైవప్రవక్త పురమాయించారంటే కారణాన్ని కాస్త గ్రహించే ప్రయత్నం చేయాలి. నేడు ఆధ్యాత్మిక అన్వేషణలో అనేక మంది స్త్రీలు గుడ్డినమ్మకాల వలలో పడి బాబాలను, మత గురువులను విచ్చలవిడిగా కలుసుకోవడాన్ని ఆ తరువాత బయటపడే దుష్పరిణామాలను చూస్తే ఆనాడు దైవప్రవక్త కేవలం పరస్త్రీలను పురుషులు చూడటం ఒక్కటే కాదు, పరపురుషుల్ని స్త్రీలు కూడా అనవసరంగా చూడటం ప్రమాదకరమని తెలిపిన బోధనలోని విజ్ఞతా వివేచనలు అర్థమవుతాయి.

361 అంటే హరామ్ కాని బంధుత్వంగల స్త్రీ పురుషులు ఏకాంతంగా ఉన్న చోట షైతాన్ దుష్టశక్తి ప్రవేశించి వారిద్దరి మధ్య బలహీన క్షణాల్లో ఏవైనా దుష్టభావనల్ని సమాజానికి ఉపద్రవకరమైన ఆలోచనల్ని రేకెత్తించే ప్రమాదం ఏర్పడుతుందన్నమాట.

(۳٦٤) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
طِیْبُ الرِّجَالِ مَاظَهَرَ رِیْحُهٗ وَخَفِیَ لَوْنُهٗ وَطِیْبُ النِّسَآءِ مَاظَهَرَ لَوْنُهٗ
وَخَفِیَ رِیْحُهٗ۔ (رواہ الترمذی ۔مشکوٰۃ۔ باب الترجل)

364. అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) "పురుషులు వాడవలసిన సుగంధం వాసన బాగా చుట్టుప్రక్కల వ్యాపించేదిగాను రంగు వ్యక్తం కానిదిగాను ఉండాలి. స్త్రీల సుగంధం రంగు బాగా కనిపించేదిగాను సువాసన తక్కువయినదిగాను ఉండాలి" అని ఉపదేశించారు.

(తిర్మిజి, మిష్కాత్)

(۳٦٥) عَنْ عَلِیِّ بْنِ اَبِیْ طَالِبٍ قَالَ الْقَائِلُ الْفَاحِشَةَ وَالَّذِیْ یُشِیْعُ
بِهَا فِی الْاِثْمِ سَوَآءٌ۔ (الادب المفرد۔ باب اثم من سمع فاحشۃ فافشاہا۔ ص٩٥)

365. హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ ఇలా ఉల్లేఖించారు: 'నీతిబాహ్యమయిన, లజ్జావిహీనమయిన మాటలు పలికేవాడు, సమాజంలో వాటిని వ్యాపింపజేసేవాడు ఉభయులూ నేరంలో సమానులే'(అల్ అదబుల్ ముఫ్రద్)

---

362 కొందరు భార్యతో జరిపిన రాసక్రీడల వివరాలను సిగ్గువిడిచి నలుగురి మధ్య చెప్పుకోవడం గొప్ప మగసిరిగా భావిస్తారు. ఇలాంటివారు ప్రళయ దినాన దైవం సమక్షంలో హాజరయ్యే అనేక దుష్టవ్యక్తుల్లో అధమాతి అధములయినవారని ఈ హదీసు బోధపరుస్తోంది. స్త్రీ పురుషుల సంబంధాల వివరాలు పడకగదిని దాటి బజారున పడటంవల్ల సమాజం రొంపిగా, రోతగా తయారవుతుందన్న హెచ్చరిక ఇందులో ఉంది.

363 ఇస్లాంలో అక్రమ స్త్రీ పురుష సంబంధాలకు ఎలాంటి స్థానం లేదు, దాన్ని సమాజానికి అత్యంత ప్రమాదకరమయిన వ్యాధిగా పరిగణిస్తుంది. అందువల్ల దానికి గొనిపోయే మార్గాలనన్నింటినీ, ద్వారాలనన్నింటినీ మూసివెయ్యడానికి, వాటిపై కాపలాను పెట్టడానికి ప్రయత్నం చేస్తుంది. అదే ఈ హదీసు ప్రబోధం కూడా.

364 ఇస్లాం స్థాపించగోరే సత్సమాజంలో లింగపరంగా పరిశుద్ధమయిన వాతావరణం వెలకొనాలన్నది దాని ఆశయం. అందులో లజ్జావిహీనమయిన పనులకు, అక్రమ లైంగిక వ్యవహారాలకు, వీటికి గొనిపోయే ప్రేరకాలకు తావుండరాదన్నది దాని లక్ష్యం. ఎదుటివారిలో లైంగిక భావోద్రేకాలను రెచ్చగొట్టే ఎలాంటి అవకాశాలను మిగల్చరాదని

(۳۶۶) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَا مِنْ مَّوْلُوْدٍ اِلَّا یُوْلَدُ عَلَی الْفِطْرَةِ فَاَبَوَاهُ یُهَوِّدَانِهٖ اَوْ یُنَصِّرَانِهٖ اَوْ یُمَجِّسَانِهٖ كَمَا تُنْتَجُ الْبَهِیْمَةُ بَهِیْمَةً جَمْعَاءَ هَلْ تُحِسُّوْنَ فِیْهَا مِنْ جَدْعَاءَ ثُمَّ یَقُوْلُ فِطْرَةَ اللّٰهِ الَّتِیْ فَطَرَ النَّاسَ عَلَیْهَا لَا تَبْدِیْلَ لِخَلْقِ اللّٰهِ ذٰلِكَ الدِّیْنُ الْقَیِّمُ۔ (بخاری، مسلم، مشکوۃ۔ باب الایمان بالقدر۔ ص۱۳)

366. దైవ సందేశహరులు ఇలా పలికారని హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖించారు, "పుట్టే ప్రతి శిశువు ప్రకృతి ఆధారంగానే పుడతాడు. ఆ తరువాత అతని తల్లిదండ్రులు అతన్ని యూదునిగానో, క్రైస్తవునిగానో, అగ్ని పూజకుణ్ణిగానో చేస్తారు. ఓ పశువుకు పుట్టే పిల్ల సవ్యంగానే పుడుతుంది. వాటిలో ఏదయినా చెవి కోసి పుట్టగా మీరు చూశారా?" ఇంకా ఆయన ఇలా ఉపదేశించారు, "అల్లాహ్ జనుల్ని సృష్టించే ప్రకృతిని అవలంబించండి. అల్లాహ్ సృష్టిలో, నిర్మాణంలో, ఎలాంటి మార్పు సంభవం కాదు - అదే సరళమయిన, పటిష్ఠమయిన ధర్మం, జీవన మార్గం." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

అదికోరుతుంది. పురుషుల్ని ఆకర్షించే ఘాటయిన సుగంధ ద్రవ్యాలను స్త్రీలు వాడరాదని ఆదేశించడానికి పూర్వమే మహిళలు అధికంగా పురుషుల మధ్య తిరుగాడే అవకాశాలను వీలయినంత మేర తగ్గించి తరువాత అంతగా అవసరమయితే స్వల్పమయిన సుగంధాలనే వాడాలని సూచించింది. అలాగే పురుషులు వీలయినంత నిరాడంబరంగా సాదాసీదాగా ఉండాలని ఇస్లాం అభిలషిస్తుంది. అందువల్లనే రంగుల సువాసనల్ని వారికి కూడదని చెప్పి స్త్రీలు సహజంగానే రంగుల్ని కోరుకుంటారు కాబట్టి వారికి అనుమతి నిచ్చింది. దానితో పాటు సామాజిక పరిశుద్ధ వాతావరణాన్ని కలుషితం చెయ్యకుండా పరిమితుల్ని సయితం విధించింది.

365 వాస్తవంగా నోటితో అశ్లీలాన్ని పలకడమన్నా ఆ పలికిన దాన్ని ప్రచారం చెయ్యడమన్నా పరిణామాల రీత్యా రెండూ ఒక్కటే. అందువల్లనే ఈ రెండు దుశ్చర్యలకు పాల్పడే ఉభయులూ సమానమే అన్నారు ప్రవక్త మహనీయులు (సఅసం).

366 ప్రతి మానవుణ్ణీ దైవం సహజ ధర్మమయిన దైవ విధేయతా ధర్మానికను

(۳۶۷) عَنْ اَبِیْ هُرَیْرَةَ عَنِ النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ اِنَّکُمْ سَتَحْرِصُوْنَ عَلَی الْاِمَارَةِ وَسَتَکُوْنُ نَدَامَةً یَّوْمَ الْقِیٰمَةِ نِعْمَ الْمُرْضِعَةُ وَبِئْسَتِ الْفَاطِمَةُ۔ (رواہ البخاری۔مشکوٰۃ۔کتاب الامارۃ۔ ص۳۱۲)

367. హజ్రత్ అబూహురైరా(రఅ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "మీరు నాయకత్వం, అధికారాల మోహంలో పడిపోతారు. కాని అది ప్రళయదినాన తలవంపులకు కారణమవుతుంది. 'పాలుపట్టే తల్లి ఎంత మంచిది, పాలు విడిపించే మహాతల్లి ఎంత చెడ్డది."
(బుఖారి, మిష్కాత్)

(۳۶۸) عَنْ عَائِشَةَ اَنَّ قُرَیْشًا قَدْ اَهَمَّتْهُمْ شَانُ الْمَرْاَةِ الْمَخْزُوْمِیَّةِ الَّتِیْ سَرَقَتْ فَقَالُوْا مَنْ یُّکَلِّمُ فِیْهَا رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَقَالُوْا مَنْ یَّجْتَرِئُ عَلَیْهِ اِلَّا اُسَامَةُ بْنُ زَیْدٍ حِبُّ رَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَکَلَّمَهٗ اُسَامَةُ فَتَلَوَّنَ وَجْهُ رَسُوْلِ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ وَقَالَ اَتَشْفَعُ فِیْ حَدٍّ مِنْ حُدُوْدِ اللّٰهِ ثُمَّ قَامَ وَاخْتَطَبَ، ثُمَّ قَالَ اِنَّمَا اَهْلَكَ الَّذِیْنَ قَبْلَکُمْ اَنَّهُمْ کَانُوْا اِذَا سَرَقَ فِیْهِمُ الشَّرِیْفُ تَرَکُوْهُ وَاِذَا سَرَقَ فِیْهِمُ الضَّعِیْفُ اَقَامُوْا عَلَیْهِ الْحَدَّ وَاَیْمُ اللّٰهِ لَوْ اَنَّ فَاطِمَةَ بِنْتَ مُحَمَّدٍ سَرَقَتْ لَقَطَعْتُ یَدَهَا۔ (بخاری۔مسلم۔مشکوٰۃ۔باب الشفاعۃ فی الحدود۔ ص۳۰۶)

---

గుణంగానే కాక అతను దానికి విరుద్ధంగా ఆచరించదలిస్తే దానికీ స్వేచ్ఛనిచ్చి స్వతం త్రుణ్ణిగా సృష్టించాడు. ఆ స్వేచ్ఛే అతని ప్రకృతి. ఆ శిశువును అలా దాని ప్రకృతి కను గుణంగా వదలివేస్తే అది తన స్వేచ్ఛను వినియోగించుకుని తనకు ఇష్టమయిన మార్గాన్ని ఎన్నుకుంటుంది. కాని తల్లిదండ్రులు తమకు ఇష్టమయిన మార్గాన అతన్ని నడపడానికి సకల యత్నాలూ చేస్తారు. సన్మార్గాన నడిచేవారు కూడా ఆ బాలలకు

368. హజ్రత్ ఆయిషా ఉల్లేఖనం: ఒకసారి ఖురైష్ ప్రజలకు ఓ విపత్తు వచ్చి పడింది. వారిలోని మఖ్‌జూమియ వంశానికి చెందిన ఓ మహిళ దొంగతనం చెయ్యడం వల్ల (ఆమె చేతులు నరకబడతాయేమోనని) వారు సందిగ్ధంలో పడ్డారు. ఆమెపట్ల సిఫారసు చెయ్యడానికి ప్రవక్త వద్దకు ఎవరిని పంపాలి అన్న అంశంపై వారు పరస్పరం సంప్రతించుకున్నారు. ఆయన ప్రేమపాత్రుడయిన ఉసామా బిన్ జైద్ తప్ప ప్రవక్త మహనీయుల సమక్షానికి వెళ్ళే సాహసం ఎవరు చేయగలరు అని అనుకున్నారు. తదనుగుణంగా ఉసామా ఆయనతో మాట్లాడారు. దానికి దైవ సందేశహరులు (సఅసం) మోము ఆగ్రహంతో రంగు మారింది. "నీవు దైవం నిర్ణయించిన శిక్ష పరిమితుల్లో ఒకదాని విషయంలో సిఫారసు చేస్తున్నావా?" అంటూ ఆయన లేచి నిలబడి ఇలా ప్రసంగించారు: "లోగడ మీకు పూర్వపు జనులు ఇందువల్లనే సర్వనాశనమయ్యారు. వారిలో ఎవరయినా స్థితిపరుడు దొంగతనం చేస్తే అతన్ని శిక్షించకుండా వదలివేసేవారు. మరే బలహీన వర్గంలోనివాడయినా చేస్తే అతన్ని శిక్షించేవారు. దైవంపై ప్రమాణం చేసి చెబుతున్నాను, ముహమ్మద్ కూతురు (సొంత కూతురు) ఫాతిమా దొంగతనం చేసినా నేను దాని చేతులు నరకివేయించేవాణ్ణి." (బుఖారి, ముస్లిం, మిష్కాత్)

(٣٦٩) عَنْ صَفْوَانَ بْنِ سُلَيْمٍ عَنْ عِدَّةٍ مِّنْ اَبْنَاءِ اَصْحَابِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ اٰبَائِهِمْ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَلَا مَنْ ظَلَمَ مُعَاهِدًا اَوِ انْتَقَصَهٗ اَوْ كَلَّفَهٗ فَوْقَ طَاقَتِهٖ اَوْ اَخَذَ مِنْهُ شَيْئًا بِغَيْرِ طِيْبِ نَفْسٍ فَاَنَا حَجِيْجُهٗ يَوْمَ الْقِيَامَةِ. (رواه ابوداؤد۔ مشکوٰۃ۔ باب الصلح)

---

సన్మార్గాన్ని చూపవచ్చు. సద్బుద్ధి కలిగితే ఆ బాలలు సన్మార్గాన్ని అనుసరించడం సాధ్యమే.

367 నాయకత్వపు హోదా కలిగి ఉండటాన్ని పాలుపట్టే అమ్మగా పేర్కొనడం జరిగింది. తొలగింపు వల్లనో లేక మృత్యువువల్లనో ఆ హోదా నుండి తొలగించడం

369. 'సఫ్వాన్ బిన్ సులైమ్ ప్రకారం ప్రవక్త సహచరుల కుమారులు తమ తండ్రులు చెప్పగా విని దైవ సందేశహరుని ఉపదేశాన్ని ఇలా ఉల్లేఖించారు: "వినండి, ఎవరయినా ఒప్పందం చేసుకున్న (వ్యక్తి లేదా జాతి)వారిపై అత్యాచారం జరిపితే, వారికి చెందిన హక్కులను తగ్గించివేస్తే, లేదా వారిపై వారి శక్తికి మించిన భారం మోపినట్లయితే, వారి ఇష్టానికి విరుద్ధంగా వారి వస్తువేదయినా కాజేసినట్లయితే, - నేను ప్రళయదినాన ఇలాంటి వారికి వ్యతిరేకంగా, బాధితుల పక్షాన నిలబడి పోరాడతాను."

(అబూ దావూద్, మిష్కాత్)

(٣٧٠) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ مَاظَهَرَ الْغُلُوْلُ فِیْ قَوْمٍ اِلَّا اَلْقَی اللّٰهُ فِیْ قُلُوْبِهِمُ الرُّعْبَ وَلَا فَشَا الزِّنَا فِیْ قَوْمٍ اِلَّا كَثُرَ فِیْهِمُ الْمَوْتُ، وَلَا نَقَصَ قَوْمٌ الْمِكْیَالَ وَالْمِیْزَانَ اِلَّا قُطِعَ عَنْهُمُ الرِّزْقُ، وَلَا حَكَمَ قَوْمٌ بِغَیْرِ حَقٍّ اِلَّا فَشَا فِیْهِمُ الدَّمُ وَلَا خَتَرَ قَوْمٌ بِالْعَهْدِ اِلَّا سُلِّطَ عَلَیْهِمُ الْعَدُوُّ

(مشکوٰۃ - ۴۵۹)

370. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ ఓ ఉల్లేఖనంలో ఇలా అన్నారు: "ఏ జాతిలోనయితే అవినీతి ఏరులయి పారుతుందో ఆ జాతిలో అల్లాహ్ శత్రుభయభీతుల్ని ముమ్మరం చేస్తాడు. ఏ సమాజంలోనయితే వ్యభిచార జాడ్యం ప్రబలిపోతుందో అది సర్వనాశనమయి తీరుతుంది. ఏ విపణిలో

---

జరిగితే ఆ రుచులు మరగిన ప్రాణి తల్లడిల్లే విధానాన్ని పాలుమాన్పించిన అమ్మలా పేర్కొనడం జరిగింది. అప్పుడు నిరాశా నిస్పృహలు అలుముకుంటాయన్నమాట.

368 న్యాయం అన్నది అన్ని వర్గాల ప్రజలకు సమానంగా లభించాలన్న ప్రథమ సూత్రాన్ని ప్రవక్త మహనీయులు ఆ తొలిరోజుల్లోనే తన సమక్షాన ఆచరణలో పెట్టి మరీ చూపారు. వ్యక్తిగత, కుటుంబ, సామాజిక రంగాల్లో మనకు నిత్యం ఎదురయ్యే సందర్భాలలో ఈ న్యాయ సూత్రాన్ని అనుసరిస్తున్నామా అని ఓసారి ఆత్మ విమర్శచేసుకుంటే సమాజం ఎంతో బాగుపడుతుంది.

369 'ఒక జాతితో ఒప్పందం' చేసుకోవడమంటే అది రెండు జాతుల మధ్యనే సాధ్యమవుతుంది. అది ప్రస్తుతానికి అప్రస్తుతం. వ్యక్తితో ఒప్పందం అంటే ఇంట్లో పని

కొలతలూ తూనికల వంచనలు సర్వ సామాన్యమయిపోతాయో అందులో ఉపాధి శుభాలన్నీ మటుమాయమయిపోతాయి. ఎక్కడయితే అధర్మపు తీర్పులు జరుగుతాయో అక్కడ తప్పనిసరిగా రక్తపాతం జరుగుతుంది. ఇంకా ఏ జాతి వాగ్దాన భంగానికి పాల్పడుతుందో అది ఎట్టకేలకు శత్రువుకు పరాధీనమయిపోతుంది." (మిష్కాత్)

(۳۷۱) عَنْ ثَوْبَانَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُوْشِكُ الْاُمَمُ اَنْ تَدَاعٰى عَلَيْكُمْ كَمَا تَدَاعَى الْاَكَلَةُ اِلٰى قَصْعَتِهَا قَالَ قَائِلٌ وَمِنْ قِلَّةٍ نَحْنُ يَوْمَئِذٍ قَالَ بَلْ اَنْتُمْ يَوْمَئِذٍ كَثِيْرٌ وَلٰكِنَّكُمْ غُثَاءٌ كَغُثَاءِ السَّيْلِ، وَلَيَنْزِعَنَّ اللّٰهُ مِنْ صُدُوْرِ عَدُوِّكُمُ الْمَهَابَةَ مِنْكُمْ وَلَيَقْذِفَنَّ فِيْ قُلُوْبِكُمُ الْوَهْنَ، قَالَ قَائِلٌ يَا رَسُوْلَ اللّٰهِ وَمَا الْوَهْنُ قَالَ حُبُّ الدُّنْيَا وَكَرَاهِيَةُ الْمَوْتِ۔

---

చేసే నౌకరు, ఆఫీసుల్లో, కర్మాగారాల్లో పనిచేసే ఉద్యోగి, లేక పొలాల్లో పనిచేసే పాలేరులు అందరూ ఇందులోకే వస్తారు. వీరిపట్ల అన్యాయం అంటే మాట ప్రకారం వారికి ఇవ్వవలసింది ఇవ్వకపోవడమో లేక వారిని బాధించడమో, ఒప్పందానికి మించిన భారం వెయ్యడమో అవుతుంది. ఇది నిషిద్ధం. పోతే వారి హక్కును తగ్గించడమంటే ఒప్పందం రీత్యా ప్రసిద్ధనియమాల రీత్యా వారికి చెందవలసిన హక్కుల్ని (వైద్య సదుపాయాలు, సెలవులు, ప్రావిడెంట్ ఫండు వగైరా) కాజెయ్యకుండా ఇవ్వాలన్నమాట. మూడవ విషయం, వారి బాధ్యతల్లోని విషయమే అయినప్పటికీ వారెప్పుడయినా చెయ్యలేక పోతే చెయ్యవలసిందేనని నిర్బంధించకుండా కాస్త సౌకర్యాన్నివ్వడం అన్నమాట. ఇలా జరక్కపోతే ప్రవక్త మహనీయులు ఆ వ్యక్తి తరఫున వకాల్తా పుచ్చుకుని పోరాడతారని ఈ హదీసు చెబుతోంది.

370 ఈ హదీసులో నాలుగు సామూహిక చెడుగులను గురించి తెలుపడం జరిగింది. ఆ రుగ్మతలు వాటి పర్యవసానాలను కాస్త పరిశీలనగా గమనిస్తే సాంఘిక శాస్త్రం గురించి ఏ కాస్త అవగాహన గలవారయినా ఆ రోగాలకు పరిణామాలు ప్రవక్త చెప్పినవి తప్ప మరేమీ కావని, చరిత్ర కూడా ప్రవక్త మహనీయుని మాటల్ని ధృవపరుస్తోందని సాక్ష్యమివ్వగలరు. నేడు మనం మన కళ్ళారా చూస్తున్నాము – అవినీతికి ఆలవాలమయిన దేశాల్లో పిరికితనం, పొరుగుదేశాల భయం ఎలా చోటు చేసుకుంటున్నాయో, అలాగే

371. హజ్రత్ సౌబాన్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకసారి, "భోజన ప్రియులు భోజనంపైకి ఒకరినొకరు పిలుచుకుంటూ ఎలా ఎగబడతారో అదే విధంగా అతి త్వరలో వైరిజాతులు మీపై అవురావురుమంటూ ఎగబడతాయి." అని సెలవీయగా ఒక వ్యక్తి 'ఆ కాలంలో మా సంఖ్యాబలం తక్కువ కావడం వల్ల అలా జరుగుతుందా?' అని ప్రశ్నించాడు. ప్రవక్త మహనీయులు దానికి, "కాదు, ఆనాడు మీరు సంఖ్యాపరంగా అధికంగానే ఉంటారు. కాని మీ స్థితి గడ్డిపోచలకన్నా అధికం కాదు. శత్రువుల గుండెల నుండి మీ భయం ఎగిరిపోతుంది. మీలో 'వహ్న్' పుట్టుకు వస్తుంది," అని అన్నారు. అక్కడున్న వారు 'వహ్న్' అంటే ఏమిటని అడగ్గా ఆయన - "ప్రపంచ వ్యామోహం, మృత్యువును ఎదుర్కొనడానికి అయిష్టత" అని సమాధానమిచ్చారు.

---

లైంగిక అరాచకం ప్రబలిన సమాజాల్లో కొత్త కొత్త రోగాలు పుట్టి, సామాజిక జీవనం విచ్ఛిన్నమయి అవి ఎలా సర్వనాశనం వైపునకు పరుగిడుతున్నాయో కూడా మనకు తెలియనిదికాదు. మోసం, దగాతో ఏర్పడిన వాణిజ్య విధానాల వల్ల నేడు ప్రపంచాన్నుండి శుభం అన్నది లేకుండాపోయి అనునిత్యం 'తీరని ఆకలి'తో మానవత ఎలా అలమటిస్తోందో అన్నది మన అనుభవంలోని విషయమే. అన్యాయం, ఆశ్రిత పక్షపాతం, స్వార్థపూరితమయిన నిర్ణయాలు ఎలా తీవ్రవాదానికి, ఉగ్రవాదానికి దారితీసి ప్రపంచమంతటా హైజాకింగు, బాంబులు, రక్తపాతం, హింసాదౌర్జన్యాలు, దురాక్రమణలు పెరగడానికి కారణభూతమవుతున్నాయో అన్నది కూడా నేడు మనం మన చర్మచక్షువులతోనే చూస్తున్నాము. ఇంకా జాతుల మధ్య జరిగే ఒడంబడికలు అనుదినం కాలరాయబడటం మూలాన ఐక్యరాజ్యసమితి లాంటి ఉమ్మడి వేదికలు కూడా ఎలా నిర్వీర్యమయి పోతున్నాయో నేడు అందరూ బహిరంగంగానే చర్చించుకుంటున్నారు. ప్రవక్త మహనీయులు తెలిపిన ఈ విషయాలలోని సత్యాలను పరిశీలనా దృష్టిగలవారెవరయినా ఇట్టే గ్రహించగలరు.

371 'ప్రపంచవ్యామోహం' అంటే ప్రపంచాన్ని, ప్రపంచంలోని బంధుత్వాలను, ఇక్కడి వస్తు సామగ్రిని అవసరం మేరకు కూడా ప్రేమించరాదని, వీటితో ఏ విధమయిన అనుబంధాన్నీ పెంచుకోరాదని భావం కాదు. కాని వాటి ప్రేమ పెరిగి మనుషుల్లో పిరికితనం, అధైర్యం, భయవిహ్వలత చోటుచేసుకున్నట్లయితే ఇలాంటి వారిని ప్రపంచంలోనూ గౌరవంగా చూడటం జరగదు. పరలోకంలోనూ వారికి విజయావకాశాలుండవు.



# 11. శ్రేష్ఠ సామూహిక వ్యవస్థ

(۳۷۲) عَنْ اَبِی سَعِیْدِ نِالْخُدْرِیِّ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَ سَلَّمَ قَالَ اِذَا کَانَ ثَلٰثَۃٌ فِیْ سَفَرٍ فَلْیُؤَمِّرُوْا اَحَدَ ھُمْ (رواہ ابوداؤد مشکوٰۃ - باب آداب السفر)

372. అబూ సయీద్ ఖుద్రి (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ముగ్గురు వ్యక్తులు కలిసి ప్రయాణం చేస్తున్నప్పుడు తమలో ఒకరిని వారు తమ నాయకునిగా చేసుకోవాలి."

(అబూ దావూద్, మిష్కాత్)

(۳۷۳) عَنْ اَبِی الدَّرْدَاءِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَ سَلَّمَ مَا مِنْ ثَلٰثَۃٍ فِیْ قَرْیَۃٍ وَلَا بَدْوٍ لَا تُقَامُ فِیْھِمُ الصَّلٰوۃُ اِلَّا قَدِ اسْتَحْوَذَ عَلَیْھِمُ الشَّیْطٰنُ فَعَلَیْکَ بِالْجَمَاعَۃِ فَاِنَّمَا یَاْکُلُ الذِّئْبُ الْقَاصِیَۃَ - (رواہ ابوداؤد مشکوٰۃ - باب الجماعۃ - ﷺ)

373. అబూ దర్దా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఏ అడవిలోనయినా నగరంలోనయినా ముగ్గురు వ్యక్తులు నివసిస్తూ ఉంటూ, వారు (సామూహిక) నమాజ్ వ్యవస్థను నెలకొల్పకపోతే వారిపై తప్పనిసరిగా షైతాన్ తిష్ఠవేస్తాడు.

---

372 ప్రయాణం లాంటి తాత్కాలిక స్థితిలోనూ సామూహిక వ్యవస్థ స్థాపనకు ఆదేశాలున్నప్పుడు స్థిరనివాసమున్న స్థితిలో సామూహిక వ్యవస్థ, నాయకత్వాలను స్థాపించడం మరింత ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది. అది తప్పనిసరి విధిగా రూపొందుతుంది. దీన్ని బలపరుస్తూ మరో ఉల్లేఖనం ఉంది. అందులో ఆయన (సఅసం) ఇలా సెలవిచ్చారు: ఒక అడవిలో ముగ్గురు వ్యక్తులు నివసిస్తూ ఉంటే వారు తమలో ఒకరిని నాయకునిగా చేసుకుని జీవించాలి.

(బాగా వినండి) సంఘంతో కలిసి జీవించండి, లేకపోతే మందకు దూరమయి పోయిన గొర్రెను తోడేలు కాజేసివేస్తుంది. (మీ పరిస్థితి కూడా అలానే ముగుస్తుంది.)" (అబూ దావూద్, మిష్కాత్)

(٣٧٤) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْجِهَادُ وَاجِبٌ عَلَيْكُمْ مَعَ كُلِّ أَمِيْرٍ بَرًّا كَانَ أَوْ فَاجِرًا وَإِنْ عَمِلَ الْكَبَائِرَ، وَالصَّلٰوةُ وَاجِبَةٌ عَلَيْكُمْ خَلْفَ كُلِّ مُسْلِمٍ بَرًّا كَانَ أَوْ فَاجِرًا وَإِنْ عَمِلَ الْكَبَائِرَ، وَالصَّلٰوةُ وَاجِبَةٌ عَلٰى كُلِّ مُسْلِمٍ بَرًّا كَانَ أَوْ فَاجِرًا وَإِنْ عَمِلَ الْكَبَائِرَ (ابوداؤد، مشکوٰة ـ باب الامامة)

374. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ముస్లిములారా, అమీర్ (నాయకుడు) మంచివాడయినా, చెడ్డవాడయినా, అతను పాపపు పనులకు పాల్పడే వాడయినా అతని నాయకత్వంలో శత్రువుల్ని మార్కొనడం మీ ధర్మం. అలాగే నమాజ్ చేయించే ముస్లిం వ్యక్తి (ఇమామ్) మంచివాడయినా, చెడ్డ వాడయినా పాపపు పనులకు ఒడిగట్టేవాడయినా, అతని అనుసరణలో నమాజ్‌ను నెరవేర్చుకోవడం మీ కర్తవ్యం. అలాగే మంచివాడయినా, చెడ్డవాడయినా పాపపు పనులు చేసేవాడయినా (మరణించిన) ముస్లిం వ్యక్తి జనాజా నమాజ్‌ని నిర్వర్తించడం తప్పనిసరి." (అబూ దావూద్, మిష్కాత్)

---

373. ఇందులో ముస్లిముల జీవితానికి సంబంధించిన ప్రముఖమయిన విషయాలను ప్రస్తావించడం జరిగింది.

1. ముస్లిములు ఎక్కడున్నా సరే వ్యక్తిగతంగా, వేర్వేరుగా జీవించడానికి అవకాశం లేదు. కేవలం ముగ్గురున్నా సరే వారు ఒక సామూహిక వ్యవస్థను నెలకొల్పుకుని జీవించాలి. సామూహిక వ్యవస్థలో ఒక నాయకుడంటూ ఉండటం ముఖ్యం. నేడు భారత ముస్లిములకు కొరవడింది అందరికీ అంగీకార యోగ్యమయిన నాయకత్వమే. ఆ నాయకత్వమే సకల వ్యవహారాలలో – కుటుంబ, సామాజిక, రాజకీయ వ్యవహారాలలో మార్గ నిర్దేశన చెయ్యాలి.

2. పైన పేర్కొన్న సామూహిక వ్యవస్థకు ప్రతీకగా నమాజ్‌ను సామూహికంగా నిర్వర్తించే ఆదేశం ఇవ్వడం జరిగింది.

(۳۷۵) عَنْ بَشِيْرِ بْنِ الْخَصَاصِيَةِ قَالَ قُلْنَا اِنَّ اَهْلَ الصَّدَقَةِ يَعْتَدُوْنَ عَلَيْنَا اَفَنَكْتُمُ مِنْ اَمْوَالِنَا بِقَدْرِ مَا يَعْتَدُوْنَ ، قَالَ لَا۔ (ابوداؤد مشکوٰۃ۔ کتاب الزکوٰۃ)

375. బషీర్ బిన్ ఖాసియ (రఅ) ఇలా ఉల్లేఖించారు, 'మేము ఒకసారి దైవ సందేశహరుని "జకాత్ వసూలు చేసేవారు మాపట్ల అతిగా ప్రవర్తిస్తారు, అలాంటప్పుడు మాపట్ల వారి అతి ప్రవర్తన మేరకు మేము మా సంపదల్ని దాచవచ్చునా?" అని ప్రశ్నించాము. దానికి ఆయన "కూడదు" అని బదులిచ్చారు. (అబూదావూద్, మిష్కాత్)

---

3. సామూహిక వ్యవస్థ నెలకొనకపోతే కలిగే నష్టాన్ని సూచించడం జరిగింది. షైతాన్ (పైశాచిక) శక్తులు, తోడేలు గొర్రెల్ని ఎత్తుకుపోయినట్లు, సామూహిక వ్యవస్థకు దూరమయిన వారిని ఎత్తుకు పోతాయని హెచ్చరించడమూ జరిగింది.

4. మిధ్యా వాదాన్ని, అసత్యాన్ని, పాపపు కార్యాలను వ్యాపింపజేసే శక్తులు సమైక్యమయి, సంఘటితమయి కృషి చేస్తున్నాయి. వారిని ఎదిరించి నిలబడేందుకు సయితం సత్యాన్ని ప్రేమించే శక్తులు, ధర్మాన్ని కోరుకునే శక్తులు కూడా సమైక్యమయి, సంఘటితమయి నిలబడాలి.

5. దైవ గ్రంథం, ప్రవక్త సంప్రదాయంలో సామూహిక జీవనాన్ని గడిపే తాకీదు మరీ మరీ చెయ్యడం జరిగింది. ధర్మం, నిష్ఠ ఆధారంగా ఏర్పడే ముస్లిములందరి సమిష్టి సామూహిక వ్యవస్థలో నుంచి వేర్పడటాన్ని 'ధర్మభ్రష్టత'కు సమానంగా పరిగణించడం జరిగింది.

ఇదీ ఇస్లాంలో సామూహిక వ్యవస్థకున్న ప్రాముఖ్యం.

374 దీనివల్లనూ అనేక విషయాలు ద్యోతకమవుతున్నాయి.

1. ఒక వ్యక్తి ముస్లిముల నాయకునిగా ఎన్నికయిన తరువాత అతని నైతికత, స్వభావాలు ఎలా ఉన్నప్పటికీ సత్కార్యాల్లో అతని ఆదేశాన్ని పాటించవలసిందే. అయితే అతను బహిరంగంగా తిరస్కారానికి సమానమైన పనులు పురమాయిస్తే మటుకు వాటిని పాటించనవసరముండదు.
2. దీనికి ప్రతీకగా నమాజ్ వ్యవస్థను సూచించడం జరిగింది. ఇమామ్ (నమాజ్ చేయించే నాయకుడు) ఎలాంటి పాపపు పనులు చేసేవాడయినప్పటికీ అతని అనుసరణలో నమాజ్ మటుకు నెరవేరుతుంది. ఇక్కడ ఓ విషయం మరువరాదు.

(۳۷۶) عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ السَّمْعُ وَالطَّاعَةُ عَلَى الْمَرْءِ الْمُسْلِمِ فِيْمَا أَحَبَّ وَكَرِهَ مَالَمْ يُؤْمَرْ بِمَعْصِيَةٍ فَإِذَا أُمِرَ بِمَعْصِيَةٍ فَلَا سَمْعَ وَلَا طَاعَةَ ۔ (متفق علیہ، مشکوٰۃ کتاب الامارۃ)

376. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రఅ) ఉల్లేఖించారు. "మాట వినడం, దాన్ని పాటించడం ముస్లిముల బాధ్యత. వారికి తమ నాయకుడు (అమీర్) ఆదేశం నచ్చినా, నచ్చక పోయినా దాన్ని పాటించవలసిందే. అదీ అతను దైవం నిషేధించిన పాపపు కార్యాలకై ఆదేశించనంతవరకే. పాపపు కార్యాలకు ఆదేశిస్తే అందులో మాట వినడమూ తగదు, దాన్ని అనుసరించడమూ తగదు." (ముత్తఫకున్ అలైహ్, మిష్కాత్)

---

ఇమామ్ అయినా, అమీర్(సాంఘిక నాయకుడు) అయినా నియమింపబడి లేదా బలవంతాన ఆస్థానాన్ని ఆక్రమించుకుని ఉన్న పక్షంలో ఈ ఆదేశం వర్తిస్తుంది. కాని సాధారణ స్థితుల్లో, ముస్లిములు తమ ఇమామ్‌ను లేదా నాయకుణ్ణి ఎన్నుకునే అవకాశమున్నప్పుడు వారు తమలో అత్యుత్తమ నైతికతగల వ్యక్తిని, అత్యంత నిష్ఠాపరాయణున్ని మాత్రమే ఎన్నుకోవాలి. మరో హదీసులో ఇలా ఉంది. "మీలో అత్యుత్తమమయిన వారినే మీ ఇమాములు (నమాజ్‌లోనూ, సంఘంలోనూ) గా నియమించుకోండి."

3. ముస్లిమ్ అయిన వ్యక్తి ఎంతటి చెడ్డవాడయినప్పటికీ అతని జనాజా నమాజ్‌ని నిర్వర్తించడంలో సంశయించరాదు. అయితే ఒకవేళ ఎవరయినా చాలా అప్రతిష్టపాలయి, తోటి మానవుల హక్కుల్ని కాజేసినవాడయి ఉన్న పక్షంలో సామాన్య ప్రజలకు హెచ్చరిక కలగడానికి, గుణపాఠం కలగడానికి సమాజంలోని ధర్మజ్ఞులు, ధర్మ నిష్ఠరీత్యా ప్రముఖులు అతని జనాజా నమాజ్‌కు దూరంగా మసలుకుంటే తప్పులేదు. ఒక హదీసు ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఆత్మహత్య చేసుకున్నవాని జనాజా నమాజ్‌ని చేయించలేదు. అలాగే రుణగ్రస్తుడి జనాజా నమాజ్ కూడా ఆయన (సఅసం) స్వయంగా చేయించలేదు. జనులతో 'మీ మిత్రుని జనాజా నమాజ్ చేయండి' అని పురమాయించారు.

ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే ఈ ఆదేశాలు, ఇలాంటి 'వెలి' వేసే పద్ధతి నిజమయిన ఇస్లామీయ సమాజం నెలకొని ఉన్న

(۳۷۷) عَنْ عُمَرَ بْنِ عَوْفٍ الْمُزَنِيِّ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ الصُّلْحُ جَائِزٌ بَيْنَ الْمُسْلِمِيْنَ اِلَّا صُلْحًا حَرَّمَ حَلَالًا اَوْ اَحَلَّ حَرَامًا وَالْمُسْلِمُوْنَ عَلٰى شُرُوْطِهِمْ اِلَّا شَرْطًا حَرَّمَ حَلَالًا اَوْ اَحَلَّ حَرَامًا ـ

(ترمذی ۔ مشکوٰۃ ۔ باب الافلاس)

377. ఉమర్ బిన్ ఔఫ్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు. ముస్లిముల మధ్య సంధి ఒడంబడికలు ధర్మబద్ధమయినవే. అయితే హరామ్‌ను హలాల్ చేసేది, హలాల్ ని హరామ్ చేసేది ఏ ఒప్పందమూ ధర్మ సమ్మతం కాదు. ముస్లిములు తాము చేసుకున్న నిబంధనల్ని పాటించాలి. అయితే ఆ నిబంధనల్లో ఏదీ హలాల్‌ను హరామ్‌గా మార్చేదయినా, హరామ్‌ను హలాల్‌గా మార్చేదయినా కాకూడదు. (తిర్మిజి - మిష్కాత్)

---

చోటనే సాధ్యమవుతాయి; లేకపోతే సమాజంలో అరాచకానికి దారితీసే ప్రమాదముంది.

375 ఈ హదీసు ద్వారా తెలిసే విషయాలు:

1 జకాత్ మనిషి వ్యక్తిగతంగా చెల్లిస్తే నెరవేరే విధి కాదు. సామూహిక వ్యవస్థ ద్వారా వసూలు చేసి సామూహికంగానే ఖర్చుపెట్టవలసిన పద్దు అది.

2 ఇస్లాంలో సామూహిక వ్యవస్థ జారీ చేసే ఆదేశాలను పాటించడం, క్రమశిక్షణను మీరకుండా మెలగడం ఎంతో ప్రముఖమయిన విషయం.

3 ఇస్లామీయ సామూహిక వ్యవస్థలో పనిచేసే ఉద్యోగులు మితిమీరి ప్రవర్తించరాదు. అధవా ప్రవర్తించినా ముఖ్యంగా జకాత్ వసూలు చెయ్యడంలో కఠినంగా వ్యవహరించినా వారికి విరుద్ధంగా అక్కడికక్కడే ఎలాంటి తప్పుడు చర్య తీసుకునే అధికారం ఎవరికీ లేదు. అవసరమయితే వారిపట్ల పై అధికారులకు ఫిర్యాదు చెయ్యవచ్చు.

376 సామూహిక వ్యవస్థకు ఎట్టి పరిస్థితిలోనూ హాని కలగజెయ్యడం క్షమార్హం కాని నేరం. అయితే ఆ వ్యవస్థద్వారా దైవాదేశాలకు విరుద్ధమయిన ఆదేశాలు వెలువడితేమటుకు వాటిని పాటించనవసరం లేదు. అలాంటి పరిస్థితిలోనే నాయకత్వాన్ని మార్చి శిష్ట నాయకత్వాన్ని తీసుకురావడం తప్పనిసరి అవుతుంది. అంత వరకు ఆ నాయకత్వం

(۳۷۸) عَنْ مَعْقِلِ بْنِ يَسَارٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اَيُّمَا وَالٍ وَلِيَ مِنْ اَمْرِ الْمُسْلِمِيْنَ شَيْئًا فَلَمْ يَنْصَحْ لَهُمْ وَلَمْ يَجْهَدْ لَهُمْ لِنُصْحِهٖ وَجُهْدِهٖ لِنَفْسِهٖ كَبَّهُ اللّٰهُ عَلٰى وَجْهِهٖ فِى النَّارِ

(المعجم الصغير للطبراني ـ ص ۹۲)

378. మా కిల్ బిన్ యసార్ (రఅ) ఓ ఉల్లేఖనంలో, నేను దైవప్రవక్త చెబుతూ ఉండగా విన్నానని ఇలా ఉల్లేఖించారు: "ఎవరయితే ముస్లిముల ఓ వ్యవహారానికి బాధ్యుడుగా నియమితుడవుతాడో అతను తన స్వంత విషయానికి చేసే విధంగా వారి శ్రేయానికి కృషి చెయ్యకపోతే అల్లాహ్ అతన్ని నరకంలో బోర్లా పడవేస్తాడు." (అల్ మో'జముస్సగీర్, తిబ్రాని)

---

అనుసరణలో వ్యవస్థ సాగవలసిందే.

377 ఈ హదీసులో అనేక మౌలిక సమస్యల్ని స్పర్శించడం జరిగింది. దీన్ని బాగా దృష్టిలో ఉంచుకుంటే చాలా సమస్యలు వాటంతట అవే పరిష్కృతమయిపోతాయి.

1. స్వయంగా ముస్లిముల మధ్యనయినా, ముస్లిములు – ముస్లిమేతరుల మధ్యనయినా, ముస్లిం ప్రభుత్వం, ముస్లిమేతర ప్రభుత్వాల మధ్యనయినా ఒప్పందాలు ఒడంబడికలు జరగవచ్చు. అందులో తప్పులేదు.
2. ఆ ఒప్పందం, ఒడంబడిక ఏ విషయానికి సంబంధించినదయినా కావచ్చు. సామాజికమయినదయినా, ఆర్థిక మయినదయినా, రాజకీయమయినదయినా కావచ్చు. ఇంకా అంతర్జాతీయ సంబంధాలకు చెందిన ఒప్పందమయినా కావచ్చు. శాసన నిర్మాణానికి సంబంధించిన రాజకీయ ప్రకటన అయినా కావచ్చు.
3. ఇలాంటి వ్యవహారాలలో ప్రతి చిన్న విషయానికి దైవగ్రంథం, దైవ ప్రవక్త సంప్రదాయంలో ఆధారాలు వెదకనవసరం లేదు. ఏ చర్యనయినా స్పష్టమయిన ఏ ఆదేశానికి భిన్నంగా నయితే లేదు కదా (హరామ్ – హలాల్) అని మటుకే చూసుకుంటే సరిపోతుంది.
4. అయితే ఆరాధనా వ్యవహారాలలో మటుకు ప్రతి చిన్న విషయానికి ఆధారం దైవగ్రంథం, దైవ ప్రవక్త సంప్రదాయంలో వెదకవలసి ఉంటుంది. లేకపోతే ఆరాధనల పేరిట 'బిద్ అత్‌లు' (కొత్త విషయాలు) చోటుచేసుకునే ప్రమాదముంటుంది. ఇంకా బహుదైవారాధన, దైవ తిరస్కార పోకడలకు పాల్పడే ప్రమాదాలు సంభవించవచ్చు.

378 ఈ హదీసు ఇంకా దీనితో పాటు 380, 381, 382 హదీసులు ఇస్లామీయ

(۳۷۹) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَللّٰهُمَّ مَنْ وَلِيَ مِنْ اَمْرِ اُمَّتِيْ شَيْئًا فَشَقَّ عَلَيْهِمْ فَاشْقُقْ عَلَيْهِ وَمَنْ وَلِيَ مِنْ اَمْرِ اُمَّتِيْ شَيْئًا فَرَفَقَ بِهِمْ فَارْفُقْ بِهٖ. (رواه مسلم، مشكوٰة۔ كتاب الامارة)

379. హజ్రత్ ఆయిషా (రఅ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారుః "నా అనుచర సంఘం వ్యవహారాలకు ఎవరయినా బాధ్యుడుగా నియుక్తుడయి ఆ తరువాత జనుల్ని కష్టాలకు, ఇబ్బందులకు గురి చేస్తే, దైవమా! నీవు కూడా అతని జీవితాన్ని ఇబ్బందులపాలుచెయ్యి. మరెవరయితే నా అనుచర సంఘం వ్యవహారాల బాధ్యత తీసుకుని జనులతో ప్రేమాభిమానాలతో వ్యవహరిస్తారో, దైవమా నీవూ అతన్ని కరుణించు." (ముస్లిం, మిష్కాత్)

---

రాజ్యాధినేతలకు, ఇస్లామీయ సంస్థల నేతలకు, పార్టీల నాయకులకు, ఇస్లామీయ కార్యార్థం ఏర్పడిన చిన్నవయినా పెద్దవయినా సంస్థల అధిపతులకు, మొహల్లాకమిటీలు, మస్జిద్ కమిటీల నాయకులకు అందరికీ వర్తిస్తాయి. చిన్న బాధ్యత అయినా పెద్ద బాధ్యత అయినా బాధ్యత స్వీకరించిన తరువాత దానికి న్యాయం చేకూర్చే ప్రయత్నం చెయ్యడం ఆ బాధ్యతను స్వీకరించిన వ్యక్తి విద్యుక్తధర్మం. ఇందులో 'తన స్వంత వ్యవహారాలకు పాటు పడేలా పాటుపడాలి' అన్న మాట మాటిమాటికీ ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు. సామూహిక జీవితంలో అనేక మంది విభిన్న కార్యభారాలను మోస్తున్నప్పుడు వారందరి మధ్య సహకారం, సమన్వయం, సమిష్టి బాధ్యతాభావం లేకపోతే, ఎవరికి వారు తన దాకా వచ్చే వరకు పట్టించుకోకపోతే వ్యవహారం చెడిపొయ్యే ప్రమాదముంది. అదే తన స్వంత కార్యమయితే మనిషి అలా నిర్లక్ష్యంగా తనకు పట్టనట్టుగా వ్యవహరిస్తాడా? అన్నదే ప్రశ్న. దైవ ప్రవక్త (సఅసం) ఇక్కడ అదే చెప్పారు. తన స్వంత పనులకు ఏ విధంగా మనిషి తరతమ భేదాలు మరచి, నాదీ, నీది అన్న అరమరికల్లేకుండా అన్ని పనులు సక్రమంగా సవ్యంగా జరగాలని కోరుకుంటాడో అదే విధంగా సామూహిక వ్యవహారాలు సయితం సజావుగా పూర్తయ్యేలా చూడటం అతని ధర్మం. లేకపోతే ప్రపంచంలో జరిగే పరాభవం, అవమానాలు అలా ఉంచి పరలోకంలోనూ అపార నష్టానికి గురి కావలసి వస్తుందని, స్వర్గం సువాసనలు కూడా సోకవని, నరకమే గమ్యమవుతుందని ప్రవక్త మహనీయులు హెచ్చరిస్తున్నారు. దైవం రక్షించుగాక!

(٣٨٠) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا مِنْ اَحَدٍ مِنْ أُمَّتِيْ وَلِيَ مِنْ اَمْرِ الْمُسْلِمِيْنَ شَيْئًا لَمْ يَحْفَظْهُمْ بِمَا يَحْفَظُ بِهٖ نَفْسَهٗ وَاَهْلَهٗ اِلَّا لَمْ يَجِدْ رَائِحَةَ الْجَنَّةِ ۔ (المعجم الصغير للطبرانی ۔ ص۱۰۱)

380. అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి), దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు ఉల్లేఖించారు: "నా అనుచరసంఘంలో ఎవరయినా ముస్లిముల వ్యవహారానికి దేనికయినా బాధ్యుడిగా నియుక్తుడయి తరువాత, తన ఇంటివారిని పరిరక్షించే రీతిలో వారినీ పరిరక్షించకపోతే స్వర్గం పరిమళం కూడా అతనికి సోకదు." (మో'జముస్సగీర్ - త్రిబాని)

---

379 ఈ హదీసు స్థూలంగా చూస్తే శాపనార్థం స్ఫురించేలా అగుపిస్తుంది. కారుణ్యమూర్తి మహనీయ ముహమ్మద్(సఅసం) సంప్రదాయానికి ఇది విరుద్ధంగా కూడా కానవస్తుంది. కాని దాన్ని తరచి చూసినట్లయితే ముస్లిముల సామూహిక వ్యవహారాలను - ఏ స్థాయిలోనయినా సరే - నిర్వహించేవారి బాధ్యతను విశదపరచడమే ప్రవక్త మహనీయుని ఉద్దేశ్యం అని ద్యోతకమవుతుంది. సమాజంలో ఏ కార్యభారమయినా ప్రముఖమయిందే. దేని విషయంలోనయినా మనిషి ప్రజలకూ జవాబు చెప్పుకోవలసి ఉంటుంది, ప్రభువుకూ జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. అందులో సందేహం లేదు. కాని ప్రజల సామూహిక వ్యవహారాలను చక్కబరచడానికి నియుక్తులయిన వారి బాధ్యత మరీ గురుతరమవడానికి కారణం ఆ బాధ్యత గల వ్యక్తి చేసే పనుల పర్యవసానాల పరిధి మరింత విస్తృతమవడమే. అతను తీసుకున్న ఓ తప్పుడు నిర్ణయం మూలంగా సామూహిక వ్యవస్థ సాంతం నష్టపోయే ప్రమాదముంటుంది. ఇక అతను తప్పుడు చర్యనే గైకొన్నట్లయితే దుష్ఫలితాలు ఒక వ్యక్తి వరకో కొందరు వ్యక్తుల వరకో పరిమితమవక మొత్తం సంఘాన్ని పరివేష్టిస్తాయి. అందువల్లనే బాధ్యతాయుత పదవులను కాంక్షించేవారికి ఆ పదవులు అప్పజెప్పరాదని సూత్రీకరించారు ప్రవక్త మహనీయులు (సఅసం). తెలిసీ ఓ కంటక ప్రాయమయిన మార్గాన్ని ఒక వ్యక్తి కోరుకుంటున్నాడంటే అతడు అవివేకి అయినా కాగలడు లేదా కడు బాధ్యతా రహితుడయినా కాగలడు. దైవం రక్షించుగాక!

380 ఈ హదీసు కూడా సామూహిక వ్యవహారాలకు బాధ్యులయిన వారి స్థానాన్ని చాటిచెబుతోంది. సామూహిక వ్యవహారాలలో ఏదయినా బాధ్యతాయుత హోదాగలవారు

(۳۸۱) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ وَلِيَ مِنْ اَمْرِ الْمُسْلِمِيْنَ شَيْئًا فَغَشَّهُمْ هُوَ فِي النَّارِ۔ (المعجم الصغير للطبرانی ص۲۰۷)

381. హ|జత్ అనస్ (రఅ) ఉల్లేఖించినదాని ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు. "ఎవరయితే ముస్లిముల ఏ వ్యవహారానికయినా పరిరక్షకుడుగా నియుక్తుడయి అందులో దాని పట్ల ద్రోహం చేస్తాడో అతను నరకాగ్నిలో కాలిపోతాడు." (మో'జముస్సగీర్ - తిబ్రాని)

(۳۸۲) عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُؤْتٰى بِالرَّجُلِ الْمُتَوَفّٰى عَلَيْهِ الدَّيْنُ فَيَسْئَلُ هَلْ تَرَكَ لِدَيْنِهٖ قَضَاءً فَاِنْ حُدِّثَ اَنَّهٗ تَرَكَ وَفَاءً صَلّٰى وَاِلَّا قَالَ لِلْمُسْلِمِيْنَ صَلُّوْا عَلٰى صَاحِبِكُمْ فَلَمَّا فَتَحَ اللّٰهُ عَلَيْهِ الْفُتُوْحَ قَامَ فَقَالَ اَنَا اَوْلٰى بِالْمُؤْمِنِيْنَ مِنْ اَنْفُسِهِمْ فَمَنْ تُوُفِّيَ مِنَ الْمُؤْمِنِيْنَ فَتَرَكَ دَيْنًا فَعَلَيَّ قَضَاؤُهٗ وَمَنْ تَرَكَ مَالًا فَلِوَرَثَتِهٖ۔ (بخاری، مسلم، مشکوٰۃ۔ باب الافلاس)

382. హ|జత్ అబూహురైరా (ర) ఇలా ఉల్లేఖించారు, "ఎప్పుడయినా దైవ ప్రవక్త వద్దకు రుణగ్రస్తుడయిన వ్యక్తి జనాజా (శవపేటిక) తీసుకువస్తే ఆయన, 'ఇతను తన అప్పును తీర్చడానికి ఏమయినా సొమ్ము వదిలాడా?' అని అడిగేవారు. సమాధానం సకారాత్మకమయితే ఆయన జనాజా నమాజ్ చేయించేవారు. లేకపోతే ఆయన అక్కడున్న జనంతో, 'మీ సహచరుని నమాజ్ చేసుకోండి, వెళ్ళండి' అని చెప్పేవారు. ఆ తరువాత విజయపరం పరలు ప్రాప్తమవగా (ప్రభుత్వ ధనాగారంలో డబ్బు వచ్చి చేరినప్పుడు) ఆయన ఒకసారి ప్రసంగిస్తూ ఇలా సెలవిచ్చారు: 'నేను ముస్లిములకు వారి ప్రాణాలకన్నా సన్నిహితంగా ఉన్నాను. అందువల్ల ఏ ముస్లిమ్ అప్పులు వదలి మరణిస్తాడో దాని చెల్లింపు నా బాధ్యత. అతను ఒక వేళ ధనం వదలి మరణిస్తే అతని వారసులే దాని హక్కుదారులు" (బుఖారి, ముస్లిం, మిష్కాత్

(٣٨٣) عَنْ اَبِیْ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَؤُمُّ الْقَوْمَ اَقْرَأُھُمْ لِکِتَابِ اللّٰہِ فَاِنْ کَانُوْا فِی الْقِرَاءَۃِ سَوَآءً فَاَعْلَمُھُمْ بِالسُّنَّۃِ، فَاِنْ کَانُوْا فِی السُّنَّۃِ سَوَآءً فَاَقْدَمُھُمْ ھِجْرَۃً فَاِنْ کَانُوْا فِی الْھِجْرَۃِ سَوَاءً فَاَقْدَمُھُمْ سِنًّا وَلَا یَؤُمَّنَّ الرَّجُلُ الرَّجُلَ فِیْ سُلْطَانِہٖ وَلَا یَقْعُدُ فِیْ بَیْتِہٖ عَلٰی تَکْرِمَتِہٖ اِلَّا بِاِذْنِہٖ (رواہ مسلم، مشکوٰۃ - باب الامامۃ - ص۹۲)

383. అబూ మస్‌ఊద్ (ర) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు. (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఖుర్‌ఆన్‌లో బాగా పాండిత్యం గలవాడు ప్రజల నాయకుడు కావాలి. ఒకవేళ అందరూ ఖుర్‌ఆన్ జ్ఞానంలో సమానులే అయితే సున్నత్ (ప్రవక్త సంప్రదాయాన్ని) బాగా ఎరిగినవాడు ముందుకు రావాలి. అందులోనూ అందరూ సమానులే అయితే హిజ్రత్ చెయ్యడంలో మున్ముందు ఉండిన వ్యక్తిని నిలబెట్టాలి. అందులోనూ అందరూ సమానులే అయిన పక్షంలో వయసులో అందరికన్నా పెద్దవాడయిన వ్యక్తి నాయకుడు కావాలి. ఎవరయినా సరే మరో ముస్లిం సోదరునికి పలుకుబడి ఉన్న చోట నాయకత్వానికి ముందుకు రాకూడదు. ఇంకా అతని ఇంట అతని ఆనతి లేకుండా అతను కూర్చునే ఆసనంపై కూర్చోరాదు." (ముస్లిం, మిష్కాత్)

---

తన స్వంత విషయాలపై సామూహిక విషయాలకు ప్రాధాన్యత నివ్వవలసి ఉంటుందని ఈ హదీసు తెలుపుతోంది. అదీ కేవలం ఎప్పుడో ఒకప్పుడు కాకతాళీయంగా కాక ఆ బాధ్యతాయుత స్థానంలో ఉన్న వ్యక్తి వ్యవహార శైలియే అలా ఉండాలని, అది అతని సహజ వైఖరిలో భాగమయిపోవాలని ఈ హదీసు మనకు బోధిస్తుంది. అయితే తన ఇంటివారి రక్షణ, సంరక్షణ, పోషణల విషయంలో నిర్లక్ష్యంగా ఉండాలని దీని అర్థం ఎంత మాత్రం కాదు. ఏది ఎప్పుడు ఎంత ప్రధానమో గుర్తించి సరయిన సంతులనాన్ని నెలకొల్పడంలోనే వివేచన కనబరచవలసి ఉంటుంది.

381 పై హదీసుల్లో, సామూహిక వ్యవహారాలకు బాధ్యుడయిన వ్యక్తి నిర్వహించవలసిన పాత్రను సకారాత్మకంగా తెలిపి అందులో అతను నిర్లక్ష్యభావాన్ని కనబరచరాదని బోధించడం జరిగింది. ఈ హదీసులో బాధ్యుడయిన వ్యక్తి వ్యవస్థపట్ల ద్రోహానికి

(۳۸۴) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ ثَلٰثَةٌ لَا تُرْفَعُ صَلٰوتُهُمْ فَوْقَ رُؤُسِهِمْ شِبْرًا رَجُلٌ اَمَّ قَوْمًا وَهُمْ لَهٗ كَارِهُوْنَ وَامْرَأَةٌ بَاتَتْ وَزَوْجُهَا عَلَيْهَا سَاخِطٌ، وَاَخَوَانِ مُتَصَارِمَانِ - (ابن ماجہ۔ مشکوٰۃ۔ باب الامامۃ)

384. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర) గారి ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు, "మూడు రకాల మనుషుల విషయంలో వారు చేసిన నమాజులు వారి తలలపై జానెడు ఎత్తు కూడా పోలేవు. 1. తన ప్రజలు అసహ్యించుకున్నా జనుల నాయకుడయ్యే వ్యక్తి. 2. తన భర్త తనతో అసంతుష్టుడయి ఉన్నప్పటికీ కాలం గడుపుతున్న మహిళ. 3. పరస్పరం సంబంధాలు తెంచుకున్న ఇద్దరు సోదరులు."

(ఇబ్ను మాజ, మిష్కాత్)

---

పాల్పడినప్పుడు కలిగే పర్యవసానాన్ని సూచించడం జరిగింది. అలాంటి వ్యక్తి నరకంలో మాడటం తప్ప మరో మార్గం లేదని నేరుగా హెచ్చరించారు దైవ సందేశహరులు (సల్లల్లాహు అలైహి వ సల్లం)

382 ఒక వ్యక్తి రుణగ్రస్తుడయి మరణించాడంటే అతను తన నిత్యావసరాల నిమిత్తం చేసిన అప్పును తీర్చుకోలేకపోయ్యాడనే కదా అర్థం. ప్రవక్త మహనీయుని కాలంలో నేటిలా దుబారా ఖర్చులకు, అధర్మమయిన ఖర్చులకు అప్పులు చేసే వారు కాదు. అందువల్లనే దైవప్రవక్త ఓ ప్రభుత్వాధి నేతగా ప్రజల అప్పులు తీర్చడం తన బాధ్యతగా పేర్కొన్నారు. ఎందుకంటే ప్రజల ప్రాథమిక అవసరాలు తీర్చడం ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యత. ఆ అవసరాలు, 1. కడుపుకు అన్నం, 2. వంటికి బట్ట 3. తలపై నీడ (ఇల్లు) 4. వ్యాధికి చికిత్స 5. అందరికీ విద్య

383 ఇందులో సూచించిన లక్షణాలు మస్జిదుల్లో నమాజ్‌ను చేసే నాయకత్వానికి సంబంధించినవే అయినప్పటికీ ఇస్లాంలో సామూహిక నాయకత్వం కూడా ధర్మానికి లోబడే ఉంటుంది గనక ఈ ఇమామత్ (నాయకత్వపు) లక్షణాలే ఇస్లామీయ రాజ్యాధినేతకు కూడా వర్తిస్తాయి. ఇక్కడ పేర్కొన్న నాలుగు లక్షణాలు ఇవి: 1. ఖుర్‌ఆన్ పాండిత్యంలో ఆధిక్యత 2. సున్నత్ జ్ఞానంలో పైచెయ్యిగా ఉండటం 3. హిజ్రత్ లేక మరేదయినా ధార్మిక సేవలో ముమ్మందు ఉన్న గుణం 4. వయసు ననుసరించి పెద్ద వాడవటం.

(٣٨٥) عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ سَمُرَةَ قَالَ قَالَ لِيْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا تَسْئَلِ الْاِمَارَةَ فَاِنَّكَ اِنْ اُعْطِيْتَهَا عَنْ مَسْئَلَةٍ وُكِّلْتَ اِلَيْهَا وَاِنْ اُعْطِيْتَهَا عَنْ غَيْرِ مَسْئَلَةٍ اُعِنْتَ عَلَيْهَا۔ (بخاری۔ مسلم۔ مشکوٰۃ۔ کتاب الامارۃ۔ ص۳۱۲)

385. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు అబ్దుర్రహ్మాన్ బిన్ సమురహ్ (ర) ఉల్లేఖించారు: "నాయకత్వాన్ని కాంక్షించకండి, మీరు ఒకవేళ దాన్ని కోరుకుంటే దానికే మిమ్మల్ని అప్పగించడం జరుగుతుంది. మీరు కోరుకోకుండానే అది మీకు ప్రాప్తమయితే (దాన్ని సవ్యంగా నిర్వర్తించడానికి) మీకు సహాయం అందజెయ్యబడుతుంది."

(బుఖారి, ముస్లిం, మిష్కాత్)

---

ఈ హదీసు ద్వారా తెలిసే మరో విషయం ఏమిటంటే, ఒక ధార్మిక పండితుని పలుకుబడి, పరపతి ఎక్కువగా ఉన్న సందర్భంలో మరో వ్యక్తి అక్కడ నాయకత్వపు బాధ్యతల్ని తలపై వేసుకుని వ్యవహరించడం సామూహిక జీవనానికి విచ్ఛిన్న కరమయినదిగా పరిణమించవచ్చు. ఆ పండితుడే స్వయంగా అలా అనుమతిస్తే అది వేరే విషయం. అలాగే ఏ వ్యక్తికయినా సంబంధించిన ప్రత్యేక ఆసనం లేక కుర్చీపై అతని అనుమతి లేకుండా కూర్చోవడం కూడా చేదు అనుభవాలకు అపార్థాలకు దారి తీయవచ్చు. అందువల్ల దాన్ని వారించడం జరిగింది.

384 'తలపై జానెడు ఎత్తుకూడా పోలేవు' అన్న దానికి అవి దైవ సన్నిధికి చేరలేవు, దైవ స్వీకారం పొందలేవు అని అర్థం. నాయకుని ప్రత్యేకమయిన ప్రస్ఫుటమయిన లక్షణం ఒకటేమిటంటే అతను తన సచ్చరిత కారణంగా జన సామాన్యం చేత ప్రేమించబడాలి, అందరి మెప్పు పొందాలి. అలాకాక జనులు అత్యధికంగా తన పట్ల సంతుష్టులుగాలేరని గ్రహించిన వెంటనే ఆ బాధ్యతల నుండి తానే స్వయంగా తొలిగి పోవాలి. లేకపోతే ప్రజల మాట అలా ఉంచి దైవం వద్దనూ అప్రసన్నతనే ఎదురుచూడవలసి వస్తుంది.

385 ఇస్లామీయ సామూహిక వ్యవస్థలోని ఓ నియమం ప్రకారం బాధ్యతల్ని కోరుకునే వారు బాధ్యతలకు అనర్హులు. యదార్థానికి నాయకత్వపు బాధ్యతలయినా రాజ్యాధికారాలయినా సామాన్యమయినవి కావు. బుద్ధీ వివేకాలున్న వాడు బాధ్యతా భావం ఎరిగినవాడు ఎవడూ ఆ భారాన్ని మొయ్యడానికి ముందుకు రాడు. ఒకవేళ ఎవరయినా అలా ముందుకు వచ్చినా ముందుకు వచ్చినట్లు సూచనలు కానవచ్చినా

(۳۸۶) عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ مَنِ ابْتَغَی الْقَضَاءَ وَسَئَلَ وُكِّلَ اِلٰی نَفْسِہٖ وَمَنْ اُكْرِہَ عَلَیْہِ اَنْزَلَ اللّٰہُ مَلَكًا یُسَدِّدُہٗ۔ (رواہ الترمذی۔ وابن ماجہ۔ مشكوٰۃ۔ باب العمل فی القضاء)

386. హజ్రత్ అనస్ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రబోధించారు: "ఎవరయితే న్యాయమూర్తి హెూదాను కోరుకుంటాడో అతను తన మనస్సుకు అప్పగించబడతాడు. కాని ఎవరికయితే తనకు ఇష్టం లేకున్నా ఆ హెూదాను చేపట్టవలసి వస్తుందో అతన్ని సన్మార్గాన నడిపేందుకు పరమ ప్రభువయిన అల్లాహ్ దైవ దూతల్ని అవతరింపజేస్తాడు." (తిర్మిజి, ఇబ్నుమాజ, మిష్కాత్)

(۳۸۷) عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ مَنْ طَلَبَ قَضَاءَ الْمُسْلِمِیْنَ حَتّٰی یَنَالَہٗ ثُمَّ غَلَبَ عَدْلُہٗ جَوْرَہٗ فَلَہُ الْجَنَّۃُ وَمَنْ غَلَبَ جَوْرُہٗ عَدْلَہٗ فَلَہُ النَّارُ۔ (رواہ ابوداؤد، مشكوٰۃ۔ باب العمل فی القضاء)

387. హజ్రత్ అబూ హురైరా (ర) ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు, "న్యాయమూర్తి హెూదాను కోరుకున్న వ్యక్తి దాన్ని పొందిన తరువాత అతని న్యాయశీలత అతని అన్యాయంపై ఆధిక్యత పొందితే అతనికి స్వర్గం ప్రాప్తమవుతుంది. కాని అతని అన్యాయం న్యాయబుద్ధిపై ఆధిక్యత పొందినట్లయితే అతనికి నరకం లభిస్తుంది." (అబూదావూద్, మిష్కాత్)

---

లేక వాటికై అతను తాపత్రయపడి ప్రయత్నాలు చేసినా దానికి రెండే రెండు అర్థాలు. అతను ఆ బాధ్యతల, పదవులలోని సూక్ష్మతను, భారాన్ని ఎరుగడు అనీ లేదా అతను పదవీ వ్యామోహంతో అధికార దాహంతో అల్లాడిపోతున్నాడనీ అర్థం. ఈ రెంటిలో ఏది వాస్తవమయినా అతను ఆ పదవికి అనర్హుడనడానికి అదే చాలు. అలా ప్రయత్నాలవల్ల ఎవరయినా ఏ హెూదానయినా పొందినట్లయితే అతనికి దైవ సహాయం ప్రాప్తం కాదు. అతను ఆ బాధ్యత మోపే కార్యభారం వల్ల అందులోనే సతమతమవుతూ ఉంటాడు. వాటికే అంకితమయిపోతాడు. దాన్నే "దానికి అప్పగించబడతారు" అన్న

(۳۸۸) عَنْ يَحْيَى بْنِ هَاشِمٍ عَنْ يُونُسَ بْنِ اَبِي اِسْحَاقَ عَنْ اَبِيْهِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كَمَا تَكُوْنُوْنَ كَذٰلِكَ يُؤَمَّرُ عَلَيْكُمْ ۔ (مشکوٰۃ۔ باب کتاب الامارۃ)

388. తన తండ్రి ద్వారా విని అబూ ఇస్‌హాక్ (ర.అ) చేసిన ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, “మీరు ఎలాంటి వారో అలాంటి వారే మీపై నాయకులయి తిష్ఠ వేస్తారు.”

(మిష్కాత్)

---

మాటల ద్వారా వ్యక్తం చెయ్యబడింది. ఒకవేళ ఏ వ్యక్తి అయినా అలాంటి పదవీ వ్యామోహానికీ, అధికార దాహానికీ గురికాకుండా వాటినుండి తప్పించుకోవాలని సకల ప్రయత్నాలు చేసినా బాధ్యతలు అతనికి అప్పగించినట్లయితే అతనికి దైవ సహాయమూ తోడవుతుంది, అవసరమయిన సామర్థ్యమూ ప్రసాదించబడుతుంది.

386 ఈ హదీసు కూడా పై హదీసు లాంటి భావాన్నే తెలుపుతోంది. ఇక్కడ న్యాయస్థానానికి సంబంధించిన పదవిని గురించి తెలుపడం జరిగింది. మనిషి తన మనస్సుకు అప్పగించబడటం అంటే అతను సిద్ధాంతాలకు, న్యాయ సూత్రాలకు కాక తన మనోకాంక్షలకు దాసుడయి చిక్కుల్లో కూరుకుపోతాడన్నమాట. ఎందుకంటే అతను స్వార్థం చేతనే ఆ హెూదాను చేపట్టాడు. స్వార్థంతోనే దాన్ని ఉపయోగించుకుంటాడు.

387 ఇది న్యాయనిర్ణయాధికారం పొందిన ప్రతి హెూదాకు వర్తిస్తుంది. మనిషి న్యాయానికి కట్టుబడి ఉన్నంతకాలం అతని ఇహపరాలు సవ్యంగా ఉంటాయి. న్యాయాన్ని వదలిన వెంటనే ఇహపరాలలో జీవితం దుర్భరమవుతుంది. నరకం అతనికి చేరువవుతుంది. సాధారణ పరిస్థితుల్లో ఒక ముస్లిమ్ బాధ్యతాయుతమయిన పదవులను కాంక్షించరాదు, వాటికై స్వయంగా యత్నించనూరాదు. లేకపోతే అతని ధర్మనిష్ఠపై మచ్చపడకమానదు. కాని ఎలాంటి స్వార్థానికి, పేరాశలకు గురికాకుండా ఎవరయినా తాను ముందుకు రావడంవల్ల న్యాయం ధర్మం నెరవేరే అవకాశముందని, దుర్మార్గుల్ని అణచడానికి వీలుందని అనుకుంటే దానికి మినాయింపు ఉంది. అదీ మరో పచ్చీలుడూ సమర్థుడయిన వ్యక్తి సమాజంలో లేని పరిస్థితుల్లో మటుకే. అత్యవసర పరిస్థితుల్లో ముందుకు వచ్చి పదవులను అందుకోవలసిన అగత్యాన్ని మరువరాదు. ఇంతకూ ఇలాంటి పరీక్షకు వీలయినంత వరకు దూరంగా మెలగటమే శ్రేయస్కరం. ఎందుకంటే మరో ఉల్లేఖనం ప్రకారం, ఎవరినయినా న్యాయమూర్తిగా నియమించడం అతన్ని కత్తి లేకుండానే గొంతుకొయ్యడం లాంటిదని చెప్పడం జరిగింది.

(٣٨٩) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اِذَا كَانَ اُمَرَائُكُمْ خِيَارَكُمْ وَاَغْنِيَاءُكُمْ سُمَحَائَكُمْ وَاُمُوْرُكُمْ
شُوْرٰى بَيْنَكُمْ فَظَهْرُ الْاَرْضِ خَيْرٌ لَّكُمْ مِّنْ بَطْنِهَا، وَاِذَا كَانَ
اُمَرَائُكُمْ شِرَارَكُمْ وَاَغْنِيَائُكُمْ بُخَلَائَكُمْ وَاُمُوْرُكُمْ
اِلٰى نِسَائِكُمْ فَبَطْنُ الْاَرْضِ خَيْرٌ لَّكُمْ مِّنْ ظَهْرِهَا
(ترمذی۔ مشکوٰۃ۔ باب تغیر الناس)

389. అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు, "మీ నాయకులు మంచి వారయినట్లయితే, మీలోని ధనికులు దాతృ గుణం కలవారయితే, మీ వ్యవహారాలు పరస్పర సలహా సంప్రదింపుల ద్వారా నిర్ణయమయినట్లయితే మీకు నేల కడుపుకన్నా దాని వీపు మేలయినది. అలా కాక మీ నాయకులు దుర్మార్గులయితే, మీలోని ధనికులు పిసినారులయితే, మీ వ్యవహారాలు (అంతఃపుర) స్త్రీల పాలయితే అప్పుడు మీకు ధరిత్రి వీపుకన్నా దాని కడుపు ఉత్తమమయినది."
(తిర్మిజీ, మిష్కాత్)

---

388 ఇక్కడ నాయకులన్న మాట ప్రభుత్వాధినేతలకు కూడా వర్తిస్తుంది. సాధారణంగా నాయకులంటే సమాజంలోని నవనీతమని చెప్పవచ్చు. సమాజంలో అత్యధిక భాగం దుష్ట జనంతో నిండి ఉన్నట్లయితే నాయకులు సద్గుణసంపన్నులయిన వారు ఎక్కణ్ణుంచి ఉద్భవిస్తారు? మరీ ముఖ్యంగా నేటి ప్రజాస్వామిక కాలంలో సామాన్య ప్రజలే తమ నాయకుల్ని, ప్రతినిధుల్ని ఎన్నుకుంటున్నప్పుడు సమాజంలోనుంచే వచ్చిన నాయకులు ప్రజల భావాలకు, చేష్టలకు అద్దంపట్టే వారు తప్ప మరో విధమయిన వారు ఎలా ప్రాప్తమవుతారు. ఈ హదీసుకు ఇంకో భావం కూడా సాధ్యమే. ఏ దేశ ప్రజలయితే చెడును ప్రేమించేవారుగా తయారవుతారో వారిపై దైవం దుర్మార్గులయిన నాయకులనే రుద్దుతాడు. అందువల్ల అనుయాయులు, దేశ ప్రజలు సజ్జనులయినప్పుడే సద్వర్తనులయిన నాయకులు, ప్రభుత్వాధినేతలు వారికి లభ్యమవుతారు.

389 ఇక్కడా నాయకులంటే, ప్రభుత్వాధినేతలు కూడా వారిలో చేరి ఉన్నారు. మంచి వారంటే రుజువర్తనులు, సచ్ఛీలురు అని భావం. వ్యవహారాలన్నవి సామూహిక

(٣٩٠) عَنْ بُرَيْدَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَلْقُضَاةُ ثَلٰثَةٌ وَاحِدٌ فِي الْجَنَّةِ وَاثْنَانِ فِي النَّارِ فَاَمَّا الَّذِيْ فِي الْجَنَّةِ فَرَجُلٌ
عَرَفَ الْحَقَّ فَقَضٰى بِهٖ وَرَجُلٌ عَرَفَ الْحَقَّ فَجَارَ فِي الْحُكْمِ فَهُوَ فِي النَّارِ وَرَجُلٌ
قَضٰى لِلنَّاسِ عَلٰى جَهْلٍ فَهُوَ فِي النَّارِ (رواه ابوداؤد وابن ماجه - مشکوٰة - باب العمل فی القضاء)

390. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చినట్లు హజ్రత్ బురైదా ఉల్లేఖించారు: కాజీ (న్యాయ మూర్తులు) మూడు రకాలు. ఒక రకం వారు స్వర్గ ప్రవేశం చేస్తారు. రెండవ రకం వారు నరకానికి పోతారు. స్వర్గానికి అర్హుడు, వాస్తవాన్ని గ్రహించి దానికనుగుణంగా తీర్పు చేసేవాడు. వాస్తవాన్ని గ్రహించినప్పటికీ తీర్పులో అన్యాయం చేసినవాడు నరకానికి పోతాడు. అలాగే అజ్ఞానంతో జనుల మధ్య తీర్పు చేసినవాడూ నరకానికి పోయేవాడే." (ఇబ్ను దావూద్, ఇబ్ను మాజా, మిష్కాత్)

---

వ్యవహారాలు అన్నమాట. భూమి 'వీపు' అంటే బ్రతికి ఉండటం అనీ, 'కడుపు' అంటే చనిపోవడం అనీ అర్థం. రెండవ కోవకు చెందిన ప్రజలు తాము స్వయంగానూ పరాభవానికీ, అవమానానికీ గురవుతారు, తరువాత వారు ముస్లిములయితే ఇస్లామ్ అప్రతిష్టకు కారణభూతులవుతారు.

ఈ హదీసులో ఓ సమాజం ఇహపరాల్లో సౌభాగ్యవంతం కావడానికి మూడు విషయాలు ముఖ్యం అని చెప్పడం జరిగింది. ఈ మూడు సామూహిక లక్షణాలున్న సమాజం సాఫల్యానికి చేరువవుతుంది. 1. దైవభక్తిగల నాయకత్వం 2. దాతృత్వం, నిరుపేదలపట్ల సానుభూతిగల సంపన్నులు 3. సకల సామూహిక వ్యవహారాలలో సలహా సంప్రతింపులు, ప్రజాస్వామిక సూత్రాల పాటింపు. దీనికి భిన్నంగా నాయకులు, పాలకులు దుష్టస్వభావులయితే, ధనవంతులు పిసినారులు, పేరాశాపరులయితే, భోగలాలసలు, విలాసమయ జీవితం మూలంగా సామూహిక వ్యవహారాలన్నీ మగువల నాయకత్వాన వదిలేసి మగవారు వారి అనుయాయులయిపోతే - అలాంటి సమాజం ఎంతో కాలం నిలువజాలదు.

ఈ హదీసు ద్వారా తెలిసే మరో విషయం ఏమిటంటే సలహా సంప్రతింపులు, పరస్పర విశ్వాసం, సహకారాల వాతావరణం లేనిచోట స్త్రీల రూపంలో అతిహేయమయిన నియంతృత్వం ఆ ప్రజలపై ఆధిక్యత పొందుతుంది.

ఇవన్నీ నేటి సామాజిక స్థితుల పూర్వరంగంలో ఎంతయినా గమనార్హమైన అంశాలు.

(۳۹۱) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ جُعِلَ قَاضِيًا بَيْنَ النَّاسِ فَقَدْ ذُبِحَ بِغَيْرِ سِكِّيْنٍ - (رواہ ابوداؤد وابن ماجہ مشکوٰۃ - باب العمل فی القضاء)

391. అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (సఅసం) ఇలా తెలిపారు. "ఎవడయితే జనుల మధ్య (తీర్పు చెయ్యడానికి) కాజీగా నియుక్తుడవుతాడో అతను కత్తిలేకుండానే వధించబడతాడు."

(ఇబ్ను దావూద్, ఇబ్ను మాజా, మిష్కాత్)

(۳۹۲) عَنْ عُبَادَةَ بْنِ الصَّامِتِ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَقِيْمُوْا حُدُوْدَ اللّٰهِ فِى الْقَرِيْبِ وَالْبَعِيْدِ وَلَا تَاْخُذُكُمْ فِى اللّٰهِ لَوْمَةَ لَائِمٍ - (رواہ ابن ماجہ بمشکوٰۃ - کتاب الحدود -)

392. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (ర.అ) ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "చట్టాన్ని మీకు దగ్గరి వారికీ దూరపు వారికీ (సమంగా) వర్తింప జెయ్యండి. దైవం విషయంలో నిందించేవారి నిందను గురించి మీరు ఫరవా చెయ్యకండి."

(ఇబ్ను మాజా, మిష్కాత్)

---

390 హదీసులో మూడు రకాల న్యాయమూర్తుల ప్రస్తావన వచ్చింది. 1. సత్యాన్ని గ్రహించడానికి అన్ని ప్రయత్నాలూ చేసి ఇదీ యదార్థం అన్న నిర్ధారణ అయిన తరువాత దానికనుగుణంగా తీర్పు చేసేవాడు. 2. సత్యాన్ని తెలుసుకున్నప్పటికీ దానికి విరుద్ధంగా తీర్పు చేసే అన్యాయవర్తనుడయిన వాడు. 3. ఏమీ తెలియకపోయినా తెలిసినట్టు న్యాయపీఠాన కూర్చున్నవాడు. ఇది కేవలం న్యాయస్థానంలో ఉండే వేదికకే కాక నిత్య జీవితంలోనూ మనిషి నిర్ణయాలు గైకొనేటప్పుడు, తీర్పు చెప్ప డానికి నియమింపబడినప్పుడు సయితం వర్తిస్తుంది. దీనివల్ల తెలిసే విషయమేమిటంటే తనకు క్షుణ్ణంగా తెలియని విషయంలో మనిషి తీర్పు చెప్పే లేక అభిప్రాయాల్ని వెలిబుచ్చే సాహసం చెయ్యరాదు. అలాగే అసలు విషయం తనకు తెలిసినా దాన్ని దాచిపెట్టి మరో విధంగా అభిప్రాయాన్ని లేక తీర్పును చెప్పడం అన్నది కూడా తగని పని. అలాగే ఇస్లామీయ రాజ్యంలో న్యాయమూర్తికి ఉండవలసిన గుణాలు రెండు.

(٣٩٣) عَنْ أُمِّ سَلَمَةَ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ فِي بَيْتِهَا فَدَعَى وَصِيفَةً لَهُ أَوْلَهَا فَأَبْطَأَتْ فَاسْتَبَانَ الْغَضَبُ فِي وَجْهِهِ فَقَامَتْ أُمُّ سَلَمَةَ إِلَى الْحِجَابِ فَوَجَدَتِ الْوَصِيفَةَ تَلْعَبُ وَمَعَهُ سِوَاكٌ فَقَالَ لَوْلَا خَشْيَةُ الْقَوَدِ يَوْمَ الْقِيٰمَةِ لَأَوْجَعْتُكِ بِهٰذَا السِّوَاكِ -

(الادب المفرد- باب قصاص العبد- ص٢٩)

393. ఇది ఉమ్ము సల్మా (ర.అ) ఉల్లేఖనం: ఒకసారి దైవ ప్రవక్త (సఅసం) ఆవిడగారి ఇంట్లో ఉండగా ఆయన తన ఇంటి పనికత్తెను పిలిచారు. పని కత్తె రావడం ఆలస్యం అయింది. ఆయన ముఖం కోపంతో ఎర్రబారింది. ఉమ్ము సల్మా (ర.అ) పరదా చాటుగా వెళ్ళి చూస్తే ఆ పిల్ల ఆడుకుంటూ ఉండటం కనిపించింది. ఆ సమయాన ఆయన చేతిలో పల్లు తోముకునే పుల్ల (మిస్వాక్) ఉండింది. అప్పుడు ఆయన ఆ పనికత్తెను సంబోధించి, ప్రళయదినాన పరిహారం ఇవ్వవలసిన భయం లేకపోతే నేను నిన్ను ఈ మిస్వాక్‌తో కొట్టేవాణ్ణి." (అల్ అదబుల్ ముఫ్రద్)

---

1. చట్టం, శాసనాంగాల సంపూర్ణ అవగాహన 2. ప్రతి విషయంలోనూ న్యాయాన్ని పాటించడం. ఈ రెంటిలో ఏది లేకపోయినా అతను ఆ పదవికి తగడు.

391 అంటే న్యాయమూర్తి స్థానం, న్యాయపీఠం కత్తిమీద సాములాంటివి. ఎంతో మన్నితమయినవి. ఆ పదవిలో ఉన్న వ్యక్తి అన్యాయపు వైఖరినవలంబిస్తే దైవం వద్ద పట్టుబడి తీవ్ర శిక్షకు పాత్రుడవుతాడు. న్యాయాన్ని చెప్పినట్లయితే పలుకుబడి ఉన్న బడా నేరస్థుల శత్రుత్వాన్ని కొనిదెచ్చుకుంటాడు. కాని న్యాయమే చెప్పి చాకచక్యంతో ఐహిక శత్రుత్వాన్నీ జయించగలగడమే అసలయిన న్యాయమూర్తి పని.

392 బంధువులు న్యాయాన్ని కోరివస్తే ఒక విధంగా, పరాయివారు వస్తే మరో విధంగా న్యాయం చెప్పడమయినా లేదా దైవం నిర్ణయించిన శిక్ష విధించడంలో తన వారని, పరాయి వారని విచక్షణ చూపడం ఇలాంటి వన్నీ తగవని దీని అర్థం. దైవం ఇచ్చిన షరీఅత్ ప్రకారం నిర్ణయాలు గైకొనడానికయినా, తీర్పులు చెప్పడానికయినా, ఎవరు ఏమంటారో, తన వారు నిందిస్తారో, పరాయివారు అపనిందలు వేస్తారో అన్న భయం లేకుండా మెలగాలని భావం.

(۳۹۴) عَنْ عَائِشَةَ رَضِیَ اللّٰہُ عَنْھَا اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اَقِیْلُوْا ذَوِی الْھَیْأٰتِ عَثَرَاتِھِمْ اِلَّا الْحُدُوْدَ۔ (رواہ ابوداؤد۔ مشکوٰۃ۔ کتاب الحدود۔)

**394. హ|జత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు, "ప్రముఖుల తప్పిదాలను మన్నించివేయండి, కాని ఒక విషయం గుర్తుంచుకోండి, అల్లాహ్ నిర్ణయించిన హద్దులు (శిక్షలు), ఎన్నటికీ క్షమించబడవు." (అబూ దావూద్, మిష్కాత్)**

---

393 ఉమ్ము సల్మా (రఅ) (ఉర్దూ వారు ఫార్సీ సంప్రదాయం ప్రకారం ఉమ్మె సల్మా అని అంటారు) దైవ ప్రవక్త (సఅసం) పతీమణి, ముస్లిములందరి మాతృమూర్తి. దైవ ప్రవక్త వంతుల వారీగా తన సతీమణుల ఇండ్లకు వెళ్ళి అక్కడే గడిపేవారు. అలాంటి ఓ సందర్భంలో జరిగిన సంఘటన ఇది. ఇందులో ప్రళయ దినాన జరిగే న్యాయనిర్ణయం గురించి ప్రస్తావించడం జరిగింది. ఓ చిన్న పలుదోముపుల్లతో కొట్టిన దెబ్బకూ పరిహారం చెల్లించవలసిన అవస్థ అక్కడ ఎదురవుతుందన్న భయం దైవ ప్రవక్త సూచించారు. ఇలాంటి పరిహారం ఇహలోకపు న్యాయస్థానంలోనూ ఆ పని పిల్ల కోరినట్లయితే చెల్లించడం తప్పదు. ఇలా చెల్లించిన ఉదాహరణలూ ఇస్లామీయ చరిత్రలో అనేకమున్నాయి. మరో విషయం: ఇంట్లో పని చేసే వారిపట్ల వ్యవహరించవలసిన తీరు ఏమిటో కూడా గొప్ప ఆదర్శవంతంగా దైవ ప్రవక్త ఆచరణ రూపేణ తెలిపారు. కోపం వచ్చినా పొరపాటును మన్నించి వెయ్యడంలోనే గొప్పతనముంది. ఈ ఆదర్శాన్ని తు.చ. తప్పకుండా పాటించిన మహనీయులూ తరువాతి వారిలో అనేకమంది ఉన్నారు.

394 ఇది చట్టపరంగా ఎవరినయినా మన్నించవీలయితే దాని పరిధుల్ని తెలిపే హదీసు. ఇందులో ప్రముఖులు అని అంటే పదవులు, హోదాని బట్టి గొప్పవారుగా చెలామణి అయ్యేవారు, సమాజంలో తమ జ్ఞానం, ధర్మనిష్ఠ, సేవల కారణంగా గౌరవాదరణలు, ప్రాముఖ్యం పొందినవారే తప్ప ఇతరులు కారు, ఇలాంటివారివల్ల ఏదైనా పొరపాటు జరిగితే దానిపట్ల చూపోపు వహించడమే ఉత్తమం.

ఈ హదీసుకు క్రియారూపంగా ప్రవక్త మహనీయుని కాలంలో జరిగిన ఓ సంఘటనను పేర్కొనవచ్చు. హాతిబ్ (ర.అ) అనే ప్రవక్త సహచరుడు, ఓ రహస్యాన్ని మక్కాలో ఉన్న తన ఇంటి వారి రక్షణార్థం, మక్కాకు చేరవేసే ప్రయత్నం చేశాడు. అది తెలిసి పోయినప్పటికీ కేవలం అతను బద్ర్ రణరంగంలో చేసిన సేవల కారణంగా అతన్ని

(۳۹۵) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ زُبَيْرٍ قَالَ قَضٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَنَّ الْخَصْمَيْنِ يَقْعُدَانِ بَيْنَ يَدَيِ الْحَاكِمِ۔ (رواه احمد، ابوداؤد، مشکوٰۃ۔ باب الاقضیہ)

395. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ ఉల్లేఖనం: "న్యాయమూర్తి సమక్షంలో దావాదారు, ముద్దాయి, ఇద్దరూ హాజరు కావాలి." అని దైవ ప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (అహ్మద్, అబూ దావూద్, మిష్కాత్)

(۳۹۶) عَنِ ابْنِ عَبَّاسٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَوْ يُعْطَى النَّاسُ بِدَعْوَاهُمْ لَادَّعٰى نَاسٌ دِمَاءَ رِجَالٍ وَاَمْوَالَهُمْ وَلٰكِنَّ الْيَمِيْنَ عَلَى الْمُدَّعٰى عَلَيْهِ۔ (رواه مسلم۔ مشکوٰۃ۔ باب الاقضیہ)

396. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర.అ) ఓ ఉల్లేఖనంలో దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారని తెలిపారు: "జనులు చేసే దావా ఆధారంగా తీర్పులు చేసినట్లయితే ప్రతి వ్యక్తి ధన ప్రాణాలకు దావాదారులు పుట్టుకువస్తారు. కాబట్టి ముద్దాయికి ప్రమాణం చేసే హక్కు ఉండాలి." (ముస్లిం, మిష్కాత్)

---

మన్నించివెయ్యడం జరిగింది. ఇది అతను మరేదురుద్దేశ్యంతో చేసిన తప్పుకాదు. కేవలం తన వారి రక్షణ కోరాడు. మన్నించి వెయ్యబడ్డాడు. అయితే దైవం నిర్ణయించిన శిక్షల్ని ఆకర్షించే నేరం చేసినప్పుడు ఆ నేరస్థుణ్ణి అతను ఎంతటి ధర్మ పరాయణుడయినప్పటికీ శిక్షించకుండా వదిలే హక్కు ఎట్టి పరిస్థితిలోనూ ఎవరికీ లేదు.

395 న్యాయస్థానంలో ఇరు వర్గాల వారూ హాజరయి తమ తమ వ్యాజ్యాన్ని వినిపించడం అవసరం. వారిలో ఒకరిని కేవలం వారి ధన సంపత్తి కారణంగానో, పదవీ హోదాల కారణంగానో, పలుకుబడి మూలంగానో న్యాయస్థానానికి రాకుండా మినహాయించడం ఎంత మాత్రం తగదు.

396 అంటే నిందితుడే తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాలి అన్న నియమం పాటిస్తే ఎవరి ధన ప్రాణాలూ భద్రంగా మిగలవు. రుజువు చేసే భారం దావేదారుపైనే ఉంటుంది. అతడు తన ఆరోపణకు ఆధారంగా సాక్ష్యాలున్నట్లయితే వాటిని ముందుకు

(۳۹۷) عَنْ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اِدْرَءُوا الْحُدُوْدَ عَنِ الْمُسْلِمِيْنَ مَا اسْتَطَعْتُمْ فَاِنْ كَانَ لَهٗ مَخْرَجٌ فَخَلُّوْا
سَبِيْلَهٗ فَاِنَّ الْاِمَامَ يُخْطِئُ فِي الْعَفْوِ خَيْرٌ مِّنْ اَنْ يُّخْطِئَ فِي الْعُقُوْبَةِ - رواه
الترمذی ۔مشکوٰۃ ۔کتاب الحدود)

397. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారని హజ్రత్ ఆయిషా ఉల్లేఖించారు: "వీలయినంత మటుకు ముస్లిముల షరీఅత్ శిక్షలను విధించకుండా దాటవేస్తూ ఉండండి. ఏ మాత్రం వీలున్నా నిందితుని దారిని అడ్డుకోకండి. నిందితుని వదలి వెయ్యడంలో తప్పు చెయ్యడం, శిక్షించడానికి ఓ నిర్దోషిని గురి చెయ్యడం కన్నా ఎంతో మేలయినది." (తిర్మిజి, మిష్కాత్)

(۳۹۸) عَنْ اَنَسٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ انْطَلِقُوْا
بِسْمِ اللّٰهِ وَبِاللّٰهِ وَعَلٰى مِلَّةِ رَسُوْلِ اللّٰهِ، لَا تَقْتُلُوْا شَيْخًا فَانِيًا وَلَا طِفْلًا
صَغِيْرًا وَلَا امْرَاَةً وَلَا تَغُلُّوْا وَضُمُّوْا غَنَائِمَكُمْ وَاَصْلِحُوْا وَاَحْسِنُوْا فَاِنَّ اللّٰهَ
يُحِبُّ الْمُحْسِنِيْنَ ۔

398. హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "బయలుదేరండి, అల్లాహ్ పేరుతో, అల్లాహ్ ప్రసాదించిన సద్బుద్ధి, సహకారాలతో, అల్లాహ్ సందేశహరుని ధార్మిక సముదాయంపై నిలకడ కనబరుస్తూ బయల్దేరండి. అయితే బలహీనులయిన వృద్ధులపై, పసి బాలలపై, మహిళలపై చెయ్యిచేసుకోకండి. యుద్ధ ప్రాప్తిపట్ల నమ్మక ద్రోహం తలపెట్టకండి. యుద్ధంలో చేజిక్కినదంతా ఓ చోట ప్రోగు చెయ్యండి. సద్వర్తనాన్నీ ఉత్కృష్ట విధానాన్నీ అవలంబించండి. నిస్సందేహంగా అల్లాహ్ ఉత్తములయిన వారిని అధికంగా ప్రేమిస్తాడు."

---

తీసుకురావాలి. అతను అలా చెయ్యలేకపోతే ఈ హదీసు ప్రకారం నిందితుడు ప్రమాణం చేసి తన నిర్దోషిత్వాన్ని ప్రకటిస్తే చాలు అతన్ని ఆ ఆరోపణ నుండి

(٣٩٩) عَنْ سُلَيْمِ بْنِ عَامِرٍ قَالَ كَانَ بَيْنَ مُعَاوِيَةَ وَبَيْنَ الرُّوْمِ عَهْدٌ، وَكَانَ يَسِيْرُ نَحْوَ بِلَادِهِمْ حَتّٰى إِذَا انْقَضَى الْعَهْدُ أَغَارَ عَلَيْهِمْ، فَجَاءَ رَجُلٌ عَلٰى فَرَسٍ. وَهُوَ يَقُوْلُ اَللّٰهُ أَكْبَرُ، اَللّٰهُ أَكْبَرُ، وَفَاءٌ وَلَا غَدْرٌ فَنَظَرَ فَإِذَا هُوَ عَمْرُو بْنُ عَبَسَةَ، فَسَأَلَهُ مُعَاوِيَةُ عَنْ ذٰلِكَ فَقَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ كَانَ بَيْنَهُ وَبَيْنَ قَوْمٍ عَهْدٌ فَلَا يَحُلَّنَّ عَهْدًا وَلَا يَشُدَّنَّهُ حَتّٰى يَمْضِيَ أَمَدُهُ أَوْ يَنْبِذَ إِلَيْهِمْ عَلٰى سَوَاءٍ۔ فَرَجَعَ مُعَاوِيَةُ بِالنَّاسِ۔ (ابوداؤد۔ باب الامان)

399. సలీమ్ బిన్ ఆమిర్ ఉల్లేఖనం ప్రకారం: హ్రజత్ముఆవియ, రోమనుల మధ్య (నిర్యుద్ధ) ఒప్పందం కుదిరింది. అదే ఒప్పంద కాలంలో హ్రజత్ ముఆవియ (సేనలతో) తరలి రోము సరిహద్దులకు బయల్దేరారు. ఒప్పంద కాలం ముగియగానే శత్రువుపై దాడి చెయ్యాలి (అన్నది ఆయన తలంపు). (ఆయన దారిలో ఉండగానే) ఒక గుర్రపు రౌతు, – 'అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ ఒప్పంద మర్యాదనుపాటించు, వాగ్దాన భంగానికి ఒడిగట్టకు' అని అంటూ వస్తున్నాడు. హ్రజత్ ముఆవియ కళ్ళెత్తి చూశారు. వచ్చే ఆయన అమ్ర్ బిన్ అబస. హ్రజత్ ముఆవియ అడగ్గా ఆయన ఇలా చెప్పారు, "నేను దైవ ప్రవక్త (సఅసం) బోధిస్తూ ఉండగా విన్నాను. ఆయన ఒకసారి ఇలా అన్నారు, 'ఒక జాతి ప్రజలతో ఒప్పందం కుదిరిన తరువాత అందులో మార్పు చెయ్యడం తగదు – ఒప్పంద కాలం పూర్తికానంత వరకు లేదా సరిసమానంగా ఒప్పందాన్ని శత్రువుపై త్రిప్పి కొట్టనంతవరకు" ఈ హదీసు విన్న తరువాత హ్రజత్ ముఆవియ సేనల్ని తీసుకుని వెనక్కి మరలారు. (అబూదావూద్)

---

విముక్తం చెయ్యవలసి ఉంటుంది.

397 న్యాయస్థానంలో విచారణ జరిపినప్పటికీ కేసు రుజువు కాకపోయినా లేదా అందులో ఏ మాత్రం అనుమానం చోటుచేసుకున్నా నిందితుణ్ణి శిక్షించవీలుండదు. ఇదే నేటి న్యాయపరిభాషలో బెనిఫిట్ ఆఫ్ డౌట్ అనంటారు. ఈ ప్రయోజనం సదా

(۴۰۰) عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ قَالَ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
خُذُوا الْعَطَاءَ مَادَامَ عَطَاءً فَإِذَا صَارَ رِشْوَةً عَلَى الدِّيْنِ فَلَا تَأْخُذُوْهُ وَلَسْتُمْ
بِتَارِكِيْهِ يَمْنَعُكُمُ الْفَقْرُ وَالْحَاجَةُ أَلَا إِنَّ رَحَى الْإِسْلَامِ دَائِرَةٌ فَدُوْرُوْا
مَعَ الْكِتَابِ حَيْثُ دَارَ أَلَا إِنَّ الْكِتَابَ وَالسُّلْطَانَ لَيَفْتَرِقَانِ فَلَا تُفَارِقُوا
الْكِتَابَ أَلَا إِنَّهُ سَيَكُوْنُ أُمَرَاءُ يَقْضُوْنَ لَكُمْ فَإِنْ أَطَعْتُمُوْهُمْ يُضِلُّوْكُمْ
وَإِنْ عَصَيْتُمُوْهُمْ قَتَلُوْكُمْ۔ قَالَ يَا رَسُوْلَ اللّٰهِ كَيْفَ نَصْنَعُ قَالَ كَمَا صَنَعَ
أَصْحَابُ عِيْسٰى نُشِرُوْا بِالْمِنْشَارِ وَحُمِلُوْا عَلَى الْخَشَبِ مَوْتٌ فِيْ طَاعَةِ اللّٰهِ
خَيْرٌ مِنْ حَيَاةٍ فِيْ مَعْصِيَةِ اللّٰهِ عَزَّ وَجَلَّ۔ (المعجم الصغير للطبراني)

400. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (ర) ఉల్లేఖనం: ప్రవక్త మహనీయులు (స) ఇలా తెలిపారు, 'కానుకను, అది కానుకగా ఉన్నంత వరకు స్వీకరించండి. కాని ఆ కానుక ధర్మ విషయంలో లంచంగా పరిణమించే ప్రమాదముంటే దాన్ని స్వీకరించకండి. కాని మీరు దాన్ని వదలరు. బీదరికం, ఆకలి

---

నిందితునికే లభించాలి అని హదీసు సూచిస్తుంది. ఇంకా ఏ వ్యక్తినీ ఎలాంటి ఆధారం లేకుండా కేసు నమోదు చేసి విచారణ జరపకుండా బందీగా నిర్బంధించడానికి లేదా ఆంక్షలు విధించడానికి ఎంత మాత్రం వీలు లేదని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ఇది ఇస్లామీయ న్యాయవ్యవస్థకు కడువిరుద్ధమయిన విషయం.

398 ఈ హదీసు యుద్ధంలో అనుసరించవలసిన నైతికతకు సంబంధించింది. యుద్ధానికి బయల్దేరేటప్పుడు దైవం పేరు మీదుగా బయల్దేరడమంటే దైవాన్ని సాక్షిగా నిలబెడుతూ అడుగు వెయ్యడమన్నమాట. ఇక దైవాదేశాలకు భిన్నంగా నడవబోమని పలకడమన్నమాట. దైవాదేశమేమిటో దైవ ప్రవక్త తెలిపారు. యుద్ధంలో కేవలం యుద్ధం చేసేవారిపై వేటు వెయ్యాలి. సామాన్య పౌరుల్ని, పౌర స్థావరాలను లక్ష్యం చేసి దాడులు జరపడం తగదు. ఈ నియమాన్ని పాటించకపోతే దైవ నియమాన్ని ఉల్లంఘించినట్లే.

399 ఈ హదీసు ద్వారా అనేక విషయాలు తెలుస్తున్నాయి.

1. ఒక దేశంతో ఒప్పందం కుదిరిన తరువాత దానికి సమానమయిన అవకాశం ఇవ్వకుండా ఆ వ్యవధి దాటగానే దానిపై దాడి చెయ్యడం ధర్మ సమ్మతం కాదు. 2. ఒప్పంద కాలంలోనే యుద్ధ పరిస్థితులు దాపురిస్తే శత్రువుకు ముందుగా తెలుపడం

దప్పులు దాన్ని స్వీకరించేందుకు మిమ్మల్ని బలవంతపెడతాయి. బాగా వినండి, ఇస్లామ్ ఫిసుర్రాయి తిరుగుతూ ఉన్నప్పుడు ఏ వైపునకు ఖుర్ఆన్ మరలుతుందో ఆ వైపునకే మీరూ మరలండి. వినండి, అతి సమీప కాలంలోనే ఖుర్ఆన్, అధికారాలు వేర్వేరయిపోతాయి. జాగ్రత్త మీరు ఖుర్ఆన్ని వదలకండి. రాబోయే కాలంలో మీ గురించి నిర్ణయాలు చేసే పాలకులు వస్తారు. మీరు వారి ఆజ్ఞాపాలన చేసినట్లయితే వారు మిమ్మల్ని అపమార్గంపట్టిస్తారు. మీరు వారి విధేయతను పాటించకపోతే మిమ్మల్ని మృత్యువు ఒడిలో పడవేస్తారు. (ఉల్లేఖనకర్త), 'అప్పుడు మేము ఏమి చెయ్యాలి?' అని ప్రశ్నించాడు. ఆయన ఇలా బోధించారు. 'ఈసా సహచరులు చేసిందే మీరున్నూ చేయండి, వారిని రంపాలతో చీరేశారు, శిలువలపైకి ఎక్కించారు. (కాని సత్యాన్ని వీడలేదు) దేవుని అవిధేయతలో జీవించడానికి బదులు దేవుని ఆజ్ఞల్ని పాలిస్తూ ప్రాణాలర్పించడమే మనిషికి ఉత్తమమయింది.' *(అల్ మో'జముస్సగీర్ తిబ్రాని)*

---

తప్పనిసరి. దీన్నే దివ్య ఖుర్ఆన్లో ఇలా బోధించడం జరిగింది: "ఏదయినా ఒప్పందం చేసుకున్న జాతి విద్రోహానికి పాల్పడే ప్రమాదం కానవస్తే సమాన స్థాయిలో దాని ఒప్పందాన్ని దానికి తిప్పి కొట్టండి." 3. ఈ ఉల్లేఖనం ద్వారా సహచరుల్లోని విధేయతా భావం ఏ మేరకు ఉన్నతమయిందో కూడా తెలుస్తోంది. పాలకునిగా ఉన్న వ్యక్తి కూడా ఓ సామాన్య వ్యక్తి ప్రవక్త ప్రవచనాన్ని తెలుపగానే తన వైఖరి ప్రవక్త ఆదేశానికి విరుద్ధంగా ఉందని తెలుసుకుని ముందుకుసాగుతున్న సేనల్ని వెంటనే వెనక్కి రప్పించారు. 4. ప్రవక్త సహచరుల ఉన్నత చరిత్ర కూడా ముందుకు వస్తుంది. వారు ఎంతటి గొప్ప పరిపాలకుడయినా సత్యవాక్కు అతని ముందు పలకడానికి వెనుకాడేవారు కారు. హజ్రత్ అమ్ర్ బిన్ అబస చేసిన ఈ సాహసవంతమయిన చర్య నిత్యం సత్యమే పలకాలనడానికి ముస్లిమ్ పాటించవలసిన ఉన్నతమయిన దృష్టాంతం.

400 ఈ హదీసు ద్వారా కొన్ని సత్యాలను తెలుపడం జరిగింది. ఒకటి, ఒకరికొకరు కానుకలు, బహూకరణలు ఇచ్చుకోవడం, విందులు, ఆతిథ్యాలు చేసుకోవడం ఇత్యాదివి అభిలషణీయమయిన సంప్రదాయాలు. హదీసుల్లోనూ వీటిపట్ల ఎక్కువగా ప్రోత్సహించడం జరిగింది. కాని ఇలాంటివి బాధ్యులయిన అధికారులు మొదలెట్టి ధార్మిక నాయకులు సత్యాన్ని వీడేలా, అధికారుల ఒత్తిడికి లొంగేలా చెయ్యడం కూడా సాధ్యమే. వారి చెడులను బహిరంగంగా చూసీ మౌనం వహించడం, ఇంకా వాటిని సమర్థిస్తూ తప్పుడు ఆదేశాలనివ్వడమూ సాధ్యమే. దీన్ని జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి.

(٤٠١) عَنْ تَمِيمٍ الدَّارِيِّ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ
اَلدِّيْنُ اَلنَّصِيحَةُ ثَلَاثًا، قُلْنَا لِمَنْ ، قَالَ لِلّٰهِ وَلِكِتَابِهِ وَلِرَسُوْلِهِ وَلِاَئِمَّةِ
الْمُسْلِمِيْنَ وَعَامَّتِهِمْ - (صحيح مسلم)

**401. తమీమ్ దారీ ఉల్లేఖనం: దైవ సందేశహరులు (సఅసం), "దీన్ (ధర్మం) అని హితైషిత, శ్రేయోభిలాషలకే అంటారు" అని ప్రవచించారు. ఈ మాటలు ఆయన మూడుసార్లు పలికారు. అప్పుడు మేము 'హితైషిత ఎవరిపట్ల?' అని అడగ్గా ఆయన ఇలా సెలవిచ్చారు, "దైవం పట్ల, ఆయన గ్రంథం పట్ల, ఆయన సందేశహరుని పట్ల, ముస్లిముల నాయకుల పట్ల, సాధారణ ముస్లిముల పట్ల." (సహీహ్ ముస్లిమ్)**

---

ఆ కారణంగానే ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్, అబ్బాసీ ఖలీఫాల కాలంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొని స్థిరచిత్తంతో సత్యంపై నిలకడ చూపిన తరువాత ఖలీఫా 'ముతవక్కిల్ బిల్లా' కాలంలో ధనం నిండిన సంచుల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు అసంకల్పితంగా ఆయన నోటి నుండి, 'ఇది మునుపటి (కారాగారపు యాతనల) కన్నా అత్యంత కఠినమయినది' అన్న మాటలు వెలువడ్డాయి. అంటే ప్రాపంచిక ఐశ్వర్యాలను చూసి అడుగులు తడబడతాయేమో అన్న సంశయమన్నమాట. కాని ఆయన ఆ పరీక్షలోనూ నిలకడ చూపారన్న దానికి చరిత్రే సాక్ష్యం పలికింది.

రెండు, ముస్లిమ్ సమాజంలో సదాచార సంపన్నమయిన సామూహిక వ్యవస్థ నెలకొని సకల శుభాలతో అది విలసిల్లాలంటే రాజకీయ వ్యవస్థ కూడా ధార్మిక నియమాలకు కట్టుబడినదయి ఉండాలి. కాని ఒకవేళ ఇవి రెండూ ఒక దానికొకటి సంబంధం లేకుండా వేర్వేరయినవిగా వ్యవహరిస్తే సామూహిక జీవితం తప్పనిసరిగా దౌర్జన్య పరమయినదిగా రూపొందుతుంది.

401. హదీసులోని "నుస్హ్" అనే పదానికి, మిశ్రమం, మలినం లేకుండా పరిశుద్ధంగా ఉండటం అని అర్థం. మైనం తీసివేసిన పరిశుద్ధమయిన తేనెని అరబీలో 'నాసిహిల్ అసలు ఖాలిస' అనంటారు. అలాగే హృదయంలో కల్లాకపటంలేని, అంతరంగంలోనూ బయటా ఒకే మాదిరిగా ఉండే మనిషి విషయంలో 'నుస్హు కల్బుల్ ఇన్సాను' అనంటారు. ఇదే భావంలో దివ్య ఖుర్ఆన్‌లో విశ్వాసులకు 'తౌబతున్నసూహ్' చెయ్యమని బోధించడం జరిగింది. అంటే ఏ విధమయిన కాపట్యమయినా, ద్వంద్వస్థితి అయినా లేని తౌబా అన్నమాట. దివ్య ఖుర్ఆన్‌లో ఒక చోట ముస్లిములను గురించి చెబుతూ ఇలా నిర్వచింపబడింది:

'బలహీనులు, వ్యాధిగ్రస్తులు, (ధర్మ మార్గంలో) ఖర్చు చెయ్యడానికి ఏమీ లేని వారి విషయంలో ఎలాంటి ఆక్షేపణలేదు - వారు అల్లాహ్ కొరకు, ఆయన సందేశహరుని కొరకు ఆపాదమస్తకం హితైషులయినందుకు. సదాచార సంపన్నులయిన వారిపై కూడా ఎలాంటి ఆక్షేపణ లేదు. అల్లాహ్, మన్నించేవాడు, కరుణించేవాడూను.

అంటే సాధారణ పరిస్థితిలో నిరంతర సంఘర్షణా రంగానికి విముఖులవడం విశ్వాసానికి విధేయతా విధానానికి వ్యతిరేకమయింది. కాని తగిన కారణమున్న స్థితిలో దాన్ని పట్టించుకోవడం జరగదు - అయితే ఆంతర్యం చిత్తశుద్ధి, స్వామిభక్తితో శోభిల్లాలి.

దీన్ని బట్టి తెలిసేదేమిటంటే అల్లాహ్ తన దాసుడు ఏ బలమయిన కారణం వల్లనయినా అశక్తుడయితే ఆచరణాపరమయిన భారం వెయ్యడు. కాని హితైషిత, శ్రేయోభిలాష విషయంలో మటుకు ప్రతి వ్యక్తీ బాధ్యుడే. అదే లేకపోతే అతని మోక్షం అసాధ్యం.

'అల్లాహ్‌పట్ల హితైషిత' అంటే, భావమేమిటంటే మనిషి తనకూ దైవానికీ మధ్యన ఎలాంటి కపట వ్యవహారం చోటుచేసుకోనివ్వరాదు. అతని ఆంతర్యంలోని ఒక్కొక్క మూల చిత్తశుద్ధి, భక్తి పరాయణతతో అలరారాలి. ఈ చిత్తశుద్ధికి భక్తిపరాయణతకు ఫలితంగా దాసుడు అల్లాహ్ ఉనికిలోనూ, ఆయన గుణగణాల్లోనూ, ఆయన అధికారాల్లోనూ, ఆయన మర్యాదల్లోనూ, హక్కుల్లోనూ సృష్టిలోని ఎవరినీ ఆయనకు సహవర్తులుగా, భాగస్వాములుగా ఎంచరాదు. ఈ విధంగా ఆచరించి మనిషి వాస్తవానికి తన ఎడలనే శ్రేయోభిలాష కనబరుస్తాడు, తన ఇహ పరాలనే చక్కదిద్దుకుంటాడు.

"ఎవరయితే, సత్కార్యాలు ఆచరిస్తారో వారు తమ కొరకే ఆచరిస్తారు."

'గ్రంథంపట్ల హితైషిత' అంటే, ఖుర్‌ఆన్ అవతరణా లక్ష్యాన్ని నెరవేర్చాలి. ఈ లక్ష్యంలో మూడు అంశాలున్నాయి:

1 పారాయణం (తిలావత్), అంటే దివ్య ఖుర్‌ఆన్‌ని ఆగుతూ, నెమ్మదిగా, సరయిన ఉచ్చారణతో చదవడం. ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది: "ఈ ఖుర్‌ఆన్‌ని మేము కొద్ది కొద్దిగా అవతరింపజేశాము. (ప్రవక్తా). నీవు దీన్ని ఆగుతూ ఆగుతూ జనులకు వినిపించాలని." (బనీ ఇస్రాయీల్: 106)

2 యోచన, చింతన. అంటే కేవలం అర్థం చేసుకోకుండా చదవడం కాదు. ఆయత్‌లను పరిశీలనా దృష్టితో చదవాలి. ఉదాహరణకు ఇలా ఉపదేశించడం జరిగింది: 'మేము మీ వద్దకు శుభదాయకమయిన ఈ గ్రంథాన్ని అవతరింపజేశాము - జనులు దీని వచనాలపట్ల చింతన చెయ్యాలని, ఆలోచించాలని, బుద్ధీ జ్ఞానాలున్న వారికి సుబోధనా సంపద, గుణపాఠం ప్రాప్తం కావాలనీను.'

3. ఖుర్‌ఆన్ ప్రకారం తీర్పు చెయ్యడం, అంటే, అధ్యయనం, అనుశీలనం కేవలం ఆ పరిధుల్లోనే ఆగిపోరాదు, వాటి ఉద్దేశ్యం, ఖుర్‌ఆన్ అందజేసే చట్టాలు,

నియమాలు మనిషి తన వ్యక్తిత్వంలో, తన వాతావరణంలో, తన దేశంలో, ప్రపంచమంతటా జారీ చెయ్యాలి.

దానికే ఆధిక్యత, ఆధిపత్యాల స్థానమివ్వాలి. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది: మేము మీ వద్దకు ధర్మ బద్ధంగా ఉద్గ్రంథాన్ని అవతరింపజేశాము. తద్వారా దైవం మీకు చూపించిన శాసనాల వెలుగులో మీరు జనుల మధ్య తీర్పులు చెయ్యాలని.

దైవ సందేశహరుని పట్ల హితైషిత అంటే, ప్రవక్త సంప్రదాయాన్ని అనునిత్యం పాటించాలి. ఆయన, ఆయన సహచరులూ కలసి ఏ జీవన వ్యవస్థను స్థాపించడానికి ప్రాణాలొడ్డి శ్రమించారో దాన్ని స్థాపించేందుకు శాయశక్తులా కృషి చెయ్యాలి. ఆయన ప్రామాణిక విధానానికి ప్రపంచంలోని ఇతర విధానాలన్నింటిపైనా ప్రాధాన్యత నివ్వాలి. ఆయన మాటలకు, ఆయన చేతలకు ప్రతిగా మరెవరి మాటకయినా ఆచరణకయినా ఎలాంటి ప్రాముఖ్యాన్ని ఇవ్వరాదు.

ముస్లిముల నాయకులపట్ల హితైషిత అంటే అర్థం నేటి మస్జిదుల్లో నమాజ్ చేయించే నాయకులు (ఇమాములు) అని కాదు. అలాగే ఇస్లామీయ విధానాలకు దూరంగా సంచరించే సామాజిక, రాజకీయ నాయకులనీ కాదు. ఇది ముస్లిమ్ సమాజం దురదృష్టమనే చెప్పాలి. నేడు ధర్మం, రాజకీయాలు వేర్వేరయిపోయాయి. నాయకత్వపు భావమే మారిపోయింది. ఇస్లామీయ వ్యవస్థలో రాజకీయాలయినా, ఇతర ప్రాపంచిక వ్యవహారాలయినా అన్నీ ధర్మానికి లోబడే ఉండాలి. అందువల్ల నిజమయిన ఇస్లామీయ రాజ్యంలో మస్జిదుల్లో ఇమాములయిన వారే దేశంలోనూ నాయకులుగా అలరారుతారు.

ఈ వివరణ దృష్ట్యా ముస్లిముల నాయకులపట్ల హితైషిత అంటే నాయకులు ధర్మబద్ధమయిన కార్యాలు చేస్తే వారితో సహకరించాలి. వారు వక్రమార్గాన్ని అవలంబిస్తూ, తప్పుడు పనులు చేస్తూ ఉంటే వారిని ఎలాంటి జంకు గొంకు లేకుండా నిర్భయంగా విమర్శించాలి. వారి తప్పుడు పనుల్ని గురించి ప్రజలకు ఎరుకపరచాలి. మరో హదీసులో ప్రవక్త మహనీయులు (సఅసం) "ఉత్తమమయిన జిహాద్ (నిరంతర సంఘర్షణ) నిరంకుశ పాలకుని సమక్షంలో న్యాయమయిన మాట పలకడం" అని అన్నారు.

ఈ హితైషితనే ఇమామ్ మాలిక్ ఖలీఫా మన్సూర్ సమక్షంలో ప్రదర్శించారు. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ మామూన్ కెదురుగా, మో'తసిమ్, వాసిక్ బిల్లాహ్ కొరడాల ఛాయలో ప్రదర్శించారు. ఇమామ్ ఇబ్ను తైమియ ఈజిప్ట్ నియంతల కెదురుగా, ముజద్దిద్ అల్ఫసాని జహాంగీర్ దర్బారులో ప్రదర్శించారు.

సామాన్య ముస్లిముల హితైషిత అన్న దానికి కొన్ని భిన్న కోణాలున్నాయి:

1. సామాన్య ముస్లిములు మార్గం తప్పి నడుస్తూ ఉంటే వారికి వివేచనతో, బోధనా దృష్టితో సన్మార్గం వైపునకు పిలుపునివ్వాలి. వారిలో ఇస్లామీయ జాగృతిని తీసుకురావాలి.

2. వారు అజ్ఞానులయినట్లయితే వారిలో ధర్మజ్ఞానాన్ని పెంపొందించాలి. ధార్మిక పాఠశాలలు, వయోజన విద్యా కేంద్రాలు స్థాపించాలి. ధర్మ సందేశాన్ని బాగా ప్రచారం చేసి దేశంలో నలుమూలలా దైవ సూక్తులు, ప్రవక్త ప్రవచనాలు ప్రతిధ్వనింపజేయాలి.

3. వారు వ్యాధిగ్రస్తులయితే వారి సుశ్రూష చేయాలి. వారికి మందులు తెచ్చి పెట్టాలి. వారి చికిత్సకై సామూహిక వ్యవస్థ (ఆసుపత్రులు వగైరా)ను స్థాపించాలి. అనాథ రోగులకు చికిత్స జరిగే సువ్యవస్థను నెలకొలపాలి.

4. ముస్లిముల్లో బాధితులయిన వారికి అన్యాయానికి గురయిన వారికీ వ్యక్తిగత స్థాయిలోనూ, సామూహిక స్థాయిలోనూ, దుర్మార్గుని ఆపడంలోనూ, బాధితులకు న్యాయం చేకూర్చడంలోనూ ప్రయత్నాలు జరగాలి. దీనికిగాను పటిష్ఠమయిన సంఘటిత సంస్థలు రూపొందించాలి. వాటి ద్వారా సమాజంలోని బలహీనులు, నిస్సహాయుల్లో వారికి ఓ అండ ఉన్న భావనను పెంపొందించాలి.

5. ముస్లిములు మరణించినప్పుడు వారి ఖనన కార్యక్రమంలో పాల్గొనాలి. వారి వారసులకు ఓదార్పు నివ్వాలి. పరస్పర సానుభూతి, సహాయ సహకారాల భావాలను సర్వసామాన్యం చేయాలి. 'విశ్వాసులు అందరూ సోదరులు' అన్న దైవ వచనానికి క్రియాత్మక వాతావరణాన్ని సృజించి కనుల పండువు చేయాలి.

ఇది హదీసు కాదు, ధర్మానికి సారాంశం, ధర్మంలోని మధువు, సౌరభం!

**వ ఆఖిరు దావాన అనిల్ హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్!!**



